# చరకసంహిత - శారీరస్థానము

(మూలము మరియు చక్రపాణి వ్యాఖ్యలకు తెలుగు అనువాదము)


డా॥ ఎమ్. ఎల్. నాయుడు, M. D. (Ay.)

ఉపన్యాసకులు

డా॥ నోరి రామశాస్త్రి ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల, విజయవాడ

డా॥ సిహెచ్. రాజరాజేశ్వర శర్మ, ఆయుర్వేద శిరోమణి

రిసెర్చ్ ఆఫీసర్, రీజియనల్ రిసెర్చి సెంటర్, విజయవాడ

డా॥ పి. హిమసాగర చంద్రమూర్తి, M.D., (Ay.)

ఉపన్యాసకులు

డా॥ నోరి రామశాస్త్రి ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల, విజయవాడ



ఆం.ప్ర. ఆయుర్వేదిక్ లిటరేచర్ ఇంప్రూవ్‌మెంట్ ట్రస్ట్

హైదరాబాద్

# CHARAKASAMHITA - SAAREERASTANAM
with Chakrapani's Commentary in Telugu

by
Dr. M. L. Naidu
Dr. Ch. Rajarajeswara Sarma
Dr. P. Himasagara Chandramurthy






Published by :
A. P. Ayurvedic Literature Improvement Trust
M. J. Road, Hyderabad
First Edition : April '92
Price : Rs. 100/-

for copies :
Dr. Y. Krishna Manohar
18-4-54, 2nd Lane
Kedareswarapet
Vijayawada - 3

Printed at :
Nagendra Press
Suryaraopet
Vijayawada-2



డా॥ వై. సూర్యనారాయణరావు, L. I. M.

(1906 - 1980)

వ్యవస్థాపకులు మరియు ప్రధమ అధ్యక్షులు

ఆం. ప్ర. ఆయుర్వేద సాహిత్యాభివృద్ధి ట్రస్ట్



శ్రీ బి. అరవిందరెడ్డి, I. A. S.,

అధ్యక్షులు

ఆం. ప్ర. ఆయుర్వేద సాహిత్యాభివృద్ధి ట్రస్ట్

మరియు

సంచాలకులు : భారతీయ వైద్య & హోమియోపతి శాఖ, ఆం.ప్ర. ప్రభుత్వం

# ముందుమాట

ఆంధ్రప్రదేశ్ ఆయుర్వేదిక్ లిటరేచర్ ఇంప్రూవ్ మెంట్ ట్రస్టు తరపున ఇప్పటివరకు సుమారు ఇరవైకి పైగా ఆయుర్వేద పాఠ్యగ్రంథములు ప్రచురించబడినవి. అవి ఆయుర్వేద కళాశాలలోని విద్యార్థులకేగాక వైద్యులకు జిజ్ఞాసువులకు కూడా ఉపయోగకరంగా ఉండటం ఎంతో ముదావహం. ఈ ప్రచురణా కార్యక్రమంలో భాగంగా చరకసంహితను చక్రపాణి వ్యాఖ్యతో సహా అనువదింపచేయడం ప్రారంభించాము. ఇప్పటికే విమానస్థానము కల్పస్థానములను ప్రచురించడం జరిగింది. ప్రస్తుతం శారీరస్థానము మీ ముందు ఉంచుతున్నాము. ఇది కూడా అందరి మన్ననలను పొందగలదని మా ఆకాంక్ష. శ్రమకోర్చి దీనిని అనువదించిన డా॥ ఎమ్. ఎల్. నాయుడు, డా॥ పి. హిమసాగర చంద్రమూర్తి, డా॥ పిహెచ్. రాజరాజేశ్వరశర్మ గార్లకు నా అభినందనలు. ఈ గ్రంథమును ముద్రించుటలో తోడ్పడినవారందరికి ట్రస్టు తరపున నా కృతజ్ఞతలు.

బి. అరవిందరెడ్డి

అధ్యక్షులు, ఆం. ప్ర. ఆయుర్వేద సాహిత్యాభివృద్ధి ట్రస్టు
మరియు సంచాలకులు
భారతీయ వైద్యము మరియు హోమియోపతి శాఖ
ఆం. ప్ర. ప్రభుత్వము, హైదరాబాదు.

# అభిప్రాయము

ఆయుర్వేద గ్రంథములలో చరకసంహిత అత్యంత ప్రధానమైనది. బృహత్త్రియములలోని మొదటి గ్రంథమైన చరకసంహితకు ఆయుర్వేద పాఠ్యాంశములో అత్యంత ప్రాధాన్యత కలదు. అట్టి చరకసంహితను తెలుగులో అనువాదము చేయించుటకు (చక్రపాణి వ్యాఖ్యతో) ట్రస్ట్ నిర్ణయించినది. మొట్టమొదటిసారి మా యీ ప్రయత్నంలో ఏమైనా లోపాలున్న, విద్వాంసులు తెలియపరచినచో తదుపరి ముద్రణలో సరిచేయగలము.

మా ట్రస్ట్ అధ్యక్షులుగా శ్రీ బి. అరవిందరెడ్డి ఐ.ఎ.యస్. గారు మంచి ఉత్సాహవంతులు. వారి నేతృత్వములో అచ్చుకొరకు వేచియున్న మిగతా గ్రంథములన్నియు వెలుగులోనికి రాగలవని ఆశిస్తున్నాను. ఈ బృహత్కార్యములో తోడ్పడిన మిత్రులకు, అధికారులకు, రచయితలకు, ట్రస్ట్ మెంబర్లకు నా ధన్యవాదములు. శారీరస్థానము గ్రంథకర్తలకు నా ధన్యవాదములు.

డా॥ పి. శేషిరెడ్డి
బి.సి.ఐ.యం., డి.యం.యస్., హెచ్.పి.ఎ.
అదనపు సంచాలకులు,
ఆయుర్వేద, దేశీయ వైద్యము, హోమియోపతి శాఖ
హైదరాబాద్.

28/4/92,
హైదరాబాద్.

# ఉపోద్ఘాతము

శరీరమునకు సంబంధించిన విజ్ఞానము పొందుపరచడం వలన ఇది శారీర స్థానమని పేరుపెట్టబడింది. శారీరము అనునది ఆయుర్వేదము ననుసరించి దృశ్యము తర్క్యము లేదా చింత్యము అని రెండు విధములు. దృశ్య శారీరమనగా శరీరము నందు మన దృష్టికి గోచరమగు హస్త పాదాదుల వివరణము. చింత్యము లేదా తర్క్యము అనునది చింతించి లేదా తర్కించి మాత్రమే తెలిసికొనవలసిన విషయము. ఇది దృగ్గోచరములు కానట్టి ఆత్మ, అంతఃకరణములు మొదలగువానిని గురించిన విజ్ఞానము. చరకసంహితయందు ఈ రెండు విధములగు జ్ఞానము శారీర స్థానమునందు పొందుపరుపబడింది. అందువలన ఈ గ్రంథము ఇతర గ్రంథముల కంటె భిన్నమై ఆయుర్వేదాధ్యయనమునందు అత్యంత ప్రాధాన్యతను సంతరించు కొనియున్నది. ఆయుర్వేదమునకు మూలమగు దార్శనిక విషయములు ఇచట చెప్ప బడినవి. లోక పురుష సామ్యతా నిరూపణము ఈ గ్రంథముయొక్క మరియొక ప్రాధాన్యత. గర్భోత్పత్తియందు ముందుగా సంగమము చేయు స్త్రీ పురుషులిరువురు సమాన గోత్రీకులుగా నుండరాదను విషయము స్పష్టముగా పేర్కొనబడినది. గర్భము ఏర్పడుటకు, అది వృద్ధినొందుటకును ఏ యే భావములు ఉపయోగపడునో ఆ వివరము పొందుపరచబడినది. శరీరావయవముల సంఖ్య క్లుప్తముగా పేర్కొను టయూ జరిగినది. చివరగా శ్రేష్ఠమైన సంతానమును బడయుటకు చేయవలసిన విధి విధానము కూడ పొందుపరుచబడినది.

ప్రధానముగా చరక శారీరమును చింత్య (తర్క్య) శారీరముగనే గ్రహింప వలెను. సాంఖ్య దర్శనము దీనికి ప్రాతిపదిక. సృష్టి వికాసక్రమము సాంఖ్య దర్శనము నుండియే గ్రహింపబడినది— "జాయతే బుద్ధిరవ్యక్తాద్బుద్ధ్యాఽహమితి మన్యతే,పరంఖాదీన్యహఙ్కారాదుత్పద్యన్తే యథాక్రమమ్" [చ.శా. 1-66] ఈ విషయమే సాంఖ్య దర్శనమునందును— "ప్రకృతేర్మహాంస్తతోఽహఙ్కారస్త స్మాద్గణశ్చ షోడశకంః" [సాంఖ్యకారికా-22] అని చెప్పబడినది. ఇట్లు అనేక సామ్యములు గన్పడును. ఆత్మ మనస్సుల పరస్పర సంబంధ విషయము దర్శన శాస్త్రములనన్నింటియొక్క సమాలోచన జేసి ఇచట తెలియజేసినట్లు గోచరమగు చున్నది. ఆత్మ నిరూపణము. మనో నిరూపణములు చరక శారీరమునందు జేసిన విధముగా మరి యే ఇతర ఆయుర్వేద గ్రంథమునందును జేసినట్లు గన్పడదు.

చక్రపాణి వ్యాఖ్యను సంపూర్ణముగా తెలుగులోనికి అనువదించుట యనునది ప్రథమ ప్రయత్నము. ఈ ప్రయత్నాన్ని ముందుగా ప్రోత్సహించిన అప్పటి భారతీయ వైద్యశాఖ డైరెక్టరుగారైన శ్రీ ఎన్. వి. హెచ్. శాస్త్రిగారికి మా కృతజ్ఞతాభివందనములు. ప్రస్తుతపు డైరెక్టరుగారైన శ్రీ బి. అరవిందరెడ్డిగార్కి మా కృతజ్ఞతలు. శ్రీ డా॥ పి. శేషిరెడ్డిగారు ఈ ప్రయత్నంలో మా కెప్పటికప్పుడు సహకారం అందిస్తూవచ్చారు. వారికి మా కృతజ్ఞతలు. విజయవాడ ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల ప్రిన్సిపాల్‌గారైన శ్రీ డా॥ గంగా సత్యంగారు మాకు అమూల్యమైన సలహాలనిచ్చి ప్రోత్సహించినారు వారికి మా కృతజ్ఞతలు. ఈ గ్రంథరచన కొనసాగటానికి అత్యంత ప్రాధాన్యమైన నైతిక ప్రోత్సాహము నందించిన మా అనుంగుమిత్రుడు డా॥ కె. నిష్టేశ్వర్‌గార్కి మేమెప్పుడూ ఋణపడి ఉంటాము. ఈ ప్రయత్నంలో మా కన్నివిధాలుగా సహాయపడిన మా కుటుంబసభ్యులు, మిత్రులు, విద్యార్థులు, శ్రేయోభిలాషులందరికీ మా హృదయపూర్వక కృతజ్ఞతలు. ఈ గ్రంథాన్ని త్వరగా ముద్రింపింపజేసిన శ్రీ డా॥ కృష్ణమనోహర్‌గార్కి, చక్కగా ముద్రించిన శ్రీ జి. బాబూరావుగార్కి మా కృతజ్ఞతలు.

గ్రంథకర్తలు

# గ్రంథకర్త పరిచయం



డా॥ మరడాన లక్ష్మన్నాయుడు
M D (Ay)
ఉపన్యాసకులు, డా॥ నోరి రామశాస్త్రి
ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల
విజయవాడ

జననం : 19-7-1952

జన్మస్థలం : కొత్తూరు, విజయనగరంజిల్లా

జననీజనకులు :

శ్రీమతి మరడాన అచ్చమ్మ

శ్రీ మరడాన చినశివున్నాయుడు

ప్రాథమిక విద్య :

కొత్తూరు, పార్వతీపురం, ఏలూరు.

ఉన్నత విద్య :

సంస్థానం జిల్లా పరిషత్ హైస్కూలు బొబ్బిలి శ్రీ రాజా ఆర్.ఎస్.ఆర్.కె. రంగారావు కళాశాల బొబ్బిలి.

ఆయుర్వేద విద్య :

బి. ఎ. యం. యస్ (ఉస్మానియా యూనివర్శిటీ 1972 - 1978)
ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల
హైదరాబాదు
యం. డి. (ఆయుర్వేద) కాయ చికిత్స (ఉస్మానియా 1978-1981)
ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల హైదరాబాదు.

థీసిస్ :

అమీబియాసిస్‌లో ఇంద్రయవ, నింబబీజ ప్రయోగము

ఉద్యోగ జీవితము :

ప్రభుత్వ సర్వీసులో 18-9-1981న ప్రవేశించి అరకువేలి, విశాఖ జిల్లా, కొట్టక్కి- విజయనగరం జిల్లాలోని గ్రామ ప్రాంతములలోని వైద్యశాలలలో వైద్యాధికారిగా 5సం॥ పనిచేసిరి.

విజయవాడ డా॥ నోరి రామశాస్త్రి ప్రభుత్వ ఆయుర్వేద కళాశాలలో లెక్చరర్‌గా 10-6-1986 నుండి పని చేయుచున్నారు.

గ్రంథములు :

1. కాయ చికిత్సా - మూల సిద్ధాంతములు
2. రోగ విజ్ఞానము - వికృతి విజ్ఞానము
3. ప్రథమ చికిత్సా

ప్రచురణలు :

ఆయుర్వేద పత్రికలలో, ఇతర వైజ్ఞానిక పత్రికలలో పదహారు పరిశోధనా వ్యాసములు ప్రచురింపబడినవి.

ముఖ్యముగా AIDS మరియు ఆయుర్వేద చికిత్స. మస్తిష్కావరణశోథ మరియు ఆయుర్వేద చికిత్స. కామలా వ్యాధి ఆయుర్వేద చికిత్స.

పక్షఘాతములో బృంహణవస్తి ప్రయోగము. చర్మవ్యాధులకు ఆయుర్వేద చికిత్స సాలూరు ఏజెన్సీలో వనమూలికల వనరులు. కిటిభ కుష్ఠములో విరేచన కర్మ. ప్రమేహ చికిత్స, హృద్రోగ చికిత్స, మొదలగు అనేక విషయములపై ఆంగ్లభాషలో ఆర్యవైద్యన్, సచిత్రాయుర్వేద, ఇండియన్ మెడిసన్, ఆయుర్వేద మహా సమ్మేళన పత్రిక, జాగృతి మొదలగు వైజ్ఞానిక పత్రికలలో ప్రచురించబడినవి.

పరిశోధనాత్మక పత్రముల సమర్పణ వైజ్ఞానిక గోష్ఠులు మొదలగు జాతీయ స్థాయిలో జరిగిన అనేక వైజ్ఞానిక పరిషత్తులందు U. G. C. గోష్ఠులందు, వర్క్‌షాపులందు ఇతర సమావేశములలో 158 పైగా పరిశోధనా పత్రములు సమర్పించిరి.

విజయనగరం జిల్లా గుమ్మ లక్ష్మీపురంలో గిరిజనులకు వనమూలికల సేకరణ, సంరక్షణ విధానంపై పదిరోజులు శిక్షణాశిబిరం I.T.D.A వారి పర్యవేక్షణలో నిర్వహించిరి.

ఆకాశవాణి విజయవాడ కేంద్రం నుండి గుండెజబ్బులకు ఆయుర్వేద చికిత్స, అంటువ్యాధులకు ఆయుర్వేద చికిత్స, చర్మ వ్యాధులకు ఆయుర్వేద చికిత్స, వాత వ్యాధులకు ఆయుర్వేద చికిత్స, పంచకర్మల ప్రాముఖ్యతకు సంబంధించిన అనేక ప్రసంగములు చేసిరి.

యూనివర్సిటీ ఆఫ్ హెల్త్ సైన్సెస్ వైస్‌ఛాన్సలర్‌గారు ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల జాతీయ సేవావిభాగంనకు ప్రోగ్రాం ఆఫీసరుగా నియమించినారు. ఇప్పటివరకు అనేక సేవా కార్యక్రమములు నిర్వహించిరి.

చిరునామా - డా॥ ఎమ్. ఎల్. నాయుడు
లెక్చరర్, ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల, విజయవాడ.

# గ్రంథకర్త పరిచయం



చదలవాడ రాజరాజేశ్వరశర్మ

జననం : 15-4-32

జన్మస్థలం : శ్రీకాళహస్తి
చిత్తూరుజిల్లా

**విద్యార్హతలు :**

సాహిత్య శిరోమణి - మద్రాసు విశ్వవిద్యాలయము - 1951
(బంగారు పతకము)

ఆయుర్వేద శిరోమణి - మద్రాసు విశ్వవిద్యాలయము 1955

వైద్య విశారద - వెంకటరమణ ఆయుర్వేద కళాశాల

రాష్ట్రభాషా - హిందీ - దక్షిణభారత హిందీ ప్రచారసభ.

**ఉద్యోగానుభవము :**

1) ప్రొఫెసర్ మరియు ఫిజీషియన్ వెంకటరమణ ఆయుర్వేద కళాశాల మరియు డిస్పెన్సరీ మద్రాసు 1957 నుండి 1965

2) జూనియర్ రిసెర్చి ఆఫీసర్ సి.సి.ఆర్.ఐ.ఎమ్.హెచ్. తంజావూరు 1966 నుండి 1975

(ఈ కాలమున శరభేంద్ర వైద్యరత్నావళి గ్రంథమును తమిళము నుండి సంస్కృతములోనికి అనువదించుట అనేక పుస్తకములకు సంపాద కత్వము వహించుట జరిగినది)

3) అసిస్టెంట్ రిసెర్చి ఆఫీసర్, రీజియనల్ రిసెర్చి సెంటర్ విజయవాడ - అక్టోబరు 1975 నుండి జూన్ 1979 వరకు

4) రిసెర్చి ఆఫీసర్ [ఆయుర్వేద], ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ హిస్టరీ ఆఫ్ మెడిసిన్ [సి.సి.ఆర్.ఎ.సి ] ఉస్మానియా మెడికల్ కాలేజి ప్రాంగణము పుత్లీబౌలి - హైదరాబాదు 1979 నుండి 1981 వరకు

5) రిసెర్చి ఆఫీసర్, రీజియనల్ రిసెర్చ్ సెంటర్ విజయవాడ 1981 నుండి

గ్రంథములు - వ్యాసములు :

1) ఆయుర్వేద ఉపదేశములు - రెండు భాగములు (సంస్కృతము - తమిళవ్యాఖ్య)
2) గర్భిణీ రక్ష - (సంస్కృతము - తమిళవ్యాఖ్య)
3) కౌమారభృత్యము ( " )
4) పథ్యాపథ్యము మూడు భాగములు ( " )
5) బాల తంత్రము (సంస్కృతము - తెలుగువ్యాఖ్య)
6) కుష్ఠముపై నిబంధము
7) తెలుగు దినపత్రికలు మరియు వారపత్రికలందు అనేక వ్యాసములు

చిరునామా - రిసెర్చి ఆఫీసర్,
రీజియనల్ రిసెర్చి సెంటర్ (ఆయుర్వేద)
విజయవాడ.

# గ్రంథకర్త పరిచయం



పావులూరి
హిమసాగర చంద్రమూర్తి

జననం : 1951 కూచిపూడి
కృష్ణాజిల్లా

స్వస్థలం : మున్నంగి, గుంటూరుజిల్లా

తల్లి దండ్రులు :

శ్రీమతి నాగమాంబ, శ్రీ శేషగిరిశర్మగారలు

విద్య :

సాధారణ విద్య – పి. యు. సి.
సాంకేతిక విద్య – ఎమ్.డి. (ఆయుర్వేదము) (జామ్‌నగరు)

ఉద్యోగము :

1) అసిస్టెంట్ ప్రొఫెసర్, బి.హెచ్. ఆయుర్వేద మహా విద్యాలయం శోద్ర, గుజరాత్. 29-1-79 నుండి 6-3-79 వరకు
2) మెడికల్ ఆఫీసర్ & హెల్త్ కో ఆర్డినేటర్, రాయలసీమ డెవలప్‌మెంట్ ట్రస్ట్ అనంతపురం, ఆంధ్రప్రదేశ్. 22-3-79 నుండి 4-8-80 వరకు
3) లెక్చరర్, ఆయుర్వేద కాలేజ్, పతంజలిపురి, కోయంబత్తూర్. 18-8-80 నుండి 4-9-85 వరకు
4) ప్రిన్సిపాల్ - ఇన్-ఛార్జ్, ఆయుర్వేద కాలేజ్, పతంజలిపురి, కోయంబత్తూర్. 5-9-85 నుండి 22-3-86 వరకు
5) మెడికల్ ఆఫీసర్, గవర్నమెంట్ ఆయుర్వేదిక్ డిస్పెన్సరీ కోపల్లె, గుంటూరు జిల్లా, 25-3-86 నుండి 15-9-89 వరకు
6) లెక్చరర్ - ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల, విజయవాడ 15-9-89

పరిశోధనా వ్యాసములు :

రస పతంగముపై ఎమ్. డి. థీసిస్

రస పతంగముపై చికిత్సాలయమునందు రోగులపై పరిశోధన

రస పతంగమును తయారుచేయు విధానముపై పరిశోధన

మల్లభస్మము కాశీస భస్మములను శ్వాస రోగముపై ప్రయోగించి ఆ ప్రభావమును తులనాత్మక పరిశీలన

జనపదాజీయ గ్రంథమున మహా స్రోతస్సునకు సంబంధించిన వ్యాధులకు చెప్పబడిన రసౌషధములు

ఆయుర్వేద విద్యాబోధనలో అవసరమైన పద్ధతులు

ఔషధ నిర్మాణశాలల వికేంద్రీకరణము

గ్రామీణ ఆరోగ్య విధానంతో ఆయుర్వేదం యొక్క పాత్ర - మొదలైనవి.

ఉపన్యాసములు :

1) ఆరోగ్యమునకు ఆయుర్వేద సూత్రములు (రాయవెల్లూర్)
2) ఆయుర్వేదమునందు దార్శనికతత్వము (ఉడుమలై పేట)
3) ఫ్రెంచి వారికి ఆయుర్వేద పరిచయోపన్యాసములు (కోయంబత్తూర్)
4) ఆయుర్వేదంలో ధాతు విజ్ఞానము (బెంగుళూరు)
మొదలైనవి మరియు రేడియో ఉపన్యాసములు

పరిశోధనలు :

1) అపస్మారమునందు ఆయుర్వేద ఔషధముల ప్రభావము (డి.ఎస్.టి. న్యూఢిల్లీ)
2) ఆయుర్వేదౌషధముల నాణ్యతను నిర్ణయించుట (డి.ఎస్.టి. న్యూఢిల్లీ)
3) గ్రామీణ వైద్యములో ఆయుర్వేదమును చేర్చి ప్రచారము చేయుట (యు.ఎస్. ఎయిడ్/ఐ.సి.ఎమ్.ఆర్. న్యూఢిల్లీ)

గ్రంథములు :

1) చికిత్సాదర్శిని
2) చరకసంహిత - విమానస్థానము
3) చరకసంహిత - నిదానస్థానము

చిరునామా - డా॥ పి. హిమసాగర చంద్రమూర్తి
ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల
విజయవాడ - 520 002 (ఆం.ప్ర.)

# విషయసూచిక

| విషయము | పుటసంఖ్య |
|---|---|

| విషయము | పుటసంఖ్య |
|---|---|

| విషయము | పుటసంఖ్య |
|---|---|

| విషయము | పుటసంఖ్య |
|---|---|

| విషయము | పుటసంఖ్య |
|---|---|

| విషయము | పుటసంఖ్య |
|---|---|

| విషయము | పుటసంఖ్య |
|---|---|

# చరకసంహిత - శారీర స్థానము

## ప్రథమాధ్యాయము

### కతిథాపురుషీయ శారీరము

1. అథాతః కతిధాపురుషీయం శారీరం వ్యాఖ్యాస్యామః.

2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః.

**తాత్పర్యము :** ఇక ఇపుడు కతిధాపురుషీయమను శారీరమును చెప్ప బోవుచున్నాము.

అని ఆత్రేయ భగవానుడు చెప్పియుండెను.

**ఆయుర్వేదదీపిక :** నిదాన స్థానమునందు తెలియబడిన హేతువు మొదలగువాని వలన మరియు విమానస్థానమునందు వచ్చియున్న రసము, దోషములు మొదలగువాని జ్ఞానము వలన చేయవలసిన చికిత్స కొరకు ఆ చికిత్సకు అధికరణమగు శరీరము తెలిసికొనదగుచున్నది. పలు విధములైన కష్టములతో కూడిన చికిత్స చేయకయున్నట్టియు శరీరమునందు ఆ శరీరము యొక్క విజ్ఞానముపై నాధారపడక యున్న చికిత్స మంచి ఫలితముల నివ్వనందువలన శరీరమును దానికి కారణము, ఉత్పత్తి, స్థితి, వృద్ధి మొదలగు విశేషములతో ప్రతిపాదించుటకుగాను శారీరస్థానము చెప్పబడుచున్నది. ఇచటయును అత్యంత దుఃఖమును శాంతింపజేసి మోక్షమునకు కారణమై యుండు చికిత్సకు ఉపయోగపడు పురుషుని యొక్క భేదము మొదలగు వానిని ప్రధానముగా ప్రతిపాదించుట చేత కతిధా పురుషీయమను అధ్యాయము పేర్కొనబడుచున్నది.

### ఆత్మ సంబంధమగు ప్రశ్నలు

3. కతిధా పురుషో ధీమన్ ! ధాతుభేదేన భిద్యతే,
పురుషః కారణం కస్మాత్, ప్రభవః పురుషస్య కః.

4. కిమజ్ఞో జ్ఞః,స నిత్యః కిం కిమనిత్యో నిదర్శితః.
ప్రకృతిః కా,వికారాః కేకిం లిఙ్గం పురుషస్య చ.

5. నిష్క్రియం చ స్వతంత్రం చ వశినం సర్వగం విభుమ్,
వదన్త్యాత్మానమాత్మజ్ఞాః క్షేత్రజ్ఞం సాక్షిణం తథా.

6. నిష్క్రియస్య క్రియా తస్య భగవన్ ! విద్యతే కథమ్,
స్వతన్త్రశ్చేదనిష్టాసు కథం యోనిషు జాయతే.

7. వశీ యద్యసుఖైః కస్మాద్భావైరాక్రమ్యతే బలాత్,
సర్వాః సర్వగతత్వాచ్చ వేదనాః కిం న వేత్తి సః.

8. న పశ్యతి విభుః కస్మాచ్ఛైలకుడ్యతిరస్కృతమ్,
క్షేత్రజ్ఞః క్షేత్రమథవా కిం పూర్వమితి సంశయః.

9. జ్ఞేయం క్షేత్రం వినా పూర్వం క్షేత్రజ్ఞో హి న యుజ్యతే,
క్షేత్రం చ యది పూర్వం స్యాత్ క్షేత్రజ్ఞః స్యాదశాశ్వతః.

10. సాక్షిభూతశ్చ కస్యాయం కర్తా హ్యన్యో న విద్యతే,
స్యాత్ కథం చావికారస్య విశేషో వేదనాకృతః.

11. అథ చార్తస్య భగవంస్త్రిసృణాం కాం చికిత్సతి,
అతీతాం వేదనాం వైద్యో వర్తమానాం భవిష్యతీమ్.

12. భవిష్యన్త్యా అసంప్రాప్తిరతీతాయా అనాగమః,
సాంప్రతిక్యా అపి స్థానం నాస్త్యర్తేః సంశయో హ్యతః.

13. కారణం వేదనానాం కిం,కిమధిష్ఠానముచ్యతే,
క్వ చైతా వేదనాః సర్వా నివృత్తిం యాన్త్యశేషతః.

14. సర్వవిత్ సర్వసంన్యాసీ సర్వసంయోగనిఃసృతః,
ఏకః ప్రశాన్తో భూతాత్మా కైర్లింగైరుపలభ్యతే.

15. ఇత్యగ్నివేశస్య వచః శ్రుత్వా మతిమతాం వరః,
సర్వం యథావత్ ప్రోవాచ ప్రశాన్తాత్మా పునర్వసుః.

**తాత్పర్యము :** 1) ఓ ధీమంతుడా ! పురుషుడు ధాతుభేదము వలన ఎన్ని విధములుగా విభజింపబడుచున్నాడు ?

2) ఎందువలన పురుషుడు కారణము అని పేర్కొనబడినాడు ?

3) పురుషునకు ఉత్పత్తి కారణమేది ?

4) పురుషుడు అజ్ఞానియా లేక జ్ఞానియా ?

5) అతడు నిత్యుడా లేక అనిత్యుడని చెప్పబడినాడా ?

6) ప్రకృతి ఏది ?

7) వికృతులేవి ?

8) పురుషుని యొక్క లక్షణములేవి ? ఆత్మను గురించి తెలిసినవారు ఆత్మ నిష్క్రియమనియు, స్వతంత్రమనియు, వశి, సర్వగము, విభువు, క్షేత్రజ్ఞుడు, సాక్షి యనియునూ చెప్పుచున్నారు.

9) క్రియా రహితమైన ఆత్మకు క్రియతో ఎట్లు సంబంధము కలుగుచున్నది ?

10) ఆత్మ స్వతంత్రమే యైనచో అనిష్టములగు [నీచములగు] యోనుల యందెట్లు జనించును ?

11) వశిత్వము గల ఆత్మ దుఃఖ కరములగు భావములచే బలవంతముగా నెట్లు ఆక్రమింపబడుచున్నది ?

12) ఎల్లెడలను సంచరించు సర్వగతమై యుండియు అన్ని వేదనలను ఆత్మ ఎట్లు తెలిసికొనదు !

13) ఎల్లెడలా వ్యాపించు విభుత్వము కల్గియున్న ఆత్మ పర్వతము, గోడ మొదలగు వానిచే కప్పబడియున్న [వాని వెనుకనున్న] వస్తువుల నెట్లు చూడ లేకున్నది ?

14) క్షేత్రజ్ఞుడు ముందుగనున్నాడా లేక క్షేత్రము ముందుగ నున్నదా ? అను సంశయము కలుగుచున్నది. తెలిసికొనవలసిన క్షేత్రము ముందుగ లేకుండగనే క్షేత్ర జ్ఞుడు ముందుగ నుండుట యుక్తము గాదు. క్షేత్రమే ముందుగ నున్నచో క్షేత్రజ్ఞుడు అశాశ్వతుడగుచున్నాడు గదా !

15) వేరొకకర్త లేనపుడు పురుషుడెవరికి సాక్షిభూతుడగును ?

16) నిర్వికారుడగు పురుషునికి వేదనా విశేషములెట్లు తెలియును ?

17) వైద్యుడు రోగికి గడచిన వ్యాధులకు చికిత్స చేయునా ?

18) వర్తమానముననున్న వ్యాధులకు చికిత్స చేయునా ?

19) రానున్న వ్యాధులకు చికిత్స చేయునా ? ఎందువలననగా రాబోవు వ్యాధికిని గడచిన వ్యాధికిని తత్కాలమున ఉనికిలేదు. తత్కాలమున సంభవించు వ్యాధియును స్థిరముగా నుండదు. కావున ఈ మూడింటిలో దేనికి వైద్యుడు చికిత్స చేయునను సంశయము కలుగుచున్నది.

20) వేదనలకు కారణమేది ?

21) వేదనలకు అధిష్ఠానమేది ?

22) వేదనలన్నియు నెప్పుడు నిశ్శేషముగా అంతమునొందును ?

23) సర్వవిదుడు, సర్వమును విడచినవాడు, అన్ని సంయోగములను వదలినవాడు, ప్రశాంతముగా నున్నవాడు ఒక్కడేయగు మహాత్ముడగువాడే లక్షణములతో తెలియనగును ? అని అగ్నివేశుని యొక్క మాటలను (ప్రశ్నలను) వినిన బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు, ప్రశాంతాత్ముడగు పునర్వసు (ఆత్రేయుడు) అన్ని విషయములను యథాక్రమముగా బాగుగా చెప్పుచున్నాడు.

ఆయుర్వేదదీపిక : 'కతిధా' అనగా ప్రకారము ఎన్ని విధములు అని అర్థము. "పురుషః" అనుటవలన సామాన్యముగా పురుష శబ్దమును సూచించు అర్థము పేర్కొనబడుచున్నది: ఎందువలననగా "ఖాదయశ్చేతనాషష్ఠా" అను మొదలగువాని వలన, మరియు చతుర్వింశతిభేదము భేదముచే భిన్నమగు (వేరొకటగు) కర్మపురుషుడే శరీరముగలవాడని తెలిసికొనవలెను. అట్లే "చేతనా ధాతురప్యేకః స్మృతః పురుషసంజ్ఞకః" అనుటవలన శరీరము లేనట్టి ఆత్మయే పురుషశబ్దమునకు అర్థముగా గ్రహింపవలెను. పురుషుని ధరించునది ధాతువు: అందువలన "ధాతుభేదేన" అనగా పురుషుని ధరించు విషయముల భేదము వలన అని అర్థము. "ధీమన్" అను విశేషణము వలన ఎవడు ధీమంతుడో అతడే చెప్పబోవుచున్న వాక్యమగు ఈ పురుష భేదములు మొదలగువానిని చెప్పుటకు సమర్థుడగునని చూపుచున్నాడు. "పురుషః కారణం కస్మాత్" అనగా ఏ కారణము వలన పురుషుడు ఈ సంసారమునందు ప్రధానమగు స్థాయి కారణమగుచున్నాడు? అని అర్థము. "ప్రభవత్యస్మాత్ ఇతి ప్రభవః" అనగా కారణము. "యోనిషు" అనగా జాతులయందు, "సర్వాః" పరపురుషులయందున్న వానిని కూడ అని అర్థము. క్షేత్రజ్ఞుడు అనగా ఆత్మ అని అర్థము. క్షేత్రమనగా ప్రకృతి తప్ప మిగిలిన చెప్పబోవుచున్నవి అని అర్థము. "జ్ఞేయమ్" అను మొదలగునవి - క్షేత్రము లేనపుడు క్షేత్రజ్ఞుని యొక్క అభావము లేనందున (క్షేత్రజ్ఞుడుండుటవలన) అతనికి క్షేత్రజ్ఞత్వము వర్తింపదని భావము. "సాక్షిభూతః" అనగా సాక్షీ సదృశుడు అని అర్థము. "విశేషో వేదనాకృతః" అనగా పుత్రుడు కలుగుట మొదలైనవాని జ్ఞానము కలిగి అజ్ఞానము వలన సంతోషాది విశేషములు (అనుభవించు) అని అర్థము. "చికిత్సామి" అనగా అతీత అనాగత వర్తమానములగు వ్యాధుల మధ్యన దీనిని (వైద్యుడు) చికిత్సించుచున్నాడు అని

అర్థము. "అతీతమ్" అను మొదలగువానియందు 'కిం' శబ్దము అధ్యవహార్యము (అన్నిటికీ వర్తింపవలసినది). అందువలన అతీతములను చికిత్సించునా ఏమి? వర్తమానములను చికిత్సించునా ఏమి? లేదా భవిష్యత్తునందు కలుగబోవు వ్యాధులను చికిత్సించునా ఏమి? అని అన్వయించుకొనవలెను. "స్థానం నాస్తి" అనగా (వర్తమాన వ్యాధి లక్షణములు) క్షణికమగుటచే చికిత్సకు ప్రవృత్తమగు సమయమున నిలచియుండుట జరుగదు అని అర్థము. వేదనలయొక్క కారణము మరియు అధిష్ఠానము దీర్ఘం జీవితీయాధ్యాయమున (సూత్రస్థానము 1వ అధ్యాయం) చెప్పబడి యున్నప్పటీ ఇచట ప్రకరణ వశమున విశేషముగా తెలిసికొను కోరికచేత మరల విశిష్టములైన ఈ ప్రశ్నలు వేయబడుచున్నవి. ప్రశ్నయొక్క సమాధానములు ఈ తరువాతి సూత్రము (శ్లోకము) నందు ఆచార్యునిచేత చెప్పవలసి యుండుటచే ఇచట ఆ వ్యాఖ్యను చేయుటలేదు.

## ధాతుభేదము వలన పురుషుని భేదములు

16. ఖాదయశ్చేతనాషష్ఠా ధాతవః పురుషః స్మృతః,
చేతనాధాతురప్యేకః స్మృతః పురుషసంజ్ఞకః

**తాత్పర్యము :** ఆకాశము మొదలగు ఐదు భూతములును ఆరవదియగు చేతనతో కలిపి పురుషుడు షడ్ధాతు పురుషుడని చెప్పబడును. చేతనాధాతు వొక్కటి యునూ పురుషుడని అనబడును. (షడ్ధాతు పురుషుడు - ఏకధాతు పురుషుడు అని ధాతుభేదముచే పురుషుడు రెండు విధములని భావము).

**ఆయుర్వేదదీపిక :** "ఖాదయః" అను మొదలగునవి.... "ఖాదయః" అనగా ఆకాశ వాయు-అగ్ని-జల- పృథివి (ఖం వాయురగ్నిరాపః క్షితిస్తథా) అని చెప్పబడనున్న ఐదు భూతములు; "చేతనాషష్ఠా" అనుచోట చేతనకు ఆధారమైన మనస్సుతోకూడి ఆత్మను గ్రహింపవలెను. 'ఖ' మొదలగువానిని (ఆకాశాదులను) గ్రహించుటచేత ఆకాశాదులతో నిండిన ఇంద్రియములను కూడా తెలిసికొనవలెను. ఈ పురుషుడు వైశేషిక దర్శనము అంగీకరించిన చికిత్సాశాస్త్రము యొక్క విషయమగు పురుషుడు. ఇతడే సుశ్రుతునిచేకూడ "పంచమహాభూత శరీరి సమవాయః పురుషః" అని చెప్పబడినాడు (సు. సూ. 1) "స్మృతః" అని చెప్పుటవలన పూర్వాచార్యులకు గూడ ఈ పురుషశబ్దము చెప్పబడినదేగాని తమచే ఇది కల్పించబడినది గాదని చూపుచున్నాడు. "పురి - శరీరే శేతే" శరీరమునందు నివసించువాడు అను

వ్యుత్పత్తి వలన ఏ ఆత్మ పురుష శబ్దమువలన చెప్పబడుచున్నదో దానిని చేతనా అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. ఇచట పురుషుడు అని చెప్పుటయందు ఏదీ పురుషసంజ్ఞ కలవాడు అని చెప్పుచున్నాడో దానివలన చికిత్సకు తగిన చేతనా ధాతురూప పురుషుడని అభిప్రాయము కాదు; కాని, ఇతర శాస్త్రముల వ్యవహారము నందు తెలియుట వలన ఇచటకూడ ఇతడు పురుష శబ్దము వలన సూచింపబడినాడని చూపుచున్నాడు. చికిత్సా విషయమగువాడు మాత్రము షడ్ధాతు పురుషుడే. అందువల ననే అచట సంజ్ఞితః అని చెప్పబడలేదు. ఈ పురుష శబ్దమునూ గవాదులయందు గూడ షడ్ధాతుసముదాయమునందు వర్తించుచున్నప్పటికీ సర్వప్రధానమగు నరుని యందు మాత్రమే వర్తించును. అందువలన గవాదులయందు పురుష శబ్దము ఎక్కువ ప్రసిద్ధముగాదు.

## చతుర్వింశతి తత్త్వాత్మక పురుషుడు

17. పునశ్చ ధాతుభేదేన చతుర్వింశతికః స్మృతః,
మనో దశేన్ద్రియాణ్యర్థాః ప్రకృతిశ్చాష్టధాతుకీ

**తాత్పర్యము :** ఇంకనూ ధాతు భేదమువలన పురుషుడు చతుర్వింశతికు డని చెప్పబడినాడు. ఆ ఇరువదినాల్గు తత్త్వములేవనిన - మనస్సు - 1, ఇంద్రియ ములు - 10, ఇంద్రియార్థములు - 5, అష్టధాతుకమగు ప్రకృతి - 8 (ప్రకృతి -1, మహత్తు-1, అహంకారము-1, పంచతన్మాత్రలు-5 ఈ విధముగా మొత్తము 24 తత్త్వములు).

**ఆయుర్వేద దీపిక :** "పునశ్చ" అను మొదలగువాని ద్వారా షడ్ధాతు రూపమే యగు పురుషుని మరల సాంఖ్య దర్శనమునందు చెప్పబడిన చతుర్వింశతిక భేదము వలన చెప్పుచున్నాడు. "మనః" అను మొదలగువాని ద్వారా చతుర్వింశతి కమే విభజింపబడుచున్నది. సాంఖ్యులచే ఈ పురుషుడు పంచవింశతితత్త్వమయుడని చెప్పబడినప్పటికీ, - వారు చెప్పినట్లు - "మూలప్రకృతిరవికృతిర్మహదాద్యాః ప్రకృతి వికృతయః సప్త, షోడశకస్తు వికారో నప్రకృతిర్న వికృతిః పురుషః"- (సాంఖ్య కారిక-3) మూల ప్రకృతి ఒకటి. ఇది ప్రకృతి యనబడును. మహదాదులు ప్రకృతి వికృతులు ఏడు. (1 మహత్తు+ 1 అహంకారము+ 5 పంచతన్మాత్రలు) వికార ములు 16 (11 ఇంద్రియములు-మనస్సు+ 5 బుద్ధీంద్రియములు+ 5 కర్మేంద్రియ

ములు). పురుషుడు నప్రకృతి నవికృతి-1 అని చెప్పబడినప్పటికీ ప్రకృతికి వ్యతి రేకమై ఉదాసీనముగా నుండు పురుషుని - అవ్యక్తమును ప్రకృతి యొక్క గుణము నకు సాధర్మ్యమును కలిగియుండుట వలన అవ్యక్తమును ప్రకృతియందే చేర్చి అవ్యక్త శబ్దము చేతనే గ్రహించుచున్నాడు. అందువలన పురుషుడు చతుర్వింశతికు డనుట విరుద్ధము గాదు. సూక్ష్మమగు ఉదాసీనము యొక్క భేదమును ప్రతిపాదిం చుట ఇచట ప్రయోజనకారి కాకపోవుట వలన జరుగలేదు. "దశేన్ద్రియాణి" అనగా ఐదు కర్మేంద్రియములు, ఐదు బుద్ధీంద్రియములు అని అర్థము. "అష్టధాతుకీ" అనగా ఆకాశము మొదలగు ఐదు భూతములు - బుద్ధి, అవ్యక్తము మరియు అహం కారము అని మొత్తము ఎనిమిదింటితో కూడినది. ఇదే విషయమును "ఖాదీని బుద్ధి రవ్యక్తమహఙ్కార స్తథాష్టమః" అని చెప్పుచున్నాడు.

## మనస్సుయొక్క లక్షణము - గుణములు

18. లక్షణం మనసో జ్ఞానస్యాభావో భావ ఏవ చ,
సతిహ్యాత్మేన్ద్రియార్థానాం సన్నికర్షే న వర్తతే

19. వైవృత్యాన్మనసో జ్ఞానం సాన్నిధ్యాత్తచ్చ వర్తతే,
అణుత్వమథ చైకత్వం ద్వౌ గుణౌ మనసః స్మృతౌ.

**తాత్పర్యము :** జ్ఞానము కలుగుట మరియు కలుగకపోవుట యనునది మనస్సుయొక్క లక్షణము. ఆత్మ - ఇంద్రియము - అర్థము అను వాని మధ్య సంబంధమున్నప్పటికీ మనస్సు యొక్క సంబంధము లేకపోవుటచే జ్ఞానము (ఆ ఇంద్రియార్థము యొక్క జ్ఞానము) కలుగదు. మనస్సు వీనితో సన్నిహితముగా నున్నపుడు ఆ జ్ఞానము కలుగును. అణుత్వము మరియు ఏకత్వము అను రెండును మనస్సుయొక్క గుణములుగా చెప్పబడినవి.

**ఆయుర్వేద దీపిక :** "లక్షణమ్" అను మొదలగునవి-చతుర్వింశతికము నందు మొదట చెప్పబడిన మనస్సును ఇచట వర్ణించుటకు చెప్పుచున్నాడు. "సతి" అను మొదలగువానిద్వారా జ్ఞానము కలుగకపోవుట. (అభావము) మరియు కలు గుట (భావము) అనునది మనస్సుపైన ఎట్లు ఆధారపడియుండునో తెలుపు చున్నాడు. "వైవృత్యాన్మనసః" అనగా ఇంద్రియముతో సంయోగము చెందకుండుట వలన, "సాన్నిధ్యాత్" అనగా ఇంద్రియముతో మనస్సు సంబంధము కలిగి

యుండుట వలన అని అర్థము. ఎప్పుడైతే ఇంద్రియార్థములు ఇంద్రియములతో సంయోగము చెందుతవో అపుడు ఒకానొక ఇంద్రియార్థమునందు జ్ఞానము కలుగును ఒకానొక ఇంద్రియార్థము నందు కలుగదు అని చూడబడుచున్నది. అందువలన ఈ జ్ఞానము యొక్క భావాభావములు రెండును జ్ఞానము కలుగుటకు వేరు కారణమును (ఇతర కారణమును) చూపుచున్నవి. అట్టి ఇతర కారణము ఆ మనస్సు (అని తెలియవలెను). అట్టి మనోరూప కారణము కూడ ఒకవేళ ఆత్మవలె ఒకేసారిగా అన్ని ఇంద్రియముల యందు వ్యాపించుటను సమ్మతించినచో, లేక ఇంద్రియ ముల వలె మనస్సు అనేక సంఖ్యలో నుండునని సమ్మతించినచో, అపుడు మరల మనస్సుయొక్క విభుత్వము వలన ఒకేసారి ఇంద్రియార్థములతో సంబంధము కలు గుటయందు ఐదు విధములగు జ్ఞానములునూ కలుగవలెను. (కాని నిజమునకు) జ్ఞానములన్నియు ఒకేసారి కలుగుటలేదు. అందువలన ఒకేసారిగా (ఎక్కువ ఇంద్రి యార్థముల) జ్ఞానము కలుగకపోవుట అను లక్షణము వలన మనస్సు అణు రూప మును కలిగి ఒక్కటియే అయ్యునూ యుండుట సిద్ధించునని "అణుత్వమ్" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు.

## మనో విషయములు - కర్మలు

20. చిన్త్యం విచార్యమూహ్యం చ ధ్యేయం సంకల్ప్యమేవ చ,
యత్కించిన్మనసో జ్ఞేయం తత్ సర్వం హ్యర్థసంజ్ఞకమ్.

21. ఇన్ద్రియాభిగ్రహః కర్మ మనసః స్వస్య నిగ్రహః,
ఊహో విచారశ్చ తతః పరం బుద్ధిః ప్రవర్తతే.

**తాత్పర్యము :** చింత్యము, విచార్యము, ఊహ్యము, ధ్యేయము, సంకల్ప్యము (క్రమముగా చింతింపదగినది, విచారింపదగినది, ఊహింపదగినది, ధ్యానింపదగినది, సంకల్పింపదగినది) అనునవి మరియు మనస్సుద్వారా తెలియనగు నదేదైననూ మనస్సుయొక్క అర్థములు (విషయములు) అని గుర్తింపబడును.

ఇంద్రియములకు అధిష్ఠానముగా నుండుట, తనను తాను ఆధీనములో నుంచు కొనుట, ఊహ, విచారము అనునవి మనస్సుయొక్క కర్మలు. ఇవిపైన పిదపనే బుద్ధి యనునది ప్రవర్తించును.

**ఆయుర్వేదదీపిక :** మనస్సు యొక్క గుణములను పేర్కొని మనస్సు యొక్క విషయములను 'చిన్త్యమ్" అను మొదలగువాని ద్వారా చెప్పు

చున్నాడు. చింత్యమనగా మనస్సు చేత ఇది చేయదగినది ఇది చేయదగనిది అని చింతించుట. ఇవి ఈ పనికి ఉపపత్తి కారణములు, ఇవి అనుపపత్తి కారణములు (సాధక బాధకములు) అని విమర్శించుట విచార్యము. సంభావనము చేత "ఇది ఇట్లు అగును" అని ఊహించుట ఊహ్యము. ధ్యేయమనునది భావనాజ్ఞాన విషయము. సంకల్ప్యము అనునది గుణవంతముగనైనను దోషవంతముగనైనను నిర్ధారణ చేయుట. "మనసోజ్ఞేయమనగా" ఇంద్రియముల ప్రమేయము లేకుండగ మనస్సుచే గ్రహింపబడునది. ఈ మనో విషయములు శబ్దాది రూపములగునవే: అందువలన ఆరు విషయములను వర్ణించుట ఇరువదినాల్గు సంఖ్యకంటె ఎక్కువ కాదు. సుఖాదులు మాత్రము శబ్దాదులకంటె ఇతరములైన మనో విషయములై బుద్ధి భేదమును గ్రహించుట వలననే తీసికొనబడవలసినవి. మనో విషయములను పేర్కొని "ఇంద్రియమ్" అనునగువాని ద్వారా మనస్సు యొక్క కర్మలను చెప్పు చున్నాడు. "ఇంద్రియాభిగ్రహః" అనగా ఇంద్రియములకు ఆధారమైయుండుట మనస్సు యొక్క కర్మ. మరియు తనను తాను నిగ్రహించుకొనుట (నియమములో నుంచుకొనుట) యునూ మనస్సు యొక్క కర్మ. మనస్సే తన కిష్టములేని విషయములను తానుగానే నియమించును. (నిరోధించును). మనస్సు ఇతర గుణములతో కూడి యున్నప్పుడు మిగిలిన విషయముల నుండి తన్ను తాను నియమించుకొనును అని కొందరందురు. "విషయప్రవణం చిత్తం ధృతిభ్రంశాన్న శక్యతే,నియన్తుమహితాదర్థాద్ధృతిర్హి నియమాత్మికా." అని చెప్పబడియే యున్నది. (ధృతి భ్రంశము వలన విషయ గ్రహణము జరుగదు. అహితమైన విషయముల నుండి ధృతియే నియమించును). అందువలన కారణ భూతమగు ధృతి వలన మనస్సు తనను తాను నియమించుకొనును అనుట తన క్రియలకు విరోధముగాదు. "ఊహో విచారశ్చ" అని మనస్సు యొక్క ఇతర కర్మలను చెప్పుచున్నాడు. ఇచట ఊహ యనునది నిర్వికల్పకమగు ఆలోచనా జ్ఞానము. విచారము హేయ, ఉపాదేయతలను గూర్చి ఆలోచించు వికల్పక ఆలోచనా జ్ఞానము. సాంఖ్యులు వికల్ప కారణమును నాలుగు విధములుగా అంగీకరింతురు. అచట ఒకటి ఇంద్రియ రూపమగు బాహ్యము, అభ్యంతరములు మనస్సు, బుద్ధి, అహంకారములని మూడు. అచట ఇంద్రియములు ఆలోచించును అనగా నిర్వికల్పముగా అర్థమును గ్రహించునని అర్థము. మనస్సు మాత్రము సరిగా కల్పనమును చేయుట అనగా విషయము హేయమా ఉపాదేయమా (వదల వలసినదా లేక గ్రహింపదగినదా) అను వికల్పన

మును చేయును అని అర్థము. అహంకారము అనునది అభిమననము చేయును. ఇది నాది నేను ఇచ్చట అధికారము కలిగియున్నాను అని అనుకొనజేయును అని అర్థము. బుద్ధి యనునది అధ్యవసాయమును (నిశ్చయమును) చేయును - "దీనిని దోషవంతమగుటచే త్యజించుచున్నాను". "దీనిని గుణవంతమగుటచే గ్రహించుచున్నాను" అని నిర్ణయమును చేయును. అని అర్థము. ఊహ మాత్రము బాహ్యములగు చక్షువు మొదలైనవాని కర్మమైననూ, అచట కూడ మనస్సు యొక్క అధిష్ఠానత్వముండునని మనస్సు యొక్క కర్మగనే చెప్పబడినది. "సాన్తః కరణా బుద్ధిః సర్వం విషయమవగాహతే యస్మాత్, తస్మాత్త్రివిధం కారణం ద్వారి ద్వారాణి శేషాణి" (సాంఖ్యకారిక-35) అని చెప్పబడియేయున్నది. "తతః పరం బుద్ధిః ప్రవర్తతే" అనగా ఊహ, విచారముల తరువాత బుద్ధి నిర్ణయమును చేయును అని అర్థము. అహంకారము యొక్క వ్యాపారమగు అభిమననము ఇచట చెప్పబడనప్పటికీ బుద్ధి యొక్క వ్యాపారము వలననే సూచింపబడినదిగా తెలిసికొనవలెను. బుద్ధియే దీనిని వదలుచున్నాను లేదా దీనిని తీసికొనుచున్నాను అను నిర్ణయమును చేయుట అహంకారమునకు అభిమతమైన విషయము అగుచున్నది: అందువలన బుద్ధి వ్యాపారము వలననే అహంకార వ్యాపారము కూడ గ్రహింపబడుచున్నది. బుద్ధియందే అన్ని కరణముల వ్యాపారమును అర్పించుట (ఆపాదించుట) జరుగును. "ఏతే ప్రదీపకల్పాః పరస్పర విలక్షణా గుణ విశేషాః, కృత్స్నం పురుషస్యార్థం ప్రకాశ్య బుద్ధౌ ప్రయచ్ఛన్తి". (సాంఖ్యకారికా 36.) అని చెప్పబడియున్నది.

## జ్ఞానము కలుగు విధము

22. ఇద్ద్రియేణేన్ద్రియార్థో హి సమనస్కేన గృహ్యతే,
కల్ప్యతే మనసా తూర్ధ్వం గుణతో దోషతోఽథవా.

23. జాయతే విషయే తత్ర యా బుద్ధిర్నిశ్చయాత్మికా,
వ్యవస్యతి తయా వక్తుం కర్తుం వా బుద్ధిపూర్వకమ్.

**తాత్పర్యము :** ఇంద్రియార్థము మనస్సుతో కూడిన ఇంద్రియము వలన గ్రహింపబడును. ఆ పైన మనస్సుతో గుణదోష వికల్పము చేయబడును. (ఇది దోషయుక్తమైనదా లేక గుణయుక్తమైనదా అని మనస్సు విమర్శ చేయును.) ఇట్లు కలిగిన విషయమునందు నిశ్చయాత్మకమగు బుద్ధి (దానిని గురించి) చెప్పుటకు లేదా చేయుటకు ప్రయత్నము చేయును.

**ఆయుర్వేద దీపిక :** బుద్ధియొక్క ఊహ-విచారములను చేయుట అను పనిని "ఇన్ద్రియేణ" అను మొదలగు వానిద్వారా వివరించుచున్నాడు. "గృహ్యతే" అనగా ఊహామాత్రముచేత నిర్వికల్పముగా గ్రహించబడును అని అర్థము. "గుణతః" అనగా గ్రహింపదగినదానిగా అని అర్థము. "దోషతః" అనగా వర్జింప వలసిన దానిగా అని అర్థము. బుద్ధియొక్క నిర్ణయమును "జాయతే" అనువాని ద్వారా వివరించుచున్నాడు. "విషయే తత్ర" అనగా మనస్సు ద్వారా కల్పింప బడిన విషయమునందు అని అర్థము. "నిశ్చయాత్మికా" అనగా స్థిరరూపమగు, నిర్ణయరూపమగు అని అర్థము. 'వ్యవస్యతి' అనగా అనుష్ఠానము చేయును— ఉద్యుక్తమగును అని అర్థము - బుద్ధిచే నిర్ణయింపబడిన విషయమును చెప్పుటకు లేదా చేయుటకు ఉద్యుక్తమగును అని అర్థము. "బుద్ధి పూర్వకమ్" అనుట వలన ఏ అనుష్ఠానము బుద్ధి పూర్వకముగా నుండునో అది ఈ విధముగా జరుగుచున్నది కాని ఉన్మత్త స్థితియందున్నప్పటి అనుష్ఠానము కాదు (ఈ విధముగా జరుగదు) అని చూపుచున్నాడు.

24. ఏకైకాధికయుక్తాని ఖాదీనామిన్ద్రియాణి తు,
పఞ్చ కర్మానుమేయాని యేభ్యో బుద్ధిః ప్రవర్తతే.

**తాత్పర్యము :** వేని ద్వారా బుద్ధి ప్రవర్తించునో అట్టి ఇంద్రియములు ఐదును అనుమానముచే తెలిసికొనదగినవై ఆకాశాది పంచమహాభూతములను ఒక్కొక్కటిని అధికముగా కలిగియుండును. (శ్రోత్రమునందు ఆకాశము, త్వక్కునందు ఆకాశము వాయువు, చక్షువునందు ఆకాశము వాయువు అగ్ని, జిహ్వయందు ఆకాశ వాయు అగ్నిజలములు, ఘ్రాణమునందు ఆకాశవాయు అగ్ని జల పృథివి అని ఐదును క్రమముగా ఒక్కొక్క యింద్రియమునుండి తరువాతి ఇంద్రియమునందు ఒక్కొక్కటి అధికముగా నుండును).

**ఆయుర్వేదదీపిక :** మనస్సును పేర్కొనిన తరువాత ఇంద్రియములు పేర్కొనబడుచున్నవి. అచటయును గొప్పవగుటచేత బుద్ధీంద్రియములను మొదటగా "ఏకైక" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. ఆకాశాదుల మధ్యన ఒక్కొక్క భూతము అధికముగానున్న భూతములతో కూడిన ఐదు ఇంద్రియము చక్షువు మొదలైనవి: "ఏకైకాధిక"మను పదము వలన ఐదు ఇంద్రియములును పాంచభౌతికములైనవి. కాని చక్షువునందు తేజోభూతము అధికముగా నుండును

అను మొదలగునవి చెప్పబడి యుండుటను సూచించుచున్నాడు. "కర్మానుమేయాని" వాని కార్యముల వలన అనుమానించి తెలిసికొనదగినవని అర్థము. కార్యమనగా- చక్షువు యొక్క- బుద్ధి చక్షుబుద్ధి మొదలైనవి. "యేభ్యో బుద్ధిః ప్రవర్తతే" అనగా బుద్ధీన్ద్రియములేవి కలవో అవి ఈ ఐదు అని చూపుచున్నాడు. సాంఖ్యమునందు ఇంద్రియములు అహంకారికములు అని చెప్పబడినప్పటికీ, ("సాత్త్విక ఏకాదశకః ప్రవర్తతే వైకృతాదహఙ్కారాత్"- సాంఖ్యకారిక-25), మఱి భేదము వలన ఇన్ద్రియములకు భౌతికత్వముందునని తెలియవలెను. లేదా, ఇంద్రియములకు ఈ భౌతికత్వము ఔపచారికమని తెలియవలెను. ఉపచార బీజమగు భూతములందలి ఏ గుణమును అధికముగా ఏ ఇంద్రియము గ్రహించుచున్నదో ఆ ఇంద్రియముఆ భూత (ఉపచారబీజ) భూయిష్ఠమని చెప్పబడుచున్నది: చక్షువు తేజస్సును గ్రహించును. అందువలన చక్షువు తైజసమనబడును అను మొదలగువానిని తెలియవలెను.

### పంచ కర్మేంద్రియములు - వాని కృత్యములు

25. హస్తౌ పాదౌ గుదోపస్థం వాగిన్ద్రియమథాపి చ,
    కర్మేన్ద్రియాణి పఞ్చైవ పాదౌ గమనకర్మణి.

26. పాయూపస్థం విసర్గార్థం హస్తౌ గ్రహణధారణే,
    జిహ్వా వాగిన్ద్రియం వాక్ చ సత్యా జ్యోతి స్తమోఽనృతా.

**తాత్పర్యము :** రెండు చేతులు, రెండు కాళ్ళు, గుదము, ఉపస్థ, వాగింద్రియము అను ఐదును కర్మేంద్రియములు. అందు రెండు పాదములు నడచుటకు, గుదము ఉపస్థలు మల శుక్రములను విసర్జించుటకు రెండు హస్తములు వస్తువులను గ్రహించుటకు పట్టియుండుటకు, పనికివచ్చును. జిహ్వ వాగింద్రియము. ఈ వాగింద్రియము వలన కలుగు సత్యవాక్కు జ్యోతి వంటిది. అసత్యవాక్కు తమస్సు (చీకటి) వంటిది.

**ఆయుర్వేదదీపిక :** ఇక కర్మేంద్రియములను "హస్తౌ" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. ఒకే విధమైన పనులను చేయుట వలన రెండు చేతులు ఒకటిగాను, రెండు పాదములు ఒకటిగాను లెక్కింపబడినవి. గుదము ఉపస్థ ఒక్కొక్కటిగా లెక్కింపబడినవి. వాక్కు యొక్క తీసికొనవలసినది, తీసికొనకూడనిది అను భేదమును "వాక్ చ" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. ధర్మకర్తృత్వము వలన ఉభయ లోకములందును ప్రకాశమిచ్చునదగుటచే సత్యవాక్కు జ్యోతివంటిదనుటను "జ్యోతి"యని చెప్పుచున్నాడు. దీనికి వ్యతిరేకముగా నుండునది చీకటిని పుట్టించు అబద్ధము.

## మహా భూతములు - వాని గుణములు

27. మహాభూతాని ఖం వాయురగ్నిరాపః క్షితి స్తథా,
శబ్దః స్పర్శశ్చ రూపం చ రసో గన్ధశ్చ తద్గుణాః.

**తాత్పర్యము :** ఆకాశము, వాయువు, అగ్ని, జలము మరియు పృథివి అనునవి మహా భూతములు. శబ్దము, స్పర్శ, రూపము, రసము మరియు గంధము అనునవి క్రమముగా నీ మైదింటియొక్క గుణములు (ఆకాశమునకు శబ్దగుణము, వాయువునకు స్పర్శగుణము, అగ్నికి రూపగుణము, జలమునకు రసగుణము మరియు పృథివికి గంధ గుణము ఉండును).

**ఆయుర్వేదదీపిక :** ప్రస్తుత ఉద్దేశక్రమముననుసరించి చెప్పవలసి యున్న విషయములందు ప్రకృతిని గ్రహించుటచే తీసికొనబడినవి పంచభూత గుణములు, ఇవి పరాధీనములై అష్టధాతు ప్రకృతిగా గ్రహింపబడు భూతములే: వాని విషయములను 'మహాభూతాని' అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. శబ్దాదులు యథాక్రమముగా ఆకాశాదుల ప్రాకృతిక గుణములని తెలియవలెను. గుణోత్కర్షముగా చెప్పవలసినదేది కలదో అవి అనుప్రవిష్టమగుచున్న భూత సంబంధము వలన కలుగుచున్నది. అందువలన పృథివి యందు నాలుగు భూతములు ప్రవేశించుటచే దానికి ఐదు గుణములున్నవి; ఇట్లే జలాదులయందును చతుర్గుణత్వము మొదలైనవానిని తెలియవలెను. (జలమునందు నాల్గు గుణములు అగ్నియందు మూడు గుణములు, వాయువునందు రెండు గుణములు, ఆకాశమునందు ఒక గుణము ఉన్నవని తెలియవలెను).

28. తేషామేక గుణః పూర్వో గుణవృద్ధిః పరే పరే,
పూర్వః పూర్వగుణశ్చైవ క్రమశో గుణిషు స్మృతః

**తాత్పర్యము :** మొదటి (ఆకాశమునందు) ఒక గుణమే (శబ్ద గుణమే) యుండును. తరువాతి వాటియందు ఒకటినుండి ఐదువరకు గుణవృద్ధి కలుగుచుండును క్రమముగా భూతములయందు మొదట మొదటిగుణమే యుండును అని చెప్పబడినది. (ఆకాశమునందు శబ్దగుణముండును. దాని తరువాతిదగు వాయు భూతమునందు శబ్దగుణముండును. దాని తరువాతిదగు వాయు భూతమునందు శబ్దగుణముతోబాటు స్పర్శగుణముండును. అగ్నియందు శబ్దస్పర్శలతోబాటు రూపగుణ ముండును.

జలమునందు శబ్దస్పర్శరూపములతోబాటు రసగుణముండును, పృథివియందు శబ్ద స్పర్శ రూప రసములతోబాటుగా గంధ గుణముండును. ఈ భూతములు ఐదును క్రమముగా శబ్దస్పర్శ రూపరసగంధములచే గుర్తింపబడును. వాయువు మొదలగు వానియందు ఇతర గుణములున్ననూ స్పర్శాదులయొక్క ఆధిక్యము వలన స్పర్శాది గుణములు కలవిగా చెప్పబడును.)

ఆయుర్వేద దీపిక : నైసర్గిక గుణములను పేర్కొని ఒక భూతము ఇంకొకభూతము నందు ప్రవేశించుటవలన కలుగు గుణములను "తేషామ్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "ఏకగుణః పూర్వః" అనగా పూర్వపు (మొదటి) ధాతువు ఆకాశరూపమగు శబ్దగుణము. ఆకాశాదులకు పుంలింగత్వము ధాతురూపమగు బుద్ధి యందుండుటంజేసి ఆపాదింపబడినది. "ఖాదయశ్చేతనా షష్ఠా ధాతవః" అని (పుంలింగమున) చెప్పబడియేయున్నది, యే యే విధముగా పరత్వ ముండునో, ఆ యా విధముగా యథాక్రమమున గుణవృద్ధి కలుగును ఇప్పటివరకును ఒక గుణము రెండు గుణములు మొదలగునవియుండుట యనునది నియమముగా ఏ గుణము ఏ భూతమునందు ఉండునో తెలియబడుటలేదు అను విషయమును "పూర్వః" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "గుణః" అనగా ఆకాశాది ధాతువులయందు పూర్వగుణము యథాక్రమముగా నుండును. మొదట నున్న గుణమే కాకుండా పూర్వధాతుయొక్క గుణమేదికలదో అదియును తరువాతి భూతమునం దుండును. అందువలన మొట్టమొదట శబ్దగుణముండును: వాయువునందు మాత్రము క్రమముగా ప్రాప్తించు స్పర్శగుణము (వాయువు తరువాత అగ్నియందలి రూపము నకు) పూర్వమగుచున్నది, (స్పర్శకు) పూర్వగుణమగు శబ్దముతో చేరి వాయువునకు ద్విగుణత్వము కలుగుచున్నది. ఇట్లు అగ్నిమొదలైనవానియందును తెలియవలెను. గంధగుణముమాత్రము దాని తరువాత మరియొక గుణము లేనందున పూర్వ గుణము కాజాలదు. అయినను "గన్ధశ్చ తద్గుణాః" అను పాఠమునందు "తద్గుణాః" అను పదాపేక్ష యుండుటవలన గంధమునకు పూర్వత్వము కల్పించ దగియున్నది. లేదా, "పూర్వః" అని "ఛత్రిణో గచ్ఛన్తి" అను న్యాయము వలన చెప్పబడినది. అందువలన అపూర్వమైనప్పటికీ పృథివియందు గంధము క్రమముగా వచ్చినదని తెలియవలెను.

## పృథివ్యాది పంచమహాభూతముల స్వాభావిక గుణములు

29. ఖరద్రవచలోష్ణత్వం భూజలానిల తేజసామ్;
ఆకాశస్యాప్రతీఘాతో దృష్టం లిఙ్గం యథాక్రమమ్.

30. లక్షణం సర్వమేవై తత్ స్పర్శనేన్ద్రియగోచరమ్,
స్పర్శనేన్ద్రియ విజ్ఞేయః స్పర్శో హి సవిపర్యయః

**తాత్పర్యము :** ఖరత్వము, ద్రవత్వము, చలత్వము, ఉష్ణత్వము అను నవి క్రమముగా భూమి జలము వాయువు అగ్ని అనువాని యొక్క లక్షణములు. మరియు ఆకాశమునకు అప్రతీఘాతత్వము (అడ్డగించక పోవుట) అను లక్షణమునూ చూడబడినవి.

ఈ లక్షణములన్నియు స్పర్శనేంద్రియ గోచరములు. స్పర్శయును స్పర్శ లేకుండుటయును స్పర్శనేంద్రియము ద్వారా తెలిసికొనవలెను.

**ఆయుర్వేద దీపిక :** "ఖర" అను మొదలగువానిద్వారా భూతముల అసాధారణ లక్షణములను చెప్పుచున్నాడు. అప్రతీఘాతమనగా అడ్డగించకుండుట స్పర్శకు అందకుండుట అని అర్థము; స్పర్శ కలిగియున్నదే గతికి విఘాతమును కలిగించునదగును. స్పర్శ లేకపోవుటచేత ఆకాశము అట్లు విఘాతము కలిగించదు. "సర్వమేవై తత్" అనగా ఖరత్వము మొదలగునవన్నియు అని అర్థము. "స్పర్శనేన్ద్రియ గోచరమ్" అనగా స్పర్శనేన్ద్రియము ద్వారా తెలిసికొనదగిన అని అర్థము. "స్పర్శన" అను మొదలగు వాని ద్వారా ఇదంతయు ఎట్లు స్పర్శనేంద్రియ జ్ఞేయమో చెప్పుచున్నాడు. "సవిపర్యయః" అనగా స్పర్శ లేకుండుట అని అర్థము. ఏ ఇంద్రియము దేనిని గ్రహించునో ఆ ఇంద్రియము దాని అభావమునుగూడ గ్రహించును; అందువలన ఆకాశము యొక్క అస్పర్శత్వము గూడ స్పర్శనేంద్రియము ద్వారా గ్రహింపనగుననుట యుక్తము. ద్రవత్వము మరియు చలత్వము సాంఖ్య మతమందు స్పర్శనగ్రాహ్యములగుటచే స్థూల భూతమగు వాతము యొక్క ధర్మము అను స్పర్శయే అని చెప్పబడినది. ఈ ఆకాశాది సూక్ష్మ భూతములు తన్మాత్ర రూపములని తెలియవలెను. ఆకాశాది స్థూల భూతములు మాత్రము వికారములుగా అచట (సాంఖ్యమునందు) చెప్పబడినవి. ప్రకృతి వర్గమునందు సూక్ష్మ రూపములగు తన్మాత్రలు చెప్పబడినవి. "తన్మాత్రాణ్యవిశేషాస్తేభ్యో భూతాని పఞ్చపఞ్చభ్యః ఏతే స్మృతా

విశేషాః శాన్తా ఘోరాశ్చ మూఢాశ్చ"- (సాంఖ్యకారిక-38) అని చెప్పబడియే యున్నది. అందువలన ఇచటయును ఆకాశాదులు తన్మాత్రశబ్దముచే చెప్పబడిన సూక్ష్మములని తెలియవలెను.

31. గుణాః శరీరే గుణినాం నిర్దిష్టాశ్చిహ్నమేవ చ.

**తాత్పర్యము :** సూక్ష్మ రూపములగు భూతముల యొక్క గుణములు శరీరమునందు చిహ్నములుగా నుండునని చెప్పబడినవి.

**ఆయుర్వేదదీపిక :** శరీరము నందున్న సూక్ష్మములగు భూతముల యొక్క ఇతర లక్షణములను గుణాః" "అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "గుణాః" అనగా శబ్దాదులు. "గుణినామ్" అనగా సూక్ష్మరూపములగు భూతముల యొక్క అని అర్థము. "ఏవ చ" అని గ్రహించుట వలన వ్యక్తము లగు శబ్దాదులు శరీరస్థములగు సూక్ష్మ భూతముల లక్షణమగుచున్నవని వాక్యార్థము.

అర్థాః శబ్దాదయో జ్ఞేయా గోచరా విషయా గుణాః.

**తాత్పర్యము :** శబ్దాది అర్థములు మనకు కనిపించు ఇంద్రియముల విషయములని తెలియవలెను.

**ఆయుర్వేదదీపిక :** "అర్థాః" అను మొదలగువాని ద్వారా అర్థములను చెప్పుచున్నాడు. అర్థ శబ్దము వలన నీ శబ్దాదులు పేర్కొనబడుచున్నవో అని స్థూల ములగు ఆకాశాది రూపములని తెలియవలెను. ఇందువలన ఆకాశ పరిణామమే శబ్దము, వాత పరిణామము స్పర్శ అను మొదలగునవి తెలియనగును. శబ్దాదులను గ్రహించుట వలన ఇచట ఆకాశాదులను తీసికొనుట యేది వలనో, అది ఆకాశాదుల పరిణామములేయగు శబ్దాదులేయనుట యుక్తమే. ఇందువలన శ్రోత్రము వలన గ్రహింపబడునదంతయూ ఆకాశము యొక్క శబ్దము, స్పర్శ వలన [త్వగింద్రియము వలన] గ్రహింపబడునదంతయూ వాయువు స్పర్శయును మొదలగునవి తెలియ నగును.

32. యా యదిన్ద్రియమాశ్రిత్య జన్తోర్బుద్ధిః ప్రవర్తతే,
యాతి సా తేన నిర్దేశం మనసా చ మనోభవా.

33. భేదాత్ కార్యేన్ద్రియార్థానాం బహ్వ్యో వై బుద్ధయః స్మృతాః,
ఆత్మేన్ద్రియమనోర్థానామేకైకా సన్నికర్షజా.

34. అఙ్గుల్యఙ్గుష్ఠతలజస్తన్త్రీవీణానఖోద్భవః,
దృష్టః శబ్దో యథా బుద్ధిర్దృష్టా సంయోగజా తథా.

**తాత్పర్యము :** యే బుద్ధి యే ఇన్ద్రియమును ఆశ్రయించి ప్రవర్తించునో, ఆ బుద్ధి ఆ ఇంద్రియ బుద్ధిగా చెప్పబడును. మనస్సుద్వారా కల్గు బుద్ధి మనోబుద్ధి యనియు చెప్పబడును. కార్యరూపములగు ఇంద్రియ బుద్ధియొక్క భేదము వలన ఇట్టి బుద్ధులు (జ్ఞానములు) అనేకములని చెప్పబడినవి. ఆత్మ ఇన్ద్రియములు మనస్సు ఇన్ద్రియార్థములు- వీనియొక్క సన్నికర్షము వలన కలుగు జ్ఞానము ఒకే విధముగా నుండును. అంగుళి, అంగుష్ఠముల తలముల నుండి వచ్చు శబ్దము, వీణా తంత్రులను గోటితో మీటినచో వచ్చు శబ్దము వేరైననూ శబ్దమగుటవలన ఒకే విధముగా నుండునట్లు పై చెప్పిన సంయోగము వలన కల్గు బుద్ధియు ఒకే విధముగా నుండును.

**ఆయుర్వేదదీపిక :** "యా" అను మొదలగువాని ద్వారా ప్రస్తుతము ప్రకృతిగణము నందు చేరియున్న బుద్ధిని చూపుటకు ఆ బుద్ధియొక్క వృత్తి భేదము వలన జ్ఞాన విశేషరూపములను చెప్పుచున్నాడు. "యదిన్ద్రియమాశ్రిత్య" అనగా ఏ ఇంద్రియము యొక్క మార్గమును ఆశ్రయించి — మహత్తు అను శబ్దముతో పిలువబడు బుద్ధితత్త్వము యొక్క వృత్తి విశేషరూపములగు జ్ఞానములు ఏ ఇంద్రియ మార్గమున కల్గుచున్నవో - అవి ఆ ఇంద్రియ జన్యములుగా చెప్పబడుచున్నవి — చక్షుబుద్ధి, శ్రోత్రబుద్ధి మొదలగునవి చెప్పుట ఇందులకు ఉదాహరణము. మనస్సు వలన కలుగు బుద్ధియగు చిన్త్యము మొదలగు విషయములు మనస్సునకు సంబంధించినవని చెప్పబడును అనగా మనోబుద్ధియని చెప్పబడునని అర్థము. "భేదాత్" అను మొదలగువాని ద్వారా ఇంద్రియములు మనస్సులకు వేర్వేరు బుద్ధులు ఉండుట వలన అవి ఆరుగా నుండునని ప్రతిపాదించి బుద్ధులయొక్క బహుత్వమును చెప్పుచున్నాడు. కార్యరూపమగు ఇంద్రియార్థము యొక్కయు భేదమువలన, ఆ సంబంధము వలన విభేదింపబడుచున్న అనేక బుద్ధులు కలుగుచున్నవి. కార్యము సుఖదుఃఖ భేదముచే అనేక విధములు. సుఖదుఃఖముల విస్తారము వలననే ఆ కార్యము వలన కారణమగు జ్ఞానము కూడ అనేకమగుచున్నది. ఇపుడు అన్ని విధములైన బాహ్యజ్ఞాన సాధనములను గూర్చి "ఆత్మా" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. ఆత్మ యనునది అవ్యక్తము. 'ఏకైకా' అనగా ఒక్కొక్కటి. అనేకములగు వాని కలయిక

వలన బుద్ధి కలుగుననుటకు దృష్టాంతమును "అఙ్గుళి" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. ఈ ఉదాహరణము వలన రెండు రకములగు శబ్దములను చెప్పుచున్నాడు. అంగులి అంగుష్ఠతలముల వలన కలుగు శబ్దము ఒకటి. ఇది అంగుష్ఠమును రాచుకొనుమా మధ్యమాంగుళి వలన అరచేతితో సంయోగము కలుగుటచే కలుగు శబ్దము (చిటికె) తలశబ్దము అనబడుచున్నది. వీణాతంత్రులను నఖములచే మీటుటవలన గల్గు శబ్దమొకటి; ఇతరుని మాత్రము అంగుళి మొదలగువానివలన కలుగు వీణాశబ్దమును మాత్రము వర్ణించుట. ఇందువలన అంగుళి మొదలగు వాని యందేదైననూ లోపించినపుడు శబ్దము కలుగనట్లే, బుద్ధియును, ఆత్మాదులలో నేదైననూ లోపించినపుడు కలుగనేరదు అని చూపుచున్నాడు.

## పురుషుని రాశిపురుషుడనుట

35. బుద్ధీన్ద్రియమనోర్థానాం విద్యాద్యోగధరం పరమ్,
చతుర్వింశతికో హ్యేషః రాశిః పురుషసంజ్ఞకః

**తాత్పర్యము :** బుద్ధి, ఇంద్రియములు, మనస్సు, ఇంద్రియార్థములు, వీని సంయోగమును ధరించునట్టిది అవ్యక్తము. ఈ పురుషుడు పైచెప్పిన చతుర్వింశతి తత్త్వములతో గూడి రాశిపురుషుడని గుర్తింపబడుచున్నాడు.

**ఆయుర్వేదదీపిక :** ఇచట మును బుద్ధినుత్పన్న వృత్తులగు జ్ఞానములను చెప్పుటవలననే అహంకారముగూడ సూచింపబడినది. ఆత్మాదులతో కూడిన ఈ బుద్ధి "నేను చూచుచున్నాను" అను మొదలగు రూపముగు అహంకారము పైన ఆధారపడి యుండుటవలన అహంకారమును బుద్ధియందే చెప్పియుండుటవలన మిగిలిన అవ్యక్తమును కార్యముద్వారా "బుద్ధి" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. పర మనగా అవ్యక్తము బుద్ధి మొదలగువాని సంయోగమును ధరించునది యోగధరము. అవ్యక్తమనునది ప్రకృతిరూపమై, పురుషునికొరకు ప్రవృత్తమైయుండి, బుద్ధి మొదలగువానిని కలుపునది, భోగముల ననుభవించునదియును అయియున్నది. ఈ విధముగా నిర్వచింపబడిన చతుర్వింశతితమును "చతుర్వింశతికః" అను మొదలగువాని ద్వారా ఉపసంహరించుచున్నాడు. ఒకవేళ కర్మేంద్రియములను పేర్కొని "మహాభూతాని" అను మొదలగువాని వలన ఆశ్రయరూపములైన అర్థములను చెప్పుట వలన అర్థము చెప్పబడుచున్నది: "యా యదిన్ద్రియమాశ్రిత్య" అను మొదలగువాని

వలన స్పష్టముగా తెలియుచున్న బుద్ధియొక్క వృత్తి భేదములు చెప్పబడుచున్నవి అనుకొనినచో సూక్ష్మములు అవ్యక్తములును నగు బుద్ధి అహంకారము తన్మాత్రలు చెప్పబడలేదు. కాని అవి అన్నియు "బుద్ధీన్ద్రియమనోర్థానాం" అను మొదలైన శ్లోకమునందు పరశబ్దమువలన చెప్పబడుచున్నవి. అందువలన "యోగధరం పరమ్" అనుటవలన మూలప్రకృతి మరియు ప్రకృతి వికృతులు అగు మహదాదులు ఏడును చెప్పబడుచున్నవి. ఇట్లు రాశి చతుర్వింశతిక మగుచున్నది. పరత్వమనునది వికారము కంటె ప్రకృతులకు వర్తించుచునే యున్నది.

## ప్రవృత్తి కారణము - నివృత్తి ఉపాయము

36. రజస్తమోభ్యాం యుక్తస్య సంయోగోఽయమనన్తవాన్,
తాభ్యాం నిరాకృతాభ్యాం తు సత్త్వవృద్ధ్యా నివర్తతే

**తాత్పర్యము :** రజస్సు మరియు తమస్సులతో కూడిన పురుషునకు పైచెప్పిన చతుర్వింశతి తత్త్వముల సంయోగము కలుగును. అట్టి సంయోగము అనంతమై యుండును. (దీనికి అంతము లేదు) ఈ రెండింటిని నిరాకరించుటచే సత్త్వము వృద్ధి చెంది ఈ సంయోగము నుండి పురుషుడు నివృత్తిచెందును.

**ఆయుర్వేదదీపిక :** "రజః" అను మొదలగువాని వలన ప్రస్తుతము ఈ విధమైన పురుషునకు ఏ కారణముగా సంసరణము, (ప్రవృత్తి) మరియు మోక్షములకు హేతువును చెప్పుచున్నాడు. "సంయోగోఽయమ్" అనగా చతుర్వింశతి రాశిరూపమగు సమ్మేళనము. "తాభ్యామ్" అనగా రజస్సు తమస్సుల రెండింటినుండి, సత్త్వవృద్ధికి కారణభూతమగు రజస్సు మరియు తమస్సుల నివృత్తి వలన పురుష రూప సంయోగము నివర్తించును అనగా ముక్తిని పొందును అని అర్థము. వృద్ధి పొందిన సత్త్వము విశుద్ధ జ్ఞానమును కలిగించుటచేత సంసారకారణమగు రజస్సు తమస్సుల రెండింటిని జయించి ప్రకృతి పురుషులను గూర్చిన వివేక జ్ఞానము వలన మోక్షమును పొందును.

37. అత్ర కర్మ ఫలం చాత్ర జ్ఞానం చాత్ర ప్రతిష్ఠితమ్,
అత్ర మోహః సుఖం దుఃఖం జీవితం మరణం స్వతా

38. ఏవం యో వేద తత్త్వేన స వేద ప్రలయోదయౌ,
పారంపర్యం చికిత్సాం చ జ్ఞాతవ్యం యచ్చ కించన

**తాత్పర్యము :** ఇచటనే కర్మ, కర్మఫలము మరియు జ్ఞానమును ప్రతిష్ఠితమై యున్నవి. ఇంకనూ మోహము, సుఖము, దుఃఖము, జీవితము మరియు మమత అనునవియు ఈ సంయోగ స్థితియందే కలుగును.

ఎవడు ఈ విధమైన జ్ఞానమును సరిగా తెలిసికొనునో అట్టివాడు ప్రళయము, సృష్టి (మరణము, జీవితము) అను రెండింటి యొక్క పరంపరను దానికి చికిత్సను మరియు ఇంకేదైన తెలియవలసినదున్నచో దానినంతను తెలిసికొనును.

**ఆయుర్వేదదీపిక :** "అత్ర" అను మొదలగువానిచే మరల చతుర్వింశతికమగు పురుషుని యందు కర్మ, ఫలము మొదలగునవి ఉండునని చూపుచూ దోషహీనుడగు పురుషుని యందు కర్మ, ఫలము మొదలగు విషయములు లేకపోవుటను చూపుచున్నాడు. 'ఫలమత్ర' అనగా పైన చెప్పిన సముదాయపు పురుషుని యందు అని అర్థము. కర్మయొక్క అదృష్టము (పాపపుణ్యములని). 'ఫలమ్' అనగా అదృష్టఫలము. "జ్ఞానం" అనగా సుఖాదులను. జ్ఞానమనునది ఇరువది నాల్గు తత్త్వములకు అతిరిక్తమగు పురుషునిచే కాదుగాని ఆ చేతన వలన ప్రవృత్తియూ చేతనత్వము ఆపాదింపబడి చేతనయే సుఖాది వలన "అధిష్ఠానమే" అనునది యుక్తము గానే యున్నది. "తస్మాత్తత్సంయోగాదచేతనం చేతనావదివ లింగం" (సాంఖ్య కారికా-20) అను వచనమే గలదు. "ప్రలయోదయౌ" అనగా జీవిత మరణములు రెండు అని అర్థము. "పారంపర్యమ్" అనగా శరీరము యొక్క పరంపరను అని అర్థము. "చికిత్సాంచ" అనగా మోక్షసాధనమగు నైష్ఠిక దుఃఖనాశకమగు చికిత్స యని తెలియవలెను. 'యత్కించన' అనుటవలన తెలిసికొనవలసిన దంతయు చెప్పబడకపోయిననూ తెలిసికొనును అని అర్థము.

### పురుషుడున్నాడనుటకు తార్కాణములు

39. భాన్తస్తమః సత్యమనృతం వేదాః కర్మ శుభాశుభమ్,
న స్యుః కర్తా చ బోద్ధా చ పురుషో న భవేద్యది.
40. నాశ్రయో న సుఖం నార్తిర్న గతిర్నాగతిర్న వాక్,
న విజ్ఞానం న శాస్త్రాణి న జన్మ మరణం న చ
41. న బన్ధో న చ మోక్షః స్యాత్ పురుషో న భవేద్యది.
కారణం పురుషస్తస్మాత్ కారణజ్ఞైరుదాహృతః.

42. న చేత్ కారణమాత్మా స్యాద్భాదయః స్యురహేతుకాః,
న చైషు సంభవేజ్జ్ఞానం న చ తైః స్యాత్ ప్రయోజనమ్.

**తాత్పర్యము :** కర్తయు తెలిసికొనువాడును అగు పురుషుడు లేని యెడల వెలుగు-చీకటి (ప్రతిభ-మోహము), సత్యము-అసత్యము, శుభకర్మ-అశుభ కర్మ అనునవి ఉండజాలవు. అట్లే ఆశ్రయము, సుఖదుఃఖము, పోవుట వచ్చుట, వాక్కు విజ్ఞానము శాస్త్రములు, జన్మ మృత్యువులును పురుషుడు లేనిచో యుండవు.

పురుషుడు లేనిచో బంధమోక్షములుండనేరవు. అందువలననే కారణజ్ఞులు పురుషుని కారణముగా ఉదహరింతురు. ఆత్మ కారణము కాని యెడల వెలుతురు మొదలగునవి అహేతుకములగును వీటి యందు జ్ఞానమునూ కలుగదు పైగా, వాని వలన ప్రయోజనమునూ యుండదు.

**ఆయుర్వేదదీపిక :** పురుషుడు కారణమెట్లగుచున్నాడు అను ప్రశ్నకు జవాబు – "భాస్తమ" అను మొదలగునవి. "భాః" అనగా ప్రతిభ "తమః" అనగా మోహము. పురుషుడనగా ఈ ప్రకరణమునందు ఆత్మ అని అభిప్రాయము, ఆశ్రయమనగా శరీరము. గతియును ప్రయోజన అను సంధానము వలన కలుగును. ఇట్లే అగతియును కలుగును. "కారణం పురుషస్తస్మాత్" అనగా ప్రతిభ, మోహము, సత్యము అసత్యములకు పురుషుడు కారణమని అర్థము. "నచేత్" అను మొదలగువాని ద్వారా ప్రతిభ మొదలగువానికి ఆత్మయే కారణమనుదానినే చెప్పుచున్నాడు. ప్రతిభ, మోహములు రెండునూ ధర్మాధర్మముల రెండింటినీ కలుగ జేయునవై యున్నవి. ధర్మాధర్మములు రెండును ఆత్మ లేకున్నను నిరాశ్రయములని తెలుపరాదు: మరియు సత్యము ధర్మమును జనియింపజేయుట వలన ఆచరింప వలసినది, అసత్యము (అనృతము) అధర్మమును జనింపజేయుట వలన వర్జింప దగినది. ఈ రెండు ఆత్మయందు స్థిరముగా లేనపుడు ధర్మాధర్మములను జనియింప జేయుట యనునది లేదు. అందువలననూ సత్యాసత్య భేదమునూ ఏమీ చేయక పోవుట వలన లేదనియే ఎంచవలెను. ఇట్లు శుభాశుభకర్మలయందునూ చెప్పుకొన వలెను. మరియు కర్తయే కారణమును ప్రతిసంధానము చేయువాడునూ కాలేడు. ఆత్మయొక్క భోగమునకు కారణమగు శరీరము కూడా ఆత్మలేకుండా కలుగదు. ఎందువలననగా ఆత్మకు ప్రతిసంధానము చేయువాడు లేనందువలన అని అర్థము. అట్లే తెలిసికొనువాడు (బోద్ధ)నూ పూర్వాపర అవస్థను ప్రతి సంధానము చేయువాడే

యగును. ఆత్మ యొక్క భోగాయతనమగు శరీరము ఆత్మలేక యుండలేదు. ఇదే విధముగా సుఖాదులయందును ఆత్మయొక్క కారణత్వమును ఊహింపవలయును. విజ్ఞానమనగా శాస్త్రార్థజ్ఞానము. శాస్త్రములు ప్రతిసంధాతయగు ఆత్మవలననే చేయబడినవి. 'న చైష సంభవేజ్ఞానమ్' అనగా జ్ఞాతయగు ఆత్మ లేకపోయినచో ప్రతిభ మొదలగువాని యందు తెలిసికొనువాడగు ఆత్మయొక్క అభావము వలన-జ్ఞానము సంభవించదు అని అర్థము. 'న చ తైః స్యాత్ ప్రయోజనమ్' అనగా ప్రతిభ మొదలగునవి ఆత్మకొరకే యుండుట వలన, ఆత్మ లేనిచో అవి కలుగుట యనునది నిష్ప్రయోజనమగును. ప్రయోజనము లేనపుడు వాని యుత్పత్తి యుండదు. అన్ని భావములకును ఆత్మయందుండు ధర్మాధర్మములు రెండును పురుషుని భోగము కొరకు ఉత్పత్తియగుచున్నవి. భోక్త లేనపుడు కారణాభావముచేత భోజ్యము కూడ ఉండరాదు.

43. కృతం మృద్దండ చక్రైశ్చ కుమ్భకారాదృతే ఘటమ్,
కృతం మృత్తృణ కాష్ఠైశ్చ గృహకారాద్వినా గృహమ్.

44. యో వదేత్ న వదేద్దేహం సంభూయ కరణైః కృతమ్,
వినా కర్తారమజ్ఞానాద్యుక్త్యాగమ బహిష్కృతః

**తాత్పర్యము :** మన్ను, దండము, చక్రములతో కుమ్మరివాడు లేకుండగ ఘటము చేయబడినదనియు: మన్ను, గడ్డి, కర్రలతో ఇల్లుకట్టువాడు లేకుండగ ఇల్లు నిర్మించబడినదనియు ఎవడు చెప్పునో, వాడు శరీరము, ఇతర సాధనములతో కర్త లేకుండగ చేయబడినదని అజ్ఞానముచేత ఆగమయుక్తి లోపించినవాడై చెప్పుచుండును. (పై రెండు వస్తువులను క్రమముగా కుమ్మరివాడు, ఇల్లు కట్టువాడు లేకుండగ ఎట్లు నిర్మింపజాలమో, అటులనే కర్తయగు ఆత్మ లేకుండగ దేహ ముండజాలదని భావము.)

**ఆయుర్వేదదీపిక :** ప్రమేయము గొప్పదగుటచేత ఆత్మ లేకుండగ శరీరమెట్లు ఉత్పత్తి కాదో చెప్పుటకు రెండు దృష్టాంతములను "కృతం మృద్దండ" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "సంభూయ కరణైః కృతమ్" అనగా ఆత్మ లేకుండగ భూతములచే చేయబడినది అని అర్థము. అనుమానముచేత, ఆగమముచేతనూ రహితుడగువాడు యుక్త్యాగమ బహిష్కృతః. ఆత్మ తెలిసికొనుట యందు ప్రత్యక్షము అయోగ్యమగుటచేత అది ఇచట చెప్పబడలేదు.

45. కారణం పురుషః సర్వైః ప్రమాణైరుపలభ్యతే,
యేభ్యః ప్రమేయం సర్వేభ్య ఆగమేభ్యః ప్రమీయతే.

**తాత్పర్యము :** ఆగమములచేత ప్రమేయము (తెలిసికొన దగినది) తెలియబడుచున్నదో ఆ ప్రమాణములన్నింటిచేత కారణమగు పురుషుడు తెలియబడు చున్నాడు. (ఆగమములన్నియు పురుషుడున్నాడని తెలుపుచున్నవని భావము.)

**ఆయుర్వేదదీపిక :** "సర్వైః ప్రమాణైః" అనగా ప్రత్యక్షాదులచేత అని అర్థము. "యేభ్యః" అని కరణమే అపాదానమగుటచేసి పంచమీ విభక్తి వాడబడి నది. "ఆగమయన్తి బోధయన్తీతి ఆగమాః" తెలియజెప్పునవి ఆగమములు అని అర్థము. అవి ప్రమాణములే. ఇతరులు ఆగమ ప్రమాణముల రెండింటికి శాస్త్రములనే చెప్పుదురు.

## బౌద్ధుల నిరీశ్వరవాదము

46. న తే తత్సదృశాస్త్వన్యే పారంపర్య సముత్థితాః,
సారూప్యాద్యే త ఏవేతి నిర్దిశ్యన్తే నవా నవాః

47. భావాస్తేషాం సముదయో నిరీశః సత్త్వసంజ్ఞకః,
కర్తా భోక్తా న స పుమానితి కేచిద్వ్యవస్థితాః.

**తాత్పర్యము :** పూర్వజన్మకు సంబంధించిన ఆ పంచ మహాభూతములు ఈ శరీరమున (ఇప్పటి జన్మయందలి శరీరమున) ఉండుట లేదు. ఇవి పూర్వజన్మ మున నున్నవానికి వేరుగ నుండి వానికి సదృశములై యుండునేగాని ఆ మహాభూత ములే అనుకొనరాదు. ఇవి పరంపరగా క్రొత్తగా పుట్టుచు క్రొత్తవిగా నున్నను ఆ పోలిక వలన అవియే అని చెప్పబడునుకాని అట్లు కాదు. అట్టి భావముల సముదాయము ఈశ్వరుడు (ఆత్మ) లేకుండగనున్న సత్త్వమని చెప్పబడును. కాని ఆత్మయనునది వేరుగా లేదు. అది కర్త, భోక్త, పురుషుడును కానేరడని కొందరందురు.

**ఆయుర్వేదదీపిక :** "న తే" అను మొదలగువానిద్వారా నిరాత్మవాది యొక్క మతమును ఎత్తిచూపుచున్నాడు. ఈ శరీరమునందు ఏ పృథివీజలాది భావములున్నవో అవి అవియే (పూర్వజన్మము నందలివే) అని చెప్పబడుచున్నవో

అవి కావు; అనగా పూర్వమున్నవి తరువాత కలుగవు అని అర్థము. ఒక వేళ అవి అట్లు కలుగనవైనచో "అవి" అని ఎట్లు పేర్కొనబడుచున్నవి అను విషయమును "తత్సదృశాస్త్వన్యే" అనుట ద్వారా చెప్పుచున్నాడు; అనగా పూర్వమున్న వానికి పోలియుండు ఇతరములైనవి అని అర్థము. "పారంపర్య సముత్థితాః" అనగా ముందటివానిని పోలియున్న క్రొత్తగా పుట్టినవని భావము. "సామాన్యాత్" అనగా (వానిని) పోలియున్న రూపమును కలిగియుండుటచేత అని అర్థము. "తేషాం సముదయః" అనగా క్షణభంగురములైన వానియొక్క (భూతముల యొక్క) సమ్మేళనము అని అర్థము. 'నిరీశః' అనగా స్థాయిగానుండు (నాశములేని) ఆత్మ లేనటువంటి అని అర్థము. "సత్త్వ సంజ్ఞకః" అనగా ప్రాణియని పేర్కొనబడునట్టి. "కేచిత్" అనగా బౌద్ధులు. బౌద్ధులు క్షణికములైన జ్ఞానాది సముదాయము మాత్రమే శరీరమని అందురు. ప్రతి సంధానమునూ క్షణికములైననూ జ్ఞానాదుల యొక్క కార్యకారణ భావముచేత ఏకఫలమైన సంతతియందుండునని అందురు.

48. తేషామన్యైః కృతస్యాన్యే భావా భావైర్నవాః ఫలమ్,
భుఞ్జతే సదృశాః ప్రాప్తం యైరాత్మా నోపదిశ్యతే.

**తాత్పర్యము :** అట్లు ఆత్మ లేదని చెప్పువారి మతమున ఇతరులచే చేయబడిన కర్మల వలన కలుగు ఫలములను, అట్టి కర్మలకు కర్తృత్వము గలవారి కంటె ఇతరులు అనుభవింతురని భావము.

**ఆయుర్వేదదీపిక :** "తేషామ్" అను మొదలగువానిద్వారా పై మతమును దూషించుచున్నారు. "తేషామ్" అనగా జ్ఞాన సంతానవాదులకు అని అర్థము. ఇతరులచే చేయబడిన అన్నమును వండుట మొదలగువాని వలన కలుగు ఫలమగు అన్నమును ఇతరులు భుజింతురని సిద్ధించును. ఇది అసంగతమైన విషయము. ఫలమును నేను తినగలను అని భావి ఫలమును ఆశించి ప్రవర్తించువాడు వేరు ఫలమును భుజించుటకు చూచువాడెవరును ప్రవర్తింపడు. ఇంకనూ ఎవరు ఇతరుల కొరకు మంచి ఉపకారమును చేయుచున్నాడో వాడును పరార్థము వలన స్వార్థమును సాధించుటను కోరియే చేయుచున్నాడని భావము.

49. కరణాన్యన్యతా దృష్టా కర్తుః కర్తా స ఏవ తు,
కర్తా హి కరణైర్యుక్తః కారణం సర్వకర్మణామ్.

**తాత్పర్యము :** కర్త కంటె కరణములు వేరుగా నుండుట చూచుచునే యున్నాము. అట్టివాడే కర్త యగును. కరణములతో కూడిన కర్తయే అన్ని కర్మలకు కారణమగుచున్నాడు.

**ఆయుర్వేద దీపిక :** పరమతమును దూషించి "కరణా" అను మొదలగువానిద్వారా స్వమతమును చెప్పుచున్నాడు. కరణస్య - శరీరమునకు పరిణామము నొందించునవి వేర్వేరుగా చూడబడుచున్నవి. కర్త యనునది ఆత్మ. అదియే వినాశనము లేనిది అని అర్థము. ఇచటనే "కర్తా హి" అను మొదలగువానిద్వారా దృష్టాంతమును చెప్పుచున్నాడు. అనేక శిల్పములను చేయుట తెలిసియున్న శిల్పి బాడిశ, పట్టుకారు మొదలగు సాధనములచే కొయ్యలను చీల్చుట, చీలల నూడదీయుట మొదలగు పనుల నెట్లు చేయుచున్నాడో అటులనే ఆత్మయును అని అర్థము.

50. నిమేషకాలాద్భావానాం కాలః శీఘ్రతరోత్యయే,
భగ్నానాం న పునర్భావః కృతం నాన్యముపైతి చ.

51. మతం తత్త్వవిదామేతద్యస్మాత్తస్మాత్ స కారణమ్,
క్రియోపభోగే భూతానాం నిత్యః పురుషసంజ్ఞకః.

**తాత్పర్యము :** శారీరిక భావములన్నియు ఒక నిమేష కాలముననే నశించును. అట్లు నశించినవి తిరిగి ఉద్భవింపవు. ఆ శరీరముండగా చేసిన కర్మ వేరొకరికి వర్తింపదు. ఇది తత్త్వవేత్తల మతము. కావున జన్మాంతరమున చేసిన కర్మఫలము ననుభవించుటకు కారణభూతుడొక్కడుగనే యుండవలయును. అట్టి సకల ప్రాణుల కర్మఫలములను అనుభవించువాడు పురుషుడని చెప్పబడును. అతడు నిత్యుడు (నాశనము లేనివాడు).

**ఆయుర్వేద దీపిక :** ఈ ఆత్మయొక్క సద్భావము (నిత్యత్వము) స్థిరమైనదే అగుగాక. శరీరమును పుట్టించు ధాతుల గతి ఏమగునని "నిమేష" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "భావానామ్" అనగా శరీరాది భావములకు. "అత్యయే" అనగా వినాశనమునందు; స్వయముగా అగ్నిచే దహింపబడుచున్న శరీరమునకు నిమేషకాలము కంటెను శీఘ్రముగా వినాశమగునని అర్థము. ఈ విధముగా భగ్నము నొందిన భావములకు పునర్భావము అనగా పునరాగమనము లేదని అర్థము. అందువలన యే శరీరము వలన యే కర్మ చేయబడినదో ఆ కర్మయొక్క

ఫలమును ఆ శరీరము పొందదనుట యుక్తమగుచున్నది. ఇక ఇట్లు కాహాదము. ఐన ఆపైన ఏమగును అను విషయమును "కృతమ్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. యాగాది కర్మలు చేయబడినపుడు ఆ ఫలము ఇతరులకు చెందదు. ఇట్లున్నప్పటికీ దేవదత్తునిచే చేయబడిన శుభకర్మ వలన యజ్ఞదత్తుడు మొదలగు వారును సుఖమును పొందుచుండవలెను. అందువలన క్షణభంగురములైన శరీరము కంటె వేరైనట్టి కర్మలకు కర్తయైనట్టివాడే ఆ ఫలమును కూడ అనుభవించువాడుగా నున్నాడని భావము. "క్రియోపభోగే" అనగా క్రియలయందును ఆ ఫలమునను భవించుట యందునూ అని అర్థము. భూతానామ్ అనగా ప్రాణుల యొక్క అని అర్థము.

52. అహఙ్కారః ఫలం కర్మ దేహాన్తరగతిః స్మృతిః,
విద్యతే సతి భూతానాం కారణే దేహమన్తరా.

**తాత్పర్యము :** అహంకారము, కర్మఫలము, కర్మ, ఒక దేహమునుండి వేరొక దేహమునకు వెళ్ళుట, స్మృతి (అనుభవించిన విషయములను స్మరించుట) ఇవియన్నియు ప్రాణులకు దేహమువలన కాక ఆత్మ యుండుటవలననే కలుగు చున్నవి.

**ఆయుర్వేదదీపిక :** "అహంకారః" అను మొదలగువానిద్వారా ఆత్మ యొక్క సద్భావమునందు ఇతర కారణమును చెప్పుచున్నాడు. ఈ అహంకారాదులు పూర్వాపరకాలముల రెండింటి యొక్క అస్థాయి యగు వస్తుధర్మముచేత స్థిరముగనే పరమాత్మయందుండునని భావము. "దేహమన్తరా" అనగా దేహము లేక: దేహము కాక ఇతర కారణమునందుననూ అహంకారము ఉండునని అర్థము.

## పురుషునికి పుట్టుక లేదనుట

53. ప్రభవో న హ్యనాదిత్వాద్విద్యతే పరమాత్మనః,
పురుషో రాశిసంజ్ఞస్తు మోహేచ్ఛాద్వేషకర్మజః.

**తాత్పర్యము :** పరమాత్ముడనాది యగుటవలన అతనికి కారణము (పుట్టుక) అనునది లేదు. రాశి పురుషుడనువాడు మాత్రము మోహము, ఇచ్ఛా, ద్వేషముల వలన కలిగిన కర్మ వలన పుట్టును.

**ఆయుర్వేదదీపిక :** "ప్రభవః" అను మొదలగునవి "ప్రభవః పురుషస్య కః" అను ప్రశ్నకు సమాధానము. "ప్రభవః" అనగా కారణము. "రాశి సంజ్ఞః" అనగా షడ్ధాతు సముదాయ రూపమగు లేదా చతుర్వింశతి రాశి రూపమగు వాడు అని అర్థము. "మోహేచ్ఛాద్వేషకర్మజః" అనగా మోహ-ఇచ్ఛా-ద్వేషములచే కల్గిన కర్మలవలన పుట్టినవాడు అని అర్థము. మోహము వలననే భావముల యందు ఇచ్ఛా మరియు ద్వేషము కలుగును. ఆపైన తదనుసారముగా ప్రవృత్తి జరుగును. ప్రవృత్తియందు ధర్మాధర్మములుండును. ఆ రెండును ఫలమును భోగించుటకు శరీరమును పుట్టించును.

## ఆత్మను జ్ఞానిగా గుర్తించుట

54. ఆత్మా జ్ఞః కరణైర్యోగాజ్జ్ఞానం త్వస్య ప్రవర్తతే,
    కరణానామవైమల్యాదయోగాద్వా న వర్తతే.
55. పశ్యతోఽపి యథాఽఽదర్శే సంక్లిష్టే నాస్తి దర్శనమ్,
    తత్త్వం జలే వా కలుషే చేతస్యుపహతే తథా.

**తాత్పర్యము :** జ్ఞాని (తెలుసుకొనువాడు) ఆత్మ. సాధనముల యోగము చేత అతనికి జ్ఞానము కలుగుచున్నది. అట్టి సాధనములు నిర్మలముగా లేకున్నను, అసలు లోపించియున్ననూ జ్ఞానము కలుగుట లేదు. మనము చూచుచున్నప్పటికీ అద్దము మలినమై యున్నపుడు ప్రతి రూపము కానరానట్లు. లేదా మురికినీటిలోని వస్తువు కానరానట్లును, మరియు మనసు పనిచేయనప్పుడునూ (ఉపహతమైనపుడును) జ్ఞానము కలుగదు.

**ఆయుర్వేదదీపిక :** "ఆత్మా" అను మొదలగునవి "కిమజ్ఞో జ్ఞః" అను ప్రశ్నకు సమాధానము. కరణము లనగా నిచట మనస్సు బుద్ధి, ఇంద్రియములు అని అర్థము. "న వర్తతే" అనునది "జ్ఞానం న వర్తతే" అని అన్వయము. నిజముగా ఈః జ్ఞానియగు ఆత్మ యేది కలదో దీనికి ఎల్లప్పుడును జ్ఞానము కలుగదా ఏమి అను విషయమును "పశ్యతోఽపి" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "పశ్యతోఽపి" అనగా చక్షువును కలిగియున్నప్పటికీ అని అర్థము. తత్వమనగా దర్శన విశేషణము. అందువలన మ్లానమైయున్న (మలినముగా నున్న) దర్పణము లేదా జలమునందు వస్తువుయొక్క రూపము యథార్థముగా కనుపించదు అని అర్థము.

చేతసీ అనునది ఉపలక్షణము, అందువలన చక్షువు మొదలగువానియందును ఉపహతత్వముండుట చేత (వైకల్యము కలిగినప్పుడు) జ్ఞానము కలుగకుండుట జరుగును) అని తెలియవలెను.

56. కరణాని మనో బుద్ధిర్బుద్ధికర్మేన్ద్రియాణి చ,
కర్తుః సంయోగజం కర్మ వేదనా బుద్ధిరేవ చ.

57. నైకః ప్రవర్తతే కర్తుం భూతాత్మా నాశ్నుతే ఫలమ్,
సంయోగాద్వర్తతే సర్వం తమృతే నాస్తి కిఞ్చన.

**తాత్పర్యము :** మనస్సు, బుద్ధి, జ్ఞానేన్ద్రియములు మరియు కర్మేన్ద్రియములు అనునవి కరణములు (సాధనములు) అగును. వీనికి కర్తతో సంయోగము కలిగినప్పుడు కర్మ జరుగును. బుద్ధి రూపమగు వేదన కలుగును.

భూతాత్మ ఒక్కటియే క్రియల యందు ప్రవర్తింపదు, వాని ఫలములను పొందదు. పై సాధనముల సంయోగము చేత అన్నింటి యందును ప్రవర్తించును. అది లేనప్పుడు ఏమియును ఉండదు.

**ఆయుర్వేదదీపిక :** కరణముల ప్రస్తావన వచ్చుటచేత జ్ఞానము, కర్మ, వేదన-వీనియందు ఆత్మకు ఏ కరణములుండునో వానిని "కరణాని" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. "సంయోగజమ్" అని కర్మకు, వేదనకు, బుద్ధికిని వర్తింపజేయవలెను. "నాశ్నుతే ఫలమ్" అనుదానికి "ఏకః" అని అన్వయించుకొనవలెను. "ఏకః" అనగా సాధనములు లేనట్టి అని అర్థము. "సంయోగాద్వర్తతే" అనగా కరణముల సముదాయ సంయోగము వలన ఉత్పత్తి చేయబడుచున్నది అని అర్థము. "తమృతే" అనగా ఆ సంయోగము లేకుండా అని అర్థము.

58. న హ్యేకో వర్తతే భావో వర్తతే నాప్యహేతుకః,
శీఘ్రగత్వాత్స్వభావాత్త్వభావో న వ్యతివర్తతే.

**తాత్పర్యము :** భావ మొక్కటియే (అన్య కారణములు లేక) కార్యములందు ప్రవర్తింపదు. అట్లే అహేతుకముగను కార్యము ప్రవర్తింపదు. శీఘ్రగతి కలిగియుండుట చేత ఇట్లు జరుగుచున్నది. స్వభావము చేత అభావము దీనికి వ్యతిరేకముగా నుండదు.

**ఆయుర్వేదదీపిక** : ఇచటనే సామగ్రి వలన పుట్టుట వలన సర్వకారణ ముల ఉత్పత్తిని- "న హ్యేకో" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. కారణ రూపమగు ఒకటే భావము తనకు సహకరించు ఇతర కారణములు లేకయే కార్యము లను చేయుటయందు ప్రవర్తింపదని భావము. ఇట్లు ఒక కారణము కార్యమునందు ప్రవర్తింపనటుల కార్యమును హేతువు లేక కలుగదని "వర్తతే నాప్యహేతుకః" అనుట ద్వారా చెప్పుచున్నాడు. హేతువు లేకుండగ భావము నుత్పత్తి చేయు ధర్మము-నవర్తతే-కలుగదు అని భావము హేతువు. ఇక హేతువు లేకుండా భావము కలుగనేరదు గదా ! అయినచో అభావమునందును శరీర భావములకు హేతువు యొక్క అపేక్ష (అవసరము) లేదా అని "శీఘ్రగత్వాత్" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. శీఘ్రగతి కలిగియుండు స్వభావము వలన అభావము తన స్వభావమును అతిక్రమించదు. అనగా శీఘ్రగమన స్వభావమును విడిచిపెట్టదని అర్థము. అందువలన, అహేతుకమే అభావమగును. భావమనునది మాత్రము సహే తుకముగా నుండును. "ఉత్పత్తి హేతుర్భావానాం న నిరోధేఽస్తికారణమ్" (చరక సూత్ర స్థానము - 16) అని చెప్పబడియేయున్నది. లేదా, శీఘ్రగత్వము, అస్థిరత్వ ముల వలన అభావము ఆత్మ నాశనము కొరకు వేరు అవస్థను పొందదు అని శ్లోకా ర్థము.

59. అనాదిః పురుషో నిత్యో విపరీతస్తు హేతుజః,
 సదకారణవన్నిత్యం దృష్టం హేతుజమన్యథా.

**తాత్పర్యము** : ఉత్పత్తి (ఆది) లేనట్టి పురుషుడు (ఆత్మ) నాశనము లేని వాడు (నిత్యుడు). ఉత్పత్తి కలిగిన (షడ్ధాతు సముదాయము అనగా చతుర్వింశతి తత్వములతో కూడిన) పురుషుడు నిత్యుడు కాడు. సత్ పదార్థము కారణము లేకుండు టచే నిత్యమనియు, కారణము వలన కల్గినది అనిత్యమగుననియు చెప్పుట (శాస్త్రము లందు) చూడబడినది.

**ఆయుర్వేదదీపిక** : "స నిత్యః కిమనిత్యః" అను ప్రశ్నకు సమా ధానము-"అనాదిః" అను మొదలగునవి. అనాదియగు పురుషుడు అవ్యక్తరూపుడై ఆత్మయని పిలువబడును. "విపరీతః" అనగా ఉత్పత్తి (ఆది) కలిగిన రాశి రూపు డగు పురుషుడని అర్థము. "సత్" అను మొదలగువాని ద్వారా ఇచటనే అనాదియగు వాని యొక్క నిత్యత్వమునందు శాస్త్రాంతరముల సమ్మతిని కూడ చెప్పుచున్నాడు.

"సత్" అనగా త్రివిధ సమయమునందును (భూత, భవిష్యత్, వర్తమానములందు) ప్రమాణములచే తెలియదగు భావరూపము. ఇందువలన, ప్రాగభావమునకు కారణము లేకుండుటయున్ననూ అభావరూపమగుట వలన అనిత్యత్వము తప్పదు (వ్యభిచారము రాదు.) "హేతుజమన్యథా" అనగా ఇచట యును భావరూపమని అన్వయించుకొన వలెను. అందువలన, ప్రధ్వంసమగు (నాశనమును) హేతుజన్యమునకు దానికిని అవినాశిత్వము పరిహరింపబడినదగును (హేతుజన్యము నశించు స్వభావము కలదే యగును.)

60. తదేవ భావాదగ్రాహ్యం నిత్యత్వం న కుతశ్చన,
భావాజ్ఞేయం తదవ్యక్తమచిన్త్యం వ్యక్తమన్యథా.

61. అవ్యక్తమాత్మా క్షేత్రజ్ఞః శాశ్వతో విభురవ్యయః,
తస్మాద్యదన్యత్తద్వ్యక్తం, వక్ష్యతే చాపరం ద్వయమ్.

62. వ్యక్తమైన్ద్రియకం చైవ గృహ్యతే తదిన్ద్రియైః,
అతోఽన్యత్ పునరవ్యక్తం లిఙ్గగ్రాహ్యమతీన్ద్రియమ్.

**తాత్పర్యము :** భావ పదార్థముల వలన గ్రహింపదగినది నిత్యత్వము. ఎటువంటి భావముల చేతను తెలియదగినది నిత్యమనబడును. అట్టి అవ్యక్తము అచింత్యము (చింతనకు అందనిది). అట్లుకాక భావ పదార్థములచే తెలియబడునది వ్యక్తమనబడును. ఆత్మ అవ్యక్తము క్షేత్రజ్ఞుడు, శాశ్వతుడు, విభుత్వము గలవాడు, నాశనము లేనివాడుగనున్నాడు. అందువలన వ్యక్తావ్యక్తముల స్వరూపము లక్షణము ప్రకారాంతమున నిట్లు చెప్పబడుచున్నవి.

ఏది ఇంద్రియములచే గ్రహించబడుచున్నదో అది ఐంద్రియకమనబడు చున్నదై వ్యక్తమగును. దీనికి వ్యతిరేకముగానున్నది అవ్యక్తము అది ఇంద్రియ గ్రాహ్యము కాక దాని లక్షణములచేతనే తెలియదగియున్నది.

ఆయుర్వేదదీపిక : "తదేవ" అను మొదలగువాని ద్వారా ఆ నిత్యత్వ మేమియని చెప్పుచున్నాడు. "భావాత్" అనగా ఉత్పత్తి ధర్మమును కలిగియుండుట అని అర్థము. ఆ నిత్యత్వము ఎచటనైననూ భావపదార్థము వలన కలుగదు. అనగా నిత్యమనునది ఎప్పటికీ జనింపదు అని అర్థము. అట్లైన అవ్యక్తమనునది భావమును అపేక్షించకుండుటచేత అన్ని భావముల కంటె అగ్రగణ్యమై విభుత్వముగా నిత్యముగ నుండును. అట్టిది అన్ని నిత్యమై అవ్యక్తమనియును తెలియవలెను.

అచింత్యమనునది అవ్యక్తమునకు విశేషణము. మూలప్రకృతియును అవ్యక్తమే. "వ్యక్తమన్యథా" అనగా ప్రకృతికంటె ఇతరములైన మహదాది కార్యములు అనిత్యములు. ఆకాశము కూడా వికృతి రూపము వలన అనిత్యమే. ఉదాసీన పురుషుడు మాత్రము నిత్యమే అయియున్నాడు. అవ్యక్త శబ్దముచే ఈ లక్షణము కలిగియున్నాడనుట యుక్తమే. అవ్యక్త ధర్మము కలిగినట్టి ఆ శబ్దముచే తెలియునట్టి ఇతర పర్యాయములను "అవ్యక్తమ్" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "వక్ష్యతే" అను మొదలగువాని ద్వారా మరల వేరు ప్రకారము వలన వ్యక్తావ్యక్తముల అర్థమును చెప్పుచున్నాడు. "లిఙ్గ-గ్రాహ్యమ్" అనగా అనుమానముచే గ్రహింపదగిన అని అర్థము. "అతీన్ద్రియమ్" అనుట వలన కూడా ఇంద్రియ గ్రహణమునకు సాధ్యపడనిది ఏదైననూ శబ్దాది లక్షణముల వలన తెలియునదను ఐనచో అది అవ్యక్తము కానేరదు. కాని ఏది నిత్యము, అనుమానముచే గ్రహింపదగినది యగు మనస్సు అహంకారాది సమూహమున్నదో అది అవ్యక్తమగును.

## ప్రకృతులు - వికృతులు

63. ఖాదీని బుద్ధిరవ్యక్తమహఙ్కార స్తథాఽష్టమః,
ఖూతప్రకృతిరుద్దిష్టా వికారాశ్చైవ షోడశ.

64. బుద్ధీన్ద్రియాణి పఞ్చైవ పఞ్చ కర్మేన్ద్రియాణి చ,
సమనస్కాశ్చ పఞ్చార్థా వికారా ఇతి సంజ్ఞితాః.

**తాత్పర్యము :** ఆకాశాది పంచ మహాభూతములు, బుద్ధి, అవ్యక్తము, అహంకారము అను ఎనిమిదిన్నీ ప్రకృతులని చెప్పబడినవి. వికృతులు పదునారు గలవు. ఐదు బుద్ధీంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, ఐదు తన్మాత్రలతో కూడిన మనస్సు ఈ పదునారును వికారములు అని పిలువబడినవి.

**ఆయుర్వేదదీపిక :** "ప్రకృతిః కా వికారాః కే" అను ప్రశ్నకు సమాధానము- "ఖాదీని" అను మొదలగునవి 'ఖాదీని' ఆకాశాదులనగా సూక్ష్మములగు ఆకాశాదులు తన్మాత్ర శబ్దముతో పిలువబడునవి అని అర్థము. బుద్ధి యనునది మహత్ అని పేర్కొనబడినది. అవ్యక్తమనగా మూలప్రకృతి. అహంకారము బుద్ధి యొక్క వికారము. అదియును భూతాది, తైజస, వైకారిక అని మూడు విధములు. స్థావరజంగమ భూతముల యొక్క ప్రకృతి భూత ప్రకృతి యనబడును.

జనింపబడుచున్నవి. తరువాత అహంకారము నుండి ఆకాశాదులు యథాక్రమముగా ఉత్పత్తి యగుచున్నవి. అటుపైన ఆది సృష్టి సంపూర్ణ సర్వాంగుడై పుట్టినాడని చెప్పబడుచున్నది.

ఆయుర్వేదదీపిక : ఇపుడు మహాప్రలయము తరువాత ఆది సృష్టి యందు బుద్ధ్యాదుల ఉత్పత్తి ఏ విధముగా జరుగునో ఆ విషయమును "జాయతే" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "బుద్ధ్యాఽహమితి మన్యతే" అనగా బుద్ధి నుండి పుట్టి అహంకారము వలన అహము అని అనుకొనబడుచున్నది అని అర్థము. "ఖాదీని" అనగా సూక్ష్మములై తన్మాత్ర రూపముననున్న ఆకాశాదులు మరియు ఏకాదశేంద్రియములు అని అర్థము సాంఖ్యమునందు "ప్రకృతేర్మహాం స్తతోఽహ ఙ్కార స్తస్మాద్గణశ్చ షోడశకః" (సాంఖ్యకారిక 22) అని చెప్పబడియేయున్నది. "యథాక్రమమ్" అనగా ఏ విధముగా అహంకారము నుండి ఉత్పత్తియగునో ఆ క్రమము నుండి. అచట వికృతివలన సాత్త్వికాహంకారము నుండి తైజసాహంకార సహాయమున ఏకాదశ ఇంద్రియములు కలుగుచున్నవి. భూతాదియనబడు తామసాహం కారమునుండి తైజస సహాయమున పంచతన్మాత్రలు కలుగుచున్నవి. ఈ విషయ మునే సాంఖ్యమునందు "సాత్త్విక ఏకాదశకః ప్రవర్తతే వైకృతాదహఙ్కారాత్, భూతాదే స్తన్మాత్రః స తామసాస్తైజసాదుభయమ్" (సాంఖ్యకారిక 25) అని చెప్ప బడియున్నది. "తతః" అనగా అహంకారిక కార్యము తరువాత తన్మాత్రల నుండి ఉత్పన్నములకు స్థూలభూతముల సంబంధము వలన అని అర్థము. "సంపూర్ణ సర్వాంగో జాతః" అనగా ఆదిసర్గము (నందు) పుట్టినాడు అని అర్థము.

## ప్రళయము జరుగు క్రమము

67. పురుషః ప్రలయే చేష్టైః పునర్భావైర్వియుజ్యతే,

68. అవ్యక్తాద్వ్యక్తతాం యాతి వ్యక్తాదవ్యక్తతాం పునః,
రజస్తమోభ్యామావిష్టశ్చక్రవత్ పరివర్తతే.

69. యేషాం ద్వన్ద్వే పరా సక్తిరహఙ్కారపరాశ్చ యే,
ఉదయప్రలయౌ తేషాం న తేషాం యే త్వతోఽన్యథా.

తాత్పర్యము : పురుషుడు ప్రలయకాలమునందు పురుషుడు తనకిష్టమైన భావములచే వియోగింపబడును (బుద్ధ్యాది భావములనుండి వియోగము పొందును).

ఈ విధముగా అవ్యక్తత్వము నుండి (ఆదిసర్గమున) వ్యక్తత్వమును పొందును.
వ్యక్తత్వము నుండి మరల (ప్రలయకాలమున) అవ్యక్తత్వమును పొందును.
రజస్తమో గుణములచే ఆవహింపబడినవాడై ఈ ప్రలయోదయములందు చక్రము
వలె పరిభ్రమించును. ఎవరికి రజస్తమో గుణముల రెండింటితో అధిక సంబంధము
కల్గియుండునో (రాగద్వేషము లధికముగ నుండునో) అట్టివారికి ఉత్పత్తిలయములు
రెండును కలుగుచుండును. ఆ సంబంధము లేని వారికి అట్లు ఉత్పత్తిలయములు
మాటిమాటికి కలుగవు.

ఆయుర్వేదదీపిక : ఈ విధముగా ఆదిసర్గమునందు ప్రకృతి నుండి
మహదాదుల సృష్టిని చూపించి మహాప్రలయమునందు అవ్యక్తరూపమగు ప్రకృతి
యందు బుద్ధ్యాదులయొక్క లయమును "పురుషః" అను మొదలగువాని ద్వారా —
చెప్పుచున్నాడు. "ఇష్టైర్వ్యాప్తైః" అనగా పురుషుని ఉపభోగము కొరకు ఇష్టములగు
(కావలసియున్న) బుద్ధి మొదలగువానిచేత అని అర్థము. ఇతరులు మాత్రము ఇటు
వంటిసంయోగము జన్మమునందును, వియోగము మరణమునందును జరుగునని చెప్పు
దురు. కాని జన్మమరణములందు బుద్ధ్యాదులుండుట తెలియుచుండుటచేత అట్లు అను
కొనరాదు. "అతస్త్రిభిస్త్రైరతి సూక్ష్మమూర్తైరాత్మా విదాచిన్న విముక్తపూర్వైః,
నైవేస్త్రిభిస్త్రైర్నైవ సుహోపరిభ్యాం న నహాస్యయా[illegible]ః." అని ఈ
స్థానమునందు రెండవ అధ్యాయమున చెప్పబడియున్నది. అటులనే ఇతరులిట్లనూ
"పూర్వోత్పన్నమసక్తం నియతం మహదాదిసూక్ష్మపర్యన్తం, సంసరతి నిరుపభోగం
భావైరధివాసితం లిఙ్గం". (సాంఖ్యకారిక 40) అని చెప్పబడియున్నది. అందు
వలన మహాప్రలయమునందు మాత్రమే ప్రకృతియందు ఈ భావముల లయము
జరుగుచున్నది. అట్లే ఆదిసర్గమునందు మాత్రమే ప్రకృతినుండి మహదాదుల సృష్టి
జరుగునని తెలియవలెను. ఇదియే ప్రకృతియొక్క లయ, విస్తారములను "అవ్యక్తాత్"
అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "అవ్యక్తాత్" అనగా ప్రకృతినుండి:
"వ్యక్తతామ్" అనగా మహత్తు మొదలు మహాభూత పర్యంతములగు రూపవిస్తార
మును పొందును అని అర్థము. "వ్యక్తాత్" అనగా మహాభూత విస్తారముయొక్క
అవస్థనుండి మరల అవ్యక్తరూపమును – "యాతి" పొందును అని అర్థము. మహా
ప్రలయమునందే మహాభూతములు తన్మాత్రలయందు లయమును పొందును.
తన్మాత్రలు మరియు ఇంద్రియములు అహంకారమునందు లయించును. అహం
కారము బుద్ధియందు, బుద్ధియును ప్రకృతియందును లయమునొందును ఇది లయ

క్రమము. ఈ లయక్రమము మోక్షమునందునూ కలుగుచున్నది. కాని అచట ఆ పురుషుని కొరకు తిరిగి సృష్టియనునది ప్రకృతి నుండి మొదలగుటలేదు. ఈ సంసారము ఎట్లు కలుగునో "రజః" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "ఆవిష్టః" అనగా కూడియున్న అని అర్థము. "చక్రవత్ పరివర్తతే" అనగా మాటి మాటికిని లయము సృష్టియను రెండింటితోడను సంబంధము కలిగియుండును. "ద్వన్ద్వే" అనగా రజస్తమో రూపమగు జంటయందు. "అహఙ్కారపరా" అనగా అహంకారమువలన ఇదినాదను మిథ్యాజ్ఞానపరులు. "ఉదయప్రలయౌ" అనగా జీవితము-మరణములు రెండు, లేదా లయ, సృష్టులు రెండు. "అతోఽన్యథా" అనగా ఎవరు రాగద్వేషముల నుండి విముక్తిని పొందుదురో ఎవరికి అహంకారము (ఇది నాదనుభావము) ఉండదో అట్టివారికి జనన మరణములు (ఉదయ ప్రలయములు) ఉండవు అని అర్థము.

## శరీరముననున్న పరమాత్మ లక్షణములు

70. ప్రాణాపానౌ నిమేషాద్యా జీవనం మనసో గతిః,
ఇన్ద్రియాన్తరసఞ్చారః ప్రేరణం ధారణం చ యత్.
71. దేశాన్తరగతిః స్వప్నే పఞ్చత్వగ్రహణం తథా,
దృష్టస్య దక్షిణేనాక్ష్ణా సవ్యేనావగమస్తథా.
73. ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం ప్రయత్నశ్చేతనా ధృతిః,
బుద్ధిః స్మృతిరహఙ్కారో లిఙ్గాని పరమాత్మనః.
74. యస్మాత్ సముపలభ్యన్తే లిఙ్గాన్యేతాని జీవతః,
న మృతస్యాత్మలిఙ్గాని తస్మాదాహుర్మహర్షయః.
75. శరీరం హి గతే తస్మిఞ్ శూన్యాగారమచేతనమ్,
పఞ్చభూతావశేషత్వాత్ పఞ్చత్వం గతముచ్యతే.

**తాత్పర్యము :** ప్రాణాపానముల (ఉచ్ఛ్వాస నిశ్వాసముల) ప్రవృత్తి, నిమేష-ఉన్మేషాదులు, జీవించియుండుట, మనస్సుయొక్క గమనము, ఒక ఇంద్రియము నుండి ఇంకొక ఇంద్రియమునకు (మనస్సు) సంచరించుట, ప్రేరణము, ధారణము, స్వప్నమునందు ఇతర దేశములందు సంచరించుట, మరణము చెందుటను తెలిసికొనుట, కుడికంటితో చూచిన వస్తువులయందు ఎడమ కంటితో చూచినపుడు కూడ గుర్తించుట, ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, ప్రయత్నము, చేతన, ధృతి,

బుద్ధి, స్మరణశక్తి, అహంకారము-ఇవియన్నియు పరమాత్మ యొక్క లక్షణములు. ఈ లక్షణములు జీవించిన శరీరమునందు కనిపించును మృత శరీరమునందు కని పించనందువలన ఈ ఆత్మ లక్షణములులేని మృత శరీరమును చేతనత్వము లేని శూన్య గృహమని మహర్షులు చెప్పుచున్నారు. అట్టి శరీరమునందు పంచ భూత ములు మాత్రము మిగిలియున్నందున ఆ శరీరము పంచత్వమును పొందినదిగా చెప్పబడుచున్నది.

ఆయుర్వేదదీపిక : 'కిం లిఙ్గం పురుషస్య చ' పురుషుని యొక్క లక్షణ మేది అను ప్రశ్నకు సమాధానము-"ప్రాణాపానౌ" అను మొదలగునవి. ప్రాణా పానములు అనగా ఉచ్ఛ్వాస నిశ్వాసములు. నిమేషాద్యాః అని ఆద్యశబ్దమును గ్రహిం చుట వలన ఉన్మేషము మొదలగు [illegible] విశేషములు తీసికొనబడుచున్నవి. "మనసో గతిః" అనగా మనస్సు పాటలీపుత్రము [illegible] మొదలగునవి. ఇన్ద్రియా న్తర సంచారము కూడ మనస్సునకు సంబంధించినదే. అది ఎట్లనగా చక్షురింద్రియ మును వదలి మనస్సు స్పర్శనేంద్రియమును ఆశ్రయించి యుండుట మొదలగునవి జరిగి నట్లు. ప్రేరణము మరియు ధారణము అనునవి మనస్సునకు సంబంధించినవే యని తెలియవలెను. "దేశాంతరగతిః స్వప్నే" అనునది స్వప్నము. "పఞ్చత్వ గ్రహణం" అనగా మరణమునకు సంబంధించిన జ్ఞానము. "సవ్యేనావగమః" అనగా ఎడమ కంటితో చూచి ఇదియే ఆ కుడికంటిలో చూచిన వస్తువు అని గుర్తించుట. చేతన యనునది జ్ఞాన మాత్రము. బుద్ధి యనునది [illegible] జ్ఞానము. ఇవి ఇవి అన్నియు ఆత్మనెట్లు పొందును (ఆత్మతో కలసి యుండును) అను విషయమును "యస్మాత్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "జీవతః" అనగా పంచభూతాతిరిక్త మగు ఆత్మతో కూడియున్నవానికి అని అర్థము. పంచత్వమును జీవించియున్న వానికి కలుగక మృతునికి కలుగుచున్నప్పటికీ పంచత్వమును పొందిన మృత శరీ రమునందు చూడబడుచున్న లక్షణములకు వ్యతిరేకములగుట వలన పైన చెప్పిన లక్షణములు జీవిత శరీరమునందుండునని తెలియవలెను. ఇచట ఉదాహరింపబడిన ప్రాణాపానాదులు ఆత్మ లేనట్టి మృత శరీరమునందు [illegible] కేవ లము భూతములయందు కలుగవు. మరియును మనస్సు మాత్రమే భూతాతిరిక్తమగు ఆత్మ కానేరదు; ఎందువలననగా సాధన మాత్రమగు మనస్సునకు కర్తయగు ఆత్మ వలననే ప్రేరణాదులు కలుగుచున్నందున. ఇంద్రియములును ఆత్మగా స్వీకరింపబడవు; ఎందువలననగా అట్లైనచో ఒక ఇంద్రియముతో

గ్రహింపబడవలసిన విషయము ఇంకొక ఇంద్రియము గ్రహింప లేకుండుట వలన. యజ్ఞ దత్తునిచే పొందబడిన విషయమును దేవదత్తునిచే పొందబడినదిగా గుర్తించి నట్లగును. అట్లైనచో ఒక ఇంద్రియముచే గ్రహించబడిన విషయము ఇంకొక ఇంద్రియముచే గ్రహించినట్లు గుర్తించుట - ఉదాహరణకు-సుగంధము గల చందన మును స్పర్శించుచున్నాను అని చెప్పుట. కాబట్టి మనస్సు ఇంద్రియములకు అతి రిక్తమై ఆత్మ యుండునని తెలియవలెను. ఇచట బుద్ధి శబ్దము వలన చేతనా, ధృతి, స్మృతి, అహంకారములు బుద్ధి యొక్క భేదములుగా ప్రాప్తించుచునే యున్నప్పటికీ, వేర్వేరు అర్థమునిచ్చుచున్నందువలన మరల విడిగా చెప్పవలసి యున్నవి. అటు లనే చేతన అనునది గుణము అగుట వలన అచేతనములగు ఆకాశాది భూతములకు అతిరిక్తమైన గుణములుకల ఆత్మను తెలియజేయుచున్నది. ధృతి యనునది నియ మించునదై నియమమును చేయునట్టి ఆత్మను తెలియజేయుచున్నది. బుద్ధియనునది ఊహాపోహలకు ఒకే కారణమగు ఆత్మను సూచించుచున్నది. స్మృతి యనునది పూర్వమనుభవించిన విషయమును స్మరించు స్థాయిగానున్నట్టియు ఆత్మను తెలియ జేయును అను మొదలగు వానిని తెలియవలెను. "శరీరమ్" అను మొదలగువాని ద్వారా అధిష్ఠానమగు ఆత్మ శరీరమునందు లేకుండుట వలన ప్రాణాదుల అభావ ముండునని చెప్పుచున్నాడు. శూన్యాగారమువలె అనగా నివసించువాడు లేనట్టి ఇంటి వలె-ఇట్లే మృత శరీరముండునని తెలియవలెను. శరీరము షడ్ధాతుకమై యున్నది. అచట ఆరవదియగు ఆత్మ లేనపుడు శరీరము పంచభూతాత్మకమగుచున్నది. అందు వలన అది పంచత్వమును పొందినది అని చెప్పబడుచున్నది.

## క్రియలను చేయునప్పటికీ మనస్సు అచేతనమని చెప్పబడుట

75. అచేతనం క్రియావచ్చ మనశ్చేతయితా పరః,
    యుక్తస్య మనసా తస్య నిర్దిశ్యన్తే విభోః క్రియాః.

76. చేతనావాన్ యతశ్చాత్మా తతః కర్తా నిరుచ్యతే,
    అచేతనత్వాచ్చ మనః క్రియావదపి నోచ్యతే.

**తాత్పర్యము :** మనస్సు అచేతనమై క్రియావంతమై యుండును. అది ఆత్మచేత చేతనావంతమగును. అట్టి మనస్సుతో కూడియున్న ఆత్మకు క్రియాశీలత్వ మాపాదింప బడుచున్నది. ఆత్మ చేతనావంతమగుటచే కర్తయని పిలువబడుచున్నది.

క్రియలను చేయుచున్నప్పటికీ మనస్సు అచేతనత్వము వలన దానిని కర్తగా పిలువ బడుటలేదు.

**ఆయుర్వేదదీపిక :** "నిష్క్రియస్య క్రియా తస్య కథమ్" — నిష్క్రియమైనట్టి ఆత్మ క్రియలనెట్లు చేయును? అను ప్రశ్నకు సమాధానము— "అచేతనమ్" అను మొదలగునవి. "చేతయితా పరః" అనగా పరమగు (గొప్ప దగు) ఆత్మ చైతన్యమును కలుగజేయును కాని స్వాతంత్ర్య తనంతట తాను క్రియలను చేయునది గాదు. నిజమే గదా! అయినచో ఆత్మకు క్రియలెట్లు ఆపాదింపబడు చున్నవి అను విషయమును "యుక్తస్య" అను మొదలగువానిద్వారా చెప్పు చున్నాడు. ఆత్మచే అధిష్ఠింపబడియున్నదగు మనస్సుయొక్క క్రియా ఉపచారము చేతనే ఆత్మకు క్రియావత్త్వము చెప్పబడుచున్నది. ఇదే విషయమును "చేతనావాన్" అను మొదలగు వానిద్వారా నిరూపించుచున్నాడు. చేతనుడగు ఆత్మవలననే అది అధిష్ఠించియున్న మనస్సు క్రియలయందు ప్రవర్తింపును. చేతన అధిష్ఠితము గాని మనస్సు క్రియలందు ప్రవర్తింపనేరదు. అందువలన ఎవరి వలన ఆ పని చేయబడి నదో అట్టివాడే క్రియావంతుడనబడుట యుక్తముగాని అచేతనమగు మనస్సు క్రియా వంతమని చెప్పరాదు. ఆ మనస్సు పరాధీనమై క్రియలను చేయుచుండుటచేత సూక్ష్మార్థమున క్రియావంతమైనను కర్తగా చెప్పబడుటలేదు - అని వాక్యార్థము. "నోచ్యతే" అనగా "నోచ్యతే కర్తృః" అని అన్వయించుకొనవలెను.

### ఆత్మ వివిధ యోనులందు పుట్టుటకు కారణము

77. యథా స్వేనాత్మనాఽఽత్మానం సర్వః సర్వాసు యోనిషు,
ప్రాణైస్తంత్రయతే ప్రాణీ నహ్యన్యోఽస్త్యస్య తన్త్రికః.

**తాత్పర్యము :** తను చేసిన కర్మలను బట్టి ఆత్మ తనను తానే అన్ని రకముల యోనులయందును ప్రవేశింపజేసికొని పుట్టుచుండును. తన్ను తాను ప్రాణములచే చేరుకొనును తప్ప ఆత్మకు వేరొక యోజకుడు (తంత్రకుడు) లేడు.

**ఆయుర్వేదదీపిక :** ప్రస్తుతము ఆత్మ స్వతంత్రమైయుండియూ నీచమైన యోనుల యందెట్లు జన్మించునను ఆక్షేపణమునకు సమాధానమును — "యథా స్వేన" అను మొదలగు వానిద్వారా ఇచ్చుచున్నాడు. ("స్వతన్త్రశ్చేదనిష్టాసు

కథం యోనిషు జాయతే" అను ప్రశ్నకు సమాధానము) "సర్వాసు యోనిషు" అనగా మనుష్య, గో, గజ, కీటాదీ అన్ని యోనులయందు అని అర్థము. "ప్రాణై స్తన్త్రియతే" ప్రాణములచే చేర్చుకొనును. అది తాను చేసిన ధర్మాధర్మ ముల సహాయము వలన ఆత్మను అన్ని యోనులయందును తీసికొని వెళ్ళును గాని ఇతర భావములచే ప్రేరితమై వెళ్ళదు. దీనికి ఈశ్వరుడు (శాసించువాడు) లేనందు చేత వేరొక పురుషుడు దీనికి ప్రేరకుడుగా నుండడు. లేదా ఈశ్వరుడున్ననూ అత డునూ పరాధీనుడై యుండుటవలన పురుషునికి పర ప్రేరకత్వము లేదు. అనిష్టము లైన యోనులకు వెళ్ళుటకు కారణమగు అధర్మ కృత్యమునందు పురుషునికి స్వాతంత్ర్యమేది గలదో అనిష్ట యోనులకు వెళ్ళుట యందును అదియే స్వాతం త్ర్యము గలదు. అధర్మమునకు కారణములగు స్వకర్మలచేతనే ఇతడు (పురుషుడు) తనకిష్టము లేనప్పటికీ (ఇతర యోనులకు) తీసికొని వెళ్ళును. ఈ విధముగా అనిష్ట యోని గమనము కలుగును. స్వాతంత్ర్యము కూడ పైచెప్పిన విధముగనే కల్గు చున్నది.

## ఆత్మకు వశిత్వము కలదనుట

78. వశీ తత్ కురుతే కర్మ యత్ కృత్వా ఫలమశ్నుతే,
    వశీ చేతః సమాధత్తే వశీ సర్వం నిరస్యతే.

**తాత్పర్యము :** వశియగు ఆత్మ వేనియొక్క ఫలితము ననుభవించునో ఆ కర్మలను తానే స్వయముగా చేయును. ఈ వశిత్వమువలన మనస్సును (దుష్క ర్మల నుండి) సమాధానపరచును. వశిత్వమువలన ఆత్మ సర్వకర్మ పరిత్యాగము చేయును.

**ఆయుర్వేదదీపిక :** "వశీ యద్యసుఖైః కస్మాద్భావై రాక్రమ్యతే" అను ప్రశ్నకు సమాధానము — "వశీ" అను మొదలగునవి. "వశీ" అనగా స్వేచ్ఛా ధీన ప్రవృత్తిః అందువలన, ఈ పురుషుడు వశిత్వము గలవాడగుచునే రాబోవు ఫల ముపై రాగము చేత, ఏ కర్మలను చేయుటచే ఆ కర్మ ప్రభావమువలన శుభమగు లేదా అశుభమగు ఫలముతో సంయోగము పొందునో అట్టి శుభాశుభ కర్మలను చేయును. ఇందువలన కర్మలను చేయుట యందు వశిత్వముండును. చేసిన కర్మ యొక్క ఫలము తనకిష్టము లేకున్నను అనుభవింపవలసినందున అచట పురుషునికి

వశిత్వము లేదు. వశిత్వము వలన ఇతర ఫలమును కూడ "వశీ చేతః సమాధత్తే" అనుటద్వారా చెప్పుచున్నాడు. వశీ యగుటవలన ఈ ఆత్మ తనకిష్టములేని విషయము లందు మనస్సును నివర్తింపజేయును. వశిత్వము లేనియెడల మనస్సును నివర్తింప శక్యముగాదు గదా. వశిత్వమును తెలియజేయు నింకొక కర్మను కూడ "వశీ సర్వం నిరస్యతి" అని చెప్పుచున్నాడు. ఇతడు వశీ యగుటచేతనే మోక్షముకొరకు ప్రవర్తించుచు అన్ని శుభాశుభ ఫలితముల నిచ్చు కర్మలను వదలుచున్నాడు అని అర్థము. ఇచట స్వతంత్రుడు అనగా పరమాత్మయు ఈశ్వరుడు మొదలగు భావములచే ప్రేరితమగు ప్రవృత్తి చెప్పబడుచున్నది. వశీ యనునది తనకు కలుగు ఇచ్ఛచేత ప్రవర్తింపబడునదిగాని ప్రేరితరూపమగు ఇష్టాయిష్టములగు విషయములందు ప్రవర్తింపదు. ఇది స్వాతంత్ర్యము, వశిత్వముల రెంటింటికి గల భేదము.

79. దేహీ సర్వగతో౽ప్యాత్మా స్వే స్వే సంస్పర్శనేన్ద్రియే,
సర్వాః సర్వాశ్రయస్థాస్తు నాత్మా౽తో వేత్తి వేదనాః.

**తాత్పర్యము :** ఆత్మ సర్వగతమై యున్ననూ ఒక దేహమున నున్నపుడు ఆ దేహము నందలి తనతో సంస్పర్శనము కలిగియున్న ఇన్ద్రియముల ద్వారా మాత్రమే వేదనలను తెలిసికొనును కాని సర్వ శరీరములకు కలుగు వేదనలను తెలిసికొనజాలదు.

**ఆయుర్వేదదీపిక :** "సర్వాః సర్వగతత్వాచ్చ వేదనాః కిం న వేత్తి సః" అను ప్రశ్నకు సమాధానమును "దేహీ" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "సర్వగతః" అనగా సర్వగతమైనప్పటికిన్నీ: "సంస్పర్శనేంద్రియే" అనగా సంస్పర్శన యుక్తమైన శరీరము నందు-సుఖదుఃఖ రూపమగు వేదనలను తెలిసికొనును. సర్వశరీరములనున్న వేదనలను మాత్రము తెలిసికొనజాలదు అని గ్రహింపవలెను. ఆత్మ సర్వగతమై యున్ననూ తన యొక్క స్పర్శన యుక్తమైన శరీరము నందలి వేదనలనే గ్రహించుచుండుటవలననే సర్వ శరీరములందున్న సర్వ వేదనలను తెలిసికొనదని వాక్యార్థము. "సర్వాశ్రయస్థాః" అనగా ఇతరములైన సర్వశరీరగతములైన అని అర్థము. పర శరీరమునందును స్పర్శ వలన కలిగిన ఇంద్రియా భావము వలన ఆత్మ సుఖదుఃఖములను కన్పించుచున్నప్పటికీ గ్రహింపజాలదు. "స్వే స్వే శరీరే" "అని చెప్పుట యందుసంస్పర్శనేన్ద్రియే" అనుట వలన స్వశరీరమునందునూ కేశ నఖాదులయందు ఎచట స్పర్శనేన్ద్రియము లేదో అచట ఆత్మ కొంచెమును గ్రహింపజాలదు అని చూపుచున్నాడు.

80. విభుత్వమత ఏవాస్య యస్మాత్ సర్వగతో మహాన్,
మనసశ్చ సమాధానాత్ పశ్యత్యాత్మా తిరస్కృతమ్.

81. నిత్యానుబన్ధం మనసా దేహకర్మానుపాతినా,
సర్వయోనిగతం విద్యాదేకయోనావపి స్థితమ్.

**తాత్పర్యము :** ఆత్మ సర్వగతమై గొప్పదియై యుండుట వలన దీనికి విభుత్వము (సర్వ వ్యాపిత్వము) గలదు. అట్టి ఆత్మ మనస్సును సమాధానము పరచుట వలన (మనస్సును సమాధిస్థితి యందుంచుట వలన) అడ్డగించబడిన వస్తువులను చూడగలుగుచున్నది.

మనస్సుతో నిత్య సంబంధము కలిగి యుండి దేహకర్మ వలన కలుగు ఫలితము ననుసరించి ఆత్మ అన్ని యోనులయందున్నప్పటికినీ ఆత్మ (మనోను బంధము చేత,)ఒకే యోని యందున్నదిగా తెలియవలెను.

**ఆయుర్వేదదీపిక :** "న పశ్యతి విభుః కస్మాత్ శైలకుడ్యతిరస్కృతమ్" అను ప్రశ్న సమాధానమును చెప్పుటకు ప్రవృత్తుడగుచు విభుత్వమును సాధించుట కొరకు కారణమగు గుణమును సాధించుటకు ఆత్మయొక్క విభుత్వమునే ముందుగా అందుకొరకు "విభుత్వమ్" అనువాని ద్వారా సాధించుచున్నాడు. విభుత్వమనగా ఎల్లెడలను వ్యాపించిన పరిమాణమును కలిగి యుండుట. "అత ఏవ" అనగా చెప్పబడిన సర్వగతత్వము వలన ఈ విషయమునే స్పష్టత కొరకు సాక్షాత్తు "యస్మాత్" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. ఎల్లెడలను లభించుటయను గుణముచేత ఆకాశాదుల పరిమాణమునకును సర్వగతత్వమనునది కలదు, అందువలన (ఆ యాకాశాదుల నుండి ఆత్మను) వేరుచేసి చెప్పుటకు "మహాన్" అను పదముపయోగింపబడినది. అందువలన సర్వత్ర లభించునట్టియు మహా పరిమాణమును కలిగి యుండునట్టియూ ద్రవ్యము విభువని తేలుచున్నది. విభుత్వము యొక్క వ్యుత్పత్తిని చెప్పి గోడ మున్నగుదానిచే కప్పబడిన (అడ్డగించబడిన) వస్తువుల జ్ఞానము అన్నింటను కలుగదని చూపుటకుగాను "మనసః" అను మొదలగు వానిని చెప్పుచున్నాడు. "సమాధానమ్" అనగా సమాధి. ఇందువలన యోగులు సమాధి బలముచేత అడ్డగింపబడిన దానిని కూడ [illegible] తెలుపుచున్నాడు. [illegible] తే అడ్డగింపబడిన వస్తువును చూచుటలేదో [illegible] "నిత్య" అను మొదలగువాని ద్వారా

చెప్పుచున్నాడు. ఆత్మ అన్ని యోనులయందున్నప్పటికి మనస్సుతో అనుబంధము కలిగి ఒకే యోని యందున్నదిగా తెలియవలెనని యుక్తి చెప్పబడినది. దేహమును నివర్తింపచేయు కర్మ వలన వచ్చిన ఆత్మయందు దేనికి సంబంధము కలదో దాని వలన అని చెప్పుటకు "మనసా దేహకర్మానుపాతినా" అని చెప్పుచున్నాడు. ఇందు వలన ఒకవేళ ఆత్మయనునది గోడ మొదలగువానికి అతీతముగా నున్నప్పటికి ఆ యాత్మకు ఉపలబ్ధి సాధనమగు మనస్సు ఆ ఒక్క శరీరమునందు వ్యవధానము చేయుట వలన అడ్డగింపబడిన వస్తువును ఆత్మ చూచుటలేదు అని చెప్పబడినున్నది.

82. ఆదిర్నాస్త్యాత్మనః క్షేత్రపారంపర్యమనాదికమ్,
అత స్తయోరనాదిత్వాత్ కిం పూర్వమితి నోచ్యతే.

**తాత్పర్యము** : ఆత్మకు ఆది లేదు (పుట్టుక లేక ప్రారంభము లేదు) క్షేత్రము యొక్క పారంపర్యమును ఆది లేనిదియే. అందువలన రెండింటికిని అనాదిత్వముండుటచేత ఏది ముందుగా నున్నదని చెప్పబడుటలేదు.

**ఆయుర్వేదదీపిక** : "క్షేత్రజ్ఞః క్షేత్రమథవా కిం పూర్వం" అను సంశయమునకు సమాధానము- "ఆదిః" అను మొదలగునవి. "క్షేత్రపారంపర్యమ్" అనగా అవ్యక్త వర్జితమగు క్షేత్రము యొక్కయు మహత్తు మొదలగు ఇరువది మూడింటి యొక్కయు పరంపర అనాదియగుట వలననే క్షేత్రము క్షేత్రముల రెండింటికిని ఇది మొదటగా నున్నదని చెప్పుట జరుగదని అర్థము. నిజమునకు ఒకవేళ క్షేత్ర పరంపరయును అనాది యైనచో అపుడు దానికి ఆత్మవలె *ఉచ్ఛేదముండదు (నాశనముండదు) అనాదియైనది ఆత్మవలె నిత్యముగా నుండవలెను గదా ! అనాదిత్వము కలిగి యున్నప్పటికి ఏది స్వరూపము వలననే అనాది యగునో, అది నాశనము పొందదు. ఉదాహరణమునకు ఆత్మ అని చెప్పబడుతున్నది. ఏ బుద్ధ్యాదులు నశించు ధర్మమును కలిగియున్నవో అవి నశించుచునే యున్నవి. అనాదియగు సంతాని రెండవ దాని నుండి వచ్చిన సంతానము ఎక్కువగా (గొప్పదిగా) నుండదు. అందువలన సంతానము యొక్క అనాదిత్వము తెలియుచునే యున్నది. కాని ఈ విధముగా నున్న బుద్ధ్యాది సంతానము యొక్క నాశనము మోక్షమును ప్రతిపాదింపనదియే అని ఆగమ ప్రమాణము వలన తెలియవలెను.

## ఆత్మకు సాక్షిత్వమును చెప్పుట

83. జ్ఞః సాక్షీత్యుచ్యతే నాజ్ఞః సాక్షీత్వాత్మా యతః స్మృతః,
సర్వే భావా హి సర్వేషాం భూతానామాత్మసాక్షికాః.

**తాత్పర్యము :** జ్ఞానవంతుడు సాక్షియని చెప్పబడును గాని అజ్ఞానవంతుడు సాక్షియనబడడు. జ్ఞానవంతుడగుటచే ఆత్మ సాక్షియని చెప్పబడినది. ఎల్లెడలను భూతములయొక్క అని భావములునూ ఆత్మ సాక్షికములుగా నుండును.

**ఆయుర్వేదదీపిక :** "సాక్షిభూతస్య కస్యాయం" అను ప్రశ్నకు సమాధానము– "జ్ఞ" అను మొదలగునవి. "జ్ఞః" అనగా జ్ఞానవంతుడు, ఇతడే సాక్షియని లోకమునందు చెప్పబడుచున్నాడు. అజ్ఞానము కల పాషాణాదులు సాక్షులు కావు. అందువలన జ్ఞానవత్వము లేకున్నను ఇతరములైన కర్తను సాక్షియందురని వాక్యార్థము. "సర్వేషామ్" అనగా ఆకాశాది భూతములకు. "సర్వే భావాః" అనగా దర్శన యోగ్యములగు అన్ని భూత ధర్మములు అని అర్థము. "ఆత్మ సాక్షికాః" ఆత్మకు తెలియుచున్నవి అని అర్థము.

84. నైకః కాదాచిద్భూతాత్మా లక్షణైరుపలభ్యతే,
విశేషోఽనుపలభ్యస్య తస్య నైకస్య విద్యతే.

85. సంయోగపురుషస్యేష్టో విశేషో వేదనాకృతః,
వేదనా యత్ర నియతా విశేషస్తత్ర తత్కృతః.

**తాత్పర్యము :** భూతాత్మ ఒక్కటియే (పంచభూత సంబంధములేక) కనబడదు. అట్టి భూతాత్మకు ఒక్కదానికే వేదనా విశేషము తెలియుటలేదు. సంయోగ పురుషునికే (పంచ భూతముల సంయోగము కల పురుషునికే) వేదనా విశేషము కలుగును. వేదనలు ఎచట నియతముగా నుండునో అచటనే వేదనా విశేషము లుండును.

**ఆయుర్వేదదీపిక :** "స్యాత్కథం చావికారస్య విశేషో వేదనాకృతః." అను ప్రశ్నకు సమాధానము — "నైకః" అను మొదలగునవి. వికారములు లేనట్టి పరమాత్మకు వేదనా విశేషములు లేనేలేవు. ఎచట వేదనాకృతమైన విశేషము లుండునో అది పరమాత్మకు వ్యతిరిక్తమగు రాశి రూపమేయని వాక్యార్థము. భూత

ములకు అధిష్ఠానమగు ఆత్మ భూతాత్మయనబడును. ఇట్టి భూతాత్మ ఒక్కటియే పంచ భూతములు లేకుండగ ప్రాణాపానాది లక్షణములతో కూడి లభింపదు. ఎందువలన లభింపదో ఆ విషయమును "విశేషః" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నారు. "ఏకస్య" అనగా భూతము లేనట్టిదానికి ఆత్మ యొక్క విశేషములగు వేదన మొదలైనవి లభింపవు. అందువలన అట్లు లభింపకపోవుటయే అచట ప్రమాణమని అర్థము. "సంయోగపురుషః" అనగా చతుర్వింశతిక పురుషుడని అర్థము. నిజమునకు సముదాయ ధర్మము సముదాయములో నున్నవానికే యుండుటవలన ఇట్లే వేదనాకృత ములగు విశేషములు ఇరువదినాల్గు తత్త్వములయందు అంతర్నివిష్టమగు భూతాత్మ కును ఉండవలెను. ఉదాహరణకు మినుముల రాశికి గురుత్వమనునది ఒక్కొక్క మినుమునకును గల గురుత్వము వలన కలుగునుగదా. ఈ విషయమును "వేదనా" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నారు. వేదన యనునది సుఖదుఃఖ రూపముగ నుండును. ఏ బుద్ధ్యాది సమూహము నందు వేదన నియతముగా నుండునో అచటనే దానివలన కలుగు చైతన్యము హర్షము మొదలగు విశేషము కూడ నియతముగా నుండును. అచటనే బుద్ధ్యాది సమూహమునందే అవి కలుగును గాని ఆత్మయందు కాదని భావము. బుద్ధ్యాదులయందుండు గుణత్రయ పరిణామ రూపమగు సుఖదుఃఖ ముల వలన స్వయముగా సుఖదుఃఖములు లేని ఆత్మ సుఖదుఃఖాదివంతమగును.

## వైద్యుడు భూత భవిష్యద్వర్తమాన వ్యాధులను చికిత్సించుననుట

86\. చికిత్సతి భిషక్ సర్వాస్త్రికాలా వేదనా ఇతి,
యయా యుక్త్యా వద త్యేతే సా యుక్తిరుపధార్యతామ్.

87\. పున స్తచ్ఛిరసః శూలం జ్వరః స పునరాగతః
పునః స కాసో బలవాంశ్ఛర్దిః సా పునరాగతా.

88\. ఏభిః ప్రసిద్ధవచనై రతీతాగమనం మతమ్,
కాలశ్చాయమతీతానామ ర్తీనాం పునరాగతః.

89\. తమ ర్తికాలముద్దిశ్య భేషజం యత్ ప్రయుజ్యతే,
అతీతానాం ప్రశమనం వేదనానాం తదుచ్యతే.

90\. ఆపస్తాః పునరాగుర్మా యాభిః శస్యం పురా హతమ్,
యథా ప్రక్రియతే సేతుః ప్రతికర్మ తథాశ్రయే.

91. పూర్వరూపం వికారాణాం దృష్ట్వా ప్రాదుర్భవిష్యతామ్,
యా క్రియా క్రియతే సా చ వేదనాం హన్త్యనాగతామ్.

92. పారంపర్యానుబన్ధస్తు దుఃఖానాం వినివర్తతే,
సుఖహేతూపచారేణ సుఖం చాపి ప్రవర్తతే.

93. న సమా యాన్తి వైషమ్యం విషమాః సమతాం న చ,
హేతుభిః సదృశా నిత్యం జాయన్తే దేహధాతవః.

94. యుక్తిమేతాం పురస్కృత్య త్రికాలాం వేదనా భిషక్,
హన్తీత్యుక్తం చికిత్సా తు నైష్ఠికీ యా వినోపధామ్.

**తాత్పర్యము :** వైద్యుడు త్రికాల వేదనలను చికిత్సించునని కొందరు ఏ యుక్తి వలన చెప్పుచున్నారో ఆ యుక్తిని వినుడు. ఆశిరశ్శూల మరల వచ్చినది ఆ జ్వరమే మరల వచ్చినది, బలముగా నున్న ఆ కాసయే ఇప్పుడు మరల వచ్చినది, ఆ ఛర్దియే మరల వచ్చినది అను ప్రసిద్ధ వాక్యముల వలన గతమునందున్న బాధలు మరల వచ్చినవని తెలియుచున్నది. అతీతములగు వాని కాలమునుద్దేశించి చేయు చికిత్స భూతకాలమునందలి వ్యాధుల చికిత్స యనబడును. ఉదాహరణమునకు ఏ నీరు వచ్చినందువలన పూర్వము శస్యము (పైరు) చెడిపోయినదో ఆ నీరు మరల వచ్చునను భయమున సేతువును నిర్మించినట్లు పై చెప్పబడిన చికిత్స భూతకాలము నందలి వ్యాధుల చికిత్స యగును. (ఇది వైద్యుడు అతీతవేదనలను చికిత్సించునా? అను ప్రశ్నకు సమాధానము.) రోగముల పూర్వరూపమును చూచి ముందు రాబోవు వ్యాధులకు చేయు చికిత్స అట్లు రాబోవు వ్యాధులను నశింపచేయును (రానివ్వదు). ఇది అనాగత రోగచికిత్స యగును. (ఇది రాబోవు వ్యాధులకు వైద్యుడు చికిత్స చేయునా అను ప్రశ్నకు సమాధానము).

పారంపర్యముచే అనుబంధములుగా నున్న దుఃఖములు కలుగుచుండును అవి సుఖరూపమగు చికిత్స చేయుటవలన నివర్తించి ఆరోగ్యము (సుఖము) కలుగును. దేహధాతువులు సమముగానున్నవి, విషయములుగాను, విషయములుగా నున్నవి సమములుగాను అగుట లేదు. (తమంతట తాము అగుటలేదు). ఇట్టి విషమత్వ సమత్వములు హేతువులవలననే కలుగుచుండును. (అట్లు శరీర ధాతువుల యందున్న [illegible] విషమ స్థితిని పోగొట్టునట్లు చేయుచికిత్స వర్తమాన చికిత్స

యనబడును. ఇది వైద్యుడు వర్తమాన వ్యాధులకు చికిత్సచేయునా యను (ప్రశ్నకు సమాధానము) ఈ యుక్తిని పురస్కరించుకొని వైద్యుడు త్రికాల వేదనలను నశింప జేయును (చికిత్సించును) అని చెప్పబడినది. హేతువులను వర్జించు చికిత్స నైష్ఠిక చికిత్స యనబడును.

ఆయుర్వేదదీపిక : "అథవాఽఽర్తస్య" అను మొదలగు ప్రశ్న యొక్క సమాధానమును "చికిత్సతి" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నారు. అతీత వేద నలకు చేయు చికిత్స ముఖ్యము కాదు. కాని లోక ప్రసిద్ధమగు ఉపచారమువలన అట్లు చెప్పబడునని వాక్యార్థము. "ప్రసిద్ధవచనైః" అనగా లోకమునందు ప్రసిద్ధమగు వచనములచేత. ప్రతికర్మ యనగా చికిత్స. "ఆశ్రయే" అనగా శరీరమునందు. "పూర్వరూపమ్" అను మొదలగువాని ద్వారా అనాగత రోగములకు వైద్యుడు చికిత్స చేయుననుటను సమర్థించు చున్నారు. పూర్వరూపము ఒకానొక కాలమందు రోగములకే కలుగుచున్నప్పటికీ "భవిష్యతామ్" అను పదము వలన భూతకాలపు వ్యాధుల యందునూ ఏ రూపములు కలుగునో వానిని నివారించుచున్నారు.

"ప్రాక్ సంతాపాత్ అపి దైనం సంతాపార్తమనుబధ్నాతి" అని నిదాన స్థానమున చెప్పబడియే యున్నది. ఇట్లనుట వలన రోగావస్థయందువలె పూర్వరూపము లుండును అని భావము. ఈ విధముగా అతీత, అనాగత వేదనలకు చికిత్స చేయబడు నని చెప్పబడినది. వర్తమాన చికిత్సను గూర్చి చూపుటకు పరిపూర్ణముగు నుతమును "పారంపర్య" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నారు. "పారంపర్యానుబద్ధః" అనగా సంతాన న్యాయము వలన పొందుచున్నను అని అర్థము. "దుఃఖానామ్" అనగా రోగములకు. "సుఖహేతూపచారేణ" అనగా ఆరోగ్యమునకు కారణమగు చికిత్సను సేవించుటవలన. 'సుఖమ్' అనగా ఆరోగ్యము ఈ విధముగా అనుకొన బడును - ఎప్పుడు సుఖహేతువగు చికిత్స సేవింపబడునో అప్పుడు దుఃఖమును కలిగించు కారణములను సేవించక పోవుటవలన దుఃఖము కలుగదు. రోగరూపమగు దుఃఖము క్షణభంగిత్వమువలన స్వయముగనే నశించును. సుఖహేతువు యొక్క సంబంధమువలన సుఖమగు ఆరోగ్యము ఉత్పత్తి యగును. అందువలన చికిత్స వలన రాబోవు దుఃఖము వ్యతిరేక హేతువుల వలన నిరోధింపబడును. మరియు సుఖము కలుగును అనునది సిద్ధాంతము. ఇదే సిద్ధాంతమును "న నాశాత్" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నారు. నశించుట, నశించకుండుట క్షణ భంగిత్వ

స్వభావము వలన వైషమ్యావస్థను గానీ, సమావస్థనుగాని పొందవని అర్థము. "హేతుభిః సదృశాః" అనగా సమహేతువులు సమములు, విషమహేతువుల విషమములు సాదృశ్యమును కలిగియుండునని అర్థము. ఈ విషయము చికిత్సా ప్రాభృతీయాధ్యాయమునందు వివరింపబడియే యున్నది. చికిత్సను ప్రస్తావించుటవలన సమస్త దుఃఖహారకమగు మోక్షమును కల్గించునదగు చికిత్సను "చికిత్సా తు" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. 'నిష్ఠా' అనగా అత్యంత దుఃఖమును విడిపించు మోక్షరూపము. దానికొరకు చేయబడునది నైష్ఠికీ యనబడును. "వినోపధామ్" అనగా ఆశ లేకుండగ - తృష్ణ (ఆశ) లేని ప్రవృత్తి మోక్ష మిచ్చునదగునని అర్థము.

## ఆశయే సర్వ దుఃఖములకు కారణమనుట

95. ఉపధా హి పరో హేతుర్దుఃఖ దుఃఖాశ్రయప్రదః,
త్యాగః సర్వోపధానాం చ సర్వదుఃఖ వ్యపోహకః,

96. కోశకారో యథా హ్యంశూనుపాదత్తే వధప్రదాన్,
ఉపాదత్తే తథాఽర్థేభ్య స్తృష్ణామజ్ఞః సదాఽఽతురః

97. యస్త్వగ్ని కల్పానర్థాన్ జ్ఞో జ్ఞాత్వా తేభ్యో నివర్తతే,
అనారంభాదసంయోగాత్తం దుఃఖం నోపతిష్ఠతే.

**తాత్పర్యము :** ఆశ యనునది దుఃఖములను దుఃఖాశ్రయములను కలిగించుటకు యుదాహరణము. అట్టి ఆశలను విడిచిపెట్టుట అన్ని దుఃఖములను నశింపజేయునదగును. పట్టుపురుగు తనను చంపునట్టి దారములను తన చుట్టును అల్లుకొనునట్లు అజ్ఞానియగువాడు విషయములందు కోరికలను పెంచుకొని ఎల్లప్పుడును దుఃఖించును. జ్ఞానియగువాడు కోరికలను (ఆశలను) అగ్నివలె భావించి వానిని విడిచిపెట్టును. అట్టివానికి దుఃఖప్రేరకములగు ఆశలు జనింపకపోవుటచేత వానితో సంబంధము లేకపోవుటవలనసూ దుఃఖములు కలుగవు.

**ఆయుర్వేదదీపిక :** "పరో హేతుః" అనగా మూలకారణము. దుఃఖరూపములవంటివే దుఃఖాశ్రయమగు శరీరము. భోగతృష్ణ వలన ప్రవర్తించువాడు దుఃఖమును కల్గించు శరీరమును ఉత్పత్తి చేయు ధర్మాధర్మములను చేయును. సర్వమైన కోరికలను విడిచిపెట్టుటవలన రాగద్వేషములందు కొంచెమైనను

ప్రవర్తనము కలుగదు. ఇట్లు ప్రవృత్తి లేకపోవుట వలన ధర్మాధర్మములు కలుగ నేరవు. ఈ విధముగా కలుగనట్టి ధర్మాధర్మముల నాశము జరుగును. కలిగిన ధర్మా ధర్మములకు రాగద్వేష శూన్యమగు ఉపభోగము వలననే క్షయము జరుగును. (ఇంతకుముందు కలిగిన ధర్మాధర్మములకు అని అన్వయించుకొనవలెను) అందు వలన అన్నింటిను కర్మను క్షయింపజేయుటవలన దుఃఖరూపమగు శరీరముండదని భావము. ఇచ్చటనే ఆశ వలన దుఃఖము కలుగుననుటకు దృష్టాంతమును "కోశ కారః" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "కోశకారః" అనగా అదే పేరుతో పిలువబడు పురుగు (పట్టుపురుగు), "సదా-ఉతురః" అనగా ఎల్లప్పుడును సంసార దుఃఖముచే పీడింపబడువాడు. "అనారమ్భాత్" అనగా [illegible]ములను రాగద్వేష పూర్వకమగు ఆరంభత్వము లేనందువలన. "అసంయోగాత్" అనగా ఆరంభమగునవి లేనందున, ధర్మాధర్మములు లేనందువల్ల కలుగు శరీరముచే సంయోగము కలుగనందుచేత, శరీరము యొక్క అభావమునందునా నిరాశ్రయము లగునట్టియు కారణము కాలేనట్టియు దుఃఖము కలుగనేరదని భావము.

## దుఃఖహేతువులు

98. ధీధృతిస్మృతివిభ్రంశః సంప్రాప్తిః కాలకర్మణామ్,
అసాత్మ్యార్థాగమశ్చేతి జ్ఞాతవ్యా దుఃఖహేతవః.

**తాత్పర్యము** : బుద్ధి, ధారణాశక్తి, స్మరణశక్తి అనునవి విభ్రంశము నొందుట, కాలము మరియు కర్మ యొక్క సంప్రాప్తి, అసాత్మ్యములగు విషయముల సంయోగము అనునవి దుఃఖములకు కారణములని తెలియవలెను.

**ఆయుర్వేదదీపిక** : "కారణం వేదనానాం కిమ్" అను ప్రశ్నకు సమా ధానము-"ధీధృతి" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. ఈ విషయము ప్రకరణమునందు తిరిగివచ్చుట వలన చెప్పబడుటచేత పునరుక్తము కాజాలదు. ధీ, ధృతి మరియు స్మృతి యనునవి ప్రజ్ఞ యొక్క భేదములు. ఈ విషయములే శిష్యునికి బోధపరచుట కొరకు ప్రజ్ఞా భేదములుగా వేరుగా వివరించి ఇచట చెప్పబడుచున్నవి. "సంప్రాప్తిః కాలకర్మణామ్" అనగా కాలము యొక్క సంప్రాప్తి మరియు కర్మ యొక్క సంప్రాప్తి. కర్మ సంప్రాప్తి యనునది పరిపాకము నొందుచున్న కర్మ యోగము కాల సంప్రాప్తిని గ్రహించుటచే ఇచట వివి కాలములందు (తగిన కాలము నందు) వ్యక్తములగుచున్నవా అని తెలుపబడుచున్నవి. అట్లేగాని కాల

జన్యములు అవశ్యముగా తీసికొననవసరము లేదు. కాలజన్యములు స్వాభావికము లైనందునను మరియు తృతీయకాదులును (తృతీయక జ్వరము మొదలైనవియును) అసాంత్మ్యేంద్రియార్థ జన్యములై కాలజన్యములుగనే పేర్కొనబోవుచున్నాడు. కర్మజములు మాత్రము ప్రజ్ఞాపరాధజన్యములే అవి ఇచట శిష్యులకు బోధపరచుటకు విశేషముగా కర్మజన్యములుగా వేరుచేసి చెప్పబడుచున్నవి. కర్మజములు కాలము ననుసరించియే (కాలముపై నాధారపడియే) యుండుటవలన ఇచట కాల సంప్రాప్తి జన్యములందున్నట్లు తెలియవలసియున్నవి. కర్మజములకువలె ప్రజ్ఞాపరాధము వలన తెలిసికొనదగినవానిని ప్రథమాధ్యాయమున చెప్పినట్లుగనే గ్రహించవలెను. కాని ఆచార్యునిచేత స్వయముగా ఉన్మాద నిదానమునందు "ప్రజ్ఞాపరాధాత్ సంభూతే వ్యాధౌ కర్మజ ఆత్మనః" (నిదానస్థానము 7వ అధ్యాయము) అను మొదలగునవి చెప్పబడి నవి. అటులనే జనపదోద్ధ్వంసనీయ విమానమునందు మరల "వాయ్వాదీనాం యద్వై గుణ్యముత్పద్యతే తస్యమూలమధర్మః తన్మూలం వాఽసత్కర్మ పూర్వకృతం, తయోర్యోనిః ప్రజ్ఞాపరాధ ఏవ "(విమానస్థానము 3వ అధ్యాయము) అని చెప్పబడి నది. అందువలన ఇచట "సంప్రాప్తిః కాలకర్మజామ్" అనుటవలన కాలజన్యములైన రోగములు చెప్పబడుటలేదు. కాని, కాలముపై ఆధారపడినవి చెప్పబడుచున్నవి.

## విషమాభినివేశము - సమాభినివేశము

99. విషమాభినివేశో యో నిత్యానిత్యే హితాహితే,
    జ్ఞేయః స బుద్ధివిభ్రంశః సమం బుద్ధిర్హి పశ్యతి.

**తాత్పర్యము :** నిత్యా నిత్యములగు వానియందును, హితాహితములగు వానియందును విషయముగా నిర్ణయించుట బుద్ధి విభ్రంశమనబడును. ఇదియే విషమాభి నివేశము. వీనిని సరిగా నిర్ణయించుట సమాభినివేశమనబడును.

**ఆయుర్వేదదీపిక :** "విషమ" అను మొదలగువాని ద్వారా ధీ విభ్రంశ మును వివరించుచున్నాడు. విషమాభినివేశమనగా లేనిదాని నున్నట్లుగా నిర్ణయించుట లేదా తలచుట — నిత్యమైనదానిని అనిత్యముగా తలచుట, ఇట్లే హితమగుదానిని అహితముగాను, అహితమగుదానిని హితముగాను నిర్ణయించుట బుద్ధి విభ్రంశమన బడును. ఇది ఎట్లు బుద్ధి విభ్రంశమను శబ్దముచేత చెప్పబడునో "సమంబుద్ధిర్హి

4]

పశ్యతి” అనుటద్వారా చెప్పుచున్నాడు. తగువిధముగా నున్న బుద్ధి సమముగా నున్న దానిని ఉన్నదున్నట్లుగా ఎందువలన చూచునో అందువలననే అసమముగా చూచుట బుద్ధి విభ్రంశమనబడుట ఉచితమే యని అర్థము.

## ధృతిభ్రంశము

100. విషయప్రవణం సత్త్వం ధృతిభ్రంశాన్న శక్యతే,
నియన్తుమహితాదర్థాద్ధృతిర్హి నియమాత్మికా.

**తాత్పర్యము :** ధృతియనునది భ్రంశము చెందినచో విషయములందు లగ్నమైయున్న మనస్సును నియమించుట సాధ్యపడదు. ధృతియే మనస్సును నియమించునదై యున్నది.

**ఆయుర్వేదదీపిక :** “విషయ” అను మొదలగువాని ద్వారా ధృతి భ్రంశమును చెప్పుచున్నాడు. విషయ ప్రవణమనగా విషయములయందు లగ్నమైయున్న, “నియన్తుమ్” అనగా మరల్చుటకు. “ధృతిర్హి నియమాత్మికా” అనగా ధృతి ఎందువలన అకార్యముల యందాసక్తి కలిగియున్న మనస్సును స్వస్థితి వలన మరల్చుచున్నదో అందువలననే స్వకర్మ భ్రష్టమైన ధృతి మనస్సును నియమించుటకు అశక్తమగు చున్నదని అర్థము.

## స్మృతి భ్రంశము

101. తత్త్వజ్ఞానే స్మృతిర్యస్య రజోమోహావృతాత్మనః,
భ్రశ్యతే స స్మృతిభ్రంశః స్మర్తవ్యం హి స్మృతౌ స్థితమ్.

**తాత్పర్యము :** రజోగుణము, మోహములతో ఆవరించి యున్నవానికి స్మృతి, తత్త్వ జ్ఞానము లేకుండుట స్మృతి విభ్రంశమనబడును. స్మరింపదగిన దంతయునూ స్మృతి యందుండును.

**ఆయుర్వేదదీపిక :** “తత్త్వ” అను మొదలగువాని ద్వారా స్మృతి భ్రంశమును వివరించుచున్నాడు. తత్త్వమును తెలిసికొనుటయందు ఎవనికి స్మృతి చెడిపోవునో అతడు స్మృతిభ్రష్టుడగును. “స్మర్తవ్యం హి స్మృతౌ స్థితమ్”

అనగా స్మర్తవ్యత్వము వలన సమ్మతార్థమగు స్మరణమనునది ప్రశస్తమగు స్మృతి యొక్క ధర్మము. అటులయును తత్త్వ జ్ఞానమునకు మంచి విషయములను స్మరించు గుణముచేత సమ్మతమగు దానిని స్మరింప కుండుట ఏది కలదో అది స్మృతి యొక్క అపరాధము వలన కలుగునని అర్థము.

## ప్రజ్ఞాపరాధము

102. ధీధృతిస్మృతివిభ్రష్టః కర్మ యత్ కురుతేఽశుభమ్,
ప్రజ్ఞాపరాధం తం విద్యాత్ సర్వదోషప్రకోపణమ్.

103. ఉదీరణం గతిమతాముదీర్ణానాం చ నిగ్రహః,
సేవనం సాహసానాం చ నారీణాం చాతిసేవనమ్.

104. కర్మకాలాతిపాతశ్చ మిథ్యారంభశ్చ కర్మణామ్,
వినయాచారలోపశ్చ పూజ్యానాం చాభిధర్షణమ్.

105. జ్ఞాతానాం స్వయమర్థానామహితానాం నిషేవణమ్,
పరమౌన్మాదికానాం చ ప్రత్యయానాం నిషేవణమ్.

106. అకాలదేశసంచారౌ మైత్రీ సంక్లిష్టకర్మభిః,
ఇన్ద్రియోపక్రమోక్తస్య సద్వృత్తస్య చ వర్జనమ్.

107. ఈర్ష్యామానభయక్రోధలోభమోహమదభ్రమాః,
తజ్జం వా కర్మ యత్ క్లిష్టం క్లిష్టం యద్దేహకర్మ చ.

108. యచ్చాన్యదీదృశం కర్మ రజోమోహసముత్థితమ్,
ప్రజ్ఞాపరాధం తం శిష్టా బ్రువతే వ్యాధికారణమ్.

**తాత్పర్యము :** మనుజుడు బుద్ధి, ధృతి, స్మృతి-ఇవి విభ్రంశము నొందినవాడై చేయు అశుభ కర్మను ప్రజ్ఞాపరాధముగా తెలియవలెను. ఇది సర్వ దోషములను ప్రకోపింపజేయునదగును. శారీరక వేగములను (మలమూత్రాది వేగములను) బయల్వెడలించుట, వచ్చుచున్న వేగములను అడ్డగించుట, సాహస కర్మలను చేయుట, స్త్రీలను అధికముగా సేవించుట, చికిత్స చేయవలసిన కాలము దాటిన పిదప చికిత్సించుట, మిథ్యములగు చికిత్సలను చేయుట, వినయము - ఆచారములు లోపిం

చుట, పూజ్యులను తిరస్కరించుట, తెలిసియుండియు అహితములగు విషయములను సేవించుట, అకాలమున సంచరించుట, దేశముగాని దేశమునందు సంచరించుట, చెడు పనులయందు చెడువారితో స్నేహము చేయుట, ఇంద్రియోపక్రమణీయాధ్యాయమునందు చెప్పబడిన సద్వృత్తమును ఆచరింపక వర్జించుట, ఈర్ష్య - అభిమానము - భయము - క్రోధము - లోభము - మోహము - మదము - భ్రమలను కలిగియుండుట లేదా వానితో కూడి యుండి కర్మలను చేయుట లేదా వానిని కలిగించు శారీరక ప్రవర్తనము చేయుట, ఇంకను ఇటువంటివగు రజోమోహాదుల వలన కలుగునట్టియు కర్మలను చేయుట ఇదంతయును ప్రజ్ఞాపరాధమని మంచివారు చెప్పుదురు. ఇది వ్యాధులన్నింటికీ కారణమైయున్నది.

**ఆయుర్వేదదీపిక :** ఈ విధముగా భ్రంశమైన బుద్ధ్యాదులు మూడింటి యొక్క రూపమగు ప్రజ్ఞాపరాధము వలన కలుగు కర్మను ప్రజ్ఞాపరాధముగా చూపుటకు "ధీ" అను మొదలగునవి చెప్పుచున్నారు. "సర్వదోష" అను శబ్దము వలన వాతాదులు, రజస్తమస్సులు రెండునూ గ్రహింపబడుచున్నవి. "కర్మకాలాతిపాతః" అనగా చికిత్స చేయవలసిన కాలము అతిక్రమించుట. "మిథ్యారంభ" అనగా అయోగ అతియోగ మిథ్యాయోగ రూపమగునది. వినయాచార లోపము వలననే అంతర్గతముగా తెలియుచున్నప్పటికీ మరల పూజ్యులను తిరస్కరించుటయని పేర్కొనుట యనునది అది విశేషముగా దోషప్రకోపము గావించునని తెలుపుటకునూ మరియు ఉదాహరణము కొరకునూ చెప్పబడినది. "సంక్లిష్ట కర్మభిః" అనగా పతితులతో అని అర్థము. "క్లిష్టమ్" అనగా నిందితమని అర్థము.

109. బుద్ధ్యా విషమ విజ్ఞానం విషమం చ ప్రవర్తనమ్,
ప్రజ్ఞాపరాధం జానీయాన్మనసో గోచరం హి తత్.

**తాత్పర్యము :** బుద్ధిచేత విషమమగు జ్ఞానమును కలిగియుండుట, మరియు విషమముగా ప్రవర్తించుట ప్రజ్ఞాపరాధమని తెలియవలెను. అది మనో గోచరమై యున్నది.

**ఆయుర్వేదదీపిక :** "బుద్ధ్యా" అను మొదలగువానిద్వారా సంక్షేపముగా ప్రజ్ఞాపరాధ లక్షణమును చెప్పుచున్నారు. "విషమమ్" అనగా అనుచితము. విషమ విజ్ఞానమనునది స్వరూపము వలననే ప్రజ్ఞాపరాధమగును. విషమ ప్రవర్తనము కూడ

ప్రజ్ఞాపరాధ కార్యమగుట వలన ప్రజ్ఞాపరాధ శబ్దము వలన చెప్పబడుచున్నది. "మనసో గోచరం హి తత్" అనగా ఆ విషమ ప్రవర్తనము మరియు విషమ జ్ఞానము మనస్సుయొక్క కార్యప్రజ్ఞా విషయమగుటచే మనస్సునకు గోచరమగునని అర్థము. విషమ ప్రవర్తనము కూడ మనోగోచరజన్యత్వము వలన ఉపచారము చేత చెప్పబడినది. వ్యతిరేకమగు మనో విషయ జ్ఞానము చేత విషమమగు వాక్ప్రవృత్తి, దేహప్రవృత్తియును కలుగును.

## కాలసంప్రాప్తి

**110.** నిర్దిష్టా కాలసంప్రాప్తిర్వ్యాధీనాం వ్యాధిసంగ్రహే,
చయప్రకోపప్రశమాః పిత్తాదీనాం యథా పురా.

**111.** మిథ్యాతిహీనలిఙ్గాశ్చ వర్షాన్తాః రోగహేతవః,
జీర్ణభుక్తప్రజీర్ణాన్నకాలాకాలస్థితిశ్చ యా.

**112.** పూర్వమధ్యాహ్నాపరాహ్ణాశ్చ రాత్ర్యా యామత్రయశ్చ యే,
ఏషు కాలేషు నియతా యేరోగాస్తే చ కాలజాః.

**తాత్పర్యము :** పిత్తాది దోషములకు ఋతువులను బట్టి చయప్రకోప ప్రశమములు కలుగుననుటచే వ్యాధి సంగ్రహమునందు (కియంతశ్శిరసీయాధ్యాయమునందు) ముందుగా చెప్పబడియున్నది. వర్షాంతములగు ఋతువులకు హీన మిథ్యాతి లక్షణములుండుట రోగకారణములగును. ఇవియు, ఆహారము జీర్ణించిన కాలము, భుజించుచున్న కాలము, జీర్ణమగుచున్న కాలము, వయస్సుననుసరించి బాల్యము, యౌవనము, వార్ధక్యము, పూర్వాహ్ణము, మధ్యాహ్నము, అపరాహ్ణము అను దినమునందలి కాలములు, రాత్రియందలి త్రియామములు ఈ కాలములయందు నియతముగా వచ్చు యే రోగములున్నవో అవి కాలజ రోగములనబడును.

**ఆయుర్వేదదీపిక :** "నిర్దిష్టా" అను మొదలగువానిద్వారా వ్యాధులకు కాలసంప్రాప్తిని చెప్పుచున్నాడు. "వ్యాధి సంగ్రహే" అనగా కియంతః శిరసీయాధ్యాయమునందు – "చయప్రకోప ప్రశమాః పిత్తాదీనాం యథాక్రమమ్, భవన్త్యేకైకశః షట్సు కాలేష్వభ్రాగమాదిషు." అనుట వలన మరియు ఉదాహరణమును చెప్పుటవలననూ చెప్పబడినది. అందువలన వ్యాధుల యొక్క కాల సంప్రాప్తి – పిత్తాదులకు చయప్రకోపప్రశమములు పూర్వము చెప్పబడినట్లు అని అన్వయించు

కొనవలెను. "మిథ్యా" అను మొదలగువానిద్వారా వేరు ఉదాహరణము నిచ్చు చున్నాడు. "జీర్ణ" అను మొదలగువానియందు జీర్ణము మొదలగు విశిష్టమగు అన్నము యొక్క మూడు కాలములు, అట్లే అన్నము యొక్క అజీర్ణాది అవస్థలగు అకాలమునూ వర్ణింపబడినది. "ప్రజీర్ణమ్" విదగ్ధమైనట్టి. రాత్రి యొక్క ఏ యామ త్రయమున్నదో అనగా రాత్రిని పూర్వరాత్రము మధ్యరాత్రము అపరరాత్ర రూప మగు మూడు విభాగములుగా విభజించి చెప్పుట. అంతేగాని యామమనగా ప్రహర మని అనుకొనరాదు. ఇతరచోట్ల కూడా భాగత్రయమునందు యామ విభాగమును చేసి (అభిధాన శాస్త్రమునందు) రాత్రి మూడు యామములు కలదిగా పేర్కొనబడినది. "తేషు కాలేషు" అనగా అన్నము యొక్క జీర్ణకాలము మొదలగు కాలముల యందు. జీర్ణకాలమునందు, అపరాహ్ణమునందు, అపరరాత్రియందు (రాత్రి యందలి చివరి భాగమునందు) వాతరోగములు - భుజించిన వెంటనే, పూర్వా హ్ణమునందు, మరియు పూర్వరాత్రియందును కఫజ రోగములు-అన్నము జీర్ణమగు చున్న కాలమునందు, మధ్యాహ్నమునందు, మధ్యరాత్రియందును పిత్తజ రోగములు నియతముగా కలుగును. అన్నము యొక్క అకాలమునందు (అకాలమునందు భుజించినపుడు) అజీర్ణ లక్షణములున్నపుడును భోజనము చేయుట వలన మూడు దోషములును కలుగునని తెలియవలెను. లేదా, జీర్ణ, భుక్త, అజీర్ణ అన్న కాలములని భేదము – అందువలన జీర్ణాది అవస్థలతో కూడిన అన్న కాలములు పూర్వమువలెనే తెలియవలసియున్నవి మరియు "కాలస్థితిశ్చ యః" అని తెలియ వలెను. కాలస్థితి శబ్దము వలన బాల్యాది త్రివిధ వయస్సు చెప్పబడుచున్నది. అచట బాల్యమునందు శ్లైష్మిక, యౌవనమునందు పైత్తిక, మరియు వార్ధక్యమునందు వాతికములనగు రోగములు కలుగునని తెలియవలెను.

113. అన్యేద్యుష్కో ద్వ్యహగ్రాహీ తృతీయకచతుర్థకౌ,
స్వే స్వే కాలే ప్రవర్తన్తే కాలే హ్యేషాం బలాగమః.

**తాత్పర్యము :** అన్యేద్యుష్క జ్వరము రెండురోజుల కొకసారి వచ్చును. తృతీయక చతుర్థక జ్వరములు తమ తమ కాలములందు (క్రమముగా మూడవ, నాల్గవరోజులందు) వచ్చును. ఆ యా కాలములందు వీనికి బలము సంక్రమించు చున్నందున అట్లు జరుగును.

**ఆయుర్వేదదీపిక :** విషమ జ్వరములను కాల విశేష మాత్రము చేతనే ప్రవర్తించుచుండుట వలన కాలజములను చూపుటకు "అన్యేద్యుష్క" అను

మొదలగునవి చెప్పుచున్నాడు. "ద్వ్యహగ్రాహీ" - అనునది చతుర్థకమునకు వ్యతిరేకమైనది. అనగా రెండురోజులకొకసారి వచ్చునది. చికిత్సాస్థానమున మూడవ అధ్యాయమునందు "విషమజ్వర ఏవాన్యశ్చతుర్థకవిపర్యయః మధ్యేఅహని జ్వరయిత్వాదావన్తే చ ముఞ్చతి." అని చెప్పబోవుచున్నాడు. తమ తమ కాలముల యందే ఎట్లు ప్రవర్తించుచున్నవో ఆ విషయమును - "కాలే హ్యేషాం బలాగమః" అనుట ద్వారా చెప్పుచున్నాడు. పై చెప్పిన కాలమునందే అవి బలవంతము లగుట వలన బలమును పొందినవై ఆ సమయమునందే వ్యాధి రూపమున బయల్పడునని అర్థము.

114. ఏతే చాన్యే చ యే కేచిత్ కాలజా వివిధా గదాః,
 అనాగతే చికిత్స్యాస్తే బలకాలౌ విజానతా.

**తాత్పర్యము :** పై చెప్పినవియును, ఇంకను ఇతరములగు కాలజన్యములగు వివిధ రోగములేవి కలవో వానిని ప్రాదుర్భవింపక ముందే బలకాలములను (రోగి యొక్క బలము, చికిత్సాకాలము, వ్యాధి కాలములను) తెలిసికొనుచు చికిత్స చేయవలెను.

**ఆయుర్వేదదీపిక :** ఈ వ్యాధులకు చేయవలసిన చికిత్సాక్రమమును "ఏతే చ" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "అన్యే చ" అనుట వలన ఇతరములైనప్పటికీ విశేష కాలము ప్రాప్తించినపుడు ప్రాదుర్భవించు శోథ, కుష్ఠ మొదలగు వ్యాధులను సూచించుచున్నాడు.

## పరిణామము

115. కాలస్య పరిణామేన జరామృత్యునిమిత్తజాః,
 రోగాః స్వాభావికా దృష్టాః స్వభావోనిష్ప్రతిక్రియః.

**తాత్పర్యము :** కాలము యొక్క పరిణామము వలన ముసలితనము మృత్యువులకు కారణములగు స్వాభావిక రోగములు కలుగుచుండును. అట్టి స్వాభావిక రోగములకు చికిత్సయనునది లేదు. స్వభావము మార్చదగినది కాదనుటచే అట్టి రోగములకును చికిత్స లేదని భావము.

**ఆయుర్వేదదీపిక** : స్వాభావిక రోగములు కూడ కాలపరిణామము వలన బయటపడుట (తెలియుట) వలన ఇచట వాటిని కూడ కాలజములందే చేర్చి తెలుపుటకు "కాలన్య" అను మొదలగునవి చెప్పుచున్నాడు. జరామృత్యు రూపము నకు కారణమగుటకు పుట్టినవి జరామృత్యు నిమిత్తజములు. మృత్యు శబ్దమువలన ఇచట యుగానురూపముగా ఆయువు యొక్క పర్యవసానము వలన కలుగు మృత్యు వును గ్రహింపవలెను. లేదా జరామృత్యువులకు ఏది కారణమో అందువలన జనించి నవి జరామృత్యు నిమిత్తజములనబడును. ప్రాణులకు జరామృత్యు కారణమనునది సాధారణ దేహమును వివర్తింపజేయు భూత స్వభావము మరియు అదృష్టము అగును. ఇక స్వభావికములైన వానికి చికిత్స ఏమి అని "స్వభావః" ఇత్యాదుల ద్వారా చెప్పుచున్నాడు. "నిష్ప్రతిక్రియః" అనగా రసాయనమును వర్జించి సాధారణ చికిత్సవలన ప్రతిక్రియ చేయబడదు - రసాయన చికిత్సవలన మాత్రమే చికిత్సచేయ బడును. అందువలన "అన్యప్రయోగాచ్చ్యవనః సువృద్ధోఽభూత్ పునర్యువా." (చికిత్సాస్థానము 1వ అధ్యాయము) అను మొదలగు రసాయన ప్రయోగమువలన పైచెప్పినది విరుద్ధము కాదు. లేదా, స్వాభావికములగు జరాదులు రసాయనము వలన కలిగిన బలమువలన రాబోవు కాలమునందు మరల అవశ్యముగా కలుగును అనుటవలన అవి నిష్ప్రతి క్రియములుగా చెప్పబడినవి.

**116.** నిర్దిష్టం దైవశబ్దేన కర్మ యత్ పౌర్వదైహికమ్,
హేతుస్తదపి కాలేన రోగాణాముపలభ్యతే.

**తాత్పర్యము** : పూర్వజన్మయందు చేయబడిన ఏ కర్మ దైవమని చెప్ప బడినదో అదియును కాలపరిణామమువలన రోగములకు హేతువుగా నగును.

**ఆయుర్వేదదీపిక** : ప్రస్తుతము రోగము కర్మ సంప్రాప్తివలన కలుగు నదైనప్పటికీ కాల విశేషమువలన కలుగుదానిగా చూపించుటకు "నిర్దిష్టం" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "కాలేన" అనగా కర్మ పరిపాకమగుచున్న కాలము వలన కర్మ కారణమగునని అర్థము.

**117.** న హి కర్మ మహత్ కించిత్ ఫలం యస్య నభుజ్యతే,
క్రియాఘ్నాః కర్మజా రోగాః ప్రశమం యాన్తి తత్క్షయాత్.

**తాత్పర్యము :** ఫలమనుభవింపకుండగ ఎట్టి కర్మయు (చిన్నదైనను పెద్దదైననూ) లేదు. కర్మజ వ్యాధులకు చికిత్సయును లేదు. అట్టి వ్యాధులు కర్మపరిపక్వము నొందినంతనే శమించును. (కర్మ ఎంతదైననూ తప్పక అనుభవించి తీరవలయును. అట్టి కర్మ పరిపాకము గాకముందు చికిత్స చేసిననూ అది నిష్ఫలమగును. కర్మ పరిపాకము పొందినపుడే స్వయముగా అట్టి వ్యాధి నశించునని భావము.)

**ఆయుర్వేదదీపిక :** కర్మకు ఫలముతో గల సంబంధమును "న హి" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "మహత్" అనగా విశేషము కొంచెముగా పెద్దది కాకయున్న కర్మ ప్రాయశ్చిత్తము వలన బాధించునట్టి ఫలమును ఇవ్వనప్పటికీ అది ఫలమనియే చూపుచున్నాడు. కర్మజవ్యాధులకు చికిత్స లేదనుటను "క్రియాఘ్నాః" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "తత్క్షయాత్" అనగా కర్మక్షయముచేత. కర్మయొక్క ఫలమును అనుభవించుట వలననే కర్మక్షయము జరుగుచున్నది.

## అసాత్మ్యేంద్రియార్థ సంయోగము

118. అత్యుగ్రశబ్దశ్రవణాచ్ఛ్రవణాత్ సర్వశో న చ,
శబ్దానాం చాతిహీనానాం భవన్తి శ్రవణాజ్జడాః.

119. పరుషోద్భీషణాశస్తాప్రియవ్యసనసూచకైః,
శబ్దైః శ్రవణసంయోగో మిథ్యాసంయోగ ఉచ్యతే.

120. అసంస్పర్శోఽతిసంస్పర్శో హీనసంస్పర్శ ఏవ చ,
స్పృశ్యానాం సంగ్రహేణోక్తః స్పర్శనేన్ద్రియబాధకః.

121. యో భూతవిషవాతానామకాలేనాగతశ్చ యః,
స్నేహశీతోష్ణసంస్పర్శో మిథ్యాయోగః స ఉచ్యతే.

122. రూపాణాం భాస్వతాం దృష్టిర్వినశ్యతిదర్శనాత్,
దర్శనాచ్చాతిసూక్ష్మాణాం సర్వశశ్చాప్యదర్శనాత్.

123. ద్విష్టభైరవబీభత్సదూరాతిశ్లిష్టదర్శనాత్,
తామసానాం చ రూపాణాం మిథ్యాసంయోగ ఉచ్యతే.

124. అత్యాదానమనాదానమోకసాత్మ్యాదిభిశ్చ యత్,
రసానాం విషమాదానమల్పాదానం చ దూషణమ్.

125. అతిమృద్వతితీక్ష్ణానాం గన్ధానాముపసేవనమ్,
అసేవనం సర్వశశ్చ ఘ్రాణేన్ద్రియవినాశనమ్.

126. పూతిభూతవిషద్విష్టా గన్ధా యే చాప్యనార్తవా,
తైర్గన్ధైర్ఘ్రాణసంయోగో మిథ్యాయోగః స ఉచ్యతే.

127. ఇత్యసాత్మ్యార్థసంయోగస్త్రివిధో దోషకోపనః.

**తాత్పర్యము :** మిక్కిలి ఉగ్రములగు శబ్దములను వినుట, శబ్దములను అసలు వినకుండుట, అతి హీనములగు శబ్దములను వినుట, పరుషములైన, భయంకరములైన శబ్దములను, అమంగళకరమైనట్టియు, ఇష్టము కానట్టియు, దుఃఖ సూచకము లైనట్టియు శబ్దములను వినుట అనునవి శ్రోత్రేంద్రియమునకు మిథ్యా యోగమని చెప్పబడును. దీని వలన శ్రోత్రేంద్రియమునకు జడత్వము కలుగును. స్పర్శ లేకుండుట అధికమగు స్పర్శ కలుగుట, స్వల్పమగు స్పర్శ కలు గుట, భూతముల యొక్క, విషవాయువుల యొక్కయు స్పర్శ కలుగుట స్నేహము యొక్కయు, శీతము యొక్కయు, ఉష్ణము యొక్కయు స్పర్శ అకాలమునందు కలుగుట, ఇవి స్పర్శనేంద్రియమునకు మిథ్యా యోగమగును. ఇందువలన స్పర్శనేంద్రియమునకు బాధను కలిగించును. మిక్కిలి మిరుమిట్లు గొల్పుచున్న రూపములను చూచుట, అతి సూక్ష్మములైన రూపములను చూచుట, రూపములను అసలు చూడకుండుట, ద్వేషింపదగునట్టి, భయంకరములగు నట్టియు బీభత్సములోను, దూరము నందున్నట్టియు, మిక్కిలి దగ్గరగా నున్నట్టియు, తామసము లైనట్టి [చీకటిలో నున్నట్టియు] రూపములను చూచుట చక్షురింద్రియమునకు మిథ్యా యోగమగును. వీని వలన దృష్టి నాశనము కలుగును. అధికముగ భుజించుట, అసలు సేవింపకుండుట, అలవాటుగా నున్నవానికి వ్యతిరేకములగు వానిని సేవించుట, అల్పముగ సేవించుట అనునవి రసనేంద్రియమునకు చెఱుపు కలిగించును. మిక్కిలి మృదువైనట్టియు, అతి తీక్ష్ణము లైనట్టియు గంధములను సేవించుట, అసలు గంధమును సేవింపక యుండుట, ఇవి ఘ్రాణేంద్రియమును నష్టపరచును. కుళ్ళినవి, విషయుక్తమైనవి, ద్వేష పూరితము లైనవి, ఋతు విపరీతమైనవియును అను గంధములను ఆఘ్రాణించుట ఘ్రాణేన్ద్రి

యమునకు మిథ్యాయోగమగును. ఇట్లు హీన మిథ్యా యోగములుగా మూడు విధము లగు అసాత్మేన్ద్రియార్థ సంయోగము చెప్పబడినది.

ఆయుర్వేద దీపిక : "అత్యుగ్ర" అను మొదలగువాని ద్వారా క్రమము నందు వచ్చిన అసాత్మ్యేన్ద్రియార్థ సంయోగమును వివరించుచున్నాడు. "సర్వశో న చ" అనగా అన్ని వేళల యందు ఉగ్ర శబ్దములను వినుటచేత. "స్పృశ్యానామ్" అనగా శాస్త్రమునందు స్పృశ్యములుగా చెప్పబడిన అభ్యంగ ఉత్సాదనాదులు. భూతములనగా విష క్రిములు, పిశాచములు మొదలగునవి. భూత విషవాతాదుల స్పర్శ ఏదీ కలదో మరియు అకాలమునందు వచ్చు స్నేహాశీత ఉష్ణ సంస్పర్శయును అని అన్వయము. అచట అకాలమున స్నేహ సంస్పర్శ యనుటకు ఉదాహరణము— అజీర్ణ సమయమునందు మరియు కఫవృద్ధి కాలమునందు స్నేహముచే అభ్యంగమును చేసికొనుట, ఇట్లే శీత సమయమునందు చల్లని స్పర్శలను లేపనము చేసికొనుట, మరియు ఉష్ణ కాలమునందు ఉష్ణ పదార్థముల స్పర్శయును. ఇవి యన్నియు అకాలమునందు చేయు సంస్పర్శలనబడును. "సర్వశశ్చాప్యదర్శనాత్" అనగా ఎల్లప్పుడు ప్రకాశవంతములైన, సూక్ష్మములైన రూపములను చూచుటచేత అని అర్థము. "అతి శ్లిష్టమ్" అనగా నేత్రమునకు అతి దగ్గరగా నున్న వానిని అని అర్థము. తామస రూపములను చూచుట వలన దృష్టి నశించునని ఇచట సంబంధము. అదీ మిథ్యా యోగము అనగా ద్వేషపూరితమైన, భయంకరమైన దృశ్యములను చూచుట మిథ్యా యోగము అని అర్థము. అతి సూక్ష్మ వస్తు దర్శనము కూడ మిథ్యా యోగమేయని తెలియవలెను. "ఓకసాత్మ్యాదిభిః" అను దానికి "విషమాదానమ్" అని అన్వయించుకొనవలెను. ఓకసాత్మ్యాది వైషమ్యము వలన రాశి దోషము తప్ప ప్రకృతి మొదలగు ఏడు దోషములను (ప్రకృతి-కరణ-సంయోగ-దేశ-కాల-ఉపయోగ సంస్థా-ఉపయోక్త అను ఈ ఏడును దోష పూరితములగ నుండుట) గ్రహించవలెను. త్రివిధః అనగా అయోగ, అతియోగ, మిథ్యాయోగ రూపమగు మూడు విధములు.

127. అసాత్మ్యమితి తద్విద్యాద్యన్న యాతి సహాత్మతామ్.

తాత్పర్యము : ఏది శరీరమునకు అనుకూలముగా నుండదో (కలసి రాదో) దానిని అసాత్మ్యమని తెలియవలెను.

ఆయుర్వేదదీపిక : అసాత్మ్యము యొక్క అర్థమును "అసాత్మ్యమ్" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. "సహ" అనగా శరీరముతో కలసి

యుండుట. అత్మ్యతామ్ అనగా అవికృతమైన రూపమును కలిగించదు అని అర్థము. ఇందువలన దేనిని ఉపయోగించుట వలన ప్రాకృత రూపమునకు విఘాతమును కల్గునో అది అసాత్మ్యము అని తెలిసికొనవలెను.

## ఇంద్రియ సంబంధమగు వ్యాధులు కలుగు విధము

128. మిథ్యాతిహీనయోగేభ్యో యో వ్యాధిరుపజాయతే,
శబ్దాదీనాం స విజ్ఞేయో వ్యాధిరైన్ద్రియకో బుధైః.

**తాత్పర్యము :** శబ్ద స్పర్శ రూప రస గంధముల యొక్క మిథ్యా యోగము, అతి యోగము, హీన యోగముల వలన కలుగు వ్యాధిని ఐంద్రియక (ఇంద్రియ సంబంధమైన) వ్యాధిగా పండితులు తెలిసికొనవలయును.

**ఆయుర్వేదదీపిక :** ఈ విధముగా అసాత్మ్యార్థముల వలన కలిగిన వ్యాధి ఇంద్రియము ద్వారా కలుగుటవలన అది ఐంద్రియకమని చూపుటకు "మిథ్య" అను మొదలగునవి చెప్పుచున్నాడు. హీన యోగము వలన ఇచట అయోగమని గ్రహింపవలయును. ఐంద్రియకః అనగా ఇంద్రియము ద్వారా కలుగుచున్న అని అర్థము.

129. వేదనానామశాన్తానామిత్యేతే హేతవః స్మృతాః,
సుఖహేతుః సమస్త్వేకః సమయోగః సుదుర్లభః.

**తాత్పర్యము :** దుఃఖ రూపమగు వేదనలకు ఈ విధముగా కారణములు చెప్పబడినవి. సమమగు సుఖహేతువొక్కటే యుండును. అట్టి సమత్వము యోగించుట అతి దుర్లభము.

**ఆయుర్వేదదీపిక :** "వేదనానామ్" అను మొదలగు వానిద్వారా దుఃఖ రూపమగు వేదనా హేతువులను వివరము చెప్పబడిన దానిని ఉపసంహరించు చున్నాడు. "అశాన్తానామ్" అనగా దుఃఖములకు అని అర్థము. ఇక సుఖ రూపమగు వేదనలకు కారణమేది అను విషయమును "సుఖ" అను మొదలగువానిద్వారా చెప్పు చున్నాడు. "సమయోగః" అనగా కాలము బుద్ధి ఇంద్రియముల సరియగు కలయిక. "సుదుర్లభః" అనగా కాలాది సమ్యగ్యోగమునకు అయోగాదులు లేకుండుట యను నది దుర్లభమగుటచేత ఇట్టి స్థితి ఎక్కువ దుర్లభమని చెప్పబడినది. సాధారణముగనే

కాలాదులయందు అయోగాదులలో ఏనో ఒకదానిలో పురుషుడు సంబంధము కలిగి యుండును. అందువలన పురుషులెల్లప్పుడును వ్యాధులతో పీడింపబడుచుందురు. రోగములు అల్పముగా నుండుటవలన వానిని నిర్లక్ష్యము స్వస్థులుగా నున్నారని చెప్పబడునని భావము.

130. నేన్ద్రియాణి న చైవార్థాః సుఖదుఃఖస్య హేతవః,
హేతుస్తు సుఖదుఃఖస్య యోగో దృష్టశ్చతుర్విధః.

131. సతీన్ద్రియాణి సన్త్వర్థా యోగో న చ న చాస్తి రుక్,
న సుఖం, కారణం తస్మాద్యోగ ఏవ చతుర్విధః.

**తాత్పర్యము :** ఇంద్రియములు కాని, ఇంద్రియార్థములు కాని సుఖదుఃఖములకు హేతువులు కావు. వీనికి హేతువు యోగమనునదియే. అది నాల్గు విధములుగా చెప్పబడినది. ఇంద్రియములు ఇంద్రియార్థములు ఉన్నప్పటికీ యోగము లేకుండగ బాధ లేక సుఖము అనునవి ఉండవు. అందువలన నాల్గు విధములగు యోగమే సుఖదుఃఖములకు కారణమగుచున్నది.

**ఆయుర్వేదదీపిక :** ప్రస్తుతము సమ్యగ్యోగమును గ్రహింపవలసినదానిగను (అనుసరింపవలసినదానిగను) అయోగాదులను త్యజింపవలసిన వానిగను చూపుటకు, యోగమనునదియే చతుర్విధమై సుఖదుఃఖ కారణమగుటను చూపుచు, "నేన్ద్రియాణి" అను మొదలగునవి చెప్పుచున్నాడు. నిజమునకు ఇంద్రియములు, అర్థములు సుఖదుఃఖములకు కారణములుగా లభించుచున్నప్పటికీ అవి కారణములెట్లు కావో, ఆ విషయమును "సన్తి" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "యోగో న చ" అనగా ఇన్ద్రియములకు, అర్థములకును సంబంధము లేదని అర్థము. "న సుఖమ్" అనునది ఛేదము. ఇంద్రియములు మరియు అర్థములు అను రెండింటికీ యోగము (సంబంధము) లేకపోవుట సుఖదుఃఖములకు కారణము కాకపోవుటవలన, ఆ రెండింటికీ సంబంధముండుట సుఖదుఃఖములకు కారణమగుట వలనసూ యోగమే అన్వయ వ్యతిరేకములకు కారణమనబడునని భావము. ఇట్టి యోగము ఇంద్రియములు ఇంద్రియార్థములను ఆధారముగ చేసికొని స్పష్టముగా చెప్పబడినది: అందువలన, ప్రజ్ఞ కాలములకును తెలియవలెను. ఈ ఇంద్రియము మరియు అర్థమును (కారణముగా) తీసికొనబడునగుటవలన చతుర్విధములగు యోగమునకు కారణత్వము- యోగములచే త్యజించుట, గ్రహించుట యనునవి యుండునని - చెప్పబడినది.

**132.** నాత్మేన్ద్రియం మనో బుద్ధిం గోచరం కర్మ వా వినా,
సుఖదుఃఖం, యథా యచ్చ బోద్ధవ్యం తత్త్రోచ్యతే.

**తాత్పర్యము :** కర్మ లేకుండగా ఆత్మ వలనగాని, మనస్సు వలనగాని, బుద్ధి వలనగాని సుఖదుఃఖములు గోచరింపవు. దేనిని ఎట్లు తెలిసికొనవలెనో అది అదే విధముగా చెప్పబడుచున్నది.

**ఆయుర్వేదదీపిక :** పరమార్థమున ఆత్మ - ఇంద్రియములు - మనస్సు - బుద్ధి-అర్థము-అదృష్టము (కర్మ) అనునవియే కలిసియుండి సుఖదుఃఖములను కలిగించునని చూపుటకు "నాత్మ" అను మొదలగునవి చెప్పుచున్నాము. ఇంద్రియార్థములు అనునవి గోచరమగు విషయములు. అదృష్టమనగా కర్మ. అచట ఆత్మ లేకుండగ లోష్టాదుల యందు సుఖదుఃఖములు కలుగవు. ఇంద్రియార్థాదులకు సుఖదుఃఖముల యందు కారణత్వము తెలిసియున్నదే. కర్మయును శుభమైనచో సుఖ కారణమును, అశుభమైనచో అసుఖ (దుఃఖ)మునకు కారణమును అగును. ఒకవేళ ఆత్మాదులే కారణమైనచో, అట్టియెడ ఎందువలన కాలాదుల అయోగ అతి యోగాదులు ఇచట చెప్పబడుచున్నవో అను విషయమును "యథా" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "యచ్ బోద్ధవ్యం" అనగా సుఖదుఃఖమును, "యథా బోద్ధవ్యం" అనగా కార్యవశముచేత కల్గును అనునవి అటులనే చెప్పబడుచున్నవి. ఇంకొక విధముగా కాదు అని అర్థము. అందువలన సాత్మ్యాసాత్మ్యములగు ఇంద్రియార్థముల వలన కలుగుచున్నట్లు సుఖదుఃఖములు ఇచట కన్పడుచున్న చికిత్సయందు ఏ యోగ కరములుగా చెప్పబడుచున్నవి. సుఖదుఃఖములు రెండును ఇచట ఆత్మాది జన్యత్వములుగా పేర్కొనబడుట లేదు. ఆత్మాదులు దుఃఖ హేతువులుగా ప్రతిపాదింపబడకయున్ననూ ఇచట హేయతగా ప్రతిపాదింపబడుచున్నది. కాని అసాత్మ్యేన్ద్రియార్థ యోగాములే దుఃఖ హేతువులుగా నుండి త్యజింపబడుచున్నవి. సుఖ హేతువులగు సాత్మ్య ఇంద్రియార్థ యోగాములు మాత్రము తీసికొనబడుచున్నవి అని భావము.

**133.** స్పర్శనేన్ద్రియసంస్పర్శః స్పర్శో మానస ఏవ చ,
ద్వివిధః సుఖదుఃఖానాం వేదనానాం ప్రవర్తకః.

**తాత్పర్యము :** స్పర్శనేంద్రియములను చక్షురాదీంద్రియములకు వాని అర్థములతో స్పర్శ కలుగుట మరియు మనస్సునకు దాని అర్థములతో కలుగు

స్పర్శయును అను ఈ రెండు విధములైనవి సుఖదుఃఖములను కలిగించు వేదనలను ప్రవర్తింపజేయును.

**ఆయుర్వేదదీపిక** : ఇపుడు సకల కారణ వ్యాపకమగు యోగమును వివరించుటకు, ఇంద్రియకము మానసికమును అగు స్పర్శను చూపుటకు "స్పర్శన" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "స్పర్శనేన్ద్రియ సంస్పర్శః" అనగా ఇంద్రియములకు అర్థమువలన సంబంధమును స్పర్శనేంద్రియముద్వారా కలిగినదానిని చూపుచున్నాడు. చక్షురాదులను తమతో సంబంధము కలిగిన అర్థమునే తెలిసి కొనుచున్నవి. ఒకవేళ సంబంధము లేకయే చక్షువు, శ్రోత్రము లేక ఘ్రాణము అర్థమును గ్రహించు నెడల అపుడు అవి వానికి అతి దూరముగా నున్న అర్థములను గ్రహింపవలయును. కాని అట్లు జరుగుటలేదు. అందుచేత స్పర్శచేతనే ఇంద్రియములు అర్థమును ప్రతిపాదించును. మానవ స్పర్శ యనునది చింత్యాది విషయములతో సూక్ష్మముగా నుండనే యున్నది, అందువలననే మనస్సు కొంత విషయమునే చింతించును గాని సర్వమును చింతింపదు. అందుచేత మనస్సుచేత ఏది స్పృశింపబడుచున్నదో దానినే మనస్సు గ్రహించుచుండుట జరుగుచున్నది.

134. ఇచ్ఛాద్వేషాత్మికా తృష్ణా సుఖదుఃఖాత్ ప్రవర్తతే,
తృష్ణా చ సుఖదుఃఖానాం కారణం పునరుచ్యతే.

135. ఉపాదత్తే హి సా భావాన్ వేదనాశ్రయ సంజ్ఞకాన్,
స్పృశ్యతే నానుపాదానే నాస్పృష్టో వేత్తి వేదనా.

**తాత్పర్యము** : ఇచ్ఛాద్వేషరూపమగు ఆశ సుఖదుఃఖములవలన కలుగును. సుఖదుఃఖములకు ఆశయును కారణమని చెప్పబడుచున్నది. ఆశను పొందుటవలననే వేదనలకు కారణమగు హీనమిథ్యాతి యోగములగు భావములను గ్రహించుట జరుగును. గ్రహింప దగిన విషయము లేనపుడు స్పర్శ కలుగనేరదు. స్పర్శలేనిచో బాధలు తెలియవు.

**ఆయుర్వేదదీపిక** : "ఇచ్ఛా" అను మొదలగువాని ద్వారా సుఖదుఃఖముల ఉత్పత్తి క్రమమును చెప్పుచున్నాడు. సుఖము వలన ఇచ్ఛారూపమగు అభిలాష (తృష్ణ) కలుగును. మరియు దుఃఖము వలన ద్వేషరూపమగు అభిలాష కలుగును. ఇట్లుత్పన్నమైన అభిలాష (ఆశలేదా కోర్కె) తనకిష్టమైన విషయము

లందు ప్రవర్తించుచూ ఇష్టము లేనివానియందు నివర్తించుచూ ప్రవృత్తి నివృత్తి విషయమునకు సుఖదుఃఖ హేతుత్వమును అపేక్షించి సుఖదుఃఖములను పుట్టించునని వాక్యార్థము. యనోక్తమగు తృష్ణ (ఆశ) కు సుఖదుఃఖములు హేతువులగుటను చూపుటకు "ఉపాదత్తే హి" అను మొదలగునవి చెప్పుచున్నారు. "వేదనాశ్రయ సంజ్ఞకాన్" అనగా వేదనలకు కారణముగా చెప్పబడిన కాలము మొదలగు వాని యొక్క అయోగాది రూపములు. ఇక సుఖదుఃఖములను తృష్ణయే ఐనచో ఇంద్రి యార్థముల వలన ఇతర కారణమువలన ఏమి? (ఉపయోగము) అనుదానిని "స్పృశ్యతే" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "అనుపాదానే" అనగా విషయములు కనుపించనపుడు స్పర్శ కారణమగు అర్థము లేకుండగ అర్థమునకు స్పర్శ కలుగదు. ఇక అర్థముతో స్పర్శ కలుగదు. అయినచో ఇక ఏమి? స్పర్శ లేని వాడు వేదనలను తెలియజాలడు అని తెలియవలెను. అర్థస్పర్శ లేనివాడు సుఖదుఃఖము ఉత్పన్నము గాకుండుట చేతనే వేదనలను తెలియడని అర్థము.

## వేదనలకు అధిష్ఠానములు

136. వేదనానామధిష్ఠానం మనో దేహశ్చ సేన్ద్రియః,
కేశలోమనఖాగ్రాన్నమలద్రవగుణైర్వినా.

**తాత్పర్యము :** కేశములు, నిడలోమములు, నఖాగ్రములు, అన్నము యొక్క మలము, మూత్రము, శబ్దాది గుణములు తప్ప మిగిలిన ఇంద్రియములతో కూడిన దేహము మరియు మనస్సును వేదనలకు అధిష్ఠానమై యుండును.

**ఆయుర్వేదదీపిక :** "వేదనానాం కిమధిష్ఠానమ్" అను ప్రశ్నకు సమాధానము "వేదనానామ్" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. ఇంద్రియము లతో కూడిన దేహము అనుట వలన నిరింద్రియమైనది, కేశలోమాదికములైన దేహము నిరాకరింపబడినది. అదే విషయమును స్పష్టతకొరకు "కేశలోమ" అను మొదలగువానిద్వారా వివరించుచున్నాడు. లేదా ఇంద్రియములకు ప్రాధాన్యమును తెల్పుటకు వేదనలకు ఆశ్రయములని చేరుగా ఇంద్రియములు అని గ్రహింపబడుట చేత చెప్పబడుచున్నవి. వేదన యనునది దానికాధారమగు ఇంద్రియములం దుండుటయనునది దానిని గూర్చి తెలియుట చేతనే కలుగుచున్నదని తెలియవలెను. ద్రవమనగా మూత్రము. గుణములనగా శబ్దాదులు. శరీరమునందున్న ఈ దోషములు

వేదనలకు ఆధారము గాదనుటకు అనుభవమే ప్రమాణము. గ్రహణీ, మూత్రకృచ్ఛ్రాది రోగములయందు మూత్రపురీషాదుల యందుండు వేదన ఆ మూత్ర పురీషాదుల కాధారమైన శరీర ప్రదేశమునకు సంబంధించినదేయని తెలియవలెను.

## వేదనలు కలుగని స్థితి

137. యోగే మోక్షే చ సర్వాసాం వేదనానామవర్తనమ్,
మోక్షే నివృత్తిర్నిఃశేషా యోగో మోక్ష ప్రవర్తకః.

**తాత్పర్యము :** యోగమునందు మరియు మోక్షస్థితియందును వేదనలన్నియు నివర్తించును. మోక్షమునందు నిశ్శేషముగా పునర్భావము లేకుండా నివృత్తి జరుగును. యోగము మోక్షకారణము.

**ఆయుర్వేదదీపిక :** "క్వ చైతా వేదనాః సర్వా" అను మొదలగు ప్రశ్న యొక్క సమాధానము - "యోగ" అను మొదలగునవి. "యోగః" అనగా "అనారమ్భాత్" అను మొదలగు శ్లోకమున చెప్పబడగలదు. మోక్షమనగా ఆత్యన్తిక శరీరము నుండి విచ్ఛేదనము కలుగుట. "నిఃశేషా" అనగా తిరిగి జన్మించుట జరుగదు. ఇందువలన యోగమునందు నివృత్తి చెందిన వేదన తిరిగి కలుగునని సూచించుచున్నాడు. "మోక్షప్రవర్తకః" అనగా మోక్షకారణము లేదా యోగ మోక్షములు రెండునూ నివర్తకములు అనియును పాఠము. అపుడు ఈ పక్షమున ఒకవేళ యోగ మోక్షముల రెండింటికి ఉన్న వేదనా నివర్తకత్వము "యోగీ మోక్షే చ" అను మొదలైన సగము శ్లోకము వలన చెప్పబడినది. అయినప్పటికీ యోగమోక్షములకు ఇచట వేదనానివృత్తిపట్ల కర్తృత్వము కనిపించుటచేత పునరుక్తి యగుటలేదు.

138. ఆత్మేన్ద్రియమనోర్థానాం సన్నికర్షాత్ ప్రవర్తతే,
సుఖదుఃఖమనారమ్భాదాత్మస్థే మనసి స్థిరే.

139. నివర్తతే తదుభయం వశిత్వం చోపజాయతే,
సశరీరస్య యోగజ్ఞాస్తం యోగమృషయో విదుః.

**తాత్పర్యము :** ఆత్మ, ఇంద్రియములు, మనస్సు, అర్థములు వీనియొక్క సంబంధము వలన సుఖ దుఃఖములు కలుగును. అట్లు సంబంధము లేక మనస్సు

స్థిరముగా ఆత్మజ్ఞానము నందునప్పుడు సుఖదుఃఖములు కలుగవు. అపుడు శరీరముతో కూడిన మనస్సునకు వశిత్వము కలుగును. యోగజ్ఞులగు ఋషులు అట్టి స్థితిని యోగము అందురు.

**ఆయుర్వేదదీపిక :** యోగము వేదనానివర్తక మెట్లగునో మరియు ఏది యోగమో ఆ విషయమును "ఆత్మా" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "అనారమ్భాత్" అనగా విషయములను గ్రహించుటకొరకు మనస్సు ఆరంభింప కుండుట (ప్రవర్తించకుండుట)చేత అని అర్థము. "ఆత్మస్థే మనసి" అనగా విషయములందు నివృత్తిని పొంది కేవలము ఆత్మజ్ఞానమునందే యున్నట్టి అని అర్థము. "స్థిరే" అనగా అచలముగా నున్నట్టి - ఆత్మజ్ఞానమునందు ప్రసక్తమై యున్నట్టి అని అర్థము. "తదుభయమ్" అనగా సుఖదుఃఖములు రెండును అని అర్థము. యోగము నందు యోగముకాక వేరుధర్మమగు వశిత్వము కలుగుటను "వశిత్వమ్" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. వశిత్వమనగా చెప్పబోవుచున్న అష్టవిధమగు ఐశ్వర్యబలము. "సశరీరస్య" అను పదమువలన శరీరముతోడనే వశిత్వము కలుగునని చూపుచున్నాడు.

140. ఆవేశశ్చేతసో జ్ఞానమర్థానాం ఛన్దతః క్రియా,
దృష్టిః శ్రోత్రం స్మృతిః కాన్తిరిష్టతశ్చాప్యదర్శనమ్.

141. ఇత్యష్టవిధమాఖ్యాతం యోగినాం బలమైశ్వరమ్,
శుద్ధసత్త్వ సమాధానాత్తత్ సర్వముపజాయతే.

**తాత్పర్యము :** పరకాయ ప్రవేశము, ఇతరులయొక్క మనస్సును తెలిసికొనుట, క్రియలను ఇష్టప్రకారము చేయుట, అతీంద్రియదృష్టి, అతీంద్రియ శ్రవణము, సర్వతత్వజ్ఞానము, దివ్యకాంతి, ఇష్టమునుసరించి అదృశ్యముగుట ఈ అష్టవిధ బలము యోగులకు కలుగును. ఇట్టివంతయు శుద్ధమై రజస్తమస్సులు లేని మనస్సును సమాధానపరచుటచే (సమాధి స్థితి యందుంచుటచే) కలుగును.

**ఆయుర్వేదదీపిక :** ఆవేశః అనగా పరకాయ ప్రవేశము. "చేతసో జ్ఞానమ్" అనగా ఇతరుల చిత్తమును తెలిసికొనుట. "అర్థానాం ఛన్దతః క్రియా" అనగా విషయములను ఇష్టము వచ్చినట్లు చేయుట. 'స్మృతిః' అనగా సర్వభావ తత్త్వములను స్మరించుట. "కాన్తిః" అనగా అమానుషమగు (మానవులకు సాధారణముగా నుండని) కాంతి. "ఇష్టతశ్చాప్యదర్శనమ్" అనగా ఇష్టము వచ్చినపుడు చూడ

వలసినదే చూడబడదు, ఇష్టము వచ్చినపుడు చూడబడును. లేదా "ఆవేశశ్చేతసః" అనగా పరుల చేతస్సునందు ప్రవేశించుట, జ్ఞానమ్ అనగా అతీత అనాగతమగు సర్వ జ్ఞానము. మిగిలినది పూర్వమువలె తెలియవలెను. "ఐశ్వరమ్" అనగా యోగ ప్రభావము చేత వచ్చిన ఐశ్వర్యము కలుగుట. "శుద్ధసత్త్వసమాధానాత్" అనగా రజస్తమస్సులు లేని మనస్సు ఆత్మయందు లగ్నము చేయుటచేత అని అర్థము.

## అపునర్భవము

142. మోక్షో రజస్తమోఽభావాత్ బలవత్కర్మసంక్షయాత్,
వియోగః సర్వసంయోగైరపునర్భవ ఉచ్యతే.

**తాత్పర్యము :** రజస్సు తమస్సులు లేకపోవుట వలన, బలవంతమగు కర్మ క్షీణించుట వలన సర్వ సంయోగముల నుండి వియోగము కలుగుట వలననూ మోక్షము కలుగును. అది అపునర్భవమనబడును.

**ఆయుర్వేదదీపిక :** ఇక మోక్షమెట్లు కలుగును, ఏది మోక్షము అను విషయమును "మోక్షః" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. బలవత్కర్మసంక్షయాత్ అనగా అవశ్యముగా అనుభవింపవలసిన ఫలము గల కర్మయొక్క క్షయముచేత అని అర్థము. "సర్వసంయోగైః" అనగా అని ఆత్మసంబంధముల నుండి అనగా శరీర బుద్ధి అహంకారాదులనుండి శరీరాది సంబంధము మరల కలుగకుండుట అపునర్భవము.

## ఆత్మజ్ఞానము వలన కలుగు ఫలము

143. సతాముపాసనం సమ్యగసతాం పరివర్జనమ్,
వ్రతచర్యోపవాసాశ్చ నియమాశ్చ పృథగ్విధాః.

144. ధారణం ధర్మశాస్త్రాణాం విజ్ఞానం విజనే రతిః
విషయేష్వరతిర్మోక్షే వ్యవసాయః పరాధృతిః.

145. కర్మణామసమారమ్భః కృతానాం చ పరిక్షయం,
నైష్క్రమ్యమనహఙ్కారః సంయోగే భయదర్శనమ్.

146. మనో బుద్ధిసమాధానమర్థతత్త్వపరీక్షణమ్,
తత్త్వస్మృతేరుపస్థానాత్ సర్వమేతత్ ప్రవర్తతే.

**తాత్పర్యము :** సత్పురుషులను సరిగా సేవించుట, దుష్టులను వర్జించుట, వ్రతోపవాసముల నాచరించుట, వివిధములైన నియమములను కలిగియుండుట: ధర్మ శాస్త్రములను వినుట, విజ్ఞానమును కలిగియుండుట, జనులు లేనిచోట ఉండుటకు ఇష్టపడుట, విషయములందిచ్ఛ లేకుండుట, మోక్షముకొరకు ప్రయత్నించుట, మనో నియమనమును కలిగియుండుట, కర్మలను చేయకుండుట, చేసిన కర్మలు క్షయిం చుట, సంసారమును విడచిపెట్టుటయందు కోరిక, అహంకారము లేకుండుట, పున ర్జన్మయందు భయము, మనస్సు బుద్ధికి సమాధిస్థితి కలుగుట, అస్థిరత్వమును పరీ క్షించుట ఇవి స్థిరమైన ఆత్మజ్ఞానమువలన కలుగును.

**ఆయుర్వేదదీపిక :** ప్రస్తావము వచ్చుటచేత మోక్షోపాయమును "సతామ్" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "పరాధృతిః" అనగా గొప్ప దైన మనో నియమనము. "కర్మణామసమారమ్భః" అనగా రాగల ధర్మాధర్మ సాధ నములను చేయకుండుట. "కృతానాం చ పరిక్షయః" అనగా పూర్వపు జన్మల వలన చేసిన కర్మలయొక్క ఫలమును అనుభవించుటచే అవి క్షీణించుట. "నైష్కర్మ్యమ్" సంసారమును విడచిపెట్టుటయందు కోరిక. "అనహంకారః" అనగా ఇదినాది, నేను చేయుచున్నాను ఈ మొదలగు బుద్ధిని వదలుట "సంయోగే" అనగా ఆత్మ శరీరాదు లతో సంయోగము పొందుటయందు. "మనోబుద్ధి సమాధానమ్" అనగా మనస్సు బుద్ధిలను ఆత్మయందు లీనముచేయుట. "సర్వమేతత్" అనగా "కర్మణామస మారమ్భః" అను మొదలగునవి. ఆత్మాదులకు తత్త్వస్మృతి అనగా ఉన్నదున్నట్లుగా స్మరించుట. అట్టి స్మృతి ఆత్మవలనకాక శరీరాదులచే చేయబడునది. ఈ శరీరాదులు ఆత్మ వ్యతిరేకములు అను మొదలగు స్మరణ రూపమగు స్మృతి. (అట్టి స్మృతి వల ననే పై క్రియలు జరుగును).

147. స్మృతిః సత్సేవనాద్యైశ్చ ధృత్యన్తైరుపజాయతే,
స్మృత్వా స్వభావం భావానాం స్మరన్ దుఃఖాత్ ప్రముచ్యతే.

**తాత్పర్యము :** సత్పురుషులను సేవించుట మొదలగు నియమములవలన మనోనియమము కల్గియుండుట అను దాని ఫలితము వలననూ స్మృతి కలుగును. స్మృతివలన మనుష్యుడు భావములయొక్క స్వభావమును తెలిసికొని దుఃఖము నుండి ముక్తిని పొందును.

**ఆయుర్వేదదీపిక :** ఇక దుఃఖ విమోచనమునకు స్మృతియనునది కారణ మెట్లగునో "స్మృత్వా" అను మొదలగువాని ద్వారా చెప్పనది. "స్వభావమ్" అనగా ప్రతి యొక్క ఆత్మకు సహజముగా నుండు నియమిత రూపము. పరస్పరము భిన్నముగా నుండునట్లు, పరస్పరము ఉపకారము చేసికొననట్లును ఉండు ఆత్మాదుల రూపమును గురువచనము ద్వారా తెలిసికొని ఆ వచనమును స్మరించువాడు ఎట్టి కర్మలయందును ప్రవర్తింపడు. అట్లు ప్రవర్తింపనివాడు ప్రవృత్తివలన కలుగు దుఃఖమును పొందజాలడు అని అర్థము.

## స్మృతి కలుగుటకు కారణములు

148. వక్ష్యన్తే కారణాన్యష్టౌ స్మృతిర్యైరుపజాయతే,
నిమిత్తరూపగ్రహణాత్ సాదృశ్యాత్ సవిపర్యయాత్.

149. సత్త్వానుబన్ధాదభ్యాసాజ్జ్ఞానయోగాత్ పునః శ్రుతాత్,
దృష్టశ్రుతానుభూతానాం స్మరణాత్ స్మృతిరుచ్యతే.

**తాత్పర్యము :** స్మృతి కలుగుటకు గల ఎనిమిది కారణములు చెప్పబడు చున్నవి. నిమిత్తములను చూచుట, సమాన రూపములను చూచుట, సదృశమైన వానిని చూచుట, విపరీతరూపమును చూచుట మనస్సును లగ్నము చేయుట, అభ్యాసము, తత్త్వజ్ఞానము, తిరిగి తిరిగి వినుట వీనివలన స్మృతి కలుగును. చూచినవి, విన్నవి అనుభవించినవి అగు విషయములను స్మరించుట స్మృతియగును.

**ఆయుర్వేదదీపిక :** ఇపుడు స్మృతి ప్రస్తావన వచ్చియుండుటచేత స్మృతికి కారణములను "వక్ష్యన్తే" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. నిమిత్త గ్రహణమనునది కారణములను తెలిసికొనుట, కారణమును చూచియే కార్యమును స్మరించును. రూపగ్రహణమనగా ఆకారమును గ్రహించుట – ఉదా – వనము నందు గవయమును చూచి గోవును స్మరించుట. సాదృశ్యమునకు ఉదాహరణ తండ్రి పోలికలున్న కుమారుని చూచి అతని తండ్రిని స్మరించుట. "సవిపర్యయాత్" అనగా అలిగా వ్యతిరేకముగా నున్నను స్మరణము కలుగుట – ఉదాహరణమునకు అతి కురూపిని చూచి వ్యతిరేకముగా నుండు అతి అందముగానున్న వానిని స్మరించుట. "సత్త్వానుబంధాత్" అనగా మనస్సును నియమముగా నుంచుట స్మరింపవలసిన దానిని స్మరించుట కొరకు అధీనములోనున్న మనస్సుద్వారానే అట్టి స్మర్తవ్య

విషయమును స్మరించును. "అభ్యాసాత్" అనగా అభ్యసించిన విషయమును అభ్యాస బలమువలననే స్మరించును. "జ్ఞానయోగాత్" అనగా తత్త్వజ్ఞానమును కలిగియుండుట వలన; తత్త్వజ్ఞానమును పొందియున్నవాడే ఆ బలమువలన సర్వమును స్మరించును. "పునఃశ్రుతాత్" అనగా విషయమును ఒకసారి వినియున్ననూ, మరచిపోయి తిరిగి కొంత విషయమును వినుటవలన స్మరించును. స్మృతియొక్క కారణమును పేర్కొని, స్మృతియొక్క రూపమును - "దృష్ట" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. దృష్ట మనునది ప్రత్యక్షము యొక్క లక్షణము, శ్రుతము అనునది మాత్రము ఆగమముద్వారా తెలియునది; అందువలన పూర్వ్వమనుభవించియున్నవన్నియు అని తెలియనగును. కొందరు, "స్మరణం స్మృతిరుచ్యతే" అని పఠింతురు. అచటయును అర్థభేదము లేదు.

### తత్త్వజ్ఞానబలము మోక్షమునకు సాధనమగుట

**150.** ఏతత్తదేకమయనం ముక్తైర్మోక్షస్య దర్శితమ్,
తత్త్వస్మృతిబలం, యేన గతా న పునరాగతాః.

**151.** అయనం పునరాఖ్యాతమేతద్యోగస్య యోగిభిః,
సంఖ్యాతధర్మైః సాంఖ్యైశ్చ ముక్తైర్మోక్షస్య చాయనమ్.

**తాత్పర్యము :** తత్త్వజ్ఞానబలమే మోక్షమునకు ఏకైక మార్గమని ముక్తి పొందిన (జీవన్ముక్తిని పొందిన) వారు తెలిసికొనియున్నారు. తత్త్వజ్ఞానముచే మోక్షమును పొందినవారికి పునర్జన్మ లేదు. తత్త్వజ్ఞానము యోగమునకు సాధనమని యోగులచే చెప్పబడినది. మరియు గొప్ప ధర్మము గలిగి, జీవన్ముక్తులైనట్టియు సాంఖ్యులచే ఇది మోక్షమునకు సాధనమని చెప్పబడినది.

**ఆయుర్వేదదీపిక :** ఈ విధముగా స్మృతిని సామాన్యముగా ప్రతిపాదించి తత్త్వస్మృతి మోక్షమునకెట్లు సాధనమగునో చూపుటకు "ఏతత్" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "ఏకమ్ అయనమ్" అనగా మార్గములన్నింటిలో శ్రేష్ఠమైనది అని అర్థము. "ముక్తైః" అనగా జీవన్ముక్తులచేత అని తెలియవలెను. అన్నింటను ముక్తిని పొందిన వారికి శరీరము లేకుండుటవలన వారు చెప్పునది, చూపునది లేకుండుటవలన - (ముక్తులు అనగా జీవన్ముక్తులనియే తెలియవలెను.) "తత్త్వస్మృతిబలమ్" అనగా తత్త్వస్మృతి రూపమగు బలము లేదా తత్త్వస్మృతి

వలన కలుగు బలము — మోక్షసాధన మార్గమునందు తత్త్వస్మృతియందు బల ముండును. 'యేన' అనగా ఎవరివలన ఏ విధముగా అని అర్థము. "గతాః" అనగా మోక్షమును పొందినవారు. "న పునరాగతాః" అనగా ముక్తిని పొందినవారు తిరిగి రారు అని అర్థము.

152. సర్వం కారణవద్దుఃఖమస్వం చానిత్యమేవ చ,
న చాత్మకృతకం తద్ధి తత్రచోత్పద్యతే స్వతా.

153. యావన్నోత్పద్యతే సత్యా బుద్ధిర్నైతదహం యయా,
నైతన్మమేతి విజ్ఞాయ జ్ఞః సర్వమతివర్తతే.

**తాత్పర్యము :** కారణములచేత కలుగు దుఃఖములన్నియు ఆత్మవలన చేయబడినవి కావు. ఇవి అనిత్యముగనే యుండును. ఇట్టి దుఃఖము మమత్వముచే ఉత్పత్తి చేయబడును.

సత్యబుద్ధి ఉత్పత్తి యగునంతవరకు, ఇదంతయు నేను కాదు అను బుద్ధి ఎవరికైనను వచ్చినచో అట్టి సమయమున జ్ఞాని యగువాడు ఇది నాది కాదు, నేను కాదు అని తెలిసికొని అన్ని కారణములను అతిక్రమించును.

**ఆయుర్వేదదీపిక :** ఇపుడు సంక్షేపముగా సంసారహేతువగు అజ్ఞాన మును మరియు మోక్షమునకు హేతువగు సరియగు జ్ఞానమును చూపుటకు — "సర్వమ్" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "సర్వంకారణవత్" అనగా సర్వ మును ఉత్పత్తిచేయు బుద్ధి, అహంకారము, శరీరాదులు. దుఃఖమ్ అనగా దుఃఖకార ణమే. "అస్వమ్" అనగా పరమార్థమున కారణమువలెనే ఆత్మకు వ్యతిరిక్తమగు అంతయు అని అర్థము. "న చాత్మకృతకమ్" అనగా ఉదాసీనమగు ఆత్మవలన చేయబడినది కాదు అని అర్థము. "తత్ర" అనగా కారణవంతమగు బుద్ధి, శరీరము మున్నగు వానియందు "స్వతా" అనగా ఈ బుద్ధి నాది అను మొదలగు రూపమగు మమత్వము. ఇక ఎంతకాలమువరకు ఇట్టి భ్రాంతివలన అట్టి ఉద్దేశ్యము కలుగునని "యావత్" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "సత్యా బుద్ధిః అనగా సరియగు జ్ఞానము. "యయా" అనగా సత్యబుద్ధివలన నేను ఈ బుద్ధి మొద లగునవి కాను కాని నేను వీటికంటె భిన్నమైన వానిని మరియు ఈ బుద్ధ్యాదులు నావి కావు కాని ప్రకృతి యొక్క విస్తారము అని తెలిసికొని. "జ్ఞః" అనగా తత్త్వసాక్షి

త్కారమును పొందినవాడు. సర్వమతివర్తతే అనగా బుద్ధ్యాదులన్నింటిని త్యజించును అని అర్థము.

154. తస్మింశ్చరమసంన్యాసే సమూలాః సర్వవేదనాః,
సంసంజ్ఞాజ్ఞాన విజ్ఞానా నివృత్తిం యాన్త్యశేషతః.

**తాత్పర్యము :** అట్లు సర్వమును త్యజించిన వానికి ఆ స్థితియందు సమూలముగా అన్ని వేదనలు, సంజ్ఞ, జ్ఞానము, విజ్ఞానము ఏమియు మిగులకుండ నివృత్తిని పొందును (నశించును).

**ఆయుర్వేదదీపిక :** "చరమ సంన్యాసే" అనగా తరువాత కలుగబోవు అని కర్మలను త్యజించియున్న స్థితియందు. మొదటనే గురువచనముచేత క్రియా సన్యాసము చేయబడినదియే తరువాత స్వానుభవ విరక్తివలన క్రియలను చేయదు. అభ్యాసముచేత, కలిగిన జ్ఞానమువలన వేరుగా చూచిన భావముల స్వభావమువలన ఏ సర్వ సన్యాసము చేయబడునో అచట సమూలముగా సర్వవేదనలు, జ్ఞానాదులును శరీరము నశించుటవలననే నశించును. "సమూలాః" అనగా కారణములతో కూడి అని అర్థము కారణములు బుద్ధ్యాదులును. సంజ్ఞ యనగా నిర్వికల్పకమగు ఆలోచనము జ్ఞానమనునది సవికల్పకము. విజ్ఞానమనగా బుద్ధివలన ప్రవర్తింపబడునది. లేదా సంజ్ఞయనగా నామోల్లేఖనమువలన కలుగునది, విజ్ఞానము శాస్త్రజ్ఞానము అని అర్థము. తత్త్వజ్ఞానము కూడ మోక్షమును కల్గింపజేసి ఇకపై కారణములు లేనందున అదియును నివర్తింపబడియే జరుగును.

## మోక్ష స్వరూపము

155. అతః పరం బ్రహ్మభూతో భూతాత్మా నోపలభ్యతే,
నిఃసృతః సర్వభావేభ్యః చిహ్నం యస్య న విద్యతే.
జ్ఞానం బ్రహ్మవిదాం చాత్ర నాజ్ఞస్తజ్జ్ఞాతుమర్హతి.

**తాత్పర్యము :** ఇకపై సర్వభావముల నుండి వేరుపడినట్టి లక్షణ రహితుడైనట్టి బ్రహ్మ స్వరూపమును పొందినట్టియు భూతాత్మ కలుగనేరదు. అట్టివానిని బ్రహ్మ జ్ఞానము కలవారు తెలిసికొందురు గాని అజ్ఞానులు దానిని తెలిసికొనజాలరు.

**ఆయుర్వేదదీపిక :** సర్వవిత్ అను మొదలగు ప్రశ్నకు సమాధానము "అతఃపరమ్" అను మొదలగునవి. "బ్రహ్మ భూతః" అనగా ప్రకృత్యాదులు లేనట్టి.

"చిహ్నం యస్య న విద్యతే" అనుట వలన ముక్తి పొందిన ఆత్మకు ప్రాణాపానాది ఆత్మ లక్షణము లేనందున దానిని తెలియజేయు లక్షణములు లేనేలేవని చూపు చున్నాడు. నశింపదు లేదా వేరు రూపమును పొందదు కావున (బ్రహ్మ భూతమగు) ఆత్మ అక్షరమగును. దేనికి లక్షణములు కన్పించవో అది అలక్షణమగును. ఇదే మోక్షమును ఇతరులచే ఎట్లు తెలియబడును అను విషయమును "జ్ఞానమ్" అను మొదలగువాని ద్వారా చూపుచున్నాడు. బ్రహ్మ విదులకే మనస్సు అట్టి విషయముల పైకి తీసికొని పెళ్ళును. అజ్ఞానులకు అనగా అహంకారాది వాసనలచే పీడింపబడు వారికి అట్లుండదని అర్థము.

## అధ్యాయ సంగ్రహము

తత్ర శ్లోకః—

156. ప్రశ్నాః పురుషమాశ్రిత్య త్రయోవింశతిరుత్తమాః,
కతిధాపురుషీయేఽస్మిన్నిర్ణీతా స్తత్త్వదర్శినా.
ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే శారీరస్థానే
కతిధాపురుషీయం శారీరం నామ ప్రథమోఽధ్యాయః.

**తాత్పర్యము :** పురుష సంబంధమైన ఉత్తమమగు ఇరువదిమూడు ప్రశ్నలు ఈ కతిధా పురుషీయాధ్యాయమునందు తత్త్వదర్శియగువానిచే తెలియజేయ బడినవి.

ఇది అగ్నివేశునిచే రచింపబడి చరకునిచే సంస్కరింపబడిన తంత్రమందలి శారీర స్థానములోని కతిధా పురుషీయ శారీరమను ప్రథమాధ్యాయము.

**ఆయుర్వేదదీపిక :** అధ్యాయ సంగ్రహము ఇచట చెప్పబడినది.

ఇది శ్రీ చక్రపాణిదత్తునిచే విరచింపబడిన చరక తాత్పర్యటీకయగు ఆయుర్వేదదీపిక యందలి శారీర స్థానమునందలి కతిధా పురుషీయ శారీరమను ప్రథమాధ్యాయము.

—0—

# ద్వితీయాధ్యాయము

# అతుల్యగోత్రీయ శారీరము

1. అథాతోఽతుల్యగోత్రీయం శారీరం వ్యాఖ్యాస్యామః

**తాత్పర్యము :** ఇక ఇపుడు అతుల్య గోత్రీయమను శారీరమును గురించి వ్యాఖ్యానించుకొందము.

2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః

**తాత్పర్యము :** అని ఆత్రేయ భగవానుడనెను.

**ఆయుర్వేదదీపిక :** క్రిందటి అధ్యాయమునందు ఆధ్యాత్మికమగు మరియు నైష్ఠిక మోక్ష రూపమైన చికిత్సకు ఉపయోగపడునట్టియు శరీరము యొక్క మొదటి ఉత్పత్తిని గూర్చి ఉపదేశింపబడినది. ప్రస్తుతము గర్భము యొక్క ప్రాథమిక ఉత్పత్తి క్రమము విశద పరచుటకు అతుల్యగోత్రీయమను అధ్యాయము పేర్కొనబడుచున్నది.

## శుక్ర విషయకమగు శిష్యుని ప్రశ్న

3. అతుల్యగోత్రస్య రజః క్షయాన్తే
రహోవిసృష్టం మిథునీకృతస్య,
కిం స్యాచ్చతుష్పాత్ప్రభవం చ షడ్భ్యో
యత్ స్త్రీషు గర్భత్వముపైతి పుంసః.

**తాత్పర్యము :** స్త్రీకి రజః ప్రవృత్తి ఆగిపోయిన తరువాత ఆ స్త్రీ యొక్క గోత్రముతో సమానము కాని గోత్రము కలిగిన పురుషుడు ఆ స్త్రీతో మైథునము చేసి రహస్యముగా ఆమె యోనియందు వదలినట్టిదియు, నాలుగు ధాతముల యొక్క గుణములు కలిగినదియు, ఆరు రసముల వలన ఏర్పడినట్టిదియు మరియు స్త్రీల యందు గర్భత్వమును పొందునదియు అయిన ద్రవ్యము ఏమైయుండును.

**ఆయుర్వేదదీపిక :** అతుల్య గోత్రుని యొక్క అనగా స్త్రీ గోత్రముతో సమానము కాని గోత్రము కలిగిన పురుషుని యొక్క అని అర్థము. సమానగోత్రము కలిగిన స్త్రీ పురుషులు సంభోగము చేయుట ధర్మశాస్త్రముల యందు నిషిద్ధముగా చెప్పబడుటచే అట్టి సంభోగము అధర్మమగును. రజః క్షయము యొక్క చివర అనగా రజః ప్రవృత్తి నిలచిన పిదప అని అర్థము. అంతమున అను పదముచే రజః ప్రవృత్తియగు మూడు దినములును సంభోగమునకు నిషిద్ధము.

'రహో విస్పష్టం' అనగా రహస్యముగా విడువబడినట్టి. రహః అని అని నందున శుక్ర స్రావమునకు ప్రతిబంధకమైయున్న లజ్జ యనునది లేకుండుట వల ననే శుక్ర చ్యుతి జరుగుట వలన రహస్యమును శబ్ద ప్రయోగము ఇచట జరిగినది. మిథునీ కృతస్య అనుటచే సరియైన మైథున ప్రయోగమును సూచించుచున్నాడు. అంతియే కాని విపరీతముగా చేయు సురత క్రియలు ఇచ్చట నిషేధింపబడినవి, చతు ష్పాదత్వము, షట్ ప్రభవత్వము తరువాత చెప్పబడును. ఇచ్చట శిష్యుని యొక్క ప్రశ్న రూపములో జ్ఞానము లేని శిష్యుడు ఆచార్యుని సమ్మతికి గాను అడిగినటులనే తెలియవలెను కాని బీజము యొక్క సూక్ష్మత్వము, చతుష్పాదములు, షడ్రసము లను వర్ణించిన శిష్యునకు శుక్ర శబ్దము ఎట్లు తెలియకుండును అని తలంపరాదు.

## ఆత్రేయుని సమాధానము

4. శుక్రం తదస్య ప్రవదన్తి ధీరాః
 యద్దీయతే గర్భసముద్భవాయ,
 వాయ్వగ్ని భూమ్యబ్గుణపాదవత్తత్
 షడ్భ్యో రసేభ్యః ప్రభవశ్చ తస్య.

**తాత్పర్యము :** దానిని ధీమంతులు శుక్రము అని చెప్పుచున్నారు. అది వాయువు, అగ్ని, భూమి, మరియు జలము అనువాని గుణములు కలిగియుండును. దానికి మధురాది ఆరు రసముల నుండి ఉత్పత్తి ఏర్పడుచున్నది.

**ఆయుర్వేదదీపిక :** పై ప్రశ్నకు సమాధానము ఇవ్వబడుచున్నది. దీయత అనగా ఆరోపించబడుట అని అర్థము (నాటబడుట). వాయువు మొదలైనవి శుక్రమునందు పాదాంశముగా నుండునని చెప్పునప్పుడు గుణము అను పదము అధి కముగా చేర్చుచున్నాడు: అందువలన ప్రశస్త గుణములు కలిగిన వాయువు మొద

లైన వాని వలననే విశుద్ధమగు శుక్రము ఉత్పత్తియగునని సూచించుచున్నాడు. పాద శబ్దమును ప్రయోగించుట వలన శుక్రోత్పత్తి యందుండు వాయువు మొదలైనవి ఎల్లెడలను సమానముగా శుక్రోత్పత్తియందు ఉండునని సూచించుచున్నాడు (అనగా శుక్రోత్పత్తియందు వాయువు, అగ్ని, జలము, పృథ్వి అను నాల్గింటి యొక్క ప్రాముఖ్యము సమానముగా నుండునని భావము.) ఆకాశము శుక్రమునందలి పంచ భూతములలో ఉన్నప్పటికి అది పురుష శరీరము నుండి బయలుదేరి గర్భాశయ మున చేరదు. నాలుగు భూతములే అచటికి సక్రియములై చేరును. ఆకాశము అన్ని చోట్లను వ్యాపించి యుండుటచేత గర్భాశయమునందు మొదటి నుండి ఉన్నందువలన అది అచటికి చేరిన శుక్రముతో కలసిపోవును. అందువలన శుక్రముతో కూడి ఆకాశము వెళ్ళనందువలనను, అది గర్భాశయము నందు మొదటినుండి యుండి ఉండుట చేతను అది శుక్రముతో యున్నట్లుగా చెప్పబడలేదు. ఇతర చోట్ల కూడా పంచ భూతములు ఒకచోటనుండి మరియొక చోటికి వెళ్ళుటను ప్రస్తావించునపుడు ఆకాశము వదలి పెట్టబడినది. ఉదాహరణకు :

"భూతైశ్చతుర్భిః సహితః సుసూక్ష్మైర్మనోజవో
దేహముపైతి దేహాత్" అనగా నాలుగు భూతములతో కూడి మనో జవముతో పురుషుడు ఒక దేహము నుండి మరియొక దేహమునకు వెళ్ళును. శుక్రము షడ్రసయుక్తమైన ఆహారము నుండి ఉత్పన్నమైనదగుటవలననే విశుద్ధ మగును. అందుచేత ఆరు రసముల నుండి అను పదము ప్రయోగింపబడినది. మధుర రసము వలన శుక్రము యొక్క అధికోత్పత్తి ఆమ్లాది రసముల వలన శుక్రము యొక్క నాశనమును జరుగుట, ఆయా రసముల యొక్క అధిక సేవన వలననే కలుగునని గ్రహింపవలయును.

## గర్భసంబంధమగు ఐదు ప్రశ్నలు

5. సమ్పూర్ణ దేహస్సమయే సుఖం చ
గర్భః కథం; కేన చ జాయతే స్త్రీ,
గర్భం చిరాద్విన్దతి సప్రజాపి ?
భూత్వాఽథవా నశ్యతి కేన గర్భః ?

**తాత్పర్యము :** గర్భము సంపూర్ణ దేహము గలిగినట్టిదిగా ఎట్లు అగు చున్నది ?

అది నిర్ణీత సమయమునందే ఎట్లు జనించును ?

సుఖముగ ఎట్లు జనించును ?

స్త్రీ వంధ్య కాకపోయినను చిరకాలమునకు గర్భమును ఎట్లు ధరించుచున్నది?

గర్భము ఉత్పత్తి అయిన పిదప నశించుటకు కారణమేమి ?

**ఆయుర్వేదదీపిక :** పై శ్లోకమునందు మొదటి పాదమున సంపూర్ణ దేహము ఎట్లు కలుగును ? తగిన సమయమునందు ఏ విధముగా జనించును ? సుఖముగా ఎట్లు ప్రసవించును ? అని మూడు ప్రశ్నలుగా విభజించుకొనవలెను. సంతానముండి యున్నను అనగా వంధ్య (గొడ్రాలు) కాకపోయినను ఆమె చిరకాలము తరువాత గర్భము ధరించుటకు కారణమేమి ?

## గర్భము నిలచుటకును సుఖ ప్రసవాదులకును కారణములు

6. శుక్రా స్రృగాత్మాశయ కాలసంపత్
యస్యోపచారశ్చ హి తై స్తథాఽన్నైః,
(హితై స్తథాన్నైః) గర్భశ్చ కాలేచ సుఖీ సుఖం చ
సఞ్జాయతే సమ్పరిపూర్ణగర్భః.

## చిరకాలమునకు గర్భమును ధరించుటకు కారణములు

7. యోని ప్రదోషాన్మనసోఽభితాపాత్
శుక్రాస్రృగాహార విహార దోషాత్,
అ కాల యోగాద్బలసంక్షయాచ్చ
గర్భం చిరాద్విన్దతి సప్రజాపి.

## గర్భము నశించు కారణములు

8. అస్రృక్ నిరుద్ధం విబద్ధం పవనేన నార్యాః
గర్భం వ్యవస్య న్త్యబుధాః కదాచిత్,
గర్భస్య రూపం హి కరోతి తస్యాః
తదస్రసమ్రసావి వివర్ధమానమ్.

9. తదగ్ని సూర్యశ్రమ శోకరోగైః
ఉష్ణాన్న పానైరథవా ప్రవృత్తమ్,
దృష్ట్వా సృగేకం న చ గర్భసంజ్ఞం
కే చిన్నరాః భూతహృతం వదన్తి.

10. ఓజోఽశనానాం రజనీచరాణాం
ఆహార హేతోర్న శరీర మిష్టమ్,
గర్భం హరేయుర్యది తేన మాతుః
లబ్ధావకాశా నహరేయురోజః

**తాత్పర్యము :** శుక్రము, ఆర్తవము, ఆత్మ, గర్భాశయము, కాలము ఇవి సరియైన స్థితిలోనుండి గర్భిణికి హితకరమైన ఆహార విహారాది ఉపచారములు చేయుటచే గర్భమునందలి శిశువు పరిపూర్ణ దేహమును పొంది తగు సమయమున సుఖముగా జనించును. ఇంతకు పూర్వము సంతానవతియై యున్నప్పటికిని స్త్రీ యొక్క యోని దూషింపబడి యున్నప్పుడు, మనస్సు కలత చెంది యున్నప్పుడు, పురుషుని యొక్క శుక్రము, స్త్రీ యొక్క ఆర్తవము, ఆహార విహారములు ఇవి దోషపూరితములై యున్నప్పుడు, శుక్రార్తవములు అకాలమున సంయోగము చెందియున్నప్పుడు మరియు బలము క్షీణించియున్నను అట్టి స్త్రీ చిరకాలమునకు గర్భమును ధరించును (ఈ దోషములు ఉన్నపుడు గర్భము ధరింపజాలదు అని అర్థము).

స్త్రీలకు ఆర్తవము వాయువుచే నిరోధింపబడి బయట పడలక లోలోపలనే వృద్ధి చెందుచు గర్భము వలెనే ఉండును. దీనిని చూచి మూర్ఖులు గర్భమనియే భ్రమింతురు. ఇది ఆర్తవము స్రవించుచుండుటవలన వృద్ధి పొంది గర్భమువలె కనుపించును.

అట్టిది అగ్ని, సూర్యతాపము, శ్రమ, దుఃఖము, రోగములు, ఉష్ణగుణము కలిగిన అన్నపానములు, వీని వలన బయలు వెడలగా దీనిని చూచి కొందరు గర్భము భూతములచే హరింపబడినదని చెప్పుదురు.

ఓజస్సును భుజించుచు రాత్రియందు సంచరించు పిశాచములకు ఆహారము కొరకు శరీరము రుచించదు. ఒకవేళ వానికి గర్భమును హరించు అవకాశము వారికి నప్పుడు అవి గర్భిణి యొక్క ఓజస్సును హరించెడివియే కదా (తల్లియును చని పోయి ఉండెడిది కదా) అని భావము.

ఆయుర్వేదదీపిక : పై ఐదు ప్రశ్నలకును సమాధానము ఇవ్వబడుచున్నది. గర్భము నిలుచుటకును సుఖప్రసవాదులకును కారణములు : సంపత్తు అను శబ్దము శుక్రాదులకు ఒక్కొక్కదానికి వర్తించును. శుక్ర, ఆర్తవ, గర్భాశయములు అదుష్టములై యుండుటయే సంపత్తు ఆత్మకు మాత్రము శుక్ర శోణిత సంయోగము పైననే ఆధారపడియుండుటవలన పూర్వజన్మయందు చేసిన శుభ కర్మలే సంపత్తు. కాలమునకు అతి తీక్ష్ణత్వము మొదలగునవి లేకుండుటయే కాల సంపత్తు అగును. ఉపచారము అనగా గర్భిణీ ఉపచారము. తగిన కాలమునందు అనగా (కాలే) తొమ్మిదవ మరియు పదవ మాసమునందు. ఈ స్థానమునందు నాలుగవ అధ్యాయమున "కాలః పునర్నవమస్ మాసముపాదాయాదశమాద్" అని ఈ విషయము చెప్పబడియున్నది. సుఖీ అనగా ఏ వ్యాధి చేతనైనను బాధింపబడనిది అని అర్థము. సుఖం అనగా బాధ లేకుండగ అని అర్థము. అకాలయోగము వలన అనగా ఋతుకాలము దాటిన పిదప పురుషునితో సంయోగము పొందుటవలన, ఋతుకాలమనునది పదహారు రాత్రులు ఉండును. హారీత సంహితయందు చెప్పినట్లు పదునారు రాత్రులు ఋతుకాలము ఉండును. సుశ్రుతమునందు మాత్రము ఋతుకాలము పండ్రెండు రాత్రులుగా చెప్పబడినది. "అసృక్" ఈ మొదలగు వానిద్వారా గర్భము ఏర్పడి ఎట్లు నశించును అను ప్రశ్నకు సమాధానము ఇవ్వబడుచున్నది. వాతము వలన అనగా దూషింపబడిన వాతము వలన అని అర్థము. ఆర్తవము నిరోధింపబడుటవలన గర్భము అను భ్రమ కలుగును అని గర్భస్వరూపమ్ అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. గర్భాశయమునందే పెరుగుచున్న ఆర్తవము వన ప్రభావముచేత గర్భ లక్షణములను కొన్నింటిని చూపును అని అర్థము. "అసృగేకం" అనగా ఆర్తవము మాత్రమే. నచగర్భసంజ్ఞం అనగా గ్రంధి మొదలగువాని రూపమున నుండు గర్భము కాదని అర్థము. ఓజశనానాం అను మొదలగు వానిద్వారా భూతములచేత ("పిశాచాదులచేత") గర్భము ఎట్లు తీసుకొనబడదో (నశింపచేయబడదో) దానికి కారణమును చెప్పుచున్నాడు. అష్టబిందాత్మకమైన ఓజస్సును తినువానిని ఓజోశనములు అందురు. ఒకవేళ వాటికి ఆహారము కానటువంటి గర్భమును పిశాచములు హరించునపుడు అవి తమకు ఆహారమైనటువంటి తల్లి యొక్క ఓజస్సును అవకాశము వచ్చియున్నందున హరించియుండును. (అట్టి తరి ఓజో నాశనమువలన ప్రాణనష్టము సంభవించును. కాబట్టి తల్లియును మరణించవలయును కదా). అవకాశమును పొందిన అనగా గర్భిణీయందు ప్రవేశించి (ఓజస్సును హరించుటకు అవకాశము పొందిన) అని అర్థము.

## స్త్రీ, పురుషుడు, కవలలు మొదలగునవి కలుగుటకు కారణములను గురించిన ఎనిమిది ప్రశ్నలు

11. కన్యాం సుతం వా సహితౌ పృథగ్వా
సుతౌ సుతే వా తనయాన్ బహూన్వా,
కస్మాత్ప్రసూతే సు చిరేణ గర్భం,
ఏకోఽభి వృద్ధిం చ యమేఽభ్యుపైతి.

**తాత్పర్యము :** ఆడ శిశువు జనించుటకు కారణమేమి ?

మగశిశువు ఎందువలన జనించును ?

ఆడ మగ ఒకేసారి ఎందువలన జనింతురు ?

ఇద్దరు మగశిశువులు ఒకేసారికాని ఇద్దరు ఆడ శిశువులు ఒకేసారి కాని కవలలుగా ఎందువలన జనింతురు ?

చాలామంది ఒకేసారి జనించుటకు కారణమేమి ?

గర్భము చిరకాలమునకు ప్రసవించుటకు కారణమేమి ?

ఇద్దరు శిశువులున్న గర్భమునందు ఒకే శిశువు వృద్ధిపొందుటకు కారణమేమి ?

**ఆయుర్వేదదీపిక :** కన్యాం ఇః మొదలగు శ్లోకములందు ఎనిమిది ప్రశ్నలు కలవు. కన్యకను వేరుగా ఎట్లు ప్రసవించును? అనునది మొదటి ప్రశ్న- అట్లే పుత్రుడును వేరుగా ఎట్లు కలుగును? అనునది రెండవ ప్రశ్న. పుత్రిక, పుత్రుడు కలసి ఎట్లు జనింతురు ? అనునది మూడవ ప్రశ్న. ఇద్దరు పుత్రులు ఎట్లు కలుగుదురు? అనుట నాలుగవ ప్రశ్న. ఇద్దరు పుత్రికలను ఎట్లు ప్రసవించును ? అనుట ఐదవ ప్రశ్న. ఎక్కువమంది 'పుత్రులు ఎట్లు కల్గుదురు? అనునది ఆరవ ప్రశ్న. స్త్రీ ఎక్కువ కాలమునకు ఏల ప్రసవించును ? అనునది ఏడవ ప్రశ్న. యమల గర్భమునందు ఒకే శిశువు వృద్ధి పొందుటకు కారణ మేమి ? అనుట ఎనిమిదవ ప్రశ్న.

## స్త్రీ పురుష యమళాది శిశుజనన కారణములు

## (పై ఎనిమిది ప్రశ్నలకును సమాధానములు)

12. రక్తేన కన్యామధికేన పుత్రం శుక్రేణ తేన ద్వివిధీ కృతేన,
బీజేన కన్యాం చ సుతం చ సూతే, యథా స్వ బీజాన్యతరాధికేన.

13. శుక్రాధికం ద్వైధముపైతి బీజం యస్యాస్సుతౌ సా సహితౌ ప్రసూతే,
రక్తాధికం వా యది భేదమేతి ద్విధా సుతే సా సహితే ప్రసూతే.

14. భినత్తి యావద్బహుధా ప్రసన్నః శుక్రార్తవం వాయురతి ప్రవృద్ధః
తావన్త్యపత్యాని యథావిభాగం కర్మాత్మకాన్యస్వవశాత్ ప్రసూతే.

15. ఆహార మాప్నోతి యదా న గర్భః శోషం సమాప్నోతి పరిస్రుతం వా
తం స్త్రీ ప్రసూతే సుచిరేణ గర్భం పుష్టోయదా వర్షగణైరపి స్యాత్

16. కర్మాత్మకత్వాద్ విషమాంశ భేదాత్ శుక్రాసృజోః వృద్ధిముపైతి కుక్షౌ
ఏకోఽధికో న్యూనతరో ద్వితీయః ఏవం యమేప్యభ్యధికో విశేషః.

**తాత్పర్యము :** శుక్రశోణిత సంయోగమున శోణిత మధికముగా నున్నచో కన్యకయు, శుక్రము అధికముగా నున్న పుత్రుడు జనించును అట్టి శుక్ర శోణితములు కలసి రెండుగా విభజింపబడి గర్భాశయమున నున్నచో జంట బిడ్డలు ఒకే గర్భమున కలిగెదరు. ఆ రెండు భాగములలో రక్తమధికముగా నుండునది స్త్రీ శిశువును, శుక్రమధికముగా నుండునది పురుష శిశువునై కవలలుగా జనింతురు. మరియు శుక్రశోణితములు కలసి రెండుగా విభాగము నొందునపుడు ఆ రెండు భాగములయందును శుక్ర మధికముగా నున్నచో రెండును పురుష శిశువులుగను, రక్త మధికముగా నున్నచో రెండును స్త్రీ శిశువులుగను సమకాలమున జనింతురు.

ప్రవృద్ధమైన వాతముచే అనేకముగా విభజింపబడిన శుక్రశోణిత సంయోగము వలన ఒకేసారి ఎక్కువమంది పుత్రులు లేదా పుత్రికలు కలుగుదురు. ఇట్లు సంతానము కలుగుట కర్మవశము ననుసరించి జరుగును.

గర్భమునకు ఆహారము సరిగా అందనపుడు గర్భము పీడించును లేదా స్రవించును. అట్టి గర్భము (స్రవించకున్న యెడల) తగిన పోషణ లభించినపుడు కొన్ని సంవత్సరముల తరువాత అయినను స్త్రీ ప్రసవించును.

శుక్ర శోణితముల పూర్వజన్మ కర్మ వలన వాని యొక్క విషమాంశ భేదము వలన కుక్షియందు రెండుగా విభజింపబడినపుడు అందలి ఒక భాగము అధికముగా వృద్ధిచెంది రెండవది తక్కువగా వృద్ధి చెందుట జరుగును. ఇది కవలలలో ఒక శిశు వును అధికముగా వృద్ధి చెంది రెండవ శిశువు స్వల్పముగా నుండుటను చూచుట ద్వారా గ్రహింపగలము.

ఆయుర్వేదదీపిక : పై ఎనిమిది ప్రశ్నలకును సమాధానము చెప్పబడు చున్నది. అధికముగా అను పదము శుక్రము, ఆర్తవముల రెండింటికిని వర్తించును. రెండుగా చేయుటచేత అనగా రెండు ఖండములుగా చేయుటచేత ఆయా బీజము యొక్క ఆధిక్యతను బట్టి ఆ బీజము వలన పుత్రుడు లేదా పుత్రిక జనించును. అందుచే రెండుగా విభజింపబడినచోట ఒక భాగమునందు రక్తము అధికముగా నుండి ఇంకొక భాగము శుక్రాధిక్యత కలిగి యున్నపుడు ఒక కన్యకయు, ఒక పుత్రు డును ఒకేమారు కలుగుదురు అని చెప్పబడెను. బీజము ఎక్కువగా విభజింపబడి నపుడు అనగా ఎక్కువ సంఖ్యలో విభజింపబడినపుడు (నాలుగు, ఐదు మొద లుగా గల) అని అర్థము. ప్రసన్న మనగా శుక్రార్తవములు వాయువుతో సంబంధ మేర్పడినపుడు. యథా విభాగము అనగా ఏ విధముగా శుక్రశోణితముల యందు విభాగ మేర్పడునో అట్లే పుత్రికలు, పుత్రులును స్వబీజముల ఆధిక్యము చేత కలుగుదురని అర్థము. కర్మాత్మకములనగా కర్మ ప్రధానములుగా గలవి. అస్వవ శాత్ అనునది కర్మ పరాధీనమై యుండుటను సూచించును. ఆహారము మొదలగు వానియందు గర్భిణికి ఆహారము లభించునపుడు గర్భమునకును ఆహారము లభించు నని సూచింపబడినది. శుక్రార్తవములకు స్త్రీల యొక్క దోషములగు విషమాంశ భేదములు ఏర్పడుట కలుగబోవు గర్భము యొక్క కర్మవశము చేతనే జరుగునని "కర్మాత్మకత్వాత్" అను పదముద్వారా తెలియచేయబడినది.

## ఎనిమిది విధములైన నపుంసక భేదములు

17. కస్మాద్ద్విరేతాః పవనేన్ద్రియో వా
సంస్కారవాహీ నరనారిషణ్డౌ,
వక్రీ తథేర్ష్యాభిరతిః కథం వా
సంజాయతే వాతికషణ్డకో వా.

**తాత్పర్యము :** ద్విరేతస్కుడు, పవనేంద్రియుడు, సంస్కారవాహి, నరషండుడు, నారీషండుడు, వక్రీ, ఈర్ష్యాభిరతుడు, వాతికషండుడు అను ఎనిమిది మంది నపుంసకులు ఏ కారణముచేత జనింతురు.

**ఆయుర్వేదదీపిక :** ఇచ్చట ఎనిమిది ప్రశ్నలు ఉన్నవి. నరనారిషండౌ అను పదమునందు నరషండుడు మరియు నారీషండుడు అని ఇద్దరుగా గుర్తించవలెను.

18. బీజాత్ సమాంశాదుపతప్త బీజాత్ స్త్రీపుంసలిఙ్గీభవతిద్విరేతాః
శుక్రాశయం గర్భగతస్య హత్వా కరోతి వాయుః పవనేన్ద్రియత్వమ్.

19. శుక్రాశయ ద్వార విఘట్టనేన సంస్కారవాహం కురుతేఽనిలశ్చ
మన్దాల్ప బీజావ బలావహర్షౌ క్లీబౌచ హేతుర్వికృతి ద్వయస్య.

20. మాతుర్వ్యవాయప్రతిఘేన వక్రీ స్యాద్బీజ దౌర్బల్యతయాపితుశ్చ
ఈర్ష్యాభిభూతావపి మన్దహర్షౌ పీర్ష్యారతేపేవ వాదన్తి హేతుమ్.

21. వాయ్వగ్నిదోషాద్వృషణౌతు యశ్య నాశం గతౌ వాతికషణ్డకః సః
ఇత్యేవమష్టౌ వికృతిప్రకారాః కర్మాత్మకానాముపలక్షణీయాః.

## పై సంశయములకు సమాధానము

**తాత్పర్యము :** శుక్ర శోణితములు రెండును సమానములుగా నుండుట వలన బీజమునందలి బీజభాగము దూషింపబడియుండుటవలనను. స్త్రీ పురుష లక్షణములు రెండును సమానముగా గల ద్విరేతస్కుడు అను షండుడు జనించును.

గర్భము నందుగల శిశువుయొక్క శుక్రాశయము వాతముచే నశింపచేయబడినపుడు, పవనేంద్రియత్వము కలుగును.

గర్భమునందలి శిశువుయొక్క శుక్రాశయ ద్వారమును వాయువు త్రొక్కిపెట్టి నిరోధము కలిగించినపుడు సంస్కారవాహి జనించును.

పురుషునియొక్క బీజము అల్పబలము కలిగినపుడు నరషండుడు, స్త్రీయొక్క బీజము అల్పబలము కలిగియున్నపుడు నారీషండుడును ఉద్భవింతురు.

మైధున సమయమున స్త్రీ మైథునమును వ్యతిరేకించుటచేతను తండ్రియొక్క బీజము దుర్బలముగా నుండుటచేతను వక్రీయనువాడు జన్మించును.

ఈర్ష్యచే ప్రేరేపింపబడి ఇతరుల రాసక్రీడలు చూచి ఉద్రేకితులై స్వయముగా ఉత్సాహము లేని స్త్రీ పురుషుల మైథునమువలన కలిగినవాడు ఈర్ష్యాభిరతుడనబడును.

గర్భస్థ శిశువుయొక్క వృషణములను వాయువు అగ్ని దూషించుటచే అవి నశింపబడి శిశువు వాతికషండుడగును. ఇట్లు ఈ ఎనిమిది వికృతి భేదములును పూర్వ కర్మ వాసనచేతనే కలుగునని చెప్పనగును.

**ఆయుర్వేదదీపిక :** బీజాత్ అనగా శుక్ర శోణితముల వలన అని అర్థము. ఉపతప్త బీజాత్ అనగా బీజములను జనింపజేయు బీజభాగము కొంచెముగా దూషింపబడుటచేత. స్త్రీ పురుష లక్షణములు కలవాడు అనగా స్త్రీ పురుషులకు సాధారణముగా నుండు ముక్కు చెవులు మొదలగు లక్షణములు కలవాడు. మరియు స్త్రీ పురుషులకు అసాధారణమైన ఉపస్థ, మేఢ్రము, స్తనములు మీసములు మొదలైనవి లేనివాడు అని అర్థము.

అసాధారణ లక్షణములు శుక్రము లేదా శోణితము అధికముగా నున్నపుడు ఆ యా అధిక్యతను బట్టి కలుగునవి. ఇచట రెండును సమానములుగా నుండుటచేత ఉపస్థ, మేఢ్రము మొదలైన విశేష లక్షణములు ఉండవని తెలియుచున్నది. స్త్రీత్వము, పురుషత్వము ఈ రెండింటిని కలిగించు బీజములు కలుగుటచే ద్విరేతస్కుడు అని ఒక అర్థము. లేదా స్త్రీ పురుష లక్షణములు కలవాడు అనగా మేఢ్రము ఉపస్థ ఈ రెండును కలిగియు ముందు ముందు కలుగు స్తనములు, శ్మశ్రువులు ఇతనికి ఉండవు. ఈ పక్షమునందు బీజోపతాపముచేత ముందు కలుగు స్తనాదులకు ప్రతిబంధకము చేయబడును. కాని ఉపస్థ, మేఢ్రముల ప్రతిబంధకము కాదు. ఇట్టిది కర్మవాసనచేతనే అని చెప్పెదరు. లేదా ఉపస్థ మేఢ్రము ఈ రెండును బలము కలవి అందువలన గర్భకాలమునందె సృష్టి యగును. స్తనములు మొదలైనవి ఉత్తరకాలమునందు

జనించును కాన అవి దుర్బలముగా నుండును. దుర్బలమైన బీజము, ఉపతాపముచే బలవంతములైన ఉపస్థ, మరియు మేఢ్రములకు బాధ వుండదు, కాని స్తనాదులు మాత్రము దుర్బలమైనవి గానే యుండును, అని తెలియవలెను.

శుక్రాశయం ఈ మొదలగువానిద్వారా పవనేంద్రియుడను వానిని వివరించు చున్నాడు. శుక్రాశయమనగా శుక్రస్థానము. పవనేంద్రియత్వము అనగా శుక్రమును ఇంద్రియము అని పిలిచెదరు. ఇచట శుక్రమునకు బదులు వాయువు ఉండుటచేత సంభోగకాలమున శుక్రమువలె వాయువు ప్రవర్తించును. ఇట్టివానికి సంభోగము నందు మేఢ్రము ద్వారా వాయుప్రవర్తనయే జరుగునని అర్థము, శుక్రాశయద్వారా ఈ మొదలగునవి సంస్కారవాహిని కూర్చిన వివరణము. ద్వారవిఘట్టనేన అనగా శుక్రాశయ ద్వారము (వాయువుద్వారా) విఘట్టనము చేయబడుటచేత. సంస్కారము వలన అనగా వస్తి, వాజీకరణము మొదలగు సంస్కారములచేత ఎవనికి శుక్రాశయ ద్వారమునందలి దోషములు తొలగిపోవునో అతడు సంస్కారవాహిషండుడుగా చెప్పబడెను. ఇచ్చట సుశ్రుతునిచే చెప్పబడిన ఆసేక్య, కుంభీక, సౌగంధిక అను నపుంసకులు సంస్కారవాహి నపుంసకునిలోనె చేరినవారుగా గ్రహింపవలయును. ఏల యన వారును సంస్కార విశేషముచేతనె శుక్రమును త్యజింతురు. ఈ విషయమునే సుశ్రుతమునందు ఈ విధముగా వివరించబడినది.

"పిత్రోరత్యల్ప వీర్యత్వాదాసేక్యః పురుషోభవేత్.
స శుక్రం ప్రాశ్య లభతే ధ్వజోచ్ఛ్రాయ మసంశయం.
యః పూతి యోన్యాం జాయేత స సౌగంధిక సంజ్ఞకః
స యోని శేఫసౌగంధమాఘ్రాయ లభతే బలం.
స్వే గుదేఒబ్రహ్మచర్యాద్యః స్త్రీషు పుంవత్ ప్రవర్తతే,
కుంభీకః స తు విజ్ఞేయః" ............ సు. శా. అ. 2

తండ్రి యొక్క వీర్యము అల్పముగా నుండుటచే ఆశేక్య నపుంసకుడు జనించును. అట్టివాడు ఇతరుల శుక్రమును త్రాగి స్వమేఢ్రోత్థానము పొందును. యోని దోషము (పూతియోని) గల స్త్రీకి జనించినవాడు సౌగంధికనపుంసకుడన బడును అట్టివాడు భగలింగము యొక్క వాసనను ఆఘ్రాణించి లింగోత్థానము పొందును. తన గుదమునందు మైథునము చేయించుకొని తరువాత లింగోత్థానము పొందువానిని కుంభీక నపుంసుకుడు అందురు. (సు. శా. అ. 2). మంద ఈ

మొదలగువాని ద్వారా నరనారీ షండులను ఇరుపురిని గూర్చి చెప్పుచున్నాడు. ఎవరు మందవేగులై అల్ప బీజము కలవారయ్యును ఉందురో వారిరుపును. అటులనే బలము లేని వారిరుపురు అనగా ప్రాకృతికమైన బలములేని వారిరుపురుసు. అహర్షా అనగా ఉత్సాహము లేనివారిరుపురు. క్లీబౌ అనగా దూషింపబడు బీజముకల ఆ ఇద్దరు. ఇచ్చట చెప్పబడిన గుణములు కలిగిన స్త్రీ, స్త్రీ షండునకు ఇవే గుణములు కల పురుషుడు, పురుష షండునకు కారణమని తెలియవలెను. వీరరుపురకును శుక్రమే యుండదు. ఈ విషయమున శుక్రము లేనివాడే షండుడు అని సుశ్రుతుడు చెప్పెను.

"అశుక్ర స్త్వేవ షండకః" సు. శా. అ. 2

"మాతుర్వ్యవాయ ప్రతిఘేన" అనగా మైధున కాలమునందు స్త్రీ ఆ కార్యమునందు ఇష్టములేక లేదా అంగములను విషమముగా ఉంచుట వలన (తల్లిని బలాత్కరించినందు వలన) శుక్రము ఒక పద్ధతి ప్రకారము గర్భాశయ మును చేరక పోవుటచే వక్రి అనువాడు జనించును. తండ్రి యొక్క బీజము దౌర్బల్యముగా నుండుటచేతను గర్భమునందలి శిశువు వక్రియగునని తెలియ వలెను. ఇచట దుర్బలుని యొక్క కర్మము దౌర్బల్యము అని తెలియవలెను. దాని భావము దౌర్బల్యము. అందువలన తండ్రి బీజము యొక్క దుర్బలమైన క్రియ చేత అని అర్థము. ఈర్ష్యారతి అనువాడు ఇతరుల వ్యవాయము చూచి లింగోత్థానము పొంది మైధునము చేయు శక్తి కలవాడగును. ఈ విషయము సుశ్రుతమునందు "దృష్ట్వా వ్యవాయ మన్యేషాం వ్యవాయే యః ప్రవర్తతే, ఈర్ష్యకః స తు విజ్ఞేయః" (సు.శా. అ. 2) అని చెప్పబడినది.

కర్మాత్మకానాం అను పదము వలన ఈ పై చెప్పిన నపుంసక భేదములు సాధారణముగా పూర్వజన్మ కర్మబలము చేతనే కలుగుచున్నవని చూపుతున్నాడు.

## గర్భసంబంధమగు ఐదు ప్రశ్నలు

22. గర్భస్య సద్యోఽనుగతస్య కుక్షౌ
స్త్రీ పుంనపుంసాముదరస్థితానామ్
కి లక్షణమ్ ? కారణ మిష్యతే కిం
సరూపతాం యేన చ యాత్యపత్యమ్.

**తాత్పర్యము :** 1. కుక్షియందు గర్భము ధరించిన వెంటనే ఆ స్త్రీకి కలుగు లక్షణములేవి ?

2. ఉదరమునందున్న స్త్రీ శిశువుయొక్క లక్షణములేవి ?

3. ఉదరమునందున్న పురుష శిశువు యొక్క లక్షణములేవి ?

4. ఉదరమునందున్న నపుంసకుని లక్షణము లేవి ?

5. గర్భస్థ శిశువునకు సాదృశ్యము లేదా సారూప్యము ఏ కారణము వలన కలుగును ?

**ఆయుర్వేదదీపిక** : ఇచ్చట అయిదు ప్రశ్నలు కలవు. "సద్యోఽను గతస్య" అనగా గర్భమును గ్రహించిన వెనువెంటనే అని అర్థము.

కారణము ఈ మొదలగునవి. కారణమేమి అనగా ఏ కారణము వలన సరూపతాం (సంతానము యొక్క సాదృశ్యము) గర్భము పొందును అని అర్థము. ఇదియును అయిదవ ప్రశ్న.

23. నిష్ఠీవికా గౌరవమఙ్గసాద స్తన్ద్రా ప్రహర్షో హృదయే వ్యథా చ
తృప్తిశ్చ బీజగ్రహణం చ యోన్యాం గర్భస్య సద్యోఽను గతస్య లిఙ్గమ్.

24. సవ్యాఙ్గ చేష్టా పురుషార్థినీ స్త్రీ స్వప్నపానాశనశీల చేష్టా,
సవ్యాత్త గర్భా న చ వృత్తగర్భా సవ్యప్రదుగ్ధా స్త్రియమేవ సూతే.

25. పుత్రం త్వతో లిఙ్గవిపర్యయేణ వ్యామిశ్రలిఙ్గా ప్రకృతిం తృతీయామ్.
గర్భోపపత్తౌతు మనః స్త్రియా యం జన్తుం వ్రజేత్ తత్సదృశం ప్రసూతే.

26. గర్భస్య చత్వారి చతుర్విధాని భూతాని మాతాపితృసంభవాని,
ఆహార జాన్యాత్మకృతాని చైవ సర్వస్య సర్వాణి భవన్తి దేహే.

27. తేషాం విశేషాద్బలవన్తి యాని భవన్తి మాతాపితృ కర్మజాని
తాని వ్యవస్యేత్ సదృశత్వహేతుం సత్త్వం యథానూకమపి వ్యవస్యేత్.

## సద్యోగ్రహీత గర్భ లక్షణములు

**తాత్పర్యము** : నోటి వెంట నీరుకారుట, శరీరము బరువుగా వుండుట, అంగములయందు ఒక విధమైన బాధ, కునికిపాటు, గగుర్పాటు, హృదయమునందు వ్యథ, తృప్తి, యోని శుక్రమును గ్రహించుట ఇవి అన్నియు గర్భమును గ్రహించిన వెనువెంటనే కలుగు లక్షణములు.

## స్త్రీ శిశువు గర్భము నందున్నపుడు కల్గు లక్షణములు

ఎడమ పార్శ్వమునందలి అవయవములచే పనులుచేయుట, పురుష శిశువును కోరుట, స్త్రీ సంబంధమైన స్వప్నములు, అన్నపానములు, స్వభావము, చేష్టలు వీనిని కలిగియుండుట, గర్భము కుక్షియందు ఎడమ పార్శ్వమున నుండుట. గర్భము పొడవుగా నుండుట. వామ స్తనమునందు ముందుగా దుగ్ధము వచ్చుట. ఇట్టి లక్షణములు గల స్త్రీకి స్త్రీ శిశువే కల్గును.

## పురుష శిశువు గర్భమునందున్నపుడు కల్గు లక్షణములు

పై చెప్పిన లక్షణములకు వ్యతిరేకమైన లక్షణములు కలిగిన గర్భిణికి పురుష శిశువు కలుగును. అనగా కుడి పార్శ్వమునందలి అవయవములచే పనులు చేయుట, స్త్రీ శిశువును కోరుట, పురుష సంబంధమైన స్వప్నములు, అన్నపానములు, స్వభావము, చేష్టలు వీనిని కలిగియుండుట, గర్భము కుక్షియందు కుడిపార్శ్వమున నుండుట. గర్భము వృత్తాకారముగా నుండుట, దక్షిణ స్తనమునందు ముందుగా దుగ్ధము వచ్చుట అను లక్షణములున్న గర్భిణికి మగశిశువే కలుగును.

## నంపుంసక శిశువు గర్భము నందున్నపుడు కల్గు లక్షణములు

ఈ పై రెండు విధములైన లక్షణములు మిశ్రీభూతమై ఉన్నచో అనగా రెండు ప్రక్కలయందున్న అవయవములతో సమానముగా పనులుచేయుట మొదలగు మిశ్రమ లక్షణములున్నపుడు నపుంసక శిశువు కల్గును.

## గర్భస్థ శిశువునకు సాదృశ్యము కలుగుటకు కారణము

గర్భోత్పత్తి సమయమున స్త్రీలకు ఎవరియందు మనస్సు లగ్నమైయుండునో వారి స్వరూపము గర్భమునకు కలుగును. గర్భమునకు నాలుగు భూతములతోను, తల్లిదండ్రులకు కలుగు భావములతోను, తల్లి యొక్క ఆహారముతోను, ఆత్మ యొక్క శుభాశుభ కర్మలతోను సంబంధముండును. వానిలో ఏ భావము బలమైయుండునో అట్టివి గర్భముయొక్క ఆకారమును రూపొందించుటలో కారణములగును. మనస్సు ఆత్మతోను నాలుగు భూతములతోను కలసి ఒక శరీరము నుండి వేరొక శరీరమునకు వచ్చుచున్నందున ఆ మనస్సుయొక్క పూర్వజన్మ వాసన కూడా ఇందుకు కారణమని తెలియవలెను.

ఆయుర్వేదదీపిక : "బీజగ్రహణం" అనగా యోని లోపలికి ప్రవేశించిన శుక్రము తిరిగి వెనుకకు స్రవించకుండుట అని అర్థము. "స్త్రీ స్వప్న" ఈ మొదలగునవి స్త్రీలకు సంబంధించిన కలలు, పానము, ఆహారము, గుణములు, చేష్టలు. "సవ్యాత్తేఽగర్భా" అనునది ఎడమ పార్శ్వముచేత గ్రహింపబడిన గర్భము ఎవరికి ఉండునో అట్టి స్త్రీ లేదా సవ్యాంగ గర్భ అను పాఠమును గ్రహించవచ్చును. "న చ వృత్త గర్భా" అనగా పొడవైన గర్భము అని అర్థము. "సవ్య ప్రదుగ్ధా" అనునది వామస్తనమునందు ఎక్కువగా దుగ్ధమును కలిగిన స్త్రీ. "వ్యామిశ్ర లింగా" కలిసియున్న లక్షణములు కల స్త్రీ, అను దానిని "సవ్యదక్షిణాంగ చేష్టా" అనగా ఎడమ కుడి అంగములతో సమానముగా పనిచేయునది. ఈ మొదలగువానిద్వారా తెలియవలెను, "ప్రకృతీం తృతీయాం" అనగా నపుంసకుని "గర్భోపపత్తౌ" ఈ మొదలగు వానిద్వారా పోలికకు కారణము చెప్పుచున్నాడు. గర్భోపపత్తౌ — బీజగ్రహణ కాలమునందు "మనోయం జన్తుమ్ వ్రజేత్" అనగా ఏ ప్రాణిని మనస్సున ధ్యానించునో ఇట్టి బీజగ్రహణ కాలమునందలి మనోధ్యానము స్వభావముచేతనే చింతించుచున్నదానికి సాదృశ్యమగు సంతానమునే కలుగ చేయునని తెలియవలెను. లేదా (మరియొక అర్థము) ఆ సమయమునందు కలుగు చింతవలననే చింతించుచున్న ప్రాణికి సాదృశ్యమగు రూపమును కలిగింపచేయు శక్తి బీజమునకు కలుగును. మానసికమైనటువంటి భావములకును భూత విశేషములను రూపొందించుటలో శక్తి కలదని చూచుచేయున్నాము. సంకల్పము మాత్రమే శుక్రచ్యుతిని కలుగజేయును. అటులనే దౌహృదికి ప్రాప్తించని విషయములపై చింతించుచున్నచో గర్భమునకు వికృతి కలుగును. ఈర్ష్య, భయము మొదలగువానికి ఓజస్సు శుక్రములను క్షయింపచేయు శక్తికలదు. ఇదియే సాదృశ్య కారణమును దృష్టిలో నుంచుకొని తిరిగి చెప్పవలసియుండును. ఎట్లనగా శారీర స్థానమునందలి ఎనిమిదవ అధ్యాయమునందు చెప్పబడినట్లు "య య యథావిధం పుత్రమాశాసీత" ఈ మొదలుకొని "సా సా తాంస్తాన్ జనపదాన్ మనసాఽక్రమేద్" అనువానిద్వారా చెప్పబడినది. ప్రాణులను గురించి చింతించుట సాదృశ్యమునకు కారణమని పేర్కొని సాదృశ్యమునకు ఇతర కారణములను, గర్భస్య అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు.

"చత్వారి" అనగా విశేషములులేని ఆకాశమును వదలి మిగిలిన భూతములు. మాతా ఈ మొదలగువానిద్వారా నాలుగు విధములైన కారణములను వివరించుచున్నాడు. మాతృసంభవాని అనగా రక్తగతమైనవి (ఆర్తవము

నందున్నవి.) పితృసంభవాని అనగా శుక్రమునందున్నవి. ఆహారజాని - ఆహారము వలన ఉద్భవించునవి. ఇవి మాత్రము శుక్రశోణిత సంయోగము జరిగిన తరువాతి కాలమునందు తల్లియొక్క ఆహారమునుండి పుట్టిన రసము వలన కలుగునవి. "ఆత్మ-కృతాని" అనగా ఆత్మ బద్ధమైయున్నప్పుడు చేసిన కర్మవశమున కలిగినవి అని తెలియనగును. అందు శుభకర్మచేత సదృశ రూపమును కలిగించునవి, అశుభ కర్మచేత విసదృశ రూపమును కలిగించునవి (వికృత రూపమును కలిగించునవి) అని తెలియవలెను. ఆత్మయొక్క ఆతివాహిక శరీర రూపములు అనగా సూక్ష్మ భూతములు ఏవి కలవో అవి సర్వసాధారణముగా అవిశేషముగు (వ్యతిరేకము కాని) సాదృశ్యమునకు కారణములగునని ఇచట తెలియవలెను. తేషాం ఈ మొదలగువాని యందు అతడు ఈ విధమైన నాలుగు భావములే సాదృశ్య కారణములా లేక భూతములు కారణములా అనుదానికి సమాధానము చెప్పుచున్నాడు. "విశేషాద్" అను పదము వలన అన్నియును సాదృశ్యములకు కారణములగును కాని ఏవి బలముగా నుండునో అవి విశేషముగా సాదృశ్యము కలుగుటయందు ఎక్కువగా తోడ్పడునని సూచించుచున్నాడు. ఇచ్చటను ఆహారజ భూతములకును పూర్వజన్మ కర్మాపేక్ష చేతనే సాదృశ్య కారణత్వము కలుగుచుండుటచేత ఆహారజములను తీసు కొనుట జరుగలేదు. అందువలన కర్మజ భావములయందే ఆహారజ భావములు అంతర్గతములని తెలియవలెను. మొదట ఆహారజాని అను పదముచేత వానియొక్క విద్యమానవత్వము మాత్రమే (అవి ఉండుటయే) చెప్పబడినదని తెలియవలెను. లేదా మాతృజ భావములు మొదలగునవి తత్ సదృశమైన రూపమునే కలిగించును. కాని ఆహారజాతములు ఆహార సదృశమైన భావములు కలిగించవు. అందువలన ఇచట వానిని గ్రహించలేదు. అట్లే రాబోవు అధ్యాయమునందు యోని ఖలు అస్య రసజాని (చ.శా.అ.3) - రసజభావములు ఏవి కలవో అను వాక్యముచే ఆహారము చెప్పబడినదో ఇది ప్రాణములను నిలబెట్టుకొనుటకు జరుగును కాని వానివలన తత్ సదృశమైన రూపము కలుగనేరదని తెలియవలెను. దేహ సాదృశ్యమును గురించి పేర్కొని అటుపైన మనః సాదృశ్యమును గురించి చెప్పుచున్నాడు. అనూకం అనగా పూర్వజన్మ తరువాత వెంటనే కలిగిన దేహమునకు సంబంధించినది. అందు వలన యథానూకం అనగా ఏది (ఏ సత్వము) దేవ శరీరమునుండి అంతరాయము లేకుండా వచ్చియుండునో అది దేవసత్వము అగును. ఏది పశుశరీరము నుండి వచ్చునో అది పశుసత్వము అగును అను మొదలగునవి. "అపి" శబ్దము వలన

కర్మసంబంధము మరియు జాతి సంబంధమును సూచించుచున్నాడు. అందువలన కర్మ వశము వలన కూడా సత్వము రాజసము లేదా తామసము లేదా సాత్వికము అగము. అటులనే మానుషాదీ జాతికి అనురూపముగా వుండును.

## గర్భ వికృతికి కారణములు

28. కస్మాత్ప్రజాం స్త్రీ వికృతాం ప్రసూతే
హీనాధికాఙ్గీం వికలేన్ద్రియాం చ,
దేహాత్కథం దేహముపైతి చాన్యం
ఆత్మా సదా కైరనుబధ్యతే చ ?

29. బీజాత్మ కర్మాశయ కాలదోషైః
మాతు స్తథాహార విహారదోషైః,
కుర్వన్తి దోషా వివిధాని దుష్టాః
సంస్థాన వర్ణేన్ద్రియ వైకృతాని.

30. వర్షాసు కాష్ఠాశ్మఘనామ్బువేగాః
తరోస్సరి త్స్రోతసి సంస్థితస్య
యథైవ కుర్యుర్వికృతిం తథైవ
గర్భస్య కుక్షౌ నియతస్య దోషాః.

**తాత్పర్యము :** హీనాంగములు అధికాంగములు లేదా అంగవైకల్యమును కలిగిన వికృత సంతానమును స్త్రీ ఏ కారణముచే కనును. ఆత్మ ఒక దేహమునుండి ఇతర దేహమును ఎట్లు చేరును. ఆత్మ ఎల్లప్పుడును ఏ భావములతో అనుబంధించి యుండును.

బీజము, ఆత్మయొక్క కర్మ, గర్భాశయ, మైథున కాలము వీనియందు దోషములున్నను అట్లే తల్లి యొక్క ఆహారవిహారములు దోషపూరితములుగానున్నను త్రిదోషములు కుపితములై గర్భము యొక్క ఆకారము, వర్ణము, ఇంద్రియములు వీనికి వికృతిని కలిగించును.

నదియొడ్డున నున్న వృక్షమునకు వర్షాకాలమునందు కర్రలయొక్కయు, రాళ్ళ యొక్కయు, నీటియొక్కయు వేగము వలన వికృతి సంభవించు విధమున కుక్షియందున్న గర్భమునకు దోషములు వికృతిని కలిగించును.

**ఆయుర్వేదదీపిక :** ఈ మొదలుకొని "వికలేంద్రియాంచ" అనువరకు ఒక ప్రశ్న. అందు వికృతాం అనుదాని వివరణమును హీన ఈ మొదలగువాని ద్వారా ఇచ్చుచున్నాడు. దేహాత్ ఈ మొదలగు వాక్యము రెండవది. ఎల్లప్పుడును వేనితో అనుబంధము కలిగియుండును అనునది మూడవది. ఎవరైతే "వికృతాం" అను పదమువలన కురూపత్వమును, హీనాధికాంగిం అను పదమువలన అంగ విహీనత్వము మొదలగువానినే కురూపత్వమునకు అతిరిక్తముగా చెప్పెదరో వారి అభిప్రాయమునందు ఇవన్నియు వేరు వేరు ప్రశ్నలుగా వుండును. మరియు అధ్యాయము చివర చెప్పబడనున్న ప్రశ్నలకంటే వీని సంఖ్య ఎక్కువగును. ఆత్మకర్మ అనగా ఆత్మీయమగు కర్మ. ఆశయమనగా గర్భాశయము శోషమనగా వైగుణ్యము. అశ్మఘనములు అనగా రాతిముక్కలు. వేగములు అనగా కష్టములు మొదలగువాని మూడింటియొక్క వేగములు.

## పునర్జన్మ విధానము

31. భూతైశ్చతుర్భిస్సహితః సుసూక్ష్మైః
మనోజవో దేహముపైతి దేహాత్,
కర్మాత్మకత్వాన్నతు తస్య దృశ్యం
దివ్యం వినా దర్శనమస్తి రూపమ్.

**తాత్పర్యము :** ఆత్మ మిక్కిలి సూక్ష్మములైన నాలుగు భూతములతో కూడి (ఆకాశముతప్ప) మిగిలిన నాలుగు భూతములు మనోమూలమున ఒక దేహము నుండి ఇంకొక దేహమునకు చేరును. అట్టి సూక్ష్మములగు భూతములతో కూడిన ఆత్మకు దృశ్యరూపము లేదు. యోగుల దివ్యదృష్టికి మాత్రమే ఇది కనబడును.

**ఆయుర్వేదదీపిక :** భూతైః ఈ మొదలగువానిద్వారా రెండవప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు. "సుసూక్ష్మైః" అనుటద్వారా అతీంద్రియత్వమును సూచించుచున్నాడు. ఇచట ఆకాశము అక్రియమైనందువలన దేహాంతరగమన కర్మయందు చెప్పబడలేదు. "మనసా జవతే గచ్ఛతే ఇతి మనోజవః" అనగా మనస్సు ద్వారా వెళ్ళును అని అర్థము. ఇందువలన ఆత్మకు వ్యాపకత్వము ఉన్నప్పటికి ఒక దేహమునుండి వేరొక దేహమునకు వెళ్ళుటకు కావలసిన గతిత్వము లేదు. అయి నప్పటికి మనోగతియే భూతసహితమైన గతిశబ్దమువలన చెప్పుచుండుటను చూపుట

జరిగినది. దేహాత్ అనగా మరణించుచున్న దేహమునుండి. దేహం అనగా పుట్టు చున్న దేహమునకు. కర్మాత్మకత్వాత్ అనగా కర్మాధీనత్వమువలన. అందువలన కర్మ ధర్మాధర్మరూపమగు కర్మ దీనిని ఎచటకు అనుభవించుట కొరకు తీసుకొని వెళ్ళునో అచటకే దేహము వెళ్ళును అని చెప్పబడినది. న తు ఈ మొదలగువాని ద్వారా మరణించుచున్న పురుషుని నుండి వెళ్ళుచున్నప్పుడు ఇది ఎందులకు కన పడదో తెలుపుచున్నాడు. "తస్య - ఆత్మన" అనగా అతివాహిక శరీరయుక్తమై యున్న ఆత్మకు దృశ్యము అనగా రూపము లేదు అనగా అతిసూక్ష్మరూపత్వము వలన అని భావము. అటులనే ఇట్లు పోవుచున్న వాటినన్నింటిని చూడరా? అను దానికి దివ్యం వినాదర్శనం అని చెప్పుచున్నాడు. దివ్యం దర్శనం అనగా దివ్య చక్షువు. అందువలన యోగులు మాత్రమే దీనిని చూచెదరు అని సూచించుచున్నాడు.

32. స సర్వగస్సర్వ శరీర భృచ్చ
స విశ్వకర్మా స చ విశ్వరూపః,
స చేతనాధాతురతీన్ద్రియశ్చ
స నిత్యయుక్ సానుశయస్స ఏవ.

33. రసాత్మ మాతాపితృసంభవాని భూతాని విద్యాద్దశషట్ చదేహే
చత్వారి తత్రాత్మని సంశ్రితాని స్థిత స్తథాఽఽత్మాచ చతుర్షు తేషు.

34. భూతాని మాతాపితృ సంభవాని రజశ్చ శుక్రం చ వద న్తి గర్భే
అప్యాయ్యతే శుక్రమసృక్ చ భూతై ర్యైస్తాని భూతాని రసోద్భవాని

35. భూతాని చత్వారి తు కర్మజాని యాన్యాత్మలీనాని విశ న్తి గర్భమ్
స బీజధర్మా హ్యపరాపరాణి దేహా న్తరాణ్యాత్మనియాతియాతి.

36. రూపాద్ధి రూపప్రభవః ప్రసిద్ధః కర్మాత్మకానాం మనసోమన స్తః
భవ న్తి యే త్వాకృతి బుద్ధి భేదా రజ స్తమ స్తత్ర చకర్మ హేతుః.

**తాత్పర్యము :** ఆత్మ సర్వవ్యాపి. అన్ని శరీరములను కూడా ధరించు నది, అదియే విశ్వకర్మ. విశ్వరూపమును ఆత్మయే. ఆత్మ చేతనాధాతువు మరియు అతీంద్రియమై యున్నది. ఆత్మనిత్యము. అది నిత్యము. అదియే సానుశయమై యున్నది. (అనగా రాగము ద్వేషము మొదలగువానితో కూడియున్నది). ఆహార రసము, ఆత్మ, తల్లి, తండ్రి వీనివలన గర్భమునందు పదునారు భూతములు ఏర్ప

దును. అందు నాలుగు భూతములు ఆత్మను ఆశ్రయించియుండును. ఆర్తవము నను సరించి కలిగిన భూతములు తల్లి వలన కలిగినవిగను, శుక్రము ననుసరించి కలిగినవి తండ్రి వలన కలిగినవిగను ఉండును. శుక్రార్తవములు ఏ భూతములచే పోషింపబడుచున్నవో ఆ భూతములు ఆహార రసము వలన కలిగినవిగ నుండును. ఆత్మయందు లీనమై గర్భమున ప్రవేశించు నాల్గు భూతములును కర్మ వలన కలిగినవిగ నుండును. ఈ భూత సముదాయము బీజ ధర్మమును కలిగియుండును. ఇది ఆత్మయందుండి ఆ యా శరీరములను పొందించుచుండును. కర్మానుబంధము కల వారలకు భౌతిక శరీరమునుండి భౌతిక శరీరము - మనస్సునుండి మనస్సు పుట్టును. ఆకారమునందును బుద్ధియందును భేదములు కలుగుటకు రజోగుణము తమోగుణము మరియు కర్మ అనునవి కారణములుగ నుండును.

ఆయుర్వేదదీపిక : అతివాహికమగు (సూక్ష్మమగు) శరీరముతో కూడియున్న ఆత్మయొక్క ఇతర గుణములను "స సర్వగః" అను మొదలగు వాని ద్వారా చెప్పుచున్నాడు. "సర్వశరీర భృత్" అనగా సర్వ శరీరములను ధరించుటకు యోగ్యత కలవాడు విశ్వము యొక్క పనిని (సృష్టికార్యమును) చేయు సమర్థత కలవాడు విశ్వకర్మయగును. విశ్వరూపత్వమును మనుష్య పశు మొదలగు శరీర రూపమును కర్మవశము చేత పొందుటచేత విశ్వరూపుడగును. పిల్లప్పుడును బుద్ధ్యాదులతో కూడియుండుటచే నిత్యయుక్ అని పిలువబడును. రాగాది అనుశయముతో గూడి ప్రవర్తించువాడు సానుశయుడు. అతివాహిక శరీర రూపముగా సుస్పష్టి నాల్గు భూతములను వివరించుటకు శరీరమునందు ఏ భూతములు సంఘటించునో వానినే "రస" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. ఈ భూతములు సాహాయ్యము కొరకు (ఇదివరకు) చెప్పబడియున్ననూ ప్రకరణ వశమున మరల చెప్పవలసియున్న రజస్సు, శుక్రము మొదలగు చెప్పబడనివాని నామములను ప్రతిపాదించుటకును మరల చెప్పబడుచున్నవి. "ఆత్మని సంశ్రితాని" అనగా ఆత్మసంబంధ వలన ఆత్మయందు అతివాహిక దేహ రూపముగా బద్ధములై యున్నవి అని అర్థము. "స్థితా స్తథాऽऽత్మా" అనగా ఆ భూతములయందు దేహాంతరమునకు పోవుట మొదలగు క్రియల కొరకు ఆత్మస్థితమై యున్నది అని అర్థము. ఇతర దేహము లకు వెళ్ళుట అను మొదలగు ఆత్మ యొక్క గతి ఏది కలదో అది ఆ భూతము లందే వ్యవస్థితమై యుండునేకాని వ్యాపకము (ఆత్మ) నందు కాదు. ఏందువల ననగా ఆత్మకు సర్వవ్యాపకత్వము (ముండుటచే) యుండుట వలన. "మాతా పిత్ర

సంభవాని రజశ్చ శుక్రమ్" అనగా క్రమముగా మాతృసంభవ మగు రజస్సు, పితృ సంభవమగు శుక్రము అని తెలియవలెను. ఆత్మతో లీనమైయున్నవి. (ఆత్మ లీనాః) అనగా ఆత్మతో ఎల్లప్పుడు సంబద్ధమైయున్నవి. ఆత్మతో లీనమైయున్న భూతముల యొక్క ఇతర ధర్మమును "స బీజధర్మా" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. అది ఆత్మతో సంబద్ధమైయున్న భూతముల సంతానమునకు బీజధర్మము కలిగి యుండుటచేత అవి బీజ స్వరూపముగా నుండును. బీజము తనవంటి అంకురమునే కలుగజేయును. అందువలన ఈః ఆత్మ లీనమైయున్న భూత సంతానము కూడ తన వంటి రూపము కల్గినట్టి ఇతర భూతముల కలయికతో చేయబడినట్టి దేహమును కలుగజేయుచు బీజ ధర్మమును కల్గియున్నదగును. "సా బీజధర్మిణీ" అని గానీ పఠించినచో ఆ భూత సంతతి (స్త్రీ లింగము) అని గ్రహింపవలెను. "ఆత్మని" అనగా మనోయుక్తమగు ఆత్మయందు. "యాతి" అనగా వెళ్ళును. అనగా ఇతర దేహములకు వెళ్ళును అని తెలియవలెను. ఆత్మ యొక్క గమనము మనోగమనమే యగును. "పరాపరాణి" అనిగానీ పాఠము కలదు. అపుడు "పరాణి" అనగా శ్రేష్ఠములైనవియగు దేవ శరీరము మొదలగునవి; "అపరాణి" అనగా శ్రేష్ఠములు కానివియగు క్రిమి శరీరము మొదలగునవి అని అన్వయించుకొనవలెను. నిజమునకు కంటికి కనుపించని నాల్గు భూతములు పునఃప్రవృత్తి యుక్తములై బీజ ధర్మము గలవిగా ఏల స్వీకరింపబడవలెను. కనుపించుచున్నట్టి ఈః షాట్కౌశిక శరీరము శుక్ర శోణితముల కారణముననే వచ్చుచున్నందువలన అను విషయమును "రూపాద్ధి" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. "రూప్యత ఇతి రూపమ్" భౌతికమగు రూపము శరీరము. అందువలన అభౌతిక శరీరమునుండి షాట్కౌశికమగు కలుగు ననునది ఆగమములందు ప్రసిద్ధము (చెప్పబడినది.) అందువలన, ఆగమ ప్రమాణ మగు సాంఖ్యదర్శన ప్రమాణము చేత ఆతివాహిక శరీరము నుండి వ్యక్తమగు శరీ రము ఉత్పత్తి యగుచున్నదని వాక్యార్థము. ఒకవేళ శుక్ర రజస్సులు రెండును కార ణములైనప్పటికీ, ఎపుడైతే ఆతివాహికమగు సూక్ష్మ భూత శరీరము పొందబడినదో అప్పుడే ఆ రెండును స్థూల శరీరమును కలిగించును. అంతేకాని వేరు సమయమున అట్లు కలిగించలేవు. ఒకవేళ ఆతివాహిక శరీరము లేకుండా శుక్రశోణితములు గర్భ మును కలిగించునపైనచో, అపుడు జీవాధిష్ఠానము లేకుండగనే గర్భమును జనియింప జేయవలెను. కాని అట్లు జనియింప చేయుటలేదు. అందువలన ఆత్మయందున్న బీజరూపమగు సూక్ష్మభూతముల నుండియే శుక్రశోణితముల కలయికచేత గర్భము

జన్మనొందును. ఈ ఆత్మయందున్న భూతము మాతా పితరుల భూతములకు సమాన మగు శరీర కారణమును కర్మవశము చేతనే కలుగునని "కర్మ" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. "కర్మాత్మకానాం" అనగా కర్మకు కారణమైన వాటికి అని అర్థము. లేదా రూపమును కలిగించు తంతువులనుండి రూపము కల్గిన వస్త్రము ఉత్పత్తి యగుననుట ప్రసిద్ధమగుటవలన ఆతివాహిక శరీరము నుండి దాని సదృశ మగు స్థూల శరీరము కలుగవలెను. కారణ సదృశమగు కార్యము కలుగును గదా. అటువైన ఆత్మధర్మము సూక్ష్మమగు ఆత్మయందున్న భూతములకు కలుగునని భావము. ఇక మనస్సు సాత్త్విక రాజస తామస భేదముచేత భిన్నముగా ఎందువలన అక్కడక్కడ ఆయా పురుషునియందు కలుగును అని "మనసో మనస్త" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. పూర్వజన్మయందు ఎటువంటి మనస్సు వ్యవహితమై యుండునో, ఈ జన్మయందునూ అటువంటి మనస్సే ఉండును. ఇతరచోట్ల కూడా "జన్మ జన్మ యదభ్యస్తం దానమధ్యయనం తపః. తేనైవాభ్యాసయోగేన తదేవాభ్యస్యతే పునః." అని చెప్పబడియున్నది. ఇచట మనస్సుయొక్క ఉత్పత్తియందును కర్మాత్మకానాం అని అన్వయించుకొనవలెను. అందువలన కర్మవశము వలననే మనోభేదము కలుగును అని. తెలియవలెను. ఇట్లుం డగా నిజమునకు ఆత్మస్థమగు భూతములకుండు రూపమునననుసరించియే సర్వప్రాణు లకును అదే రూపముగల శరీరము కలుగవలెను అని "భవస్తి" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. "ఆకృతిః" అనగా సంస్థానము, రజస్తమస్సులు రెండు అనేక తరతమాది భేదముల వలన భిన్నమై మరియు కర్మయు అనేక విధములుగా భిన్నమై యుండుటచేత సూక్ష్మభూతములకు అభిన్నమగు రూపకారణమున్నప్పటికీ అది భేదమునకు కారణమగును అని అర్థము.

### ఆత్మకు గతిప్రవృత్తికములగు భావములు

37. అతీన్ద్రియైస్తైరతి సూక్ష్మరూపై —
    రాత్మా కదాచిన్న వియుక్తరూపః
    న కర్మణా నైవ మనోమతిభ్యాం,
    న చాప్యహంకారవికారదోషైః.

38. రజస్తమోభ్యాం హి మనోఽనుబద్ధం,
జ్ఞానం వినా తత్ర హి సర్వదోషాః,
గతిప్రవృత్త్యోస్తు నిమిత్తముక్తం,
మనః సదోషం బలవచ్చ కర్మ.

**తాత్పర్యము :** అతీంద్రియములైన అతి సూక్ష్మములగు భూతములను కర్మ, మనస్సు, బుద్ధి అహంకారము, వికారము అను దోషముల నెప్పుడూ ఆత్మ వదలియుండదు. మనస్సునూ రజస్తమస్సులచే అనుబద్ధమై యుండును. జ్ఞానము లేనప్పుడు ఇట్టి సర్వదోషములును కలుగును. అట్టి దోషయుక్తమైన మనస్సు మరియు బలవంతమగు కర్మయు గతిప్రవృత్తికి కారణములగును.

**ఆయుర్వేదదీపిక :** "ఆత్మా సదాథైరనుబధ్యతే" అను ప్రశ్నకు సమాధానము — "అతీన్ద్రియైః" అను మొదలగునవి. "తైః" అనగా నిజధర్మము కలిగియున్నట్లు చెప్పబడినవానిచేత అని అర్థము. అహంకార వికారములే దోషములు అని అర్థము లేదా రజస్తమస్సులు రెండును దోషములు. ఇదియును సూక్ష్మభూతములతో అనుబంధము కల్గియున్న మనస్సు అని 'రజః' అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. హేతుభూతములగు రజస్తమస్సుల వలన మనస్సు భూతాదులన్నింటితోనూ అనుబద్ధమగును. ఇచటనే హేతుపును చెప్పుచున్నాడు— "జ్ఞానాత్" అను మొదలగునవి. "జ్ఞానాత్" అనగా తత్త్వజ్ఞానముచేత: తత్త్వజ్ఞానము లేక మనస్సు అన్ని దోషములతో కూడియుండును, తత్త్వజ్ఞానముచేత నిర్దోషమగునని అర్థము. దోషయుక్తముగానున్న మనస్సునకు ఏమియగునని "గతి" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. గతి యనగా దేహాంతర గమనము. ప్రవృత్తియనగా ధర్మాధర్మ క్రియలయందు ప్రవర్తించుట. దోషయుక్తముగా నుండుట వలన మనస్సు సంసార హేతువగునని వాక్యార్థము. గతి, ప్రవృత్తి అను రెండింటికి ఇతర కారణమును "బలవచ్చ కర్మ" అనుటద్వారా చెప్పుచున్నాడు. "బలవత్" అనగా విపాకము నియతముగా కలది. "ఫలవత్" అనికూడ పాఠాంతరము కలదు అయినను అదియే అర్థము. నియతమగు కర్మఫలము కర్మబలము వలననే కలుగును. ఇచటయును ప్రశ్నోత్తరములయందు "గతిప్రవృత్తయోః" అని అధికముగా చెప్పబడినది ప్రకరణ వశముననే వచ్చినదని తెలియవలెను.

## రోగ శోకముల కారణ సంబంధమగు ప్రశ్నలు

39. రోగాః కుతః సంశమనం కిమేషాం
హర్షస్య శోకస్య చ కిం నిమిత్తమ్,
శరీరసత్త్వప్రభవా వికారాః
కథం న శాన్తాః పునరాపతేయుః.

**తాత్పర్యము :** రోగము లెందులకు కలుగును? వానికి చికిత్స ఏమి? హర్షమునకు శోకమునకును కారణమేమి? శరీర మనస్సుల వలన కలుగు రోగములు శాంతిని పొందిననూ ఎట్లు తిరిగి కలుగకుండును ?

**ఆయుర్వేదదీపిక :** రోగము లెందులకు కల్గును ? అనునది మొదటి ప్రశ్న, రోగములెట్లు శమించును అనునది రెండవ ప్రశ్న ? హర్షమునకు కారణ మేమి? అనునది మూడవ ప్రశ్న, శోకమునకు కారణమేమి? అనునది నాల్గవ ప్రశ్న, శరీర మనస్సులవలన కలుగు రోగములు శాంతిని పొందిననూ ఎట్లు తిరిగి కలుగ కుండును? అనునది ఐదవ ప్రశ్న. ఇట్లు సంగ్రహముగా చెప్పదోపుచున్న ముప్పది ఆరు ప్రశ్నలు పూర్తి చేయబడుచున్నవి.

## రోగములకు శోకములకును కారణములు

40. ప్రజ్ఞాపరాధో విషమా స్తథార్థా
హేతు స్తృతీయః పరిణామకాలః,
సర్వామయానాం త్రివిధా చ శాన్తి—
ర్జ్ఞానార్థకాలాః సమయోగయుక్తాః.

**తాత్పర్యము :** ప్రజ్ఞాపరాధము, అసాత్మ్యేంద్రియార్థ సంయోగము, కాల పరిణామము వీనివలన వ్యాధులు కలుగును. జ్ఞానము (తర్క) ఇంద్రియార్థములు మరియు కాలము వీని యొక్క సమయోగము వలన అవి శాంతించును.

**ఆయుర్వేదదీపిక :** ప్రజ్ఞాపరాధము మొదలైనవి ప్రకరణవశమున మరల చెప్పబడుచున్నవి. "పరిణామ కాలః" అనగా కాల పరిణామము అని అర్థము.

41. ధర్మ్యాః క్రియా హర్షనిమిత్తముక్తా-
స్తతోఽన్యథా శోకవశం నయన్తి,
శరీరసత్త్వప్రభవాస్తు రోగా-
స్తయోరవృత్త్యా న భవన్తి భూయః.

**తాత్పర్యము :** ధర్మ కార్యములు హర్షమును కలిగించుననియు, అధర్మ కార్యములు శోకమును కలిగించుననియు చెప్పబడినవి. శరీర మనస్సులందు కలుగు రోగములు ఆ రెండింటియొక్క సంబంధమను ప్రవృత్తి లేనప్పుడు తిరిగి రాకుండును.

**ఆయుర్వేదదీపిక :** "ధర్మ్యాః" అనగా ధర్మమును సాధించునవి. అవి యును హర్షమునకు కారణమగు ధర్మమును చేయుటవలన హర్షమునకు కారణమగు చున్నది. "అతోఽన్యథా" అనగా అధర్మములగు క్రియలు (దీనికి వ్యతిరేకముగా నుండునని అర్థము). "తయోరవృత్త్యా" అనగా శరీర మనస్సునకు గల సంబంధము తెగిపోవుటవలన. మోక్షమునందే శరీర మనస్సుల రెండింటికి నివృత్తి కలుగును. అప్పుడు ఎప్పటికినీ రోగ సంబంధము నివృత్తియగును.

## శరీర మనస్సుల సంబంధము అనాది యనుట

42. రూపస్య సత్త్వస్య చ సంతతిర్యా
నోక్తస్తదాదిర్నహి సోఽస్తి కశ్చిత్,
తయోరవృత్తిః క్రియతే పరాభ్యాం
ధృతిస్మృతిభ్యాం పరయా ధియా చ.

**తాత్పర్యము :** శరీరము యొక్కయు, మనస్సు యొక్కయు సంబంధము ఏది కలదో అది ఎచటను చెప్పబడలేదు. స్వభావముగనే అట్టి సంబంధమునకు ఆది యనునది లేదు. ఈ రెండింటి సంబంధమును తెంపుటయనునది శ్రేష్ఠములగు ధృతి స్మృతి యను రెండింటివలనను మరియు శ్రేష్ఠమైన బుద్ధి వలనను చేయబడును.

**ఆయుర్వేదదీపిక :** నిజమునకు దేనికి నివృత్తి యుండునో అట్టిదానికి మొదలు అనునది ఉండును గదా ! అట్లైనచో, ఏ కారణము వలన ఆ సంబంధము యొక్క నివృత్తియనునది వాస్తవిక రోగముల నివృత్తికి కారణమగుచున్నదో అట్టి

శరీర మనస్సుల సంబంధమునకు ఆది కలదా ? అను విషయమును "రూపస్య" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "రూపస్య" అనగా శరీరము యొక్క రూపమే శరీరము, అది రూపత్వమును కలిగియుండుటచేత రూపశబ్దముచే పేర్కొన బడుచున్నది. ఉదా : "రూపాద్ధి రూపప్రభవః" అని చెప్పబడినట్లు. "నోక్తః" అని ఆగమములందు చెప్పబడలేదు. ఎందువలన చెప్పబడలేదో అని "నహి సోఽస్తి" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. అనగా అది లేకపోవుటచేతనే చెప్పబడ లేదు అని అర్థము. ఇక శరీర మనస్సుల సంబంధము అనాదియైనదో దాని యొక్క నివృత్తి ఎట్లు జరుగును అని "తయోః" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "తయోః" అనగా సంబంధమును కలిగియున్న శరీర మనస్సుల రెండింటి యొక్క అని అర్థము. "పరాభ్యాం" అనగా శ్రేష్ఠములగు, ధృత్యాదులు మోక్షమునకు ఎట్లు కారణమగునో ఆ విషయము కతిధా పురుషీయ శారీరమునందు చెప్పబడినది. అనాదియైననూ శరీర సంతతి (సంబంధము) ఎట్లు నశించునో ఆ విధము కూడా అచటనే చెప్పబడినది.

43. సత్యాశ్రయే వా ద్వివిధే యథోక్తే
పూర్వం గదేభ్యః ప్రతికర్మ నిత్యమ్,
జితేన్ద్రియం నానుపతన్తి రోగా -
స్తత్కాలయుక్తం యది నాస్తి దైవమ్.

**తాత్పర్యము :** పైచెప్పబడిన శరీరము మనస్సు అను రెండు ఆశ్రయ ములు ఉన్నప్పటికీ వ్యాధులు కలుగుటకు ముందే ప్రతిక్రియను చేసుకొనునట్టి జితేంద్రియునకు తత్కాలమున అనుభవించదగిన పూర్వజన్మకృతకర్మ లేని యెడల రోగములు కలుగవు.

**ఆయుర్వేదదీపిక :** శాస్త్రమునందు చెప్పబడుచున్న శరీర మానస రోగముల చికిత్సకు ఇతర ప్రకారమును "సతి" అను మొదలగువానిద్వారా చెప్పు చున్నాడు. ఆశ్రయ శబ్దమువలన శరీర మనస్సులు రెండూను తీసికొనబడుచున్నవి. "పూర్వం గదేభ్యః" అనగా ఉత్పన్నము కానటువంటి రోగములందే అని అర్థము. "ప్రతి కర్మనిత్యమ్" అనగా రానట్టి రోగములకు చికిత్స చేయుచున్నట్టి. జితే న్ద్రియమ్ అనుటవలననూ రోగహేతువులగు ప్రజ్ఞాపరాధ అసాత్మ్యేంద్రియార్థములను వర్జించుటను చూపుచున్నాడు. ప్రతి కర్మ నిత్యత్వము వలన పరిహారము చేయ

శక్యము కానట్టి కాలకృతదోష చికిత్సను చూపుచున్నాడు. "తత్కాలయుక్తమ్" అనగా తత్కాలమునందే అవశ్యముగా రోగమును కలిగించుటద్వారా పచ్యమాన మగుచున్న అని అర్థము. ఇందువలన బలవంతమగు పూర్వజన్మకృత కర్మ అవశ్యముగా రోగము నిచ్చునని చూపుచున్నాడు.

44. దైవం పురా యత్ కృతముచ్యతే తత్
తత్ పౌరుషం యత్త్విహ కర్మ దృష్టమ్,
ప్రవృత్తిహేతుర్విషమః స దృష్టో
నివృత్తిహేతుర్హి సమః స ఏవ.

**తాత్పర్యము :** పూర్వజన్మయందు చేసిన కర్మ దైవమనబడును. ఈ జన్మయందు చేయబడినది పౌరుషమనబడును. అట్టి కర్మ విషయమైనదైనచో ప్రవృత్తికి కారణమగును. సమమైనదైనపుడు నివృత్తికి కారణమగును.

**ఆయుర్వేదదీపిక :** ప్రకరణవశమున దైవమనబడు కర్మనుదానికి సంబద్ధమైయుండు పురుషకారమును కూడ "దైవమ్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. అందువలన ప్రకరణముచేత చెప్పబడుచున్నందువలన జనపదోద్ధ్వంసనీయ విమానమున చెప్పబడిన దానితో సమానమగు కర్మను చెప్పుట పునరుక్తి కానేరదు. "పురా" అనగా క్రిందటి జన్మయందు "ఇహ" అనగా ఈ జన్మయందు. "విషమః" అనగా అధర్మరూపమగు దైవము, రోగజనకమగు పురుషకారమును అని అర్థము. "సః" అని చేయబడిన పుంలింగనిర్దేశము ధర్మాధర్మ రూపమువలనను మరియు పురుషకారమును తెలియజేయుటకును చేయబడినదని తెలియవలెను. ఇతరులు మాత్రము ప్రవృత్తి హేతువనగా సంసారమునందు ప్రవృత్తికి హేతువనియు, నివృత్తి హేతువనగా మోక్షహేతువనియును వర్ణింతురు.

45. హైమన్తికం దోషచయం వసన్తే
ప్రవాహయన్ గ్రైష్మికమభ్రకాలే,
ఘనాత్యయే వార్షికమాశు సమ్యక్
ప్రాప్నోతి రోగానృతుజాన్న జాతు.

**తాత్పర్యము :** హేమంతమున కలిగిన చయమును పొందిన దోషమును వసంతమునందును, గ్రీష్మమునందు చయము నొందిన దోషమును వర్ష

ఋతువునందును, వర్ష ఋతువునందు చయమును పొందిన దోషమును శరదృతువునందును - శోధనము చేయుచున్నచో ఋతువులననుసరించి వచ్చు వ్యాధులు కలుగ నేరవు.

ఆయుర్వేదదీపిక : ఇక కాలకృత దోషముల కారణములను పరిహరించుటకు ప్రతికర్మను ఎట్లు చేయవలెను అను విషయమును "హైమన్తికమ్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "వసన్తే" అనగా చైత్రమాసమునందు. "అభ్రకాలే" అనగా శ్రావణమునందు "ఘనాత్యయే" అనగా మార్గశిరమాసమునందు. "మాధవ ప్రథమే మాసి" (చ. సూ. 7వ అధ్యాయము) అని చెప్పబడియున్నది. "ప్రవాహయన్" అనుటవలన యథాయోగ్యముగా వమనాదులచేత శోధించుచుండుట అని తెలియవలెను.

## స్వస్థవృత్తము

46. నరో హితాహారవిహారసేవీ
సమీక్ష్యకారీ విషయేష్వసక్తః,
దాతా సమః సత్యపరః క్షమావాన్
ఆప్తోపసేవీ చ భవత్యరోగః

47. మతిర్వచః కర్మ సుఖానుబన్ధం
సత్త్వం విధేయం విశదా చ బుద్ధిః,
జ్ఞానం తపస్తత్పరతా చ యోగే
యస్యాస్తి తం నానుపతన్తి రోగాః.
తత్ర శ్లోకః.

48. ఇహాగ్నివేశస్య మహార్థయుక్తం
షట్త్రింశకం ప్రశ్నగణం మహర్షిః,
అతుల్యగోత్రే భగవాన్ యథావ —
న్నిర్ణీతవాన్ జ్ఞానవివర్ధనార్థమ్.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే శారీరస్థానేఽతుల్యగోత్రీయంనామ ద్వితీయోఽధ్యాయః.

**తాత్పర్యము :** హితములైన ఆహార విహారములను సేవించునట్టియు, ఆలోచించి కార్యములను చేయునట్టియు, విషయములందు ఆసక్తి లేనట్టియు, దాన గుణము, సమబుద్ధి, సత్యవాక్పాలనము, క్షమాగుణము, ఆప్తులను సేవించుట అను గుణములు కలవాడును అగువాడు ఆరోగ్యవంతుడుగ నుండును.

సుఖానుబంధయోగ్యములైన మతి, వాక్కు, కర్మలను కలిగి, అధీనములో నున్న మనస్సు - నిర్మలమైన బుద్ధి కలిగినట్టియు తత్త్వజ్ఞానము, తపస్సు, యోగము నందు తత్పరతయు కలిగినట్టి మనుజునకు రోగములు కలుగవు.

ఈ అతుల్యగోత్రీయాధ్యాయమునందు అగ్నివేశునిచే అడుగబడిన, గొప్ప అర్థము కలిగియున్నట్టి ముప్పదిఆరు ప్రశ్నలకు తగురీతిన జ్ఞానాభివృద్ధి కొరకు ఆత్రేయభగవానుడు సమాధానము నిచ్చెను.

ఇది అగ్నివేశునిచే రచింపబడి చరకునిచే ప్రతిసంస్కరింపబడిన తంత్రము నందలి శారీరస్థానమున అతుల్యగోత్రీయశారీరమను రెండవ అధ్యాయము.

**ఆయుర్వేదదీపిక :** రోగములు రాకుండుటకు ఇతర హేతువును "నరః" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "సమః" అనగా భూతముల యందు సమచిత్తమును కలిగియుండువాడు. "సుఖానుబన్ధమ్" అనుదానిని మనస్సు ద్వారా, వచస్సుద్వారా అనుటకు అన్వయించుకొనవలెను. అందువలన కాయ, వాక్, మనస్సుల కర్మలు ఉత్తర కాలీన సుఖఫలముల నిచ్చునవిగా నుండుటను గ్రహింప బడుచున్నవి. "సత్త్వం విధేయం" అనగా తన అధీనములో నున్నట్టి మనస్సు అని అర్థము. "విశదా బుద్ధిః" అనగా కల్మషము లేని బుద్ధి అని అర్థము. బుద్ధి యనగా ఇచట ఊహాపోహాలనేదిచేయునో దానినే గ్రహింపబడినది. మతి యనునది మాత్రము స్మృతి, చింతనములను తెలియజేయును. జ్ఞానమనగా తత్త్వజ్ఞానము. మిగిలినవి బాగా తెలిసియున్నవే !

ఇది శ్రీ చక్రపాణి దత్తునిచే విరచితంబైన ఆయుర్వేదదీపిక యను చరక తాత్పర్య టీకయందలి శారీర స్థానమున అతుల్యగోత్రీయ శారీరమను రెండవ అధ్యాయము.

— 0 —

# తృతీయాధ్యాయము

## ఖుడ్డికా గర్భావక్రాంతి శారీరము

1. అథాతః ఖుడ్డికాం గర్భావక్రాన్తిం శారీరం వ్యాఖ్యాస్యామః.

2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః.

**తాత్పర్యము :** ఇక ఇప్పుడు ఖుడ్డికా గర్భావక్రాంతి శారీరమును గూర్చి చెప్పుకొందము.

అని ఆత్రేయ భగవానుడనెను.

**ఆయుర్వేదదీపిక :** పూర్వాధ్యాయమునందు శుక్రశోణితములు రెండును గర్భమునకు కారణములుగా చెప్పబడినవి. కానీ, గర్భమునకు గల కారణములన్నియును చెప్పబడలేదు. అందువలన గర్భకారణములను సంపూర్ణముగా పేర్కొనుట కొరకు ఖుడ్డికా గర్భావక్రాంతి చెప్పబడుచున్నది. "ఖుడ్డికాం" అనగా చిన్నదైన దానిని (అల్పమైనదానిని) గర్భముయొక్క అవక్రాంతి అనగా మేళనము (కలయిక), ఉత్పత్తి అని అర్థము.

### గర్భమేర్పడు విధానము

3. పురుషస్యానుపహతరేతసః స్త్రియాశ్చాప్రదుష్టయోనిశోణితగర్భాశయాయా యదా భవతి సంసర్గః ఋతుకాలే, యదా చానయోస్తథాయుక్తే సంసర్గే శుక్రశోణిత సంసర్గమన్తర్గర్భాశయగతం జీవోఽవక్రామతి సత్త్వసంప్రయోగాత్తదా గర్భోఽభినిర్వర్తతే, స సాత్మ్యరసోపయోగాదరోగోఽభివర్ధతే సమ్యగుపచారైశ్చోపచర్యమాణః, తతః ప్రాప్తకాలః సర్వేన్ద్రియోపపన్నః పరిపూర్ణశరీరో బలవర్ణసత్త్వసంహననసంపదుపేతః సుఖేనజాయతే సముదాయాదేషాం భావానాం—మాతృజశ్చాయం గర్భః పితృజశ్చాత్మజశ్చ సాత్మ్యజశ్చ రసజశ్చ, అస్తి చ ఖలు సత్త్వమౌపపాదుకమితి హోవాచ భగవానాత్రేయః.

**తాత్పర్యము :** పరిశుద్ధముగనున్న శుక్రము గల పురుషమునకును, దూషింపబడని యోని, ఆర్తవము, గర్భాశయమునూ కలిగిన స్త్రీకినీ ఋతుకాలమున ఎపుడు సంయోగము జరుగునో అపుడు ఆ సంసర్గమునందు గర్భాశయ గతమై యున్న శుక్రశోణిత సంయోగమును జీవుడు మనోపూర్వకముగా ఆక్రమించును. ఆ సమయమున గర్భము ఏర్పడును. సరియగు ఉపచారములను చేయుటవలన, సాత్మ్య మగు ఆహార రసమును తల్లి ఉపయోగించుట వలననూ అట్టి గర్భము రోగములు లేనిదై వృద్ధి నొందుచూ సమస్తేన్ద్రియములతో కూడియుండి పరిపూర్ణ దేహము కలదై బల వర్ణ సత్త్వదేహ-నిర్మాణముల సంపత్తుతో కూడినదై శుక్రశోణితాది భావముల యొక్క సముదాయము వలన సకాలమునందు సుఖముగ జనించును. అట్టి గర్భము మాతృజము, పితృజము, ఆత్మజము, సాత్మ్యజము, రసజములుగ నుండును మరియు సత్త్వము ఔపపాదికముగ నుండును అని ఆత్రేయ భగవానుడు చెప్పెను.

**ఆయుర్వేదదీపిక :** "పురుషస్య" అను మొదలగునవి (వానియందు) "అనుపహతరేతసః" అను పదము వలననే పురుషునకు అని తెలియవచ్చుచున్నది: పురుషుని యొక్క రేతస్సునకే గర్భజనకత్వముండుటచేత. అందువలన పురుషునికి అను పదము వలన ఎవడు సంపూర్ణ ధాతువులను కలిగి పురుష శబ్దముచే పిలువ బడదగియున్నాడో అట్టి బాలుడుకాని పురుషుని గ్రహించుచున్నాడు. స్త్రీకిని అను పదముయొక్క అర్థము తెలియుచున్నప్పటికీ యవ్వనవతియగు స్త్రీని సూచించు చున్నాడు. "సంసర్గః" అనగా మైథునము. ఋతువునందు అనగా పుష్పదర్శనమందు ప్రశస్తమగు కాలము ఋతుకాలము. అందువలన ఋతుకాలము యొక్క మూడు దినములను నిషేధించుచున్నాడు. ఎందుచేతననగా- "రజస్వలాభిగమనమలక్ష్మీ ముఖానాం" (చరక సూత్రస్థానము-25వ అధ్యాయము) అను మొదలగువానిద్వారా ఋతువునందలి మొదటి మూడు దినములు మైథునమునకు నిషిద్ధము. ఆర్తవ దర్శ నము కూడ శరదృతువుతో సాధర్మ్యమును కలిగియుండుటచేత ఋతు శబ్దము వలన చెప్పబడుచున్నది. ఋతువునందు నాటబడిన బీజములు ఏ విధముగా మొలకెత్తునో ఆ విధముగనే ఆర్తవ దర్శనమని పిలువబడు ఋతువునందు కూడ శుక్ర రూపమగు బీజము నాటబడుచుండుటచేత ఇచట ఋతుసాధర్మ్యము కన్పడుచున్నది. కేవలము ఇటువంటి సంయోగమే గర్భమునకు కారణము కాదు, కాని జీవాధిష్ఠానము కూడ ఉండవలెనని "యదా" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "తథాయుక్తే" అనగా దూషింపబడని రేతస్సుకల పురుషునికి, దూషింపబడని యోని మొదలైనవి

కల స్త్రీకిని కలుగు మైథునమునందు అని అర్థము. ఈ అర్థము "పురుషస్య" అను మొదలగువానిద్వారా లభించుచున్నప్పటికీ మరల సూత్రమునందు చెప్పబోవుచున్న 'శుక్రశోణిత సంసర్గమ్' అను మొదలగునవి అవిర ధర్మము ఉండవలెనని చూపుటకు చెప్పబడుచున్నది. అందువలననది పునరుక్తిగాదు. లేదా, "పురుషస్య" అను మొదలగువానివలన మైథునమునకు ముందు మొదటనే అనుపహతమైన రేతస్సును కలిగియుండుట చెప్పబడినది: "తథాయుక్తే" అనుట వలన మైథున సమయమందు కూడ శుక్రము యోని మొదలగువానికి దోషము లేకుండుట చెప్పబడుచున్నది. మైథున కాలమునందు మాత్రమే ఈర్ష్య మొదలగు వానివలన శుక్రము దుష్టి చెందుట సంభావింపబడుచున్నది "శుక్రశోణిత సంసర్గమ్" అనగా శుక్రశోణితముల సమ్మేళనము. "అంతః" అనుటవలన గర్భాశయమునకు బయట జరిగిన సమ్మేళనము గర్భమునకు కారణము కాకుండుట చేత దానిని నిషేధించుచున్నాడు. జీవ శబ్దము వలన చేతనాధాతువగు ఆత్మ అని గ్రహింపవలెను. నిజమునకు ఆత్మ వ్యాపకముగదా! అట్టిది ఎట్లు ఉత్పత్తియగును అని "సత్త్వ" అను మొదలగు వాని ద్వారా చెప్పుచున్నాడు. "సత్త్వ సంప్రయోగాత్" అనగా మనోగమనము చేత అని అర్థము. ఆ విషయమును శారీరస్థానము 1వ అధ్యాయమునందు, "యుక్తస్య మనసా తస్య నిర్దిశ్యన్తే విభోః క్రియాః" అని చెప్పబడినట్లు తెలియవలెను. ఆత్మ విభుత్వము చేత సర్వగతత్త్వమును కలిగియుండుట వలననైనను ఎచ్చటకూ వెళ్ళకున్ననూ అయినప్పటికీ దీనియొక్క కర్మవశము చేత మనస్సు ఎచటకు తీసికొని వెళ్ళునో అచటనే చైతన్యము ఉపలబ్ధమగుట వలన ఆత్మయును అచటకు వెళ్ళినది అని తెలియనగునని భావము. ఇక ఇట్లు ఉత్పన్నమగు గర్భము ఎట్లు అభివృద్ధిని పొందును, ఎట్లు జనించును అను విషయమును "సమ్యగుపచారైః" అని చెప్పుచున్నాడు. "సమ్యగుపచారైః" అనగా గర్భమునకు హితకరములగు ఆహార విహారముల చేత అని అర్థము. "ప్రాప్తకాలః" అనగా ప్రసవ కాలమును పొందినదై అని అర్థము. ప్రసవకాలము అనునది తొమ్మిది పది మాసములు. "పరిపూర్ణ శరీరః" అనగా సర్వాంగములచే వృద్ధిపొందిన శరీరము. సంపత్ అను శబ్దము బలము మొదలగువానికి ప్రతియొక్క దానికిని అన్వయించును. "సముదయాత్" అనగా సరియైన మేళనము వలన. "ఏషామ్" అనుట వలన పురుషస్య అను మొదలగు సూత్రమునందు చెప్పబడిన శుక్ర - ఆర్తవ - జీవ - సత్త్వ - సాత్మ్య - రసములను ఉపచారములను తెలియజేయుచున్నాడు. ఇదియే, గర్భము సముదాయము

వలన కల్గుననుట ప్రత్యేకముగా తల్లి మొదలగునవి గర్భకారణములనుటను చూపుటకు "మాతృజశ్చ" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "సాత్మ్యజశ్చ" అనుచోట సాత్మ్య శబ్దము వలన రసముకాక రూపాదులు మరియు ఆహారము సాత్మ్యముగా గ్రహింపవలెను. సాత్మ్యరసమనునది మాత్రము "రసజః" అనుదానివలననే తీసికొనబడినది. "ఔపపాదుకమ్" అనగా ఆత్మకు శరీరముతో కలుగు సంబంధమును కలిగించునది అని అర్థము ఇదివరకే ఇది వివరింపబడినది. ఇచట "పురుషస్యానుపహత్య రేతస్య" అనుట వలన తండ్రియే మొదట చెప్పబడినాడు. అయినప్పటికీ గర్భమునకు తల్లియొక్క ప్రాధాన్యతను చూపుటకు "మాతృజశ్చాయం" అని మొదట చెప్పబడినది. తల్లియును గర్భమునందు ప్రధాన కారణము. ఎందువలననగా ప్రారంభము నుండి ప్రసవము వరకు తల్లియే గర్భమునకు గుణదోషములను కలిగించును. అంతకుముందు మాత్రము పురుషునకు మైథునము నందు స్వాతంత్ర్యముండుటచేత మరియు శరీరధారకమగు ప్రధానమైన అస్థి (ఎముక)కి కారణమగుట చేత (పురుషుని) మొదట పేర్కొనుట జరిగినది.

## భరద్వాజుని అభిప్రాయము

1. నేతి భరద్వాజః, కిం కారణం - న హి మాతా న పితా
నాత్మా న సాత్మ్యం న పానాశనభక్ష్యలేహ్యోపయోగా గర్భం
జనయన్తి,న చ పరలోకాదేత్య గర్భం సత్త్వమవక్రామతి.

**తాత్పర్యము :** అట్లు కాదని భరద్వాజుడు చెప్పెను. ఎందువలననగా- తల్లిగాని, తండ్రిగాని, ఆత్మగాని, సాత్మ్యముగాని, పాన - అశన - భక్ష్య - లేహ్యములనుపయోగించుట వలనగాని గర్భము కలుగదు, మరియు సత్త్వము పరలోకమునుండి వచ్చి గర్భమునందు ప్రవేశింపదు.

**ఆయుర్వేదదీపిక :** పూర్వపక్షమును ఉద్ధరించుట వలన సిద్ధాంతమును గ్రహించుటకు తల్లి మొదలగు గర్భకారణములను భరద్వాజుని నోటి ద్వారా ఆక్షేపించుచున్నాడు, - "న" అను మొదలగునవి. "నేతి" అనుట వలన సామాన్యము వలన ఆత్రేయునిచే చెప్పబడినదానికి ఆక్షేపణము. "కిం కారణమ్" అనుట వలన ఎందుచేత ఈ ఆత్రేయ వచనము విరుద్ధమని ఇచ్చట కారణము అడుగుచూ "న హి మాతా" అను మొదలగువాని వలన పై చెప్పిన తల్లి మొదలగు కారణములకు భరద్వాజుడు అకారణత్వమును తెలియచేయుచున్నాడు.

2. యది హి మాతాపితరౌ గర్భం జనయేతాం, భూయస్యః స్త్రియః పుమాంసశ్చ భూయాంసః పుత్రకామాః,తే సర్వే పుత్రజన్మాభిసంధాయ మైథునధర్మమా- పద్యమానాః పుత్రానేవ జనయేయుర్దుహితౄర్వా దుహితృకామాః, న తు కాశ్చిత్ స్త్రియః కేచిద్వా పురుషా నిరపత్యాః స్యురపత్యకామా వా పరి- దేవేరన్.

**తాత్పర్యము :** మాతా పితరులిరువురే గర్భమును జనింపజేయునెడల చాలమంది స్త్రీలు, పురుషులును ఎక్కువ సంతానమును కోరుకొని యున్నవారై పుత్రుని పుట్టించవలెనను కోరికతో సంభోగమును చేయుచున్నవారై పుత్రులనే పుట్టింప వలయును లేదా కుమార్తెలను కోరుకొన్నవారై కుమార్తెలను పుట్టింపవలయును. అంతేకాని కొందరు స్త్రీలుగాని పురుషులుగాని సంతానము లేక సంతానమును కోరు కొన్న వారుండరాదు. (అట్లు జరుగుట లేదు కదా. అందువలన తల్లిదండ్రులు గర్భమునకు కారణముకాదని భరద్వాజుని మతము).

**ఆయుర్వేదదీపిక :** "యది హి" అను మొదలగువాని వలన తల్లి మొద లగునవి గర్భమునకు కారణము కాకుండుటకు కారణమును చెప్పుచున్నాడు. లేదా, తల్లి మొదలగునవి కారణము కాదని భరద్వాజుని వలన ప్రతిజ్ఞ చేయబడినది. అచట "కిం కారణం" అని హేతువు ప్రశ్నింపబడినది. అటు పై "న హి మాతా" అను మొదలగు వాని ద్వారా హేతువు చెప్పబడుచున్నది. దీనికి ఈ అర్థమును కలదు - తల్లి మొదలగునవి గర్భమునకు కారణముగా ప్రత్యక్షముగా కనుపించుటలేదు. అందువలన తల్లి మొదలగునవి గర్భమునకు కారణము కాదు. "యది హి" అను మొదలగు వానిద్వారా ఉపపత్తికి విరోధమైనప్పటికీ తల్లి మొదలగునవి కారణ మగుచున్నవనియు చూపుచున్నాడు. అందువలన అది పునరుక్తి కానేరదు. మైథున ధర్మమనగా వ్యవాయము (లైంగిక సంభోగము), పుత్రుని కోరు వారు పుత్రులనే జనియింపజేయవలెను లేక కుమార్తెను కోరువారు కుమార్తెలనే జనియింప జేయువలె నని అన్వయము. "న తు కాశ్చిత్ స్త్రియః" అనుచోట మైథునమును పొందుచున్న వారేయగు స్త్రీలు మరియు పురుషులు బాధపడరు అని అన్వయము. గర్భమునకు మాతా పితరులు ఆధారమగుటవలన వారెప్పుడు సంతానమును కోరుకొందురో అపుడే మైథునమును పొందుచూ సంతానమును పొందుచుండ వలెను. అటులైన ఎవరునూ సంతానము లేక బాధపడరని అర్థము.

3. న చాత్మాఽఽత్మానం జనయతి. యది హ్యాత్మాఽఽత్మానం జనయేజ్జాతో వా జనయే దాత్మానమజాతో వా, తచ్చోభయథాఽప్యయుక్తమ్. న హి జాతో జనయతి సత్త్వాత్, న చాజాతో జనయత్యసత్త్వాత్, తస్మాదుభయథాఽప్య నుపపత్తిః తిష్ఠతు తావదేతత్. యద్యయమాత్మాఽఽనం శక్తో జనయితుం స్యాత్, న త్వేనమిష్టాస్వేవ కథం యోనిషు జనయేద్వశినమప్రతిహతగతిం కామరూపిణం తేజోబలవర్ణ సత్త్వసంహనన సముదితమజరమరుజమమ రమ్; ఏవంవిధం హ్యాత్మాఽఽత్మాన మిచ్ఛత్యతో వా భూయః.

**తాత్పర్యము :** ఆత్మ తన్ను తాను జనింపజేయదు. ఆత్మ తనను జని యింపజేయు నెడల పుట్టినదిగాని పుట్టవలసినది జనియింప జేయవలయును. ఈ రెండు పద్ధతులును యుక్తము గావు. ఎందువలననగా పుట్టినది ఉండుటచేత (సత్-త్వము వలన) పుట్టింపలేదు. మఱియు పుట్టనిది లేకపోవుట (అసత్-త్వము) వలన పుట్టింపలేదు. అందువలన రెండు విధములను ఇది సిద్ధించుట లేదు. ఇది అట్లుండనిమ్ము. ఈ ఆత్మ ఆత్మను (తనను) జనియింపజేయ శక్తి కలిగియున్న యెడల తనను ఇష్టమైన యోనులందు పుట్టుదానిగను, వశిత్వము – అడ్డగింపబడని గమనము – కామరూపము – తేజస్సు – బలము – వేగము (శక్తి) – వర్ణము – సత్త్వము – నిర్మాణములు కలదానినిగను ఎందుకు చేయదు. ఆత్మ తనకు ఇట్టి గుణములుగాని ఇంతకంటె ఎక్కువ గుణములనుగాని కోరుకొనును.

**ఆయుర్వేదదీపిక :** గర్భమునకు ఆత్మజత్వమును "న చాత్మా" అను మొదలగువాని ద్వారా నిషేధించుచున్నాడు. మనుష్య, గజ, తురగాదీ, రూపముల వలన తనను పుట్టించును అని అర్థము. "సత్త్వాత్" అనగా జనించియున్న ఆత్మకు నిత్యమాసత్వము (కనుపించుట) ఉండుటచేత; కనుపించునది పుట్టదు అని అర్థము. "అసత్త్వాత్" అనగా కారణభూతమగు ఆత్మ పుట్టని పక్షమున అసత్త్వము చేత దానికి కారణత్వము సిద్ధింపలేదని అర్థము. ఇచటనే ఇంకొక ఖండనమును "తిష్ఠతు" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "యోనిషు" అనగా జాతుల యందు "అతో వా భూయ" అనగా పై చెప్పిన గుణములకంటె అధికముగా ఇంద్రాది గొప్పవారితో సమానము అని అర్థము.

4. అసాత్మ్యజ శ్చాయం గర్భః. యది హి సాత్మ్యజః స్యాత్, తర్హి సాత్మ్యసే వినామేవైకాన్తేన ప్రజా స్యాత్ అసాత్మ్యసేవినశ్చ నిఖిలేనానపత్యాః స్యుః, తచ్చోభయముభయత్రైవ దృశ్యతే.

**తాత్పర్యము :** ఈ గర్భము సాత్మ్యము నుండి పుట్టినదియును కాదు. ఒకవేళ సాత్మ్యజమే యైనచో సాత్మ్యమును సేవించువారికి మాత్రమే సంతానము కలుగవలెను. అసాత్మ్య సేవనము చేయువారు పూర్తిగా సంతానము లేనివారుగా నుండవలెను. సంతానము కలుగుట కలుగకపోవుట యనునది సాత్మ్య అసాత్మ్యములను సేవించువారిరువురి యెడలను కనుపించుచున్నది.

**ఆయుర్వేదదీపిక :** "తచ్చోభయమ్" అనగా సంతానముతో నుండుట మరియు సంతానము లేకపోవుట. "ఉభయత్ర" అనగా సాత్మ్యమును సేవించువారికి, అసాత్మ్యముకు సేవించువారికి కూడ అని అర్థము.

5. అరసజశ్చాయం గర్భః.యది హి రసజః స్యాత్, న కేచిత్ స్త్రీ పురుషేష్వనపత్యాః స్యుః,న హి కశ్చిదస్త్యేషాం యో రసాన్నోపయుఙ్క్తే; శ్రేష్ఠరసోపయోగినాం చేద్గర్భా జాయన్త ఇత్యభిప్రేతమితి, ఏవం సత్యాజౌరభ్రమార్గమాయూరగోక్షీరదధిఘృతమధుతైల సైన్ధవేక్షురసముద్గశాలి- భృతానామేవైకాన్తేన ప్రజా స్యాత్, శ్యామాకవరకోద్దాలకకోరదూషకకన్ద- మూలభక్షాశ్చ నిఖిలేనానపత్యాః స్యుః, తచ్చోభయముభయత్ర దృశ్యతే.

**తాత్పర్యము :** ఈ గర్భము రసము వలన కలిగినదియును కాదు. ఒకవేళ రసము వలన గర్భము కలుగుచుండిన యెడల, ఏ స్త్రీ పురుషులును సంతానము లేక యుండరు. ఎందువలననగా రసము నుపయోగించువారు లేరని ఎవటయును లేదు. ఒకవేళ శ్రేష్ఠ రసమును ఉపయోగించువారికి గర్భములు కలుగునని అభిప్రాయమగుచో; మేక, గొర్రె, లేడి, నెమలి, గోక్షీరము, దధి, ఘృతము, తేనె, తైలము, సైంధవము, ఇక్షురసము, పెసలు, శాలిధాన్యము అను వానిని భుజించువారలకు మాత్రమే సంతానము కలుగవలెను చామలు, వరిగలు, అరిగెలు, కొర్రలు, దుంపలు, వేళ్ళు అనువానిని భుజించు వారలు సంతానహీనులుగా నుండవలెను. కాని శ్రేష్ఠ రసములనుపయోగించువారికి శ్రేష్ఠము కాని రసము నుపయోగించు వారికిని సంతానము కలుగుట, సంతానము కలుగకపోవుట అనునవి చూచుచునే యున్నాము.

ఆయుర్వేదదీపిక : "యో రసాన్నోపయుజ్క్తే" అనగా రసమే గర్భమునకు కారణమైనచో దానిని స్త్రీ పురుషులందరూ సేవించుచున్నారు, అందువలన అందరునూ సంతానవంతులై యుండవలెనని భావము. ఇక గర్భము రసజమనుట యనునది శ్రేష్ఠరసముగా వర్ణింపబడుచున్నచో అచటనూ "శ్రేష్ఠ" అను మొదలగు వాని ద్వారా దూషణమును చెప్పుచున్నాడు.

6. న ఖల్వపి పరలోకాదేత్య సత్త్వం గర్భమవక్రామతి: యది హ్యేనమవక్రామేత్, నాస్య కిఞ్చిత్ పౌర్వదేహికం స్యాదవిదితమశ్రుతమదృష్టం వా, న చ తచ్చ న కిఞ్చిదపి స్మరతి.

4. తస్మాదేతద్బ్రూమహే—అమాతృజశ్చాయం గర్భోఽపితృజశ్చానాత్మజశ్చాసాత్మ్యజశ్చారసజశ్చ, న చాస్తి సత్త్వమౌపపాదుకమితి. (హోవాచభరద్వాజః.)

తాత్పర్యము : సత్త్వము కూడ పరలోకము నుండి గర్భమును ప్రవేశింపదు. అట్లు ప్రవేశించు నెడల పూర్వజన్మ యందలి దేహమునకు సంబంధించిన విషయములు తెలియక, వినబడక, చూడబడకనూ యుండవు. అట్టి సత్త్వము ఆ విషయములను కొంచెమైననూ స్మరించుట లేదు.

అందువలన, ఈ గర్భము మాతృజము కాదు, పితృజము- ఆత్మజము- సాత్మ్యజము- రసజమునూ కాదు. మరియు సత్త్వము ఔపపాదుకము కాదు అను విషయమును చెప్పుచున్నాము అని భరద్వాజుడు చెప్పెను.

ఆయుర్వేదదీపిక : "అస్తి చ సత్త్వమౌపపాదుకమ్" అని ఏది చెప్పబడినదో దానిని "న ఖల్వపి" అను మొదలగువాని ద్వారా దూషించుచున్నాడు. "పౌర్వదేహికమ్" అనగా పూర్వ దేహముచే అనుభవింపబడినది. "అవిదితమదృష్టం వా" అనగా ఈ జన్మ యందును పూర్వ దేహముచే అనుభవింపబడినది. తెలియకయూ, చూడబడకయూ ఉండరాదు. విదితమనగా ప్రత్యక్ష వ్యతిరిక్త ప్రమాణము వలన లభించినది. చూచినది మాత్రము ప్రత్యక్షము ద్వారా లభించినది దీనికి వ్యతిరేకముగా నుండునది అవిదితము, అదృష్టము అని తెలియవలెను. "న చ కిఞ్చిదపి స్మరతి" అనగా పూర్వజన్మయందు అనుభవించినదానిని కూడ స్మరింపదు అని అర్థము. మనస్సు పూర్వజన్మయందు దేనిని అనుభవించునో అదియే ఈ జన్మ

యందును అనుసరింపబడును. మరియు అందువలన దేవదత్తుడు బాల్యమునందను భవించిన దానిని యౌవనమునందు స్మరించినట్లు - క్రిందటి జన్మయందనుభవించిన విషయమును ఈ జన్మయందును అట్లే స్మరింపవలయును. కాని ఇది అట్లు స్మరింపదు. అందువలన పూర్వాపరజన్మలయందు ఒకే సత్త్వము ఉండదు అని భావము. తస్మాత్ అను మొదలగువాని ద్వారా మొదట ఖండింపబడిన విషయమును మరల నిగమనము వలన చూపుచున్నాడు.

## భరద్వాజుని మతమును ఆత్రేయ భగవానుడు ఖండించుట

5. నేతి భగవానాత్రేయః, సర్వేభ్య ఏభ్యో భావేభ్యః సముదితేభ్యో గర్భోఽభినిర్వర్తతే.

**తాత్పర్యము :** అది సరికాదు. ఈ అన్ని భావములు కలిసియున్నప్పుడు గర్భమేర్పడును అని ఆత్రేయ భగవానుని మతము.

**ఆయుర్వేదదీపిక :** "నేతి" అను మొదలగు వానిద్వారా భరద్వాజుని మతమును ఆత్రేయుని వాక్కుద్వారా దూషించుచున్నాడు. "సముదితేభ్యః" అను వచనము చేత తల్లి మొదలగునవి ఒక్కొక్కటిగా ఇతర కారణములు లేక గర్భ కారణము అగుటను నిషేధించుచున్నాడు. అందువలన తల్లి మొదలగు గర్భకారణ ములు ఉన్నప్పటికీ ఇతర కారణమగు జీవుడు ప్రవేశించుట మొదలగునవి లేనపుడు గర్భము కలుగకపోవుట యుక్తమేయగును. ఎక్కువ సాధనముల కలయికతో జనించు కార్యమునందు కొన్ని మాత్రమే యుండుటవలన అట్టి కార్యము జనింపక పోవుటవలన అవి అకారణములు కావు. ఇట్లుండగా వస్త్రమునకు కారణములగు తంతువులును మిగిలిన కారణములు లేనందున వస్త్రమును ఏర్పరచ లేకపోవుట వలన వానికి అకారణత్వము ఆపాదింపబడవలెను. తల్లి మొదలగు భావములు లేకుం డగ గర్భము కలుగక పోవుచుండుటయును ఇట్లే తెలియవలెను. (అనగా గర్భమును కలిగించుటకు తల్లి మొదలగు భావములే కారణమని గ్రహింపవలెను).

## తల్లి వలన గర్భమునకు కలుగు భావములు

6. మాతృజశ్చాయం గర్భః. న హి మాతుర్వినా గర్భోత్పత్తిః స్యాత్, న చ జన్మ జరాయుజానామ్. యాని ఖల్వస్య గర్భస్య మాతృజాని, యాని చాస్య మాతృతః సంభవతః సంభవన్తి, తాన్యనువ్యాఖ్యాస్యామః; తద్యథా—త్వక్ చ లోహితం చ మాంసం చ మేదశ్చ నాభిశ్చ హృదయం చ క్లోమ చ యకృచ్చ ప్లీహా చ వృక్కౌ చ బస్తిశ్చ పురీషాధానం చామాశయశ్చ పక్వాశయశ్చోత్తరగుదం చాధరగుదం చ క్షుద్రాన్త్రం చ స్థూలాన్త్రం చ వపా చ వపావహనం చేతి (మాతృజాని).

**తాత్పర్యము :** ఈ గర్భము తల్లి వలననూ ఏర్పడుచున్నది. తల్లి లేక గర్భము ఉత్పత్తి లేదు. అట్లే జరాయుజములకు (మావినుండి పుట్టినట్టి మనుష్యాదులకు) జన్మమునూ కలుగనేరదు. ఈ గర్భమునకును, జన్మించినట్టి శిశువునకును తల్లి వలన ఏవి కలుగుచున్నవో వానిని గూర్చి చెప్పుకొందము. అవియేవనగా — చర్మము, రక్తము, మాంసము, మేదస్సు, నాభి, హృదయము, క్లోమము, యకృత్తు, ప్లీహము, వృక్కలు, వస్తి, పురీషాశయము, ఆమాశయము, పక్వాశయము, ఊర్ధ్వగుదము, అధోగుదము, చిన్న ప్రేవులు, పెద్ద ప్రేవులు, వప, వపావహనము అనునవి (ఇవి తల్లి వలన కలుగునవి).

**ఆయుర్వేదదీపిక :** "మాతృజశ్చాయం గర్భః" అను మొదలగువాని ద్వారా ఈ విధముగానే తల్లి యొక్క కారణత్వమును చెప్పుచున్నాడు గర్భోత్పత్తి యందు తల్లి కారణమగుటను చూపించి జరాయుజములు పుట్టుటయందు కారణమును "న చ జన్మ" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. జరాయువనగా మావి. దేనిని చుట్టుకొని మనుష్యాదులు జనింతురో అది మావి యనబడును. జరాయువుచే చుట్టబడి పుట్టు మనుష్యాదులు జరాయుజాలు అనబడుదురు. స్వేదమునుండి పుట్టునట్టి దోమ మొదలగువానికి, వృక్షములకును, కప్పలు మొదలగువానికి తల్లి లేకున్ననూ జన్మకలుగును. అండజములకునూ (గ్రుడ్డునుండి పుట్టు పక్ష్యాదులకునూ) జన్మ యందు తల్లియనునది కారణమగుచునే యున్నను ఇచట ఈ ప్రకరణమునందు మనుష్యుని ఉద్దేశించి యుండుటచేత అండజములను వదలి జరాయుజములకు అని

చెప్పబడినది. లేదా, జరాయుజము యొక్క అభివ్యక్తి రూపమగు జన్మయందు అభివ్యక్తి వరకు తల్లి ఏ విధముగా కారణమగునో అండమునందు అట్లుకాదు. కూర్మము (తాబేలు) మొదలగువానియందు అండోత్పత్తి వరకు మాత్రమే తల్లి కారణము అగును. అభివ్యక్తి రూపమగు జన్మయందు తల్లి కారణము కాదు. "పితుర్వినా న జరాయుజానాః జన్మ॥ అని ఏ విషయమును చెప్పబోవుచున్నారో, అది జరాయుజోత్పత్తియందు తండ్రి అవశ్యముగా అపేక్షణీయమని చూపుటకు: అండజములగు చేపలు మొదలైనవి తండ్రి లేకుండగనే పైనసూచిత విశేషమును పొందియే కలుగుచున్నవని భావము. "యాన్యస్య మాతృతః సంభవతః సంభవంతి" అనునది "మాతృజాని" అనుదాని యొక్క వివరణము— సంభవించుచున్న గర్భము యొక్క ఏవి — తల్లివలన అనగా తల్లి వలన వచ్చిన శోణితము నుండి — పుట్టుచున్నవో ఆ మాతృజములగు త్వగాదులను చెప్పుకొందుము అని అన్వయము. ఇటులనే ఇతర చోట్లయును "యాని" అను మొదలగు సూత్రము వ్యాఖ్యానింపవలసి యుండును. త్వగాదులకు మాతృజత్వము ఆగమముల వలన తెలిసినవే. పురీషాధానము పక్వాశయము. ఉత్తర గుదము అధరగుదము అను రెండును గుదము యొక్క పైని మరియు క్రింది భాగములు. వపావహనము పైలవర్తిక యని చెప్పబడుచున్నది.

## గర్భమునకు తండ్రివలన కలుగు భావములు

7. పితృజశ్చాయం గర్భః నహిపితుర్ఋతేగర్భోత్పత్తిః స్యాత్,న చ జన్మ జరాయుజానాం.యాని ఖల్వస్య గర్భస్య పితృజాని యాని చాస్య పితృతః సంభవతః సంభవన్తి,తాన్యనువ్యాఖ్యాస్యామః:తద్యథా— కేశశ్మశ్రునఖలోమదన్తాస్థిసిరాస్నాయుధమన్యః శుక్రం చేతి. (పితృజాని)

**తాత్పర్యము :** ఈ గర్భము తండ్రి వలనను కలిగినది. తండ్రిలేనిదో గర్భోత్పత్తి జరుగదు. మరియు జరాయుజాలకు జన్మమే యుండదు. ఈ గర్భమునకు పుట్టిన శిశువునకును తండ్రివలన కలిగిన ఏ భావములు కలుగుచున్నవో వాని చెప్పుకొందుము. అవి యేవనగా — తలవెంట్రుకలు, మీసము గడ్డములు, గోళ్ళు, నీచ రోమములు, దంతములు, ఎముకలు, సిరలు. స్నాయువులు, ధమనులు మరియు శుక్రము అనునవి (ఇవి తండ్రి వలన కలుగునవి).

**ఆయుర్వేదదీపిక :** "శుక్రము" అని [illegible] సర్వధాతు సారమగు శుక్రము యొక్క ఉపయోగమును చూపుచున్నారు.

## గర్భమునకు ఆత్మ వలన కలుగు భావములు

8. ఆత్మజశ్చాయం గర్భః.గర్భాత్మ హ్యన్తరాత్మా యః,తం 'జీవ' ఇత్యాచక్షతే శాశ్వతమరుజమజరమమరమక్షయమభేద్యమచ్ఛేద్యమలోద్యం విశ్వరూపం విశ్వకర్మాణమవ్యక్తమనాదిమనిధనమక్షరమపి.స గర్భాశయమనుప్రవిశ్య శుక్రశోణితాభ్యాం సంయోగమేత్య గర్భత్వేన జనయత్యాత్మనాఽఽత్మానం, ఆత్మసంజ్ఞా హి గర్భే.తస్య పునరాత్మనో జన్మానాదిత్వాన్నోపపద్యతే, తస్మాన్న జాత ఏవాయమజాతం గర్భం జనయతి,అజాతో హ్యయమజాతం గర్భం జనయతి:స చైవ గర్భః కాలాన్తరేణ బాలయువస్థవిరభావాన్ ప్రాప్నోతి,స యస్యాం యస్యామవస్థాయాం వర్తతే తస్యాం తస్యాం జాతో భవతి,యా త్వస్య పురస్కృతా తస్యాం జనిష్యమాణశ్చ,తస్మాత్ స ఏవ జాతశ్చాజాతశ్చ యుగపద్భవతి;యస్మింశ్చైతదుభయం సంభవతి జాతత్వం జనిష్యమాణత్వం చ స జాతో జన్యతే,స చైవానాగతేష్వవస్థాన్తరేష్వజాతో జన్యయత్యాత్మనాఽఽత్మానం.సతో హ్యవస్థాన్తరగమనమాత్రమేవ హి జన్మ చోచ్యతే తత్ర తత్ర వయసి తస్యాం తస్యామవస్థాయాం;యథా—సతామేవ శుక్రశోణితజీవానాం ప్రాక్ సంయోగాద్గర్భం న భవతి,తచ్చ సంయోగాద్భవతి;యథా—సతస్తస్యైవ పురుషస్య ప్రాగపత్యాత్ పితృత్వం న భవతి,-తచ్చాపత్యాద్భవతి;తథా సతస్తస్యైవ గర్భస్య తస్యాం తస్యామవస్థాయాం జాతత్వమజాతత్వం చోచ్యతే.

**తాత్పర్యము :** గర్భము ఆత్మ వలననూ కలుగును, అంతరాత్మమైన గర్భాత్మ జీవుడనబడును. అట్టి జీవుని శాశ్వతునిగను, బాధలు లేనివానిగను, ముసలి తనము లేనివానినిగను, మరణము లేనివానిగను, నశింపనివానిగను, ఛేదింపబడనివాని గను, ఛేదింపబడనివానిగను, కలలు లేనివానినిగను, సమస్త రూపములు కలవానిని గను, సమస్త కర్మలు కలవానినిగను, వ్యక్తము కానివానిగను, ఆదిరహితునిగను, అంతము లేనివానినిగను, మార్పు చెందనివానినిగను చెప్పుచున్నారు. అట్టి అంత రాత్మ గర్భాశయమునందు ప్రవేశించి శుక్రశోణితములతో సంసర్గము పొంది తన్ను తాను గర్భరూపమును పొందించును. అప్పుడు గర్భమందు ఆత్మ సంజ్ఞ కలుగును. ఆదిరహితమైనదగుటవలన అట్టి ఆత్మకు జన్మ కలుగదు. అందువలన ఈ ఆత్మ పుట్టకయే గర్భమును పుట్టించును. పుట్టని ఈ ఆత్మ అప్పటివరకు పుట్టియుండని

గర్భమును కలిగించును. అట్టి గర్భమే కాలక్రమమునుబట్టి బాల్య యౌవన వార్ధక్యము లనెడి అవస్థలను పొందును. అది ఏ అవస్థయందుండునో ఆ అవస్థయందు పుట్టి నదిగ నుండును. దీనికి ఏ అవస్థ కలుగనున్నదో దానియందు పుట్టబోవునదిగ యుండును. అందువలన అదియే పుట్టినదిగను పుట్టబోవునదిగను ఒకేమారు ఉండును. పుట్టినదిగను పుట్టబోవునదిగను నుండు గర్భమునందు ఆత్మ పుట్టినిదై తనను పుట్టించును. గర్భమునకు ఆ యా అవస్థలు కలుగుటకు పూర్వమునందు ఆత్మ పుట్టనిదై తనను పుట్టించును. ఉన్నటువంటి ఆత్మకు ఆ యా వయస్సునందు ఆ యా అవస్థలను పొందుటయే జన్మయనబడును. ఉన్నటువంటి శుక్రశోణిత జీవు లకు గర్భమను సంజ్ఞ సంయోగము కలుగుటకంటె పూర్వము కలుగక, సంయోగము కలిగిన పిమ్మట ఎట్లు కలుగునో, ఉన్నటువంటి పురుషునికి తండ్రియను సంజ్ఞ సంతానము కలుగుటకంటె పూర్వమునందు కలుగక సంతానము కలిగిన పిమ్మట ఎట్లు కలుగునో అట్లే ఉన్నటువంటి ఆ గర్భమునకే ఆ యా అవస్థలను బట్టి పుట్టు టయు పుట్టకుండుటయు చెప్పబడుచున్నది.

ఆయుర్వేదదీపిక : "ఆత్మజః" అను మొదలగువానివలన గర్భము ఆత్మవలన పుట్టుటను వివరించుచున్నాడు. "అన్తరాత్మేత్యుచ్యతే" అనుటవలన గర్భము నకు కారణభూతమగు ఆత్మను షడ్ధాతు సముదాయాత్మకమగు ఆత్మ శబ్దముచే పేర్కొనబడుటవలన వివరించుచున్నాడు. "ఆచక్షతే" అనగా ఆగమములందు శాశ్వతుడు మొదలగు శబ్దములచే పెద్దలు చెప్పుచున్నారు అని అర్థము. "అలోఢ్యమ్" అనగా క్షోభ చెందించుటకు వీలుకానిది. "గర్భత్వేన జనయత్యాత్మానమ్" అనగా షడ్ధాతుకమగు ఆత్మకు గర్భస్వరూపమేమి కలదో దానిని పుట్టించునని అర్థము. "ఆత్మసంజ్ఞా హి గర్భే" అని గర్భమునకు ఆత్మ యను పేరు కలుగునని చెప్పు చున్నాడు. "తస్య" అనుటవలన పరమాత్మను తెలియజేయుచున్నాడు. పరమాత్మకు అనాదిత్వముండుటచేత జన్మ లేకుండును: అందుచేత ఇది మొదటగనే పుట్టియున్నదై అంతవరకు పుట్టియుండని గర్భమును పుట్టించును అని అన్వయము. ఇక అది పుట్టినిదైనచో ఎట్లు జనింపచేయును - ఎట్లు జనింపచేయునో — "అజాతో హ్యయమ్" అని చెప్పుచున్నాడు. ఇది నిత్యము (అనాదము) అని అర్థము. అందు వలన ఆకాశమువలె నిత్యత్వమును కలిగియుండుటవలన పుట్టనిదే యున్నను అంతరాత్మ గర్భస్వరూపమగు తన్ను తాను పుట్టించును. అందువలనను అంతరాత్మ రూపమున నిత్యము విద్యమానముగా నుండుటచే పుట్టకయున్నను గర్భరూపమగు

అవస్థయందు పుట్టినది అని చెప్పబడుచున్నది. ఇట్లు ఆత్మకు జాతత్వము అజాతత్వము అను రెండును ఉద్దేశింపబడుచున్నవి. "న చైవ" అను మొదలగువానిద్వారా ఇదియే ఆత్మయందుగల జాతాజాతత్వమును చూపుటకు, ఉదాహరణము కొరకును, గర్భము నందే జాతత్వాజాతత్వముండుటను చూపుచున్నాడు. "పురస్కృతా" అనగా మున్ముందు జరుగబోవునది అని అర్థము. ఉదాహరణకు— బాలునికి ఇంకనూ కలుగని వృద్ధా త్వావస్థ కలుగనున్నది అని ఎట్లనబడుచున్నదో, అటులనే పుట్టని ఆత్మ తన్ను తాను పుట్టించుచున్నది అని అనబడును. "చ" శబ్ద ప్రయోగమును సమర్థించుటవలన మాత్రమే ఇట్టి వివక్షను తెలిసికొనవలెను. ఇందువలననూ ఆత్మయందు అవస్థా భేదముచేత పుట్టియుండుటను సమర్థించుటవలన "జాతో వా జనయేత్ అజాతో వా" ఈ మొదలగు గ్రంథముచే చేయబడిన పూర్వపక్షము శబ్దప్రయోగ సమర్థనమువలన పరిహరింపబడినది. పరమార్థమున మాత్రము నిత్యత్వమును కలిగియుండుటవలన పుట్టియుండనట్టిదేయగు ఆత్మ పుట్టియుండని గర్భరూపమగు ఆత్మను పుట్టించును అని తెలియవలెను. అందువలన, అనిత్యమగు దానికి కారణత్వము నిత్యమగుదానికి (పుట్టుక) జన్యత్వమును లేదు అను పక్షము స్థిరముగనే యున్నది. "సతో హి" అను మొదలగువానిద్వారా సాంఖ్యమతమగు సత్కార్యపక్షమును చూపుచున్నాడు. లేదా, వయోభేదము వలన అవస్థాంతరగమనమేది కలదో అదియే జన్మయని చూపుచున్నాడు. "తస్యాం తస్యామవస్థాయాం" అనునది ఛేదము. "పితృత్వమ్" అనగా పితృత్వమువలన ఉద్దేశింపబడుట అని అర్థము.

## తల్లి మొదలగు భావములు గర్భము నేర్పరచుటయందు కూడియుండుట

9. న ఖలు గర్భస్య న చ మాతుర్న పితుర్న చాత్మనః సర్వభావేషు యథేష్టకారిత్వమస్తి;తే కించిత్ స్వవశాత్ కుర్వన్తి, కించిత్ కర్మవశాత్, క్వచిచ్చైషాం కర్మశక్తిర్భవతి, క్వచిన్న భవతి. యత్ర సత్త్వాదికరణ- సంపత్తత్ర యథాబలమేవ యథేష్టకారిత్వమ్, అతోఽన్యథా విపర్యయః న చ కరణదోషాదకరణమాత్మా సంభవతి గర్భజననే, దృష్టం చేష్టా యోనిరైశ్వర్యం మోక్షశ్చాత్మవిద్ధిరాత్మాయత్తం. న హ్యన్యః సుఖదుఃఖయోఃకర్తా. న చాన్యతో గర్భో జాయతే జాయమానః, నాఙ్కురోత్పత్తిరబీజాత్.

**తాత్పర్యము :** తల్లికిగాని, తండ్రికిగాని, ఆత్మకుగాని గర్భముయొక్క సమస్త భావములందును యథేష్టకారిత్వము లేదు. వారు తమ వశము వలన కొంచెమును, కర్మవశము వలన కొంచెమును చేయుదురు. సాధన సంపత్తి ననుసరించి వీరికి ఒక్కొక్కచోట యథేష్టకారిత్వము కలుగుచుండును. ఒక్కొక్కచోట కలుగదు. మనస్సు మొదలగు సాధనముల బలమెపుడుండునో అపుడు వానియొక్క బలముననుసరించి కొంచెము చేయుదురు. సాధనములందు దోషములున్నను, ఆత్మ గర్భమును కలిగించుటకు కారణము కాకపోదు. ఇష్టయోనిగమనము, ఐశ్వర్యము, మోక్షము అనునవి ఆత్మకు అధీనమైయుండునని ఆత్మవేత్తలు చెప్పుచున్నారు. సుఖదుఃఖములకు ఆత్మకంటె ఇతరమైన కర్త లేదు. పుట్టుచున్నట్టి గర్భము ఆత్మ కంటె ఇతరమైన దానివలన పుట్టదు. బీజము కానిదానివలన అంకురోత్పత్తి కానేరదు.

**ఆయుర్వేదదీపిక :** ఆత్మ ఆత్మను జనింపజేయునెడల అపుడది వశిత్వాది గుణములు కలిగియున్న ఆత్మను జనియింపజేయవలెను. అని ఏది (భరద్వాజునిచే) చెప్పబడినదో దానికి సమాధానమును "న ఖలు" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. తల్లి మొదలగువానికి గర్భము యొక్క అన్ని భావములయందు యథేష్ట కారిత్వము లేదు అని అన్వయించుకొనవలెను. ఇచటయును, ఆత్మయే ప్రకృతమైనప్పటికీ (ఉద్దేశింపబడినప్పటికీ) సమానమగు సమాధానత్వము వలన తల్లి, తండ్రియను రెండు భావములు సిద్ధించుచున్నవి. ఏ విధముగా ఆత్మకు సర్వ భావములను యథేష్ట కారిత్వము వలన ఇష్టమైన యోనియందు ప్రవేశించుట మొదలగు ప్రసక్తి యున్నదో అదే విధముగా తల్లిదండ్రు లిరువురకునూ యథేష్ట కారిత్వము వలన పుత్రులనే జనింపజేయవలెను అను పూర్వపక్షము పరిహరింపబడినది. ఇక ఏ కారణము వలన ఆత్మాదులకు ఒక్కొక్కప్పుడు యథేష్ట కారిత్వము ఉండదు - అను విషయమును "కించిత్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "కించిత్" అనగా అంతయును కాదు (కొంచెము) అని అర్థము. అచట తల్లిదండ్రులు స్వవశులై గర్భమునకు కారణమగు మైథునమును, సాత్మ్యరస సేవనమునూ ఆచరింతురు, గర్భమునకు జీవాధిష్ఠానము అను మొదలగునవి మాత్రము కర్మాధీనమునందు పరవశమై యుండును. మరియు ఆత్మయును గర్భమునకు చైతన్యము కలిగించుట యందు మరియు ధర్మాధర్మ హేతువులగు క్రియలను చేయుటయందు స్వవశమై యుండును; కర్మజన్యములగు ఇష్టానిష్ట యోనులయందు ప్రవేశించుటయందు

మాత్రము ధర్మాధర్మము పైననే పరాధీనమై యుండును. అందువలన కర్మాధీన విషయమునందు తల్లి మొదలగువానికి యథేష్ట కారిత్వము లేదు. తల్లి మొదలగు వానికి కొంచెము యథేష్ట కారిత్వము ఉండునని చూపుటకు "క్వచిచ్చేషామ్" అను మొద లగునవి చెప్పుచున్నాడు. "కరణమనగా" ఉపకరణము, సాధనము ఉపాయము అని అర్థము. సత్త్వమనగా మనస్సు, ఆదియనగా ప్రధానమైనది, దేనికి మనస్సు ప్రధానముగా నుండునో అవి -మనస్సు, ఇంద్రియములు, శుక్రము, శోణితము మొదలగునవి - సత్త్వాదులు అని అర్థము. "యథాబలమ్" అనగా కర్మననుసరించి; బల శబ్దము వలన ఇచట కర్మ (అదృష్టము) చెప్పబడుచున్నది. ఇందువలన తల్లి మొదలగువానికి ఎచట పుత్రుని కోరుటయందు ఇష్ట యోని ప్రవేశమునందు శక్తి కలుగునో మరియు కర్మము వానికి అనుగుణముగా నుండునో అచట కోరిన పుత్రుని పొందుటయందు, ఇష్టమైన యోనియందు ప్రవేశించుట మొదలగు కార్యములు జరుగును. అది ఎట్లనగా - పురుషుడు విశుద్ధమగు శుక్రము ఎక్కువగా యుండి, స్త్రీయును విశుద్ధమగు యోని గర్భాశయము మొదలగువానిని కలిగియుండి పుత్రుని జనియింపజేయు కర్మ వారిరు వురకును బలవంతమైయున్నపుడు పుత్రుని బడయవలెనని సంకల్పించి మైథునమును చేయువారై కోరిన పుత్రుని బడయుదురు; అట్లే ఆత్మయును విశుద్ధమగు సత్త్వాది గుణములతో కూడియున్నదై తత్కాలమున శుభకర్మ కలిగియుండి ఇష్టమగు యోనిని కోరుచున్నప్పుడు ఇష్టమగు యోనియందు ప్రవేశించుటను ఆత్మ సాధించుట అనునవి యథేష్ట కారిత్వమునకు ఉదాహరణములు అని తెలియ వలెను. "అతో౭న్యథా" అనగా సత్త్వాది సాధనములు సరిగా లేనప్పుడును, పూర్వజన్మయందలి కర్మ వ్యతిరేకముగా నున్ననూ అని తెలియవలెను. "విపర్యయే" అనగా యథేష్టకారిత్వము లేకుండుట అని అర్థము. లేదా, కొన్నింటియందు అనగా మైథునాదులయందు పిత్రాదులకు స్వవశత్వముండునట్లు జీవుడు ప్రవేశించుటయందును వానికి స్వవశత్వముండునా అని "క్వచిచ్చేషామ్" అట్లు మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. తల్లి మొదలగువానికి కొంత కార్యమునందే కరణశక్తి యుండుటవలన అన్నింటను అట్లు శక్తి లేకపోవును. అందువలన గర్భము యొక్క అన్ని భావములకును స్వవశత్వముండదని భావము. ఎచట ఈ తల్లి మొద లగునవి స్వవశములై ప్రవర్తించునో అచటయునూ అవి తమతమ కరణములచే యుక్తమైయుండియే అట్లు చేయుచున్నవి అని "యత్ర సత్త్వా"అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "యథాబలమ్" అనగా యథాశక్తి (శక్తి కొలది) అని

అర్థము. ఇందువలననూ తల్లి మొదలగునవి యే విశేషములందు సమర్థత కలిగి యుండునో ఆ విశేషములందు సత్త్వము మొదలగువాని బలము వలన యథేష్ట కారిత్వము కలిగియున్నవి. అంతేకాని అశక్యము అగు విషయమునందు లేక కరణములు దెబ్బతిని యున్నప్పుడు యథేష్టకారిత్వమును కలిగియుండవని చూపు చున్నాడు. "అతోఽన్యథా విపర్యయః" అనుదానియొక్క అర్థము ముందుగనే వివ రింపబడినది. సత్త్వాదికరణ దోషముచేత ఈ ఆత్మ పైవిధముగా గర్భమును కలి గింపదు కదా, హంత ! అట్లైనచో, ఈ ఆత్మ (గర్భమునకు) అకారణమే యగు చున్నది. కారణమెట్లుండునో అది అట్టిదేయగు కార్యమును చేయును అని "న చ" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. కరణదోషము వలన గర్భమును కలిగింప కున్ననూ ఆత్మ ఎప్పుడునూ గర్భమును కలిగించుటయందు అకారణమగునని కాదు. అట్లైననూ (కరణదోషము వలన గర్భమును కలిగింపలేకున్ననూ) అది కారణ మగుచునేయున్నది. ఇది ఎట్లనగా మన్ను మొదలగువాని అభావమువలన ఘటమును చేయకున్ననూ కుంభకారుడు ఘటమునకు కారణమే యగుచున్నాడు. అట్లే ఆత్మ యును సాధనములయందలి దోషములచేత గర్భమును చేయలేకున్ననూ దానిని కలి గించు శక్తిని కలిగియుండుట ఎక్కువసార్లు చూడబడియుండుటచే కారణమే యగు చున్నది. మరియు ఇష్టయోనియందు ప్రవేశించుటయందు చేయబడిన ప్రసక్తియును ఆత్మచే చేయబడునని భావింపబడినది ఎందువలననగా ఆత్మకు కారణత్వము ఉండుట వలన - అట్టి యథేష్టకారిత్వము కొంచెము ఉండునని చూపుచు "దృష్టం చ" అను మొదలగువానిని చెప్పుచున్నాడు. యోని ఆత్మాధీనము అనగా పురుషునికి ఇష్టమైన యోని అని అర్థము. అట్లే ఐశ్వర్యాదులు ఆత్మాధీనములే అయియుండుట చూడబడి నది. కతిధాపురుషీయమునందు "ఆవేశశ్చేతసోజ్ఞానం" అను మొదలగువానిద్వారా ఈ విషయమును చెప్పియున్నాడు. ఆత్మకు కారణత్వముండుటకు ఇతర హేతువులను "న హ్యన్య" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. సుఖదుఃఖములకు ఆత్మ కంటె వేరు కర్త లేనందువలన, ఆత్మయే సుఖదుఃఖ సాధనములగు ఇంద్రియ, శరీర కర్మలకు కర్తయైనందువలననూ సుఖదుఃఖములకు ఆధారమగు గర్భమునకు ఆత్మ కారణమని భావము. ఇక భూతములే ఎందుచేత సంయోగ వశమున చేతనత్వమును పొంది సుఖాదులకు కారణములగుటలేదు అను విషయమును "న చాన్యత" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "అన్యత" అనగా వేరై యుండుటచేత. "జాయమానః" అనగా ఉత్పత్తి యగుచున్న కారణము వంటి కార్యమే

ఉత్పత్తి యగుచున్నది. ఎందువలననగా శనగ యొక్క అంకురము కొబ్బరికాయ (బీజము)నుండి ఉత్పత్తి యగుటలేదు. "అబీజాత్" అనగా కార్యత్వముగా అభిప్రాయపడిన అంకురమునకు కావలసిన బీజము కాకపోవుటవలన అని అర్థము. ఇందు వలన గర్భమునకు చేతనత్వమేది కలదో అది అచేతనములగు భూతములవలన కలుగదు, కాని చేతనాధారమగు ఆత్మ వలననే కలుగుచున్నదని చూపుచున్నాడు.

## ఆత్మజ భావములు

10. యాని తు ఖల్వస్య గర్భస్యాత్మజాని, యాని చాస్యాత్మతః సంభవతః సంభవన్తి, తాన్యనువ్యాఖ్యాస్యామః, తద్యథాతాసు తాసు యోనిషూత్పత్తి-రాయురాత్మజ్ఞానం మన ఇన్ద్రియాణి ప్రాణాపానౌ ప్రేరణం ధారణమాకృతి-స్వరవర్ణవిశేషాః సుఖదుఃఖే ఇచ్ఛాద్వేషౌ చేతనా ధృతిర్బుద్ధిః స్మృతిరహఙ్కారః ప్రయత్నశ్చేతి (ఆత్మజాని).

**తాత్పర్యము :** ఈ గర్భమునకు, జనించిన శిశువునకును ఆత్మ వలన ఏవి కలుగునో దానిని గూర్చి చెప్పుకొందము- అవి యేవనగా-ఆ యా యోనులందు పుట్టుట, ఆయువు, ఆత్మజ్ఞానము, మనస్సు, ఇంద్రియములు, ప్రాణవాయువు, అపాన వాయువు, ప్రేరణము, ధారణము, ఆకారము, స్వరము, వర్ణము, సుఖదుఃఖములు, ఇచ్ఛాద్వేషములు, చైతన్యము, ధారణాశక్తి, బుద్ధి, స్మృతి, అహంకారము, ప్రయత్నము అనునవి. ఇవి ఆత్మ వలన కలుగునవి.

**ఆయుర్వేదదీపిక :** గర్భమునకు ఆత్మజత్వమును పై విధముగా వివరించి ఆత్మజ విశేషములను "యాని" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. ప్రేరణము మరియు ధారణము అనునవి ఇంద్రియములకే వర్తించును. ఇచటయును ధర్మాధర్మముల వలన కలుగు దేవాది ఉత్తమ యోనులందును పశువు మొదలగు నీచ యోనులందును ప్రవేశించుటకు కారణములగు ధర్మాధర్మములకును వానిని కలిగింప జేయు ఆత్మయే మూలకారణమని చెప్పబడుచున్నది. ఆత్మజ్ఞాన ప్రాణాపాన ప్రేరణాదులయందు మనస్సును సాధనముగా చేసికొని ఆత్మయే వ్యవధానము చేయుట వలన అది కారణమగుచున్నది.

## గర్భమునకు సాత్మ్యము వలన కలుగు భావములు

11. సాత్మ్యజశ్చాయం గర్భః. నహ్యసాత్మ్యసేవిత్వమన్తరేణ స్త్రీపురుషయోర్వ-
న్ధ్యత్వమస్తి, గర్భేషు వాఽప్యనిష్టో భావః. యావత్ ఖల్వసాత్మ్యసేవినాం స్త్రీ-
పురుషాణాం త్రయోదోషాః ప్రకుపితాః శరీరముపసర్పన్తో న శుక్రశోణిత-
గర్భాశయోపపద్యన్తే తావత్ సమర్థా గర్భజననాయ భవన్తి. సాత్మ్యసేవినాం
పునః స్త్రీ పురుషాణామనుపహతశుక్రశోణితగర్భాశయానామృతుకాలే సన్ని-
పతితానాం జీవస్యానవక్రమాద్గర్భా న ప్రాదుర్భవన్తి. నహి కేవలం
సాత్మ్యజ ఏవాయం గర్భః, సముదయోఽత్రకారణముచ్యతే. యాని ఖల్వస్య
గర్భస్య సాత్మ్యజాని యాని చాస్య సాత్మ్యతః సంభవతః సంభవన్తి,
తాన్యనువ్యాఖ్యాస్యామః: తద్యథా—ఆరోగ్యమనాలస్యమలోలుపత్వమిన్ద్రి-
యప్రసాదః స్వరవర్ణబీజసంపత్ ప్రహర్షభూయస్త్వం చేతి (సాత్మ్యజాని).

**తాత్పర్యము :** ఈ గర్భము సాత్మ్యము వలన నేర్పడును. అసాత్మ్య సేవనము చేయకుండుట వలన స్త్రీ పురుషులకు వంధ్యత్వముగానీ గర్భములందు అనిష్ట భావములు కానీ ఉండవు. అసాత్మ్య సేవనము చేయు స్త్రీ పురుషులకు త్రిదోషములు ప్రకోపించినపై శరీరమున ప్రసరించుచున్నను శుక్రశోణిత గర్భాశయములకు విఘాతమును కల్గించనంతవరకు గర్భము కలుగును. సాత్మ్యమును సేవించుచు పరిశుద్ధములగు శుక్రశోణిత గర్భాశయములను కలిగియుండి, ప్రశస్తమైన ఋతుకాలమునందు సంగమమునొందు స్త్రీ పురుషులకును జీవుడు సంక్రమింపక పోయినచో గర్భములు కలుగనేరవు. అందుచే ఈ గర్భము కేవలము సాత్మ్యము నుండి పుట్టినది మాత్రమే కాదు. ఇది అన్ని భావముల సముదాయము వలననే కలుగును అని చెప్పబడుచున్నది. ఈ గర్భమునకును జనించిన దానికిని సాత్మ్యసేవన వలన నేవి కలుగుచున్నవో వానిని చెప్పుచున్నాము-అవి యేవనగా-ఆరోగ్యము, సోమరితనము లేకుండుట, విషయాసక్తి లేకుండుట, ఇంద్రియ నైర్మల్యము, స్వర-వర్ణ-బీజ సంపత్తు, సంతోషము అనునవి. ఇవి సాత్మ్యసేవన వలన కలుగును.

**ఆయుర్వేదదీపిక :** "సాత్మ్యజశ్చ" అను మొదలగువానిద్వారా సాత్మ్యజత్వమును వివరించుచున్నాడు. అసాత్మ్య సేవన వలన గర్భమునకు ఉపఘాతము కలుగుటను చూపుచు సాత్మ్యసేవనము గర్భమునకు కారణమగుటను దృఢపరచుచున్నాడు. అసాత్మ్య సేవనము చేయువారికిని సంతానము కలుగుటను చూపుచు

"అసాత్మ్యసేవినశ్చ నిఖిలేనానపత్యాః స్యుః" అను పూర్వపక్షమును (భరద్వాజుని వాక్యము) పరిహరించుచున్నాడు. "సాత్మ్యసేవినాం పునః" అను సూత్రము వలన "సాత్మ్యసేవినామేకాన్తేన ప్రజా స్యాత్" అని ఏది చెప్పబడినదో దానిని పరిహరింపుచున్నాడు. "సన్నిపతితానామ్" అనగా వ్యవాయమును (లైంగిక సంపర్కమును) పొందుచున్నవారలకు అని అర్థము. ఇచట స్వర-వర్ణములు రెండును సాత్మ్యజములు గను, ఇంతకుముందు ఆత్మజములుగను చెప్పబడినవి. అందువలన సాత్మ్య-ఆత్మలు రెండును వీనికి కారణములని తెలియవలెను.

## గర్భమునకు రసము వలన కలుగు భావములు

12. రసజశ్చాయం గర్భః. న హి రసాదృతే మాతుః ప్రాణయాత్రాఽపి స్యాత్, కిం పునర్గర్భజన్మ. న చైవాసమ్యగుపయుజ్యమానా రసా గర్భమభినిర్వర్తయన్తి న చ కేవలం సమ్యగుపయోగాదేవ రసానాం గర్భాభినిర్వృత్తిర్భవతి, సముదాయోఽప్యత్ర కారణముచ్యతే. యాని తు ఖల్వస్య గర్భస్య రసజాని, యాని చాస్య రసతః సంభవతః సంభవన్తి, తాన్యనువ్యాఖ్యాస్యామః: తద్యథాశరీరస్యాభినిర్వృత్తిరభివృద్ధిః ప్రాణానుబన్ధస్తృప్తిః పుష్టిరుత్సాహశ్చేతి (రసజాని).

తాత్పర్యము : ఈ గర్భము రసము వలననూ కలుగుచున్నది. రసము లేకుండగ తల్లికి జీవనమే యుండరాదు. ఇక గర్భము కలుగుట యనునది ఉండనే యుండదు. రసములను సరిగా ఉపయోగించకపోవుటవలన గర్భము కలుగనేరదు. ఇంకనూ రసములనుసరిగ ఉపయోగించుటవలన మాత్రముననూ గర్భము కలుగ నేరదు. వీటన్నిటి (తల్లి తండ్రి ఆత్మ మొదలగువాటన్నింటి) సముదాయమే గర్భము కలుగుటకు కారణమగునని చెప్పబడుచున్నది. ఈ గర్భమునకును, జనించినదానికిని రసము వలన ఏవి కలుగునో వానిని గురించి చెప్పుకొందము. అవి యేవనగా — శరీరము ఏర్పడుట, అభివృద్ధి చెందుటయు, ప్రాణములు నిలచి యుండుట, తృప్తి, పుష్టి, మరియు ఉత్సాహము అనునవి. ఇవి రసము వలన కలిగినవి.

ఆయుర్వేదదీపిక : "ప్రాణ యాత్రాఽపి స్యాత్" అనగా గర్భధారణకు కారణభూతముగా నుండు తల్లియొక్క ప్రాణములతోనుండు స్థితి అని అర్థము.

"న చైవాసమ్యగుపయుజ్యమానా" అను మొదలగువానివలన అసాత్మ్యరసము సేవించువారలకు గర్భమునకు ఉపఘాతము కలుగుటను చూపుచున్నాడు. అసాత్మ్యరసమును సేవించువారలకు సంతానము కలుగుట యనునదేది కలదో అది అసాత్మ్య సేవనము చేయువారలకు సంతానము కలుగుటవలెనే యుండుటవలన ఇచట మరల చూపబడలేదు. "సముదాయోఽప్యత్ర కారణమ్" అనుటవలన మాత్రము రసమును సరిగా సేవింపనివారికిని సంతానము కలుగుటయందు ధర్మాదులే కారణమని చూపుచున్నాడు. "అభినిర్వృత్తి" యనగా అంగప్రత్యంగములు వ్యక్తమగుట. "ప్రాణానుబంధః" అనగా బ్రతుకు కలిగియుండుట. "పుష్టిః" అనగా ఉపచయము. "వృద్ధి" యనగా పొడవు పెరుగుట, "ఉత్సాహః" అనగా బలము. ఇతి శబ్దము ప్రకారమునందు ఉపయోగింపబడినది. ఇదియును ఇతరములు అగు వర్ణాదులును రసజములు అని చూపుచున్నాడు. ఇక్కడ ఇంతకుముందు సూత్రములలోని ఇతి శబ్దమును వ్యాఖ్యానించుకొనవలెను. ఇతి శబ్దము పరిసమాప్తి కొరకు ఎపుడు ఉపయోగింపబడినదో అపుడు, ప్రారంభింపబడిన (చెప్పబడిన) రసజములకును పరిసమాప్తియని తెలియవలెను. అందువలన ప్రారంభింపబడని (చెప్పబడని) వర్ణాదులుకూడ రసజములుగా వచ్చుచున్నవి.

## మనస్సు జీవునికి శరీరమునకును సంబంధ మేర్పరచుట

13. అస్తి ఖలు సత్త్వమౌపపాదుకం: యజ్జీవం స్పృక్ శరీరేణాభి సంబధ్నాతి, యస్మిన్నపగమన పురస్కృతే శీలమస్య వ్యావర్తతే, భక్తిర్విపర్యస్యతే, సర్వేన్ద్రియాణ్యుపతప్యన్తే, బలం హీయతే, వ్యాధయ ఆప్యాయ్యన్తే. యస్మాద్దీనః ప్రాణాఞ్జహాతి, యదిన్ద్రియాణామభిగ్రాహకం చ "మన" ఇత్యభిధీయతే: తత్త్రివిధమాఖ్యాయతే - శుద్ధం, రాజసం, తామసమితి యేనాస్య ఖలు మనోభూయిష్ఠం, తేన ద్వితీయాయా మాజాతౌ సంప్రయోగోభవతి: యదా తు తేనైవ శుద్ధేన సంయుజ్యతే, తదా జాతేరతి క్రాన్తాయా అపి స్మరతి. స్మార్తం హి జ్ఞానమాత్మనస్తస్యైవ మనసోఽను బన్ధాదనువర్తతే, యస్యానువృత్తిం పురస్కృత్య పురుషో "జాతిస్మర" ఇత్యుచ్యతే. యాని ఖల్వస్య గర్భస్య సత్త్వజాని, యాన్యస్య సత్త్వతః సంభవతః సంభవన్తి, తాన్యనువ్యాఖ్యాస్యామః: తద్యథా - భక్తిః శీలం శౌచం ద్వేషః స్మృతిర్మోహస్త్యాగో మాత్సర్యం శౌర్యం భయం క్రోధస్తన్ద్రి ర్సాహస్తైక్ష్ణ్యం మార్దవం

గామ్భీర్యమవస్థితత్త్వమిత్యేవమాదయశ్చాన్యే, తే సత్త్వవికారా యాన్యుత్తర కాలం సత్త్వభేదమధికృత్యోపదేక్ష్యామః. నానావిధాని ఖలు సత్త్వాని, తాని సర్వాణ్యేకపురుషే భవన్తి. న చ భవన్త్యేకకాలమ్, ఏకం తు ప్రాయో వృత్త్యాఽఽహ.

**తాత్పర్యము :** మనస్సు ఔపపాదుకముగ నుండును. ఏది ఆత్మను స్పర్శ యుక్తమగు శరీరముతో కూర్చునో, ఏది పోవుటకు సిద్ధముగ నున్నపుడు – శీలము వ్యతిరేకముగా మారునో, ఇచ్ఛ మార్పు నొందునో, సమస్తేంద్రియములు తపింప బడునో, బలము క్షీణించునో, వ్యాధులు వృద్ధిపొందునో, ఏది పోయినపుడు ప్రాణ ములు పోవునో, ఏది ఇంద్రియములను ధరించి యుండునో – అది మనస్సు అని పేర్కొనబడుచున్నది. అట్టి మనస్సు శుద్ధ మనియు (సాత్త్వికమనియు), రాజసమనియు, తామసమనియు మూడు విధములుగ నుండును. మనస్సునకు సత్త్వరజస్తమో గుణములతో దేనితో నెక్కువ సంబంధముండునో అట్టి గుణము యొక్క సంబంధము రెండవ జన్మయందును ఉండును. ఎప్పుడు మనస్సు సత్త్వ గుణముతో కూడియుండునో అప్పుడది క్రిందటి జన్మయందలి విషయములనుకూడ స్మరించును. స్మరింపబడిన జ్ఞానము అట్టి మనస్సుయొక్క సంబంధము చేతనే ఆత్మను అనుసరించి కలుగును. అట్లు అనుసరించియుండుటను ఆధారముగా జేసికొని ఆ పురుషుడు జాతిస్మరుడు అని పేర్కొనబడుచున్నాడు. ఇట్లు సత్త్వము చెప్పబడినది. ఈ గర్భమునకు, జనించినదానికిని సత్త్వము వలన కలుగునవేవి కలవో వానిని గూర్చి చెప్పుకొందము. అవి యేవనగా – ఇచ్ఛ, స్వభావము, శౌచము, ద్వేషము, స్మృతి, మోహము, త్యాగము, మాత్సర్యము, శౌర్యము, భయము, కోపము, పాలుమాలిక, ఉత్సాహము, తీక్ష్ణత్వము, మృదుత్వము, గాంభీర్యము, స్థిరముగా లేకుండుట–అనునవియు ఇంకనూ ఇటువంటి ఇతరములైనవియును సత్త్వము వలన కలుగును. ఇతర భావములను సత్త్వభేదముల నాధారముగ జేసికొని తరువాత చెప్ప బోవు చున్నాము. అన్ని విధములగు సత్త్వములు ఒకే పురుషునియందుండును. కాని, ఏక కాలమున నుండవు. ఏ సత్త్వము అధికముగనుండునో మనుజుడు అట్టి సత్త్వము కలవాడుగ చెప్పబడును.

ఆయుర్వేదదీపిక : "అస్తి" అను మొదలగువానిద్వారా ఇంతకు ముందు భరద్వాజునిచే ఆక్షేపింపబడిన మనస్సుయొక్క ఔపపాదుకత్వమునకు సమాధానము నిచ్చుచున్నాము. 'అపి' శబ్దము అవధారణమునందు ఉపయోగింపబడి

నది. ఇచటయును 'యజ్జీవం స్పృక్శరీరేణాభిసంబధ్నాతి" అను మొదలగువాని ద్వారా మనస్సుయొక్క అసాధారణ ధర్మమును చెప్పబడియే ఉపపాదుకమును సిద్ధింపజేయునదగును. ఎందువలననగా మనస్సు లేనపుడు ఈ చెప్పబడుచున్న ధర్మము సిద్ధింపకపోవుటవలన. నిత్యము ఆత్మను స్పర్శించునది 'స్పృక్' అని అర్థము. శరీరమనగా ఆతివాహిక శరీరము, అందువలన కారణభూతమగు స్పృక్ శరీరము వలన ఆత్మ రూపమగు జీవము బంధింపబడును: భోగాయతన శరీరము వలన అని అర్థము. ఆతివాహిక శరీరము యొక్క అస్తిత్వము, "భూతైశ్చతుర్భిః సహితః సుసూక్ష్మైర్మనోజవో దేహముపైతి దేహాత్". (చరక-శారీర స్థానము 2వ అధ్యాయము) అనుట వలన ప్రతిపాదింపబడినది. లేదా జీవమ్ - ఆత్మను, స్పృక్ శరీరేణ - స్పర్శము గల శరీరముతో, ఏ మనస్సు సంబంధమును కల్పించునో అది ఉపపాదుకముగ నుండునని అన్వయించుకొనవలెను. ఇట్లనుకొనవలెను - ఒక వేళ మనస్సు ఆత్మతో శరీరమునకు సంబంధమును కల్గించునని స్వీకరించబడినచో, అప్పుడు ఆత్మకు వ్యాపకత్వముండుట వలన ఎల్లెడలనూ అది అగుచుండవలెను. కాని అట్లు జరుగుటలేదు. అందుచేత ఎచట మాత్రము స్పర్శయుక్తమగు శరీరమునందు మనస్సు ప్రతిబద్ధమగుచున్నదో అచటనే ఇది సుఖదుఃఖములను పొందబడుచున్నది. 'స్పృక్' అను విశేషణము వలన శరీరము యొక్క మాత్రనఖ కేశములయందు మనోగమనము లేకుండుట వలన ఆత్మయొక్క అనుపలబ్ధిని చూపుచున్నాడు. "అప గమన పురస్కృతే" అనగా దేహాంతర గమనమునకు సిద్ధముగా నున్నపుడు. భక్తి యనగా కోరిక. "యస్మాద్హీన" అనగా మనస్సుచేత వదలిపెట్టబడిన. ''యేన'' అనగా అట్లున్న సాత్త్వికము వలన, రాజసము వలన లేదా, తామసము వలన మనస్సు ఎక్కువగా కూడియుండుట అని అభిప్రాయము. 'ద్వితీయాయామాజాతౌ' అనగా రెండవ జన్మయందు: పూర్వజన్మయందు ఎటువంటి మనస్సు ఉండునో అటువంటిదే తరువాతి జన్మయందును సాధారణముగా నుండునని అర్థము. కొందరు మాత్రము, "తేన న ద్వితీయాయాం" అను మొదలగువానిని పఠింతురు. అచటయును సాధా రణముగా రెండవ జన్మయందు సమానమగుదానితో మనస్సుయొక్క సంయో గము జరుగదు కాని ఎప్పుడో ఒకప్పుడు జరుగును అని అర్థము. "నాస్య కించిత్ పౌర్వ దేహికమవిదితం స్యాత్" అని ఏది చెప్పబడినదో అట్టి పౌర్వదేహిక జ్ఞానము కొంచెము కలుగునని చూపుటకు "యదా తు" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "ఉపేతేన" అనగా విశుద్ధమగు సత్త్వగుణముతో అని అర్థము. "తిష్ఠత్యేవ" అని చెప్ప బోవుచున్న ''యస్య'' అనుదానికి సంబంధింపబడియున్నది. యోని మంత్రము

యొక్క పీడనము వలన కలిగిన తమస్సుచే వికలమైన మనస్సు గడచిన జన్మ యందలి విషయములను స్మరింపదు. సత్త్వమెక్కువగా నున్నపుడు తమస్సు మనస్సు నావరింపదు అప్పుడు మనస్సు గడచిన జన్మయందనుభవించిన విషయములను తప్పక స్మరించునని భావము. "పురస్కృత్య" అనగా కారణమగుట వలన అవధరించి అని అర్థము. ఈ మనస్సు యొక్క ధర్మ సముదాయము ఇంద్రియోపక్రమణీయాధ్యాయ మున చెప్పబడినప్పటికీ మరల ఇచట ప్రకరణ వశమున చెప్పబడుచుండుట యను నది పునరుక్తి దోషమును పొందదు. సత్త్వమునకు గర్భజనకత్వము ప్రత్యక్షముగా చెప్పబడనప్పటికీ సత్త్వమునకు గర్భము ఎడల ఉపపాదుకత్వమేది చెప్పబడినదో, దానివలననే సత్త్వమునకు గర్భజనకత్వమున్నదను ప్రతిజ్ఞ చేయబడినదని అను కొనవలెను. అందువలన "యాని ఖల్వస్య గర్భస్య సత్త్వజాని" అను మొదలగు వాని వలన గర్భమునందు సత్త్వజ భావములను చెప్పుట సరిగనే యున్నది. గర్భ కారణమగు సత్త్వమునకును ఉపపాదుకమని చెప్పుటచే ఏ కారణము చెప్పబడినదో, అది గర్భ కారణత్వమునకు అతిరిక్తమగు దేహామునుండి వేరు దేహమునకు వెళ్లుట యను మనోధర్మము యొక్క ప్రతిపాదన కొరకు చెప్పబడినది అని తెలియ వలెను. ''నానా విధాని'' అనగా నానా విధములగు సాత్త్వీక, రాజస, తామస, వృత్తుల వలన వేర్వేరుగా నుండునవి అని అర్థము. అవి ఒకే పురుషుని యందు కలుగును అనుట వలన - ఒకే పురుషుడు ఒక్కొక్కప్పుడు ధర్మక్రియల వలన సాత్త్వికుడగును, ఒక్కొక్కప్పుడు కామ చింతనచే రాజసుడగును, ఒక్కొక్క ప్పుడు మోహామునందుండి తామసుడగును అని చూపుచున్నాడు. 'న భవన్త్యేక కాలమ్' అనగా ఒకేమారుగా సాత్త్వికాది ధర్మములు కలుగక ఒకదాని తరువాత నొకటి కలుగును అని అర్థము. ఒకవేళ ఒక పురుషునియందే సాత్త్వికాదులన్నియు కల్గుచున్నవి గదా! అట్టి ఎడ ఏ విధముగా ఇతడు సాత్త్వికుడు అను మొదలగు వ్యపదేశము ఎట్లు కలుగును ? అను విషయమును - 'ఏకం తు' అను మొదలగు వాని ద్వారా చెప్పుచున్నాడు. 'ప్రాయోవృత్త్యా' అనగా ఎక్కువగా ఎవనికి సాత్త్విక చేష్టలుండునో అతడు సాత్త్వికుడని, ఎవనికి ఎక్కువగా రాజస వృత్తులుండునో అతడు రాజసుడనియు చెప్పబడును అను మొదలగునవి. ఇదే విషయము మొదట (సూత్ర స్థానము 8వ అధ్యాయమునందు) చెప్పబడినది - "యద్గుణం చాభీక్ష్ణం పురుషమనువర్తతే సత్త్వం తత్సత్త్వమేవోపదిశన్తి బాహుల్యానుశయాత్". (ఏ గుణ మును మాటిమాటికిని పురుషుని యొక్క సత్త్వము అనుసరించునో ఎక్కువగా నుండుటవలన అట్టి గుణమే ఆ సత్త్వము కలిగియున్నదని చెప్పుదురు).

14. ఏవమయం నానావిధానామేషాం గర్భకరాణాం భావానాం సముదాయాదభి-
నిర్వర్తతే గర్భః, యథా - కూటాగారం నానాద్రవ్యసముదాయాత్, యథా
వా - రథో నానారథాంగసముదాయాత్; తస్మాదేతదవోచామ -
మాతృజశ్చాయం గర్భః, పితృజశ్చ, ఆత్మజశ్చ, సాత్మ్యజశ్చ, రసజశ్చ,
అస్తి చ సత్త్వమౌపపాదుకమితి. (హోవాచ భగవానాత్రేయః).

**తాత్పర్యము :** ఇట్లు, ఏ విధముగా - అనేక ద్రవ్యముల సముదాయము చేత గృహము, లేదా, ఏ విధముగా - అనేక రకములైన రథము యొక్క అంగముల సముదాయముచేత రథము ఏర్పడుచున్నట్లు అనేక విధములైనట్టియు, గర్భకరములైనట్టియు భావముల సముదాయముచే గర్భము ఏర్పడుచున్నది.

అందువలననే - ఈ గర్భము మాతృజమునూ, పితృజమునూ, ఆత్మజమునూ, సాత్మ్యజమునూ, రసజమునూ అయియున్నదనియూ, మరియు సత్త్వము ఔపపాదుకముగ నున్నదనియు చెప్పుచున్నాము అని ఆత్రేయ భగవానుడు చెప్పెను.

**ఆయుర్వేదదీపిక :** ఈ విధముగా తల్లి మొదలగు కారణములను వివరించుటవలన గర్భమునకు చెప్పబడిన సముదాయము వలన పుట్టుకను దృష్టాంతము ద్వారా దృఢీకరించుటకు "ఏవమయమ్" అను మొదలగునవి చెప్పుచున్నాడు. కూటాగారమనగా జేంతాకస్వేదము కొరకు ప్రతిపాదించబడిన వర్తులాకారగృహము. ఇతరులు మాత్రము వస్త్రాదులతో చేయబడిన సంచారి గృహమును కూటాగారమందురు. ఇచట ప్రకరణమునందు కూడ తల్లి మొదలగు అన్ని కారణములు కలిసియున్నపుడే గర్భమునకు కారణమగుచున్నవి మాతా, పితా, ఆత్మ, సత్త్వములను వదలి సాత్మ్యము రసముల రెంటింటికే కారణత్వమును వివరించుటయందు "సముదాయోఽప్యత్ర కారణమ్" అని చెప్పబడినదేది వలనో అచట ఇట్లు అనుకొనవచ్చును - ఇచట ఏ విధముగా తల్లి మొదలగు నాల్గు భావములు ఎట్లు అవశ్యముగా గర్భమునకు కారణములైనవో సాత్మ్యము రసములు అట్లు కావు; ఎందువలననగా శుక్రము, శోణితము, మనస్సు, ఆత్మల యొక్క సంసర్గమువలననే గర్భము కలుగుచున్నది. గర్భమేర్పడుటయందు సాత్మ్య రసముల అవశ్యకత లేదు. గర్భము ఏర్పడిన తరువాత కాలమున సాత్మ్యము రసములవలన గర్భమునకు పుష్టి కలిగింపబడుచున్నది. అందువలన సాత్మ్యమునందు, రసమునందును తప్పక సముదాయము నందు అపేక్షిత్వమును చూపుచు అచటనే "సముదాయోఽప్యత్ర కారణమ్" అని

చెప్పబడినది. తల్లి మొదలగునవి మాత్రము పరస్పరము సముదాయమునందుండ వలసినవై యున్ననూ, సాత్మ్యరసములు మొదట గర్భముయొక్క కలయికయందు అవశ్యముగా ఉండవలసి లేకుండుటం జేసి మరల అచట సముదాయాపేక్షిత్వము చెప్పబడలేదు. "సముదాయాదేషాం భావానాం" అనుటవలన తల్లి మొదలగు నాల్గు భావములకు పరస్పర సముదాయము కొరకు అపేక్షిత్వము ఏది కలదో అది చెప్ప బడియే యున్నది. ఇంకనూ గర్భమునకు అవిశేషముగా సాత్మ్యరసముల రెండింటికీ కారణత్వము — "సాత్మ్యజశ్చాయం", "రసజశ్చాయం" అని ఏది చెప్పబడినదో అది గర్భమేలకమునకు తరువాతి కాలమునందు కారణమగుట వలన చెప్పబడినది. మరియు తల్లి, తండ్రి ఇరువురకును విశుద్ధమగు శుక్రశోణితములను ఉత్పత్తి చేయుట యను కారణములుగా పరంపరగా కారణత్వము వలన అని తెలియవలెను.

15. భరద్వాజ ఉవాచ — యద్యయమేషాం నానావిధానాం గర్భకరాణాం భావానాం సముదాయాదభినిర్వర్తతేగర్భః కథమయం సంధీయతే, యది చాపి సంధీయతే కస్మాత్ సముదాయప్రభవః సన్ గర్భో మనుష్యవిగ్రహేణ జాయతే, మనుష్యస్య మనుష్యప్రభవ ఉచ్యతే; తత్ర చేదిష్టమేతద్యస్మా-న్మనుష్యో మనుష్యప్రభవ స్తస్మాదేవ మనుష్యవిగ్రహేణ జాయతే, యథా-గౌర్గోప్రభవః, యథా - చాశ్వోఽశ్వప్రభవః ఇతి, ఏవం సతి యదుక్తమగ్రే సముదాయాత్మక ఇతి తదయుక్తమ్. యది చ మనుష్యో మనుష్యప్రభవః, కస్మాజ్జడాన్ధకుబ్జమూకవామనమిన్మిన వ్యఙ్గోన్మత్తకుష్ఠికిలాసిభ్యో జాతాః పితృసదృశ-రూపా న భవన్తి. అథాత్రాపి బుద్ధిరేవం స్యాత్ - స్వేనైవాయమాత్మా చక్షుషా రూపాణి వేత్తి, శ్రోత్రేణ శబ్దాన్, ఘ్రాణేన గన్ధాన్, రసనేన రసాన్, స్పర్శనేన స్పర్శాన్, బుద్ధ్యా బోద్ధవ్యమిత్యనేన హేతునా న జడాదిభ్యో జాతాః పితృసదృశా భవన్తి. అత్రాపి ప్రతిజ్ఞాహానిదోషః స్యాత్, ఏవముక్తే హ్యాత్మా సత్స్విన్ద్రియేషు జ్ఞః స్యాదసత్స్వజ్ఞః, యత్ర చైతదుభయం సంభవతి జ్ఞత్వమజ్ఞత్వం చ, సవికారశ్చాత్మా. యది చ దర్శనాదిభిరాత్మా విషయాన్ వేత్తి, నిరిన్ద్రియో దర్శనాదివిరహాదజ్ఞః స్యాత్, అజ్ఞత్వాద-కారణమ్, అకారణత్వాచ్చ నాత్మేతి వాగ్వస్తుమాత్రమేతద్వచనమనర్థం స్యాదితి (హోవాచ భరద్వాజః).

**తాత్పర్యము :** భరద్వాజు డిట్లనెను — నానా విధములగు గర్భకర భావములయొక్క సముదాయముచేత గర్భము ఏర్పడుచున్నచో, అట్టి కలయిక ఎట్లు జరుగుచున్నది ? ఒకవేళ కలియుచున్నను సముదాయమువలన కలుగు గర్భము ఎట్లు మనుష్యరూపమున పుట్టుచున్నది ? మనుష్యుడు మనుష్యునినుండి పుట్టునని చెప్పుచున్నారు. మనుష్యుడు మనుష్యప్రభవుడని అంగీకరించినచో అందువలననే మనుష్యరూపమున పుట్టుచున్నాడు. ఉదాహరణకు - ఆవు ఆవునుండి మరియు గుఱ్ఱము గుఱ్ఱమునుండియు పుట్టుచున్నట్లు. ఇది ఇట్లుండగా మొదట గర్భము సముదాయము వలన కలుగునని చెప్పబడినదేది కలదో అది అయుక్తముగా నున్నది. మనుష్యుడు మనుష్య ప్రభవుడైనచో, మందుడు - గ్రుడ్డివాడు - గూనివాడు - మూగవాడు - పొట్టివాడు - నత్తివాడు - మంగు కలవాడు - ఉన్మాదము కలవాడు - కుష్ఠము కలవాడు - బొల్లి కలవాడు అను వీరికి పుట్టుచున్నవారు తండ్రి వంటివారెందుకు అగుటలేదు. ఇచటను ఇట్టి అభిప్రాయము కలుగుచున్నది. ఎట్లనగా - ఆత్మ తన సంబంధమైన చక్షురింద్రియముచే రూపమును, శ్రోత్రేంద్రియముచే శబ్దమును, ఘ్రాణేంద్రియముచే గంధమును, రసనేంద్రియముచే రసమును, స్పర్శనేంద్రియముచే స్పర్శను, బుద్ధివలన బుద్ధిచే తెలిసికొనదగినదానినంతయు తెలిసికొనును. అట్టి ఈ కారణము వలన మందత్వము, గ్రుడ్డి, మూగ ఈ మొదలగునవి ఉన్నవారికి పుట్టినవారు తమ తండ్రివంటి రూపమును (మందత్వాదులను) పొందుటలేదు. ఇచటయును ప్రతిజ్ఞాహాని దోషము కలుగును. ఎందువలననగా - ఇంద్రియములున్నచో ఆత్మ జ్ఞానిగను, ఇంద్రియములు లేనిచో ఆత్మ అజ్ఞానిగను ఉండవలయును. ఇట్లు జ్ఞానము కలిగియుండుట, జ్ఞానము లేకయుండుట అను రెండును సంభవించినచో ఆత్మ వికారముతో కూడి యుండవలయును. ఆత్మ చక్షురాదీంద్రియములచే విషయములను తెలిసికొనునెడల ఇంద్రియరహితుడగు ఆత్మ ఆ ఇంద్రియముల అభావముచే అజ్ఞుడు (ఏమియు తెలియనివాడు) అగును. అజ్ఞుడగుటవలన అకారణత్వము కలుగును. (ఇతడు దేనికిని కారణము కాజాలడు) కారణత్వాభావము కలిగియుండుటవలన "ఆత్మ అర్థరహితమైన శబ్దము మాత్రమే" యను వాక్యము అంగీకరించవలసివచ్చును.

**ఆయుర్వేదదీపిక :** మరల భరద్వాజుడు అడుగుచున్నాడు - "యద్యయమ్" అను మొదలగునవి. "కథం సన్దీయతే" అనగా ఏ విధముగా కలియును అని అర్థము. "మనుష్యవిగ్రహేణ జాయతే" అనగా మనుష్య శరీరముతో ఎందువలన మనుష్య రూపముననే కలుగుచుండుట అని అర్థము. గర్భము సముదాయాత్మకమని

ఏది చెప్పబడినదో అది అయుక్తము-అనగా ఇచట తల్లి మొదలగువానికంటె ఇతరమైన భావములను కారణముగా చెప్పుట వలన మరియు జాతియందే మనుష్యాది రూపము బలవంతమగు కారణమగుట వలన పై చెప్పబడిన తల్లి మొదలగువాని సముదాయము వలన గర్భము కలుగుననునది యుక్తము కాదని భావము. ఈ విషయమునందే మరియొక దూషణమును (ఖండనమును) "యది చేత్" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. జడుడనగా మంద బుద్ధి గలవాడు "మిన్మినః". అనగా ముక్కుతో మాట్లాడువాడు. "పితృసదృశరూపా" అనుచోట పితృశబ్దము వలన తల్లిదండ్రులిరువురను గ్రహింపబడవలయును. కారణము వంటి రూపమును కలిగియుండుట వలన మనుష్యులు కలుగుచున్నచో జడుడు మొదలగు కారణ రూపముల నుండి జనించినవారును కారణ సదృశులుగా నుండవలెననుటచేత జడులుగా నుండవలెనని భావము. ఇచట జడాది ఎక్కువ ఉదాహరణములిచ్చుట - పక్షమును ఎక్కువ ఉదాహరణములతో ప్రతిపాదించినచో సిద్ధింపజేయవచ్చునను తలంపుతో చేయబడినది. ప్రతిపాదింపబడిన పూర్వ పక్షమునందు సమాధానము ఈ విధముగా నుండవచ్చునను శంకను "అథాత్ర" అను మొదలగువానిద్వారా వెలిబుచ్చుచున్నాడు. "స్వేనైవ" అనగా తన స్వయముగా సంపాదించిన కర్మ వలననే అని అర్థము. అందువలన ఇంద్రియములు ఆత్మజములుగా చెప్పబడినందున తల్లి తండ్రి వంటి మనుష్య జన్మములు లేనందుననూ, ఇంద్రియములకు తండ్రి కారణము కాకుండుటచేత గర్భమునకు తండ్రి ఇంద్రియముల వంటి ఇంద్రియములు కలుగవని భావము. "స్వేనైవ" అని శ్రోత్రము మొదలగు వానికి అన్వయింపబడుచున్నది. "జడాది-భిస్తాతా" అనుచోట ఆది శబ్దము ప్రకారమును తెలియజేయునది. అందువలన కుబ్జ కుష్ఠ్యాదులను గ్రహింపవలెను. కుబ్జత్వము, కుష్ఠత్వము మొదలగువానికి ఆధారభూతమగు శరీరము ఆత్మనుండి పుట్టినది కాదు. కాని మాతపితరుల నుండి పుట్టినదియే. అందువలననూ కుబ్జాదుల నుండి పుట్టినవానికి కుబ్జాదులు లేకపోవుట అక్కడ నున్న అవస్థను బట్టియే జరుగును. "అత్రాపి" అను మొదలగువానిద్వారా శంకించబడిన సమాధానమును దూషించుచున్నాడు. "ప్రతిజ్ఞాహానిః స్యాత్" అనగా "ఆత్మా జ్ఞః" (శరీరస్థానము 1వ అధ్యాయము) అను మొదలగువాని ద్వారా ఆత్మకు జ్ఞత్వమున్నదను ప్రతిజ్ఞకునూ మరియు, "నిర్వికారః పరస్త్వాత్మా" (సూత్రస్థానము 1వ అధ్యాయము) అను నిర్వికారత్వ ప్రతిజ్ఞకునూ దోషము కలుగవలెనని భావము. "అసత్స్వజ్ఞః" అనుటవలన ఒక్కొక్కప్పుడు అజ్ఞత్వము ఉండుటవలన మొదట ప్రతిజ్ఞ చేసిన జ్ఞత్వమునకు దెబ్బవచ్చును. ఇంద్రియములు అధీనములో నుండుట

వలన పరాధీనమగుటచే ఆత్మకు జ్ఞత్వముండుట వాస్తవము కారాదు అని భావము. "యత్ర" అను మొదలగువాని ద్వారా ఆత్మకు సవికారత్వమును సాధించుచున్నాడు. జ్ఞత్వమును వదలి అజ్ఞత్వమున నుండుటవలన ప్రాకృతికముగా నుండవలసిన దాని కంటే వ్యతిరేకముగా నుండుటచేత వికారము కలుగునని భావము. "సవికార" అనగా "వికారవాన్" అను అర్థము మతుప్ లోపించుట వలన వచ్చినది అని తెలియవలెను. ఆత్మకు ఇంద్రియముల అధీనములో నుండుట అను గుణము చేత జ్ఞత్వమునకు ఇతర దూషణమును, "యది చ" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "అజ్ఞత్వాదకారణమ్" అనగా అజ్ఞత్వముచేత స్థానాంతరముగా శరీర ప్రేరణాదుల యందు కారణము కారాదని అర్థము. "అకారణత్వాచ్చానాత్మా" అనగా శరీర ప్రేరణాదులయందు బుద్ధిని ప్రవర్తింప జేయుటయందు అకారణమగుట వలన, అచేతనములగు పంచ మహాభూతములు తప్ప చేతనమని పిలువబడు ఆత్మ శబ్దముచేతనే దీనిని పిలువవలెను అని అర్థము. "వాగ్వస్తు మాత్రమ్" అనగా స్పష్టముగా చక్షువుద్వారా రూపమును చూచును అను మొదలగువాని వలన ఆత్మయనునది అర్థరహితమగు శబ్దము మాత్రమే అని అర్థము.

## ఆత్రేయుని సమాధానము

16. ఆత్రేయ ఉవాచ — పురస్తాదేతత్ ప్రతిజ్ఞాతం — సత్త్వం జీవం స్పృక్-శరీరేణాభిసంబధ్నాతీతి. యస్మాత్తు సముదాయప్రభవః సన్ స గర్భో మనుష్య-విగ్రహేణ జాయతే మనుష్యో మనుష్యప్రభవ ఇత్యుచ్యతే, తద్వక్ష్యామః — భూతానాం చతుర్విధా యోనిర్భవతి - జరాయ్వణ్డస్వేదోద్భిదః. తాసాం ఖలు చతసృణామపి యోనీనామేకైకా యోనిరపరిసంఖ్యేయభేదా భవతి, భూతా-నామాకృతివిశేషాపరిసంఖ్యేయత్వాత్. తత్ర జరాయుజానామణ్డజానాం చ ప్రాణి-నామేతే గర్భకరా భావా యాం యాం యోనిమాపద్యన్తే తస్యాం తస్యాం యోనౌ తథా తథా రూపా భవన్తి; యథా - - కనకరజతతామ్రత్రపుసీసాన్యా-సిచ్యమానాని తేషు తేషు మధూచ్ఛిష్టవిగ్రహేషు, తాని యదా మనుష్యబిమ్బ-మాపద్యన్తే తదా మనుష్యవిగ్రహేణ జాయన్తే, తస్మాత్ సముదాయప్రభవః సన్ గర్భో మనుష్యవిగ్రహేణ జాయతే; మనుష్యశ్చ మనుష్యప్రభవ ఉచ్యతే, తద్యోనిత్వాత్.

**తాత్పర్యము :** ఆత్రేయుడిట్లు చెప్పెను. ముందుగనే సత్త్వము జీవమును (ఆత్మను) సర్వయుక్త శరీరముతో కలుపును అని ఈ ప్రతిజ్ఞ చేయబడినది. సముదాయము వలన కలుగుచున్ననూ, ఎందువలన గర్భము మనుష్యరూపమున పుట్టుచున్నది ? మరియు మనుష్యుడు మనుష్యుని వలన పుట్టును అని ఏల చెప్పబడుచున్నదో ఆ విషయమును చెప్పబోవుచున్నాము.

భూతములకు జరాయు, అండ, స్వేద, ఉద్భిదములని నాల్గు విధములగు యోని యుండును. భూతములయొక్క ఆకృతి విశేషములు లెక్కకు మించినవిగ నుండుట వలన ఈ నాల్గు విధములగు జాతులలో ఒక్కొక్క జాతియు లెక్కకు మించినదిగ నుండును. గర్భకరములగు భావములు జరాయుజముల యొక్కయు, అండజముల యొక్కయు యోనులలో ఏ యోనిని పొందునో ఆ యోనియందు ఆ యా రూపము కలదిగ నుండును. అది ఎట్లనగా— బంగారము, వెండి, రాగి, తగరము, సీసము - వీనిని కరిగించి మైనముతో చేయబడిన ఆయా మూసలలో పోసినచో ఆ యా మూస యొక్క ఆకృతి కల్గునట్లు గర్భకర భావములును యోనిననుసరించి ఆ యా రూపమును పొందునవగును. ఆ భావముతో మనుష్య బింబమును పొందినపుడు (మనుష్య యోనియందున్నపుడు) మనుష్య విగ్రహముగ పుట్టును. అందువలన గర్భము సముదాయాత్మకమై మనుష్య విగ్రహముగా పుట్టును. మనుష్య యోనినుండి పుట్టుట వలన మనుష్యుడు మనుష్య ప్రభవుడని చెప్పబడుచున్నాడు.

**ఆయుర్వేదదీపిక :** ఆత్రేయ భగవానుడు, "పురస్తాత్" అను మొదలగు వాని ద్వారా సమాధానమును ఇచ్చుచున్నాడు. "కథమయం సన్దీయతే" అను ప్రశ్నకు ఇది సమాధానము. సత్త్వము శుక్రార్తవములను సంధానమునకు కారణమని అర్థము. యోని యనగా జాతి. యోని శబ్దము ఎప్పుడు కారణమును సూచించునో అపుడును జరాయుజాది రూపమగు యోనినుండి పుట్టినవియును జరాయుజాదులే అని చెప్పబడుచున్నవి ఎందువలననగా నిచట కార్యమునందు కారణము ఉండుట వలన ఆకృతియనగా సంస్థానము (ఆకారము): దానియొక్క విశేషములు పరస్పరము పోలికలేని ఆకృతులే. ఉదా - మనుష్య – గజ - తురగ మొదలగు రూపములు. సంభవించుచున్న యోని భేదమును చూపి గర్భము ఎట్లు యోనిని అనుసరించి యుండునో, ఆ విషయమును, "తత్ర" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "గర్భకరాః భావాః" అనగా శుక్రము మొదలైనవి. "మధూచ్ఛిష్ట విగ్రహేషు" అనగా మైనముతో మట్టియందు నిర్మించబడిన సంచక రూపమగు (మూసవంటి)

విగ్రహములయందు. "మనుష్యబిమ్బేషు" అనగా మైనముతో చేయబడిన మనుష్యాకారపు మూస అని అర్థము. తనరము మొదలగు బహు ద్రవ్యముల ఉదాహరణము ఎందులకనగా - ఏ విధముగా ఎక్కువగా నున్నప్పటికినీ తనరాదులకు-మనుష్యాకారపు మైనపు మూసలో నున్నవానికి మనుష్యాకృతి కలుగజేయు శక్తి కలుగుచున్నదో, అదే విధముగా మనుష్య యోనులందు పడినట్టి ఎక్కువగానున్న శుక్రాదులకును మనుష్య విగ్రహమును చేయుటయను గుణము కలుగుచున్నదని సమాన ధర్మము కలిగియుండుటచేత ఇచట ఉదహరింపబడినది. "సముదాయాత్మకః సన్" అనగా గర్భము సముదాయము వలన కలుగునదైనప్పటికీ యోని రూపమున నున్న కారణము యొక్క మహిమ చేత స్వయోని సదృశమేయగు గర్భము కలుగును గాని అన్యయోని సదృశమగునది కలుగదు. కారణ ధర్మమునకు మార్పు అనునది లేదు. అందువలన శుక్రాది సముదాయమునూ కారణమగుచున్నది. విశేషించి తల్లి దండ్రులు గర్భమునకు సజాతీయత వలన కారణమగుచున్నారు అనుటయందు కొంచెము కూడ నష్టము లేదు. "తయోర్నిత్యాత్" అనగా విశేషించి మనుష్యునకు కారణమగుటచేత అని అర్థము.

17. యచ్చోక్తం - యది చ మనుష్యో మనుష్యప్రభవః, కస్మాన్న జడాదిభ్యో జాతాః పితృసదృశరూపా భవన్తీతి; తత్రోచ్యతే-యస్య యస్య హ్యఙ్గావయవస్య బీజే బీజభాగ ఉపతప్తో భవతి, తస్య తస్యాఙ్గావయవస్య వికృతిరుపజాయతే, నోపజాయతే చానుపతాపాత్; తస్మాదుభయోపపత్తిరప్యత్ర. సర్వస్య చాత్మజానీన్ద్రియాణి, తేషాం భావాభావహేతుర్దైవం; తస్మాన్నైకాన్తతో జడాదిభ్యో జాతాః పితృసదృశరూపా భవన్తి.

**తాత్పర్యము :** మనుష్యుడు మనుష్యుని వలననే పుట్టుచున్నవాడైనచో, ఎందువలన మందుడు మొదలగువారిగా పుట్టినవారు తండ్రివంటి రూపమును కలిగియుండుటలేదు అని అడుగబడిన దానికి సమాధానము చెప్పబడుచున్నది. బీజమునందు బీజభాగమగు యే యే అవయవము బాధింపబడునో గర్భమునందు ఆ యా అవయవమునకు వికృతి కలుగును. అట్లు బాధ కలుగనప్పుడు వికృతియును కలుగదు. అందుచేత ఇచట రెండును జరుగును. అన్నింటను ఇంద్రియములు ఆత్మ

సంభవములే కాని అవి ఉండుట, ఉండకుండటలకు కారణము పూర్వజన్మయందలి కర్మయే కారణము. అందువలన కొన్నిచోట్ల మందుడు మొదలగువారిగా పుట్టువారు తండ్రివంటి రూపమును పొంది యుండరు.

ఆయుర్వేదదీపిక : "బీజే" శుక్ర శోణితములు రెండింటియందును అని అర్థము. బీజము యొక్క అంగప్రత్యంగమును ఏర్పడజేయు భాగము బీజభాగము. "ఉభయోపపత్తిరప్యత్ర" అనగా తండ్రివంటి రూపము కలవారు కలుగుదురు మరియు కలుగరు అని అర్థము. "ఆత్మజాని" అనగా ఆత్మను బద్ధము చేయు కర్మవలన కలిగినవి. "భావాభావహేతుర్దైవమ్" అనగా ఇంద్రియము ఉన్న పుడు శుభకర్మ వలన ఇంద్రియజనకమైనదనియు, ఇంద్రియము లేనపుడు అశుభ కర్మ వలన ఇంద్రియలోప కారకమైనదనియు అర్థము. "తస్మాత్" అను మొదలగు వానిద్వారా సమాధానమును ఉపసంహరించుచున్నాడు. ఇట్లనుకొనబడుచున్నది— మనుష్య బీజమే ప్రత్యంగములగు బీజభాగముల సముదాయాత్మకమై తనవంటి ప్రత్యంగ సముదాయ రూపమగు పురుషుని కలిగించునదగును, ఇంద్రియములును భోగసాధనములై ఆత్మను బద్ధముచేయు కర్మపైన ఆధారపడియున్నవి; అందు వలన, తండ్రి కుష్ఠురోగి యైననూ కుష్ఠాధారమగు చర్మము మొదలగువానిని కలి గించు బీజము దోషయుక్తముగానపుడు ఉపతప్తముగానట్టి త్వగాదులు కలిగిన బీజము చేత కుష్ఠురోగము లేనట్టి త్వగాదులు కలిగినవారే జనియింపబడుదురు. అతిగా వృద్ధి చెందిన కుష్ఠురోగము వలన తండ్రియొక్క బీజముకూడ కుష్ఠమును కలిగించు దోషము వలన దూషింపబడును; అపుడు దూషింపబడిన త్వక్కు మొదలగునవి కల బీజభాగముచేత కుష్ఠమువలన దుష్టిపొందినదియే యగు త్వక్కు కలుగును. ఈ విష యము సుశ్రుత నిదానస్థానము 5వ అధ్యాయమునందు - "దమ్పత్యోః కుష్ఠ బాహుల్యాద్దుష్టశోణిత శుక్రయోః, యదపత్యం తయోర్జాతం జ్ఞేయం తదపి కుష్ఠితమ్" అని చెప్పబడినది. ఈ విధముగా కుష్ఠురోగము కలవానికిని ఒకవేళ హేతుబలము చేత బీజమునందు కుష్ఠమును కలిగించు దోషము ఉన్నయెడల, అపుడు కుష్ఠురోగికిని కుష్ఠురోగముకల సంతానము కలుగును. అంధత్వము మొదలగునవి కలుగుటయందు ఇంద్రియమునకు ఉపఘాతమును కల్గించునట్టి పూర్వజన్మయందలి దుష్కర్మయే కారణము. అది అంధ సంతానమునందును తప్పకయుండును. అందువలన సంతా నమునకు అంధత్వముండుటయందు దృష్టికి ఉపఘాతమును కలుగజేయు అశుభకర్మ యున్నపుడు కాకతాళీయ న్యాయముచేత అంధునికి పుట్టినవాడును అంధుడగుట చూడ

బడుచున్నది. ఇట్లే పొట్టివారు మొదలగువారియందు, జడుడు మొదలగువారి యందును వ్యాఖ్యానించుకొనవలెను.

18. న చాత్మా సత్స్విన్ద్రియేషు జ్ఞః,అసత్సు వా భవత్యజ్ఞః,న
హ్యసత్వః కదాచిదాత్మా,సత్త్వవిశేషాచ్చోపలభ్యతే జ్ఞానవిశేష ఇతి.

**తాత్పర్యము :** ఆత్మ ఇంద్రియములున్నప్పుడు జ్ఞానిగను, అవి లేనపుడు అజ్ఞానిగను ఉండదు. (ఇంద్రియములున్నను, లేకున్నను జ్ఞానిగనే యుండునని భావము) ఆత్మ ఎప్పుడును సత్త్వరహితుడుగా నుండదు. సత్త్వవిశేషము చేతనే ఆత్మకు జ్ఞానము కలుగుచున్నది.

**ఆయుర్వేదదీపిక :** ఆత్మయందు ఏ అజ్ఞత్వ ప్రసక్తి చేయబడినదో అచట "న చ" అను మొదలగునవి చెప్పుచున్నారు. ఇంద్రియము ఉన్నపుడు, మరియు ఇంద్రియములు లేనపుడునూ ఆత్మ జ్ఞానవంతుడేననునది ప్రతిజ్ఞా విషయము. "న హ్యసత్వః కదాచిత్" అనుచోట 'హి' శబ్దము హేతువునందు ప్రయోగింపబడి నది. అందువలన ఎల్లప్పుడు ఆత్మ మనస్సుతో కూడియుండుటచే బాహ్యేన్ద్రియ ములు లేనప్పటికీ, అంతఃకరణ మనోసంబంధముచేత ఆత్మ మనస్సుద్వారా కలుగ జేయబడు జ్ఞానమును పొందుచున్నట్టివాడే యగుచున్నాడని అర్థము. ఈ బాహ్య విషయగతమగు జ్ఞానమేదికలదో, అది సత్త్వమునకు ఇంద్రియాధిష్ఠాన విశేషముచే కలుగును; అందువలన, ఇంద్రియమున్నపుడు ఇంద్రియము వలన కలుగు విశిష్ట జ్ఞానము కలుగును. కేవలము మనోజన్యమైన ఆత్మజ్ఞాన మేదికలదో అది ఎల్లప్పుడును కలుగుచునే యుండును. అందుచేత మనోసన్నిధి మాత్రముననే కలుగు నిత్యముగ నుండు జ్ఞానమేది కలదో అది ఎల్లప్పుడునూ ఉండును.

భవన్తి చాత్ర —

19. న కర్తురిన్ద్రియాభావాత్ కార్యజ్ఞానం ప్రవర్తతే,
యా క్రియా వర్తతే భావైః సా వినా తైర్న వర్తతే.

20. జానన్నపి మృదోఽభావాత్ కుమ్భకృన్న ప్రవర్తతే.

**తాత్పర్యము :** ఇంద్రియములు లేకపోవుటచే కర్తకు కార్యజ్ఞానము కలుగదు. భావ వస్తువులచేత ఏ క్రియ చేయబడునో (ప్రవర్తింపబడునో), అది అవి (భావవస్తువులు) లేకుండగ జరుగదు.

కుండను తయారుచేయుట తెలిసియున్ననూ, కుంభకారుడు దానిని తయారు చేయుటకు కావలసిన ద్రవ్యమగు మట్టియొక్క అభావముచేత కుండను తయారు చేయలేడు.

**ఆయుర్వేదదీపిక :** ఈ ఆత్మయొక్క జ్ఞానశక్తి పరాహతము కాదు అను ఆశయముతో "న" అను మొదలగునవి చెప్పుచున్నాడు. ఈ ఇంద్రియకమనునదేది కలదో అది విషయోపభోగవంతమై అది ఒకప్పుడు కలుగును. ఒకప్పుడు ఇంద్రియము లేనందుచేత అట్లు కలుగదని అధ్యాత్మ విదులు ఒప్పుకొందురు; కాని బ్రహ్మజ్ఞానము నందును ఆత్మయనునది జ్ఞానమును కలిగించు శక్తిని కలిగియేయుండును. కాని ఒక ప్పుడు కారణములేనందుచేత అట్లు జ్ఞానమునందు ప్రవర్తింపదు. "కార్యజ్ఞానమ్" అనగా కార్యప్రవృత్తి వలన జనించు బాహ్య విషయ సంబంధమగు జ్ఞానము; అందు వలన విషయములు లేని జ్ఞానము ఆత్మకు ఇంద్రియములు లేనపుడు కలుగునని సూచించుచున్నాడు. "భావైః" అనుచోట "స్త్రైః" అని అన్వయించుకొనవలెను. "వర్తతే" అనగాఉత్పత్తి చేయబడుచున్నది. ఇచటనే "జానన్నపి" అను మొదలగు వానిద్వారా దృష్టాంతమును చెప్పుచున్నాడు. "జానన్నపి" అనగా ఘటమును చేయుట తెలిసికొనియుండియూ అని అర్థము. మృదోః అనగా మట్టియొక్క, అభావాత్- అభావముచేత అని అర్థము.

**20.** శ్రూయతాం చేదమధ్యాత్మమాత్మజ్ఞానబలం మహత్.

**21.** ఇన్ద్రియాణి చ సంక్షిప్య మనః సంక్షిప్య చఞ్చలమ్,
ప్రవిశ్యాధ్యాత్మమాత్మజ్ఞః స్వే జ్ఞానే పర్యవస్థితః.

**23.** సర్వత్రావహితజ్ఞానః సర్వభావాన్ పరీక్షతే.

**తాత్పర్యము :** ఆత్మ సంబంధమైనట్టియు, గొప్పదైనట్టియు, ఆత్మజ్ఞాన బలమును వినుము. ఇంద్రియములను, చంచలమైన మనస్సును విషయముల నుండి మరల్చి, ఆత్మయందు ప్రవేశించి ఆత్మజ్ఞానము పొందినట్టియు, స్థిమితమైన జ్ఞానము కలిగినట్టియు ఆత్మజ్ఞుడు సమస్త భావములను తెలిసికొనుచున్నాడు.

**ఆయుర్వేదదీపిక :** ఆత్మకు జ్ఞత్వము కలిగియుండుటయందు వేరు సాధనమును, "శ్రూయతామ్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. ఆత్మకు జ్ఞానము యొక్క బలమేది కలదో అది ఆత్మజ్ఞాన బలము. "సంక్షిప్య" అనగా

విషయములనుండి మరల్చి. "మనః సంక్షిప్య" అనగా మనస్సును కూడ ఆత్మ వ్యతిరేకమగు విషయమునుండి నిగ్రహింపజేసి అని అర్థము. "చంచలమ్" అనునది స్వభావము వలన కలిగిన మనోచాంచల్యము. "స్వే జ్ఞానే" అనగా ఆత్మజ్ఞానము నందు. "సర్వభావాన్ పరీక్షతే" అనగా ఇంద్రియములు లేకున్ననూ సమాధి బలము వలననే సర్వజ్ఞుడగుచుండుటవలన ఆత్మకు జ్ఞత్వము సిద్ధించును.

22. గృహ్ణీష్వ చే(వే)దమపరం భరద్వాజవినిర్ణయమ్.

23. నివృత్తేన్ద్రియవాక్చేష్టః సుప్తః స్వప్నగతో యదా,
విషయాన్ సుఖదుఃఖే చ వేత్తి నాత్మాఽప్యతః స్మృతః.

24. నాత్మజ్ఞానాదృతే చైకం జ్ఞానం కిఞ్చిత్ ప్రవర్తతే,
న హ్యేకో వర్తతే భావో వర్తతే నాప్యహేతుకః.

తాత్పర్యము : మరియొక నిర్ణయమును వినుము. ఇంద్రియములు వాక్కు-వీనియొక్క వ్యాపారము లేనివాడై, నిద్రించుచున్ననూ, స్వప్నగతములైన విషయములను, సుఖదుఃఖములను తెలిసికొనుచున్నాడు. అందువలనను ఆత్మ జ్ఞానియని చెప్పబడును. ఆత్మజ్ఞానము లేనిచో ఎట్టి జ్ఞానమును కలుగనేరదు. ఏ భావమైనను కారణము లేకుండగగాని కర్త లేకుండగగాని ప్రవర్తింపదు.

ఆయుర్వేదదీపిక : నిరింద్రియమగు ఆత్మకు నైసర్గికమైన జ్ఞానము కలుగుటకు మరియొక కారణమును కూడ "గృహ్ణీష్వ" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "స్వప్నగతః" అనగా స్వప్నమును చూచు అవస్థయందు పొందబడినది అని అర్థము. ఆత్మ జ్ఞానము-విషయ జ్ఞానముల యందు భేదాను "నాత్మ" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. నిత్యమగు ఆత్మజ్ఞానము లేకుండగ కొంచెమును విషయజమగు జ్ఞానము ఒక్కటియును సహాయము-ఇంద్రియాది సాధన రూపమగు సహాయము లేకుండగ ఉత్పత్తి కాదు. ఆత్మ జ్ఞానము నిత్యమే అయియున్నది. సాంఖ్య దర్శనమునందునూ "చిచ్ఛక్తిరపరిణామిని" అని మొదలుకొని "ఆత్మనః" అను వరకూ సూత్రమున ఈ విషయము చెప్పబడినది. "న హ్యేకో వర్తతే భావః" అని ఇచట ఉపపత్తిని చెప్పుచున్నాడు. భావమనగా ఉత్పత్తి ధర్మము, అది కారణ రహితమై ఒక్కటియే యుండి-నవర్తతే-కలుగదు (ప్రవర్తిం

పదు) అని అర్థము. మరియు కారణ జన్యత్వము కల్గియున్నప్పటికీ భావము-అహేతుకముగా-కర్త లేకుండగ, న వర్తతే- ఉత్పత్తి కాదు. కాని, కర్తయగు కుంభకారునిపై ఆధారపడియేమన్ను, చక్రము మొదలగునవి ప్రవర్తించును. కాబట్టి, విషయ జ్ఞానములు కూడ ఇంద్రియములు మనస్సు మరియు విషయముల తోడను మరియు కర్తయగు ఆత్మ వలననూ కలుగుచున్నవని భావము.

25. తస్మాజ్జ్ఞః ప్రకృతిశ్చాత్మా ద్రష్టా కారణమేవ చ,
సర్వమేతద్భరద్వాజ నిర్ణీతం జహి సంశయమ్.

**తాత్పర్యము :** ఆత్మకు జ్ఞత్వము కలదు, ఆత్మయు ప్రకృతియై యున్నది. ఆత్మ ద్రష్టయై యున్నది మరియు ఆత్మయే కారణము అని ఇదంతయు నిర్ణయింపబడి యున్నది. అందుచేత, ఓ భరద్వాజుడా ! సంశయమును విడుపుము.

**ఆయుర్వేదదీపిక : "తస్మాత్"** అను మొదలగువాని ద్వారా ఉపసంహరించుచున్నాడు. ఇచటయును ఆత్మకు జ్ఞాత్వాజ్ఞత్వము వలన అపాదింపబడిన సవికారత్వమును నిత్యజ్ఞాన సాధనమగుట వలననే పరిహరింపబడినదగుటచే ఇచట వేరుగా పరిహరింపబడలేదు. భరద్వాజ శబ్దము వలన ఇచట ఆత్రేయుని గురుడుగా చెప్పబడుటలేదు, కాని ఇతడు వేరెవరో భరద్వాజ గోత్రుడు. అందువలన అతనియొక్క సంశయమును ఛేదించుట ఆత్రేయుని వలన జరుగుట యుక్తమే యగును.

## అధ్యాయ సంగ్రహము

తత్రశ్లోకౌ—

26. హేతుర్గర్భస్య నిర్వృత్తౌ వృద్ధౌ జన్మని చైవ యః,
పునర్వసుమతిర్యా చ భరద్వాజమతిశ్చ యా.

27. ప్రతిజ్ఞాప్రతిషేధశ్చ విశదశ్చాత్మనిర్ణయః,
గర్భావక్రాన్తిముద్దిశ్య ఖుడ్డీకాం తత్ప్రకాశితమ్.
ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే శారీరస్థానే
ఖుడ్డీకాగర్భావక్రాన్తిశారీరం నామ తృతీయోఽధ్యాయః.

**తాత్పర్యము :** ఈ ఖుడ్డీకా గర్భావక్రాన్తి శారీరమునందు-గర్భము ఏర్పడుటకు కారణము, వృద్ధి పొందుటకు కారణము, పుట్టుటకు కారణము, ఆత్రేయుని

మతము మరియు భరద్వాజుని మతము, ప్రతిజ్ఞా ప్రతిషేధము, విశదమగు ఆత్మ నిర్ణయము అనునవి వివరింపబడినవి.

ఇది అగ్నివేశునిచే రచింపబడి, చరకునిచే ప్రతిసంస్కరింపబడిన తంత్ర మందలి శారీర స్థానమున ఖుడ్డికా గర్భావక్రాంతి శారీరమను తృతీయాధ్యాయము.

**ఆయుర్వేదదీపిక :** సంగ్రహముగా హేతు శబ్దము గర్భము యొక్క మొదలునందును జన్మయొక్క చివరయును సంబంధించియుండును. ప్రతిజ్ఞా ప్రతిషేధము భరద్వాజునిచే చేయబడినదని తెలియవలెను. దానికి సాధనముగా ఆత్రేయుని కేదికలదో అది "విశదశ్చాత్మ నిర్ణయః" అనుట వలన చెప్పబడినది "తత్" అని తల్లి మొదలగు వానిని తెలియజేయుచున్నందున నపుంసక ప్రయోగముగా తెలియ వలెను.

ఇది శ్రీ చక్రపాణి దత్తునిచే విరచింపబడిన ఆయుర్వేదదీపిక యనెడు చరక తాత్పర్యటీక యందలి శారీర స్థానమున ఖుడ్డికా గర్భావక్రాన్తి శారీరము అను మూడవ అధ్యాయము.

—0—

# చతుర్థాధ్యాయము

# మహతీ గర్భావక్రాన్తి శారీరము

1. అథాతో మహతీం గర్భావక్రాన్తిం శారీరం వ్యాఖ్యాస్యామః.

2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః.

**తాత్పర్యము :** ఇక ఇపుడు మహతీ గర్భావక్రాంతి శారీరమును గూర్చి చెప్పుకొందము.

అని ఆత్రేయ భగవానుడు చెప్పెను.

**ఆయుర్వేదదీపిక :** ఖుడ్డికా గర్భావక్రాంతిని వివరించిన తరువాత మహతీ గర్భావక్రాంతిని పేర్కొనుట జరుగుచున్నది.

## గర్భ సంబంధమగు ఎనిమిది సంశయములు

3. యతశ్చ గర్భః సంభవతి, యస్మింశ్చ గర్భసంజ్ఞా,యద్వికారశ్చ గర్భః, యయా చానుపూర్వ్యాఽభినిర్వర్తతే కుక్షౌ, యశ్చాస్య వృద్ధిహేతుః, యతశ్చాస్యాజన్మ భవతి, యతశ్చ జాయమానః కుక్షౌ వినాశం ప్రాప్నోతి, యతశ్చ కార్త్స్న్యేనావినశ్యన్ వికృతిమాపద్యతే, తదనువ్యాఖ్యాస్యామః.

**తాత్పర్యము :** గర్భము దేనివలన కలుగును ? దేనికి గర్భమను సంజ్ఞ గలుగును ? గర్భము వేనియొక్క స్వరూపము? గర్భము కుక్షియందు ఏ క్రమమున ఏర్పడును ? గర్భము ఎట్లు వృద్ధి పొందును ? గర్భము ఏర్పడకుండుటకు కారణ మేమి ? కుక్షియందు గర్భము ఎందువలన వినాశనము పొందును ? ఎందువలన పూర్తిగా నశింపక వికృతి నొందును ? ఈ విషయములన్నియు చెప్పుకొందము.

**ఆయుర్వేదదీపిక :** "యతః" అనగా ఏ కారణముచేత "యద్వికారః" అనగా దేనిచే నిండియున్నది అని అర్థము. "యయాఽఽనుపూర్వ్యా" అనగా ఏ క్రమము వలన అర్థము. "అవినశ్యన్" అనగా మరణించకుండగ అని అర్థము.



## ఏ కారణమువలన గర్భము ఏర్పడునను ప్రశ్నకు సమాధానము

4. మాతృతః పితృత ఆత్మతః సాత్మ్యతో రసతః సత్త్వత ఇత్యేతేభ్యో భావేభ్యః సముదితేభ్యో గర్భః సంభవతి. తస్య యే యేఽవయవా యతో యతః సంభవతః సంభవన్తి తాన్ విభజ్య మాతృజాదీనవయవాన్ పృథక్ పృథగుక్తమగ్రే.

తాత్పర్యము : తల్లి, తండ్రి, ఆత్మ, సాత్మ్య, రస, సత్త్వములను భావముల సముదాయము వలన గర్భమేర్పడును. అట్టి గర్భమునకు తల్లి మొదలగు భావములనుండి యే యే అవయవము లేర్పడునో ఆ విషయమును వివరించి ఇది వరలో చెప్పట జరిగినది.

ఆయుర్వేదదీపిక : యే యే భావములు మాతృజ, పితృజ మొదలగు చర్మము రక్తము మొదలగునవి, యతో యతో — తల్లి మొదలగు వానినుండి కలుగుచున్నవో, ఆ మాతృజాది అవయవములను వేర్వేరుగా విభజించి, అగ్రే - అనగా పూర్వాధ్యాయమునందు (చెప్పబడినది): అందువలన ఇచట మాతృజాది భావములు చెప్పబడలేదు అని వాక్యార్థము వచ్చును. ఈ విషయము పూర్వాధ్యాయమునందే "మాతృజశ్చాయం గర్భః" (శారీరము 3వ అధ్యాయము) అను మొదలగువానివలన చెప్పబడినప్పటికి ప్రశ్న క్రమమునకు సమాధానము నిచ్చుట కొరకు ఇచట మరల చెప్పబడినది. ఎందువలన అని మొదట కారణమును, తరువాత కార్యరూపమగు గర్భమును దాని తరువాత గర్భధర్మమును [illegible] అను క్రమమున ప్రశ్నకు సమాధానమివ్వబడుచున్నది.

## దేనికి గర్భమని పేరు కలుగు అను ప్రశ్నకు సమాధానము

5. శుక్రశోణితజీవసంయోగే తు ఖలు కుక్షిగతే గర్భసంజ్ఞా భవతి.

తాత్పర్యము : కుక్షియందు జరిగిన శుక్రము - శోణితము - జీవము అను వాని సంయోగమునకు గర్భము అని పేరు.

ఆయుర్వేదదీపిక : శారీరస్థానము మూడవ అధ్యాయమునందు "శుక్రశోణితసంసర్గమన్తర్గర్భాశయగతం" అని మొదలిడి "గర్భోఽభినిర్వర్తతే" అను వరకు ఏది చెప్పబడినదో అదే అచట ఈ గర్భశబ్దమునకు [illegible] నిర్దేశించి

నదికాదు. అందువలన ఇచట గర్భమను సంజ్ఞను పేర్కొనుటకు ఇవ్వబడిన వివరణము పునరుక్తిగానేరదు. "కుక్షిగతే" అనగా కుక్షియందలి ఒక భాగమగు గర్భాశయమున నున్నట్టి అని అర్థము "సంయోగే" అనగా సరియగు కలయిక: అందువలన జీవమునకు ఆతివాహిక శరీరముతో గల్గు సంబంధము గ్రహింపబడుచున్నది. అంతేగాక ఆత్మకు వ్యాపకత్వముండుటవలన కలుగు సంబంధము కాదు. (ఇందువలన, గర్భమును కలిగించు సంబంధము (కలయిక) ఇచట అభిప్రేతము అని తెలియవలెను). ఇట్లున్న సంయోగము కుక్షియందే జరుగుచున్నసూ తెలిసియున్నట్టి విషయమునే శిష్యునకు ప్రతిపాదించుటకు "కుక్షిగతే" అను పదము ఉపయోగింపబడుచున్నది

## గర్భము దేనియొక్క వికారము? (దేనితో నిండియున్నది?) అను ప్రశ్నకు సమాధానము

6. గర్భస్తు ఖల్వన్తరిక్షవాయ్వగ్నితోయభూమివికారశ్చేతనాధిష్ఠానభూతః. ఏవమనయా యుక్త్యా పఞ్చమహాభూతవికారసముదాయాత్మకో గర్భశ్చేతనా-ధిష్ఠానభూతః; స హ్యస్య షష్ఠో ధాతురుక్తః.

**తాత్పర్యము :** గర్భము ఆకాశ - వాయు - అగ్ని - జల - పృథివి అను వాని మయమైయుండి చేతనకు అధిష్ఠానమైయున్నది. ఇట్లు ఈ యుక్తివలన గర్భము పంచమహాభూతములచే తయారింపబడిన వానియొక్క సముదాయముగా నున్నది. ఇది చేతనాధాతువునకు అధిష్ఠానము. చేతన యనునది గర్భముయొక్క ఆరవ ధాతువుగా చెప్పబడినది.

**ఆయుర్వేదదీపిక :** "గర్భస్తు" అను మొదలగునవి గర్భమును కలిగించునవైననూ భూమ్యాదులను వదలి చెప్పబోవుచున్న భూతగ్రహణమునకు అనుకూలము నుండుటచేత (భూతగ్రహణ విషయము అట్లు కోరుచుండుటచేత, ఇట్లు చెప్పుట అవసరమగుటచేత) అంతరిక్షము మొదట చెప్పబడినది. "అంతరిక్షం పూర్వమన్యేభ్యోగుణేభ్య ఉపాదత్తే" అని ముందుముందు చెప్పబోవుచునే యున్నాడు. "చేతనాధిష్ఠానభూతః" అనగా ఆత్మయొక్క భోగకారణమైన స్వరూపము అని అర్థము. చేతనా శబ్దముతో ఆత్మ చెప్పబడుచున్నది; లేదా, భూతశబ్దము సాదృశ్యమును తెలియజేయును; అందువలన ఆత్మకు అధిష్ఠానము వంటిదియగు శరీరము అని

అర్థము వచ్చును. భోగ కారణము లేనటువంటి, ఆశ్రయము లేనట్టియు ఆత్మకు శరీరము ఆశ్రయమగునని మాత్రము కాదు. "అనయా యుక్త్యా" అనగా ఈ భూత వికారరూపమగు యుక్తివలన పంచమహాభూత వికార సముదాయాత్మకమగును; వేరు యుక్తి వలన కతిథాపురుషీయమునందు చెప్పబడిన చతుర్వింశతి తత్త్వములు కలదగును. మరియు మాతృజాది రూపముల దృష్ట్యా తల్లి మొదలగువాని సముదాయ రూపముగ గర్భము ఉండునని అర్థము. మాతృజాదుల సముదాయమని చెప్పుట యందును పంచమహాభూతముల సముదాయమనుటకు వ్యతిరేకము కాకుండుటచేత ఈ పక్షములకు విరోధము లేదు. ఎందువలననగా మాతృజాదులును పంచమహాభూతముల వికారములే. ఈ విషయము శారీరస్థానమందలి రెండవ అధ్యాయమున "రసాత్మమాతాపితృసంభవాని భూతాని విద్యాద్దశ షట్ చ దేహే" అని చెప్పబడియే యున్నది. చతుర్వింశతికత్వమునందును పంచమహాభూతాత్మకత రూపముగనే అచట వివరింపబడినది. "న హి" అను మొదలగునవి. "అస్య" అనగా గర్భము యొక్క అని అర్థము.

## కుక్షియందు గర్భము ఏ క్రమమున ఏర్పడును అను ప్రశ్నకు సమాధానము

7. యయా చానుపూర్వ్యాఽభినిర్వర్తతే కుక్షౌ తాం వ్యాఖ్యాస్యామః — గతే పురాణే రజసి నవే చావస్థితే శుద్ధస్నాతాం స్త్రియమవ్యాపన్నయోని శోణిత గర్భాశయామృతుమతీమాచక్ష్మహే. తయా సహ తథాభూతయా యదా పుమానవ్యాపన్నబీజో మిశ్రీభావం గచ్ఛతి, తదా తస్య హర్షోదీరితః పరః శరీరధాత్వాత్మా శుక్రభూతోఽఙ్గాదఙ్గాత్ సంభవతి స తథా హర్షభూతేనాత్మనో దీరితశ్చాధిష్ఠితశ్చ బీజరూపో ధాతుః పురుషశరీరాదభినిష్పత్యోచితేన పథా గర్భాశయమనుప్రవిశ్యార్తవేనాభిసంసర్గమేతి.

**తాత్పర్యము :** గర్భము కుక్షియందు ఏ క్రమమున ఏర్పడునో ఆ విషయమును చెప్పబోవుచున్నాము - పాత ఆర్తవము పోయి క్రొత్త ఆర్తవము నిల్చినట్టియు, శుద్ధస్నానము చేసినట్టియు, పరిశుద్ధములగు యోని - శోణిత - గర్భాశయములను కలిగినట్టియు స్త్రీని ఋతుమతి అందురు. అట్టి స్త్రీతో కూడ ప్రమాణముగనున్న శుక్రము గల పురుషుడు ఎప్పుడు సంయోగమును పొందునో, అప్పుడు అట్టి పురుషుని హర్ష సంతో

షముచే ప్రేరేపింపబడినట్టియు, సారభూతమైనట్టియు, శరీర ధాతురూప మైనట్టియు శుక్రము ప్రతి అంగము నుండియు సంభవించును. అట్లు సంభవించునట్టియు, సంతోషముతోకూడి ఆత్మచే ప్రేరేపింపబడి నట్టియు, అట్టి ఆత్మచేత అధిష్ఠింపబడి నట్టియును బీజరూపమగు శుక్రము పురుష శరీరమునుండి బయలువెడలి ఉచితమైన మార్గము ద్వారా గర్భాశయమునందు ప్రవేశించి ఆర్తవముతో సంయోగము నొందును.

ఆయుర్వేదదీపిక : "గతే" అనగా నివృత్తి చెందియున్న సమయము నందు "పురాణే" అనగా ఋతుకాలము అతిక్రమించుటచేత చేరియున్నట్టి. "నవే చావస్థితే" అను వచనమువలన క్రొత్తదియును లేనపుడు దానికి గర్భమునకు కారణ మగుట యుండదని చూపుచున్నాడు. "శుద్ధస్నాతామ్" అనుటవలన శుద్ధ స్నానము చేసియున్నట్టి స్త్రీయే సంయోగమున కర్హురాలు, స్నానము చేయని ఆ స్త్రీ అశుద్ధత్వము వలన మైథునయోగ్యము కాదని చూపుచున్నాడు. "స్త్యాయత్యస్యాం గర్భ ఇతి స్త్రీ" గర్భమును గ్రహించునది కావున స్త్రీ యనబడును. అందుచే స్త్రీ శబ్దము నుపయోగించి వంధ్యను (గొడ్రాలిని) ఇచట నిరసించుచున్నాడు. "ఋతుమతి" అనునది ప్రశంసయందు మతుప్ ప్రయోగము "తథాభూతయా" అనగా అట్లున్నట్టి స్త్రీతో అని అర్థము. హర్షమనగా ప్రీతి విశేషము. దానివలన – ఉదీరితః అనగా ప్రేరేపింపబడిన. పరః అనగా సారము. లేదా తరువాతి కాలమునందు ఉత్పన్నమగునది పరము. శుక్రమే అన్ని ధాతువులకంటె తరువాతి కాలమున ఉత్పన్నమగును. "శరీర ధాత్వాత్మా" అనగా శరీర ధాతురూపమగు. "శుక్రభూతః" అనగా శుక్రరూపమే అంగాంగములనుండి సంభవించును అని తెలియుచున్నది. అందువలన, అంగముల నుండి శుక్రము ఉత్పత్తికాదు కాని శుక్ర రూపముగనే ఉండును అని తెలియు చున్నది. "సర్వత్రానుగతం శుక్రం దేహే" (చికిత్సాస్థానము 2వ అధ్యాయము 4వ పాదము) అని చెప్పబడియేయున్నది. "హర్షభూతేన" అనగా హర్షమయత్వమును పొంది యుండుట వలన. (శరీరమంతయు హర్షమయమగుటవలన) "ఉదీరితశ్చాధిష్ఠితశ్చ" అనుట వలన ఉదీరణ కాలమందు మరియు నిస్సరణకాలమందును శుక్రమునకు హర్షము మరియు ఆత్మకధిష్ఠానమై యుండి గర్భాశయమును పొందుటకు కారణమును చూపుచున్నాడు. శుక్రప్రవృత్తి యగుకాలము నందు పురుషుని హర్షము

లేనివాడైనచో అపుడు శుక్రప్రవృత్తి జరుగదు. మరియు వేగమునకు విఘాతము కలుగుటచేత అది గర్భాశయమును పొందదు. బీజరూప ధాతువనగా శుక్రము. "అభి సంసర్గమ్" అనగా సరియగు కలయిక అని అర్థము.

8. తత్ర పూర్వం చేతనా ధాతుః సత్త్వకరణో గుణగ్రహణాయ ప్రవర్తతే; స హి హేతుః కరణం నిమిత్తమక్షరం కర్తా మన్తా వేదితా బోద్ధా ద్రష్టా ధాతా బ్రహ్మా విశ్వకర్మా విశ్వరూపః పురుషః ప్రభవోఽవ్యయో నిత్యో గుణీ గ్రహణం ప్రధానమవ్యక్తం జీవో జ్ఞః పుద్గలశ్చేతనావాన్ విభుర్భూతాత్మా చేన్ద్రియాత్మా చాన్తరాత్మా చేతి. స గుణోపాదానకాలేఽన్తరిక్షం పూర్వతరమన్యేభ్యో గుణేభ్య ఉపాదత్తే, యథా ప్రలయాత్యయే సిసృక్షుర్భూతాన్యక్షరభూత ఆత్మా సత్త్వోపాదానః పూర్వతరమాకాశం సృజతి, తతః క్రమేణ వ్యక్తతరగుణాన్ ధాతూన్ వాయ్వాదికాంశ్చతురః తథా దేహగ్రహణేఽపి ప్రవర్తమానః పూర్వతరమాకాశమేవోపాదత్తే తతః క్రమేణ వ్యక్తతరగుణాన్ ధాతూన్ వాయ్వాదికాంశ్చతురః సర్వమపి తు ఖల్వేతద్గుణోపాదానమణునా కాలేన భవతి.

**తాత్పర్యము :** అచట ముందుగా సత్త్వము (మనస్సు)ను సాధనముగా జేసికొనినదైన చేతనా ధాతువు గుణములను (భూతముల యొక్క గుణములను) గ్రహించుటకు ప్రవర్తించును. అదియే హేతువు, కారణము, నిమిత్తము, అక్షరము, కర్త, మంత, వేదిత, బోద్ధ, ద్రష్ట, ధాత, బ్రహ్మ, విశ్వకర్మ, విశ్వరూపుడు, పురుషుడు, ప్రభవుడు, అవ్యయుడు, నిత్యుడు, గుణి, గ్రహణము, ప్రధానము, అవ్యక్తము, జీవుడు, జ్ఞాని, పుద్గలుడు, చేతనావంతుడు, విభుడు, భూతాత్మ, ఇంద్రియాత్మ, అంతరాత్మ అని చెప్పబడును. ఆ చేతనా ధాతువు భూతములను గ్రహించు సమయమునందు ఇతర భూతములకంటె ముందుగ ఆకాశమును గ్రహించును. ప్రళయాంతమునందు భూతములను సృష్టింపదలచినట్టియు, సత్త్వముతో కూడి నట్టియు, చేతనాధాతువు ముందుగ ఆకాశమును సృష్టించి పిమ్మట క్రమముగ వ్యక్తతరములైన గుణములు కలిగినట్టి వాయువు మొదలైన నాలుగు భూతములను ఎట్లు సృష్టించునో, అటులనే దేహమును గ్రహించుటకు ప్రవర్తించునదై ముందుగ ఆకాశమునే గ్రహించి పిమ్మట క్రమముగా వ్యక్తతరములైన గుణములు గల వాయువు మొదలగు నాల్గు భూతములను గ్రహించును. ఈ గుణ గ్రహణమంతయును నిజమునకు అణుకాలములోనే జరుగును.

ఆయుర్వేదదీపిక : సత్త్వమనగా మనస్సు, అది దేనికి సాధనమో అది సత్త్వకరణమనబడును, ఆత్మ నిష్క్రియమగుట వలన క్రియావంతమగు మనస్సు వలన ఏ కార్యమును చేయునో అదియును మనస్సుచే చేయబడుచున్నప్పటికీ మనస్సుకు అచేతనత్వముండుట వలన ఆ కార్యము చేతనావంతమగు ఆత్మది యే అని చెప్పబడుచున్నది. శారీర స్థానము నందు 1వ అధ్యాయమున "చేతనావాన్ యతశ్చాత్మా తతః కర్తా నిరుచ్యతే." అని చెప్పబడియే యున్నది. "గుణ గ్రహణాయ" అనుచోట గుణ శబ్దమువలన గుణము గుణి (గుణము కల్గియున్నది) అను వానికి భేదము లేకుండుట ప్రవారముతో నుండుటచేత గుణములను కల్గియున్నవి యగు భూతములు చెప్పబడుచున్నవి. లేదా గుణము అప్రధానమైనది. ఆత్మ ప్రధానమైనది, దానికి వ్యతిరేకమైనవియగు గుణములు భూతములు. అప్రధాన రూపములగు భూతములను ఆత్మ ఎందులకు గ్రహించును అను ఆశంక కల్గుట యందు ఆత్మయొక్క ప్రాధాన్యమును తెలియజెప్పు పర్యాయములను "స హి" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. నాశనము లేనిది అక్షరము (న క్షరతి) గుణీ అనగా భూతరూప గుణములను కల్గియున్నాడని అర్థము. భూతములను గ్రహించునది గ్రహణమనబడును. ఈ పర్యాయములచేత చెప్పబడుచున్న ఆత్మకు ఇతర పదార్థములు కుపకారము చేయుట వలన లోక ప్రసిద్ధమగు వానికంటె శ్రేష్ఠత్వమును చూపబడుచున్నది. "పూర్వతరం" అనగా మొదటనే. "అన్యేభ్యో గుణేభ్యః" అనగా వాయువు మొదలైన వానికంటె అని అర్థము. ఇచట గర్భము నందు జరుగు భూతగ్రహణ క్రమమునందు "యథా" అను మొదలగువాని ద్వారా దృష్టాంతమును చెప్పుచున్నాడు. "ప్రలయస్య" అనగా మహా ప్రలయమునకు, అత్యయే అనగా ఆదిసృష్టియందు అని అర్థము. "సిసృక్షుః" అనగా సృష్టించుటకు ఇష్టపడియున్నవాడు అని అర్థము. "భూతాని" అనగా ఆకాశాదులు. "సత్త్వోపాదన" అనగా మనోసాధనము గలది. మహాప్రలయమునందే వికారము యొక్క లయము ప్రకృతియందు జరుగుటచేత అతి అవ్యక్త రూపములగు ప్రకృతి పురుషులు రెండే నిలచును. అటు తరువాత సృష్టి ఆరంభమునందు ప్రకృతి యొక్క మహత్తు మొదలగు విస్తారము క్రమముగా ఉత్పత్తియగును. అచట మొదట ఆకాశము ఉత్పత్తి యగును. తరువాత వ్యక్తములగు వాయువు మొదలగునవి వ్యక్తములగునని సాంఖ్య సిద్ధాంతము. ఆకాశము యొక్క పుట్టుకయు సాంఖ్యమతము వలననే తెలియ వలెను. "దేహగ్రహణేఽపి" అనగా గర్భ స్వరూపమును గ్రహించుట యందును

అని అర్థము. "ఉపావర్తే" అనగా ఉత్క్రాంతికగతమైయున్న ఆకాశమును ఆకాశమయముగా స్వీకరించును. "వ్యక్తతరగుణాని" అనగా ఒక గుణమున్న ఆకాశము కంటె శబ్ద స్పర్శ గుణములున్న వాయువు వ్యక్తతరమగును. దానికంటె శబ్ద స్పర్శరూప గుణములు గల తేజస్సు వ్యక్తతరమగును అను మొదలగునవి. ఈ భూత గ్రహణ క్రమము ఆగమ సిద్ధమే. అటువంటి యుక్తి ఇచట హృదయంగమముగా నుండదు. ఇట్టి భూతగ్రహణము కొద్ది కాలములోనే జరుగునని చూపుటకు "సర్వమ్" అను మొదలగువానిని చెప్పుచున్నాడు.

## మాసానుక్రమముగ గర్భము వృద్ధి చెందుట - మొదటి మాసమునందు గర్భముయొక్క స్వరూపము

9. స సర్వగుణవాన్ గర్భత్వమాపన్నః ప్రథమే మాసి సంమూర్ఛితః సర్వధాతుకలుషీకృతః ఖేటభూతో భవత్యవ్యక్త విగ్రహః సదసద్భూతాంగా-వయవః.

## రెండవ మాసమునందు గర్భము యొక్క స్వరూపము

10. ద్వితీయే మాసి ఘనః సంపద్యతే పిండః పేశ్యర్బుదం వా.
తత్ర ఘనం పురుషః, పేశీ స్త్రీ, అర్బుదం నపుంసకమ్.

**తాత్పర్యము :** సమస్త గుణములతో కూడిన ఆ చేతనాధాతువు గర్భత్వమును పొందినదై మొదటి మాసమునందు సమ్మూర్ఛితమగును, సర్వ ధాతువులచే కలుషితము చేయబడినదగును, ఆకారము తెలియనిదగును. శ్లేష్మము ముద్దవలె నుండి అంగ ప్రత్యంగములు ఉన్నట్లును లేనట్లును కనిపించు. రెండవ మాసమునందు గట్టిపడి ముద్దవలెగాని, పేశివలెగాని, అర్బుదము వలెగాని ఉండును. ముద్దవలె నున్నచో పురుషుడును, పేశివలె నున్నచో స్త్రీయును, అర్బుదమువలె నున్నచో నపుంసకుడును పుట్టును.

**ఆయుర్వేదదీపిక :** "సర్వధాతు కలుషీకృతః" అనగా అన్ని ధాతువులు అవ్యక్తములుగా నుండుట వలన కలుషింపచేయబడి యున్నట్టి అని అర్థము. ధాతు శబ్దము వలన భూతములు చెప్పబడుచున్నవి. లేదా రసాది ధాతువుల బీజ రూపములు. "ఖేటః" అనగా శ్లేష్మము, అందువలన "ఖేట భూతః" అనగా

శ్లేష్మము వలె ఉన్నట్టి అని అర్థము. "సదసద్భూతాఙ్గావయవః" అనునది 'అవ్యక్త విగ్రహః" అనుదాని యొక్క వివరణము. "సదసద్భూతాంగాయవః" అనగా కన్పించుచున్నట్టి మరియు కన్పడనట్టి అంగ ప్రత్యంగములు కల్గినట్టి అని అర్థము. అంగములు బీజరూపములుగా నుండుట వలన సత్త్వము: అవ్యక్త రూపములుగా నుండుట వలన అసత్త్వము - (ఇట్లు రెండును ఈ స్థితియందు వర్తించును). లేదా, సదసద్భూతాంగావయవమగునది ఘనత్వము పొందునని యుక్తి. "ఘనః" అనగా కఠినము. పిండమనునది గ్రంథి ఆకారమునను్నది. పేశీయనగా మాంసపేశీ వలె దీర్ఘముగా నుండునది. అర్బుదమనగా గుండ్రముగా ఎత్తుగానుండునది.

## మూడవ మాసమున గర్భముయొక్క స్వరూపము

11. తృతీయేమాసి సర్వేన్ద్రియాణి సర్వాఙ్గావయవాశ్చ
యౌగపద్యేనాభినిర్వర్తన్తే.

**తాత్పర్యము :** మూడవ మాసమందు అన్ని ఇంద్రియములు అన్ని అంగావయవములును ఒకేమారు ఏర్పడును.

**ఆయుర్వేదదీపిక :** "అఙ్గాని" అనగా శిరస్సు మొదలగు అంగములు. దానియొక్క అవయవములు అంగావయవములు. "యౌగపద్యేన" అను వచనము వలన శారీరస్థానము 6వ అధ్యాయము నందు చెప్పబోవుచున్న "కుమారస్య శిరః పూర్వమభినిర్వర్తతే" అను ఏక పక్షమును నిషేధించుచున్నాడు. ఒకేమారు అన్ని అంగములు ఏర్పడునని సిద్ధాంతము.

## పంచమహాభూతముల వలన గర్భమునకు కల్గు భావములు

12. తత్రాస్య కేచిదఙ్గావయవా మాతృజాదీనవయవాన్ విభజ్య పూర్వముక్తా యథావత్.మహాభూతవికారప్రవిభాగేన త్విదానీమస్య తాంశ్చైవాఙ్గావయవాన్ కాంశ్చిత్ పర్యాయాన్తరేణాపరాంశ్చానువ్యాఖ్యాస్యామః.మాతృజావయోఽ- ప్యస్య మహాభూతవికారా ఏవ. తత్రాస్యాకాశాత్మకం శబ్దః శ్రోత్రం లాఘవం సౌక్ష్మ్యం వివేకశ్చ,వాయ్వాత్మకం స్పర్శః స్పర్శనం రౌక్ష్యం ప్రేరణం ధాతువ్యూహనం చేష్టాశ్చ శారీర్యః,అగ్న్యాత్మకం రూపం దర్శనం ప్రకాశః పక్తిరౌష్ణ్యం చ,అబాత్మకం రసో రసనం శైత్యం మార్దవం స్నేహః క్లేదశ్చ,పృథివ్యాత్మకం గన్ధో ఘ్రాణం గౌరవం స్థైర్యం మూర్తిశ్చేతి.

తాత్పర్యము : ఈ గర్భమునకు కలుగు మాతృజాది అంగావయవములు కొన్ని విభజించి చెప్పబడినవి ఇపుడు దానిని మహాభూత వికారములుగా విభజించుట వలన అవియే అంగావయవములను కొన్ని ఇతర పర్యాయముల లోడను, ఇంకొన్నిటిని చేర్చియు చెప్పుకొందము. మాతృజాది అంగావయవములు కూడ పంచమహాభూత వికారములే. అచట, శబ్దము, శ్రోత్రేంద్రియము, లాఘవము, సౌక్ష్మ్యము, విభజింపబడియుండుట (విభజించుట) అనునవి ఆకాశాత్మకములు. స్పర్శ, త్వగింద్రియము, రూక్షత్వము, ప్రేరణము, ధాతువులను క్రమముగ నిర్మించుట (ధాతువ్యూహనము), శరీర చేష్టలు - ఇవి వాయ్వాత్మకములు. రూపము, చక్షురింద్రియము, కాంతి, పచనమగుట, ఉష్ణము — ఇవి అగ్న్యాత్మకములు. రసనము, రసనేంద్రియము, శీతము, మృదుత్వము, స్నేహము, క్లేదము — ఇవి అబాత్మకములు (జల మహాభూత సంబంధమైనవి). గంధము, ఘ్రాణేంద్రియము, గురుత్వము, స్థైర్యము, ఆకారము ఇవి పృథివ్యాత్మకములు.

ఆయుర్వేదదీపిక : "కేచిత్" అనగా అన్నింటిని అనికాదు. అచట మాతృజాది అంగములను చెప్పుటయందు ఇచట చెప్పబడుచున్న శబ్దాదులు పేర్కొనబడలేదు. కాని, త్వక్కు మొదలైనవాటిని కొన్నింటిని మాత్రమే చెప్పుట జరిగినది. "పర్యాయాన్తరేణ" అను వచనముచేత మాతృజాది అవయవములగు "త్వక్ చ లోహితం చ" అను మొదలగువానిద్వారా శారీరస్థానము మూడవ అధ్యాయమునందు ఏవి చెప్పబడినవో ఇచట అవి సాక్షాత్తు చెప్పబడుటలేదు. కాని త్వక్కునందు ఆకారము, మృదుత్వము, స్నేహము మొదలగునవి ఏవి కలవో, అవి భూతజన్యములుగా చెప్పబడుటచే త్వక్కును పేర్కొనునవి (సూచించునవి)గా నుండును. ఇట్లే రక్తమునందున భూతములను చెప్పుటవలన రక్తమునూ చెప్పబడినదనియే గ్రహింపవలెను. "త్వగాదయో వక్ష్యమాణా" అనగా భూతరూప సముదాయముగా త్వగాదులు చెప్పబడనున్నవి అని అర్థము. త్వగాదులను మాతృజాదులుగా చెప్పబడుట అవి మాతృ మొదలగు భావములకు అధీనమై యుండునని తెలియజేయుట కొరకు అని తెలియవలెను. మరల ఇచట ఈ అంగావయవములు భూతజన్యములుగా చెప్పబడుటకు కారణమేమనగా — వానియొక్క వృద్ధిక్షయములందు ఆయా వృద్ధి క్షయములకు కారణములగు భూతములను (తెలిసికొనుటచేత) నిషేధించుట మరియు ఉపయోగించుటల వలన క్షయమును లేదా వృద్ధిని కలిగించు జ్ఞానముకొరకు ఈ జ్ఞానము కావలసియున్నది. ఏ అవయవము ఏ భూతప్రధానమైయున్నదో ఆ అంగము ఆ

భూత ప్రధానమగు ద్రవ్యమువలన వృద్ధియగుచున్నది. తద్వ్యతిరేకమగు ద్రవ్యము వలన క్షీణింపబడుచును యున్నది. వాయువునందు లఘుత్వమున్నట్లు — "రూక్షః శీతో లఘుశ్చైవ" (సూత్రస్థానము 1వ అధ్యాయము) అను మొదలగువానిద్వారా చెప్పబడినప్పటికీ ఇది ఆకాశమునందు ఎక్కువగానున్నట్లు తెలియవలెను. అందు వలన ఇచట లఘుత్వము ఆకాశ వికారమందు చెప్పబడుచున్నది. ఆకాశము అత్యంత సూక్ష్మమగుటచేత ఇది వాయువుకంటెను ఎక్కువ లఘుత్వమును కల్గియున్నది. వివేకమనగా విభజింపబడియుండుట. ధాతువ్యూహనమనగా ధాతువులయొక్క రచన మరియు వానిని వహించుట. దేనివలన చూడబడుచున్నదో అది దర్శనము — అనగా చక్షురింద్రియము (దృశ్యతేఽనేనేతి దర్శనమ్ చక్షురింద్రియమ్).

## లోకమునకు - పురుషునకును సామ్యమున్నదని చెప్పుట

13. ఏవమయం లోకసంమితః పురుషః.యావన్తో హి లోకే మూర్తిమన్తో
భావవిశేషాస్తావన్తః పురుషే,యావన్తః పురుషే తావన్తో
లోకే ఇతి;బుధాస్త్వేవం ద్రష్టుమిచ్ఛన్తి.

**తాత్పర్యము** : ఈ విధముగా ఈ పురుషుడు లోకముతో సమముగా నున్నాడు. మూర్తిమంతములగు భావములు లోకమునందెన్ని కలవో అవియన్నియు పురుషునియందు గలవు. అట్లే పురుషునియందెన్ని మూర్తిమంతమగు భావములు గలవో అవి యన్నియును లోకమునందు గలవు అని ఈ విధముగా చూచుటకు పండితులు ఇష్టపడుచున్నారు. (ఈ లోకమంతయు పంచభూతాత్మకమని చెప్పబడినది. అటులనే పురుషుడును పంచభూత వికారములతో నిండినవాడని చెప్పియుండుట వలన లోకము - పురుషుడు ఈ రెండింటియందు సామ్యత ఇచట ఎత్తిచూపబడు చున్నది).

**ఆయుర్వేదదీపిక** : ఈ శరీరము భూతముల వికారమయమై యుండుట లోకసామ్యము వలన తెలిసియున్ననూ అది పరమ అభీష్టమగు మోక్షమునకునూ కారణమగుచున్నదని లోకసామ్యమును చూపుటకు "ఏవమయమ్" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "ఏవమ్" అనగా పంచమహాభూత వికారమయముగా, "లోకసంమితః" అనగా లోకముతో సమానుడు అని అర్థము. ఇచటయునూ శరీరమునకు చెప్పబడిన భూతవికారమయత్వమేదికలదో, అందువలన భూతవికారమయ

త్వము సాధారముగా చేసికొని లోకము-పురుషుడు ఈ రెంటింటికీ సాదృశ్యము (పోలిక) చెప్పబడినది; లోకము పురుషులకు గల ఆధ్యాత్మిక సామ్యత పురుష విచయ శారీరమునందు చెప్పబడవలసి యున్నదేది కలదో అది ఇచట చెప్పబడ కున్ననూ "యావన్తో హి" అను మొదలగు విశేషమును పేర్కొనుట వలన సూచింపబడినది అని తెలియవలెను. అందువలన, పురుషునియందున్న ఆధ్యాత్మికములగు అంతరాత్మ, సత్త్వము, అహంకారము మొదలగు భావ విశేషములు, లేక భౌతికములగు మూర్తిమత్త్వము క్లేదము మొదలగు భావ విశేషము లెన్నికలవో అవి లోకమునందున్న వాటితోనూ సమానములని తెలియవలెను. ఈ లోక-పురుషుల సామ్యము పురుష విచయాధ్యాయమునందు వివరముగా చెప్పబడగలదు. ఇట్టి లోక పురుషులకు సామ్యమును చెప్పుట యనునది ముముక్షువులకే (మోక్షమును కోరు వారికే) ఉపయుక్తమని చూపుటకు "బుధాస్త్వేవమ్" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "బుధాః" అనగా సరియైన జ్ఞానము గలవారు, మోక్షముతో సంబంధమున్నవారు అని అర్థము. లోక పురుష సామ్యమును చెప్పుట యనునది మోక్షము కొరకేయని పురుష విచయమునందు స్వయముగనే చెప్పబోవుచున్నాడు.

14. ఏవమస్యేన్ద్రియాణ్యఙ్గావయవాశ్చ యౌగపద్యేనాభినిర్వర్తన్తేఽన్యత్ర తేభ్యో
భావేభ్యో యేఽస్య జాతస్యోత్తరకాలం జాయన్తే; తద్యథా దన్తా వ్యఞ్జనాని
వ్యక్తీభావస్తథాయుక్తాని చాపరాణి. ఏషా ప్రకృతిః వికృతిః పునరతోఽన్యథా.
సన్తి ఖల్వస్మిన్ గర్భే కేచిన్నిత్యా భావాః, సన్తి చానిత్యాః కేచిత్, తస్య
య ఏవాఙ్గావయవాః సన్తిష్ఠన్తే, త ఏవ స్త్రీలిఙ్గం పురుషలిఙ్గం నపుంసకలిఙ్గం
వా బిభ్రతి. తత్ర స్త్రీపురుషయోర్యే వైశేషికా భావాః ప్రధానసంశ్రయా
గుణసంశ్రయాశ్చ, తేషాం యతో భూయస్త్వం తతోఽన్యతరభావః.
తద్యథా—క్లైబ్యం భీరుత్వమవైశారద్యం మోహోఽనవస్థానమధో
గురుత్వమసహనం శైథిల్యం మార్దవం గర్భాశయబీజభాగస్తథాయుక్తాని
చాపరాణి స్త్రీకరాణి, అతో విపరీతాని పురుషకరాణి, ఉభయభాగావయవా
నపుంసకకరాణి భవన్తి.

**తాత్పర్యము :** జనించిన తరువాత కలుగు భావములు తప్ప మిగిలినవగు ఇంద్రియములు, అంగప్రత్యంగములును గర్భమునకు ఒకేసారి ఏర్పడును. దంతములు, మీసము గడ్డము, వ్యక్తత్వము (రజోదర్శనము-శుక్రదర్శనము) మొదలగు

భావములు గర్భమునకు జనించిన పిదప కలుగును. ఈ విధముగా జరుగుట ప్రకృతి యనబడును దీనికి వ్యతిరేకముగా జరుగుట వికృతి యనబడును. గర్భమునందలి భావములలో కొన్ని నిత్యములుగను కొన్ని అనిత్యములుగను ఉండును. వానిలో నిత్యములగునవి స్త్రీ లక్షణములను గానీ, పురుష లక్షణములనుగానీ, నపుంసక లక్షణములనుగానీ తెలియజేయును. స్త్రీ పురుషులకు ప్రధాన సంశ్రయములు గుణ సంశ్రయములగు విశేష భావములు ఆత్మ, పంచభూతములను ఆశ్రయించియుండును. వానియొక్క అధిక్యతను అనుసరించి స్త్రీగానీ, పురుషుడుగానీ, నపుంసకుడుగానీ జనించును. అదీ యెట్లనగా - క్లైబ్యము (పురుషత్వము లేకుండుట), పిరికితనము, ఎదిరించి మాట్లాడలేకుండుట, మోహము, స్థిరత్వము లేకుండుట, అధోభాగ గురుత్వము, అసహనము, శైథిల్యము, మృదుత్వము, గర్భాశయ బీజభాగమును కల్గియుండుట, ఇంకనూ ఇటువంటివేయగు ఇతర భావములు స్త్రీని జనింపజేయును. వీనికి వ్యతిరేకములగు భావములు పురుషుని జనింపజేయునవిగా నుండును. ఈ రెండును కలిసియున్నపుడు నపుంసకుడు కలుగును.

**ఆయుర్వేదదీపిక :** ప్రస్తుతము చెప్పబడుచున్న మూడవ మాసమునందు కలుగు ఇంద్రియాది అంగములేర్పడుటయను విషయమును ఉపసంహరించుచున్నాడు. "యౌగపద్యం" అనగా ఒకేమారుగనే. ఇంద్రియములును అన్ని అంగములతోపాటు సమాన కాలమునందు ఏర్పడునని చూపుటకు యౌగపద్యమని పేర్కొనుచున్నాడు. దంతాదులును మూడవ మాసమునందు ఏర్పడునా ? అను శంకను తీర్చుటకు "అన్యత్ర" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "వ్యఞ్జనాని" అనగా మీసము-గడ్డములు, చన్నులు మొదలగునవి. వ్యక్తిభావమనగా శుక్రము రజస్సులు ఆవిర్భవించుట. "తథాయుక్తాని" అనగా పుట్టిన తరువాతి కాలమున పుట్టునవగుటచే దంతాదులవంటి అంగములు, బుద్ధ్యాదులు. "ఏషా ప్రకృతిః" అనగా ఇంద్రియములు, అంగావయవములు ఒకేమారు ఏర్పడును; దంతాదులును పుట్టిన తరువాత కొంత కాలమునకు ఏర్పడును అను ఇట్టి పరిస్థితి మనుష్య స్వభావము అని అర్థము. "అన్యథా" అనగా ఒక్కొక్కప్పుడు దంతములతోనే పుట్టుటయనునది మనుష్యునకు వికృతియని భావము. ఇక ఎందువలన దంతాదులతో పుట్టుట వికృతిగా చెప్పబడుచున్నదో ఆ విషయమును "సన్తి" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "ఖలు" శబ్దము హేతువునందు ప్రయోగింపబడినది. "నిత్యః" అనగా శరీరముండు నంతవరకునూ ఉండు కరచరణాదులు. శరీరముండునంతవరకునూ ఉండనట్టివియగు

దంతాదులు అనిత్యములు. ఇందువలన అనిత్య స్వభావముకల దంతాదులు గర్భము నకు మొదట కలుగుట నిత్యత్వమునకు వికృతి యనుట యుక్తమని అర్థము. ఇక నిత్యానిత్యముల మధ్యన ఏవి స్త్రీ మొదలగు లక్షణములను కలుగచేయును అని- "తన్య" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "సన్నివిష్ట" అనగా శరీర ముండునంతవరకు నిలచియుండునవి అని అర్థము. ఇందువలన నిత్యములగు ఉపస్థ మొదలగునవేవి కలవో అవియే స్త్రీలింగత్వముగానీ, పురుష లింగత్వముగా గానీ ఏర్పడును. అచట ఉపస్థ రూపమగు నిత్యభావము స్త్రీలింగము, శేఫ (మేఢ్రము) పుంలింగము, ఉపస్థ ఆకారముగానీ, లింగాకారముగానీ లేక కేవలము రంధ్రము మాత్రమేయున్నచో నపుంసక లింగము అగును. లేదా స్త్రీలకు చన్నులు మొదలగు ఏ లక్షణములుండునో, పురుషులకు కలుగు మీసములు మొదలగునవేవి కలుగునో, నపుంసకునకును స్త్రీ పురుషులకిరువురకును సమానములగు లక్షణములేవి యుండునో అవియన్నియునూ నిత్యభావములగు ఉరస్సు (రొమ్ము), కపోలము (చెక్కిళ్ళు) అను వానినుండియే కాలవశమున ఏర్పడునని వాక్యార్థము చన్నులను కలిగించు బీజమును కలిగియున్న రొమ్ము తరువాతి కాలమున చన్నులను కలిగి యుండును. అట్లే మీసములను కలిగించు బీజయుక్తమగు కపోలమే తరువాతి కాలమున మీసమును కలిగియుండును. శరీరమునందు చన్నులు మీసములను కలి గించు బీజము తప్పనిసరిగా ఉండవలెనని లేదు అనినచో, ఎందువలన అవి (చన్నులు, మీసము మొదలగునవి) గర్భమునకు అది ఏర్పడు కాలముననే ఎందు వలన ఏర్పడుట లేదు ? ఎందువలననగా తగిన కాలమునందే అట్లు ఏర్పరచుటయను నది బీజము యొక్క మహిమయైయున్నది. ఉదాహరణమునకు భూమిపై పడినప్పటికీ శాలిధాన్యపు బీజము స్వభావముచేగాక తగిన ఋతువునందే అంకురమును పుట్టించు చున్నది. ఇక ఏ కారణముచేత సమానమగు ప్రాయములయందు కారణమగు స్త్రీ మొదలగు విశేషములు ఏర్పడునో-"వైశేషికా" అను మొదలగువానిద్వారా చెప్పు చున్నాడు. "వైశేషికాః" అనగా పరస్పర విరుద్ధములగు విశిష్ట గుణములు అని అర్థము. ప్రధాన సంశ్రయములనగా ఆత్మను ఆశ్రయించినవిగా నున్నవని అర్థము. గుణసంశ్రయములనగా శుక్రశోణితము-అందున భూతములను ఆశ్రయించునవిగా యున్నవి అని అర్థము. గుణశబ్దము వలన ఇచట భూతములు చెప్పబడుచున్నవి. "యత" అని సప్తమియందు "తసి" ప్రయోగము. అందువలన ఏ విశేష భావము నందు ఎక్కువగా నుండుట యనునది కర్మవశమున జరుగునో ఆ భావముకంటె

ఇతరమైన స్త్రీ రూపమగునదిగాని పురుష రూపమగునదిగాని గర్భముయొక్క ఉత్పత్తి జరుగును. ఒకవేళ స్త్రీ కరములగు క్లైబ్యాది భావములు ఎక్కువగా నున్నచో అప్పుడు స్త్రీ జనించును. దీనికి వ్యతిరేకముగా నున్నప్పుడు పురుషుడు జనించును అని అర్థము. అచట "తద్యథా" అను మొదలగువానిద్వారా స్త్రీ కరములగు భావములను చెప్పుచున్నాడు. అపై శారద్యమనగా మోహము. శైథిల్యమనగా దగ్గరగా లేని అల్లిక: ఉదాహరణకు గట్టిదగు జనపనార వస్త్రమును గంజిలో తడిపినపుడు ఉండు శైథిల్యము. మార్దవమనగా అవయవములకు సహజముగా నుండు మృదుత్వము: ఉదాహరణమునకు పట్టు సూత్రమునందు ఎల్లప్పుడును ఉంచిన వస్త్రమునకు ఉండు మృదుత్వము. క్లైబ్యము మొదలుకొని అవస్థానమువరకు ప్రధాన సంశ్రయములు: మిగిలినవి గుణ సంశ్రయములు. "తథాయుక్తాని" అనుటవలన యోని బీజభాగము మొదలగువానిని గ్రహించుచున్నాడు. ఈ అధోగురుత్వాదులు రజస్సు అధికముగా నుండు బీజమునందే కలుగుచున్నదని తెలిసికొనవలెను. అందువలన "రక్తేన కన్యా-మధికేన" (శారీరస్థానము 2వ అధ్యాయము) అని చెప్పబడినది ఏది కలదో అది ఇప్పుడు చెప్పుచున్నవానికి సమానమే కాని విరుద్ధము కాదు. "విపరీతాని" అనగా అక్లైబ్యము మొదలగునవి అని అర్థము. "ఉభయభాగావయవాః" అనగా స్త్రీ పురుష కారకములగు అవయవములు. "నపుంసకకరాణి" అనగా నపుంసక నిర్దేశము అవ్యక్తగుణముల అభిప్రాయమువలన. అందువలన మొదట "నపుంసకకరాణి" అని అవ్యక్తగుణ సందోహాభిప్రాయము వలన ప్రయోగింపబడినది, తరువాత అని యేవి అని చెప్పవలసియున్నందున విశేష పరిగ్రహముచేత "ఉభయభాగావయవాః" అని పుంలింగముతో నిర్దేశము చేయబడినదని తెలియవలెను.

## గర్భమునకు సుఖదుఃఖానుబంధము కలుగుట - స్త్రీని ద్వైహృదయ యని పిలచుట

15. తస్య యత్కాలమేవేన్ద్రియాణి సన్నిష్ఠన్తే, తత్కాలమేవ చేతసి వేదనా నిర్బన్ధం ప్రాప్నోతి; తస్మాత్తదా ప్రభృతి గర్భః స్పన్దతే, ప్రార్థయతే చ జన్మాన్తరానుభూతం యత్కించిత్, తద్ద్వైహృదయ్యమాచక్షతే వృద్ధాః.
మాతృజం చాస్య హృదయం మాతృహృదయేనాభిసంబద్ధం భవతి రసవాహినీభిః సంవాహినీభిః; తస్మాత్తయోస్తాభిర్భక్తిః సంస్పన్దతే.
తచ్చైవకారణమపేక్షమాణా న ద్వైహృదయ్యస్య విమానితం గర్భమిచ్ఛన్తి

కర్తుమ్. విమాననేహ్యస్య దృశ్యతే వినాశో వికృతిర్వా. సమానయోగక్షేమా హి తదా భవతి గర్భేణ కేషుచిదర్థేషు మాతా. తస్మాత్ ప్రియహితాభ్యాం గర్భిణీం విశేషేణోపచరన్తి కుశలాః.

**తాత్పర్యము :** ఆ గర్భమునకు ఎపుడు ఇంద్రియములు ఏర్పడునో, అపుడే మనస్సునందు సుఖదుఃఖానుబంధము ఏర్పడును. అందుచే అప్పటినుండి గర్భము స్పందింపబడుచుండును. మరియు అది ఏదేని పూర్వజన్మయందనుభవించిన దానిని కోరుచుండును. అద్దానిని పెద్దలు ద్వైహృదయమందురు. తల్లివలన జనించిన గర్భము తల్లియొక్క హృదయముతో రసవాహకములగు నాడులతో కట్టబడి యుండును. అందువలన తల్లికిని గర్భమునకును నాడులద్వారా కోరికలు కలుగు చుండును. ఈ కారణమును చూచినవారు ద్విహృదయయగు తల్లి యొక్క కోరికలను తిరస్కరించుటకు ఇష్టపడరు. అట్లు తిరస్కరించుటచేతనే గర్భమునకు వినాశము గాని వికృతిగాని కల్గును. కొన్ని విషయములందు తల్లి గర్భముతో సమానమగు యోగక్షేమములు కలదిగ నుండును. కావున తెలివిగలవారు తల్లికి ప్రియమైన హిత మైన ఉపచారములను ఇచ్చెదరు.

**ఆయుర్వేదదీపిక :** "సన్తిష్ఠన్తే" అనగా ఏర్పడుచున్నవి అని అర్థము. "వేదనా" అనగా సుఖదుఃఖములు తెలియుట. "నిర్బంధం ప్రాప్నోతి" అనగా సంబంధమును పొందును, ఇంద్రియోత్పత్తియగు కాలమునందే సుఖదుఃఖములు తెలిసియున్నదగునని వాక్యార్థము. "తస్మాత్" అనగా సుఖదుఃఖ సంబంధముచేత, సుఖమును పొందుటకొరకు, దుఃఖమును పరిహరించుట కొరకును - స్పందతే - అనగా కదలును, మరియు జన్మాంతరానుభూతమగు సుఖహేతువులను కోరుచుండును అని అర్థము. ఆ గర్భముయొక్క కోరికతో కూడిన మాతృహృదయము-ను ద్వైహృదయ్యము అని - వృద్ధులు - జ్ఞానవృద్ధులు పిలుతురు. రెండు హృదయము లుండుటవలన - ద్వైహృదయ్యమని అనబడును. మాతృహృదయము గర్భహృదయ ముతో సమముగా నుండును. గర్భహృదయము మాతృహృదయముతో ఎట్లు సంబం ధించి యుండునో "మాతృజమ్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. మాతృ కారణకమగు ఆర్తవజము మాతృజమగును. "రసవాహినీభిః" అనగా గర్భ పోష ణము కొరకు ఉన్నట్టి మాతృహృదయమును గర్భము యొక్క నాభికి కట్టుచున్న రసవాహినులచేత అని అర్థము. ఇందువలన దేనిని గర్భము కోరునో ఆ ప్రార్థనను

రసవాహినులద్వారా తల్లి పొందినదై తల్లియును ఆ కోరికను కలదగును. ఇట్లే తల్లి కోరిక వలననూ గర్భము ఆ కోరికను పొందినదగును. "తయోః" అనగా తల్లి - గర్భము ఈ రెండింటికి. "భక్తిః" అనగా ఇచ్ఛ. "తాభిః" అనగా రసవాహినులతోడ. "సంసర్పతే" అనగా మాతృహృదయము నుండి గర్భహృదయమునకు తీసికొనివెళ్ళను, మరియు గర్భహృదయము నుండి మాతృహృదయమునకు తీసికొని వెళ్ళను అని అర్థము. "గర్భస్య వినాశో వికృతిర్వా" అనగా పెద్ద కోర్కెను అణచుటవలన వినాశము స్వల్పమైన కోర్కెను అణచుటవలన వికృతియుకలుగును. లేదా తల్లియొక్క కోరిక గర్భముయొక్క కోరికతో కూడియున్నది దానికి విఘాతము కలుగుటవలన గర్భమునకు విఘాతము కలుగును, అట్టి సాక్షాత్తు గర్భ సంబంధమగు కోరిక తీరినపుడు (అణచివేయబడినపుడు) సుకుమారతరమగు గర్భము వాతప్రకోపమువలన నశించును. తల్లియొక్క కోర్కె అణచివేయబడినపుడు అది తల్లియందు వాతకోపమును కలుగజేయుచు సమాన యోగక్షేమములుకల గర్భము నందును కొంచెము వికృతి కలుగుటవలన వికృతిని కలుగజేయును. దీనినే "సమాన యోగక్షేమా" అను మొదలగువానిద్వారా చూపుచున్నాడు. యోగః అనగా సుఖహేతువులుండుట; క్షేమమనగా కష్టములను పరిహరించుట. ఈ యోగక్షేమములు రెండును తల్లికిని గర్భమునకును సమానముగా నుండును. "కేషుచిదర్థేషు" అను వచనమువలన సమానము కాని యోగక్షేమములుండుటయును కొంత ఉండునని చూపుచున్నాడు. అందువలన తల్లియొక్క ఆకలి మొదలగు బాధలు అవశ్యముగా గర్భమును ప్రవేశించి బాధింపవు అట్లే గర్భమునకుండునవి తల్లినియును బాధింపవు అని చూపుచున్నాడు. "గర్భిణీం విశేషేణ" అను వచనముచేత గర్భిణి కాని స్త్రీకిని ఋతుకాలమునందు ప్రియములు, హితములును అగు ఉపచారములు చేయవలెనని తెలిసికొననగును. ఈ విషయము శారీరస్థానము 8వ అధ్యాయమునందు "సహచర్యమైనాం ప్రియహితాభ్యాం సతతముపచరేయుః" అను మొదలగువాని ద్వారా చెప్పబడినది.

## గర్భమును గ్రహించిన స్త్రీయొక్క లక్షణములు

16. తస్యా గర్భోత్పత్తిస్తైహృదయస్య చ విజ్ఞానార్థం లిఙ్గాని సమాసేనోపదిక్ష్యామః. ఉపచారసాధనం హ్యస్య జ్ఞానే, జ్ఞానం చ లిఙ్గతః, తస్మాదిష్టో లిఙ్గోపదేశః, తద్యథా - ఆర్తవాదర్శనమాస్యసంస్రవణమనన్నాభిలాషశ్ఛర్ది-

రరోచకోఽమ్లకామతా చ విశేషేణ శ్రద్ధాప్రణయనముచ్చావచేషు భావేషు
గురుగాత్రత్వం చక్షుషోర్గ్లానిః స్తనయోః స్తన్యమోష్ఠయోశ్చ
కార్ష్ణ్యమత్యర్థం శ్వయథుః పాదయోరీషల్లోమరాజ్యుద్గమో
యోన్యాశ్చాటాలత్వమితి గర్భే పర్యాగతే రూపాణి భవన్తి.

**తాత్పర్యము :** గర్భమును పొందిన స్త్రీకిని, ద్వైహృదయమునకును గల లక్షణములను తెలిసికొనుట కొరకు ఆ లక్షణములను సంక్షేపముగ చెప్పబోవుచున్నాము. జ్ఞానమునందే (జ్ఞానము వలననే) ఉపచార సాధనము కలుగును. ఆ జ్ఞానమును లక్షణములవలన కలుగును అందుచే లక్షణములను చెప్పుట అవసరమై యున్నది. ఆ లక్షణము లేవనగా — ఆర్తవము కనుపించక పోవుట, నోట నీరూరుట, అన్నమునందిచ్ఛ లేకుండుట, వాంతియగుట, నోటికి రుచి తెలియకుండుట, పులుపును ఎక్కువగా కోరుట, గొప్ప వస్తువులను, నీచమైన వస్తువులను కోరుచుండుట, శరీరము బరువుగ నుండుట, కన్నులు వాడియుండుట, చన్నులయందు పాలు ఏర్పడుట, పెదవులు - చనుకట్టులపై నలుపు ఎక్కువగా కలుగుట, పాదముల యందు కొంచెము వాపుకలుగుట, రోమరాజి (బొడ్డుక్రింద నిలువుగానుండు వెంట్రుకల వరుస) ఎత్తుగానగుట, యోని విస్తరించుట అనునవి. ఇవి గర్భమేర్పడిన పిదప స్త్రీలకు గల్గు లక్షణములు.

**ఆయుర్వేదదీపిక :** ఉపచార సాధనమనగా ఉపచారమునకు తగిన సాధనము. "అస్యా" అనగా గర్భమును గ్రహించిన దానికి మరియు ద్వైహృదయమునకును అనగా గర్భమును గ్రహించినదానికి చేయవలసిన ఉపచారము — "శక్యా తు చేద్గర్భమాపన్నా క్షీరమనుపస్కృతం కాలే కాలే పిబేత్" (శారీరస్థానము 8వ అధ్యాయము) అనువాని ద్వారా చెప్పును ద్విహృదయోపచారమును ముందు అవతరించి చెప్పగలడు. "అమ్లకామతా" అనుచోట "విశేషణ" అనునది ఉపమానము. "జ్ఞానము" అనగా గర్భముయొక్క మరియు ద్విహృదయము యొక్కయు జ్ఞానము. "శ్రద్ధా" అనగా కోరిక. "ఉచ్చావచేషు" అనగా ఉచ్చనీచములయందు — తిను పదార్థములయందు చేయబడినవానియందు చేయబడని వానియందును అని అర్థము. "ఈషత్" అనునది పాదశోధకమ వర్తించును "చాటాలత్వము" అనగా తెరువబడిన యుండుట. ఈ లక్షణములు గర్భ స్థాపనమునకు ఉండును. తృతీయమాస మునుపు ప్రకటమగునవి మాత్రము ద్వైహృదయ యొక్క లక్షణములని తెలిసికొనవలెను.

## గర్భమునకు ఉపఘాతమును కలిగించు భావములు

17. సా యద్యదిచ్ఛేత్తత్తదస్యై దద్యాదన్యత్ర గర్భోపఘాతకరేభ్యో భావేభ్యః.

18. గర్భోపఘాతకరా స్త్విమే భావా భవన్తి;తద్యథా—సర్వమతి గురూష్ణతీక్ష్ణం దారుణాశ్చ చేష్టాః;ఇమాంశ్చాన్యానుపదిశన్తి వృద్ధాః—దేవతారక్షోఽనుచరపరిరక్షణార్థం న రక్తాని వాసాంసి బిభృయాన్న మదకరాణి మద్యాన్యభ్యవహరేన్న యానమధిరోహేన్న మాంసమశ్నీయాత్ సర్వేన్ద్రియ-ప్రతికూలాంశ్చ దూరతః పరివర్జయేత్,యచ్చాన్యదపి కిఞ్చిత్ స్త్రియో విద్యుః

**తాత్పర్యము :** గర్భిణీ స్త్రీ కోరుకొన్న వాటిలో గర్భమునకు ఉపఘాతమును కలిగించు భావములు తప్ప మిగిలిన వాటినన్నింటిని ఇచ్చుచుండవలెను. గర్భమునకు ఉపఘాతములను కలిగించు భావములు ఏవనగా — అతిగురు, అతి ఉష్ణ, అతితీక్ష్ణ పదార్థములు, దారుణమైన చేష్టలు. జ్ఞానవృద్ధులు ఇవియేకాక ఇంకను ఇతరములైన వానినికూడా ఉపదేశించుచున్నారు — దేవతలు, రాక్షసులు - వీరి అనుచరుల నుండి రక్షించుకొనుట కొరకు రక్తవస్త్రములను ధరింపరాదు; మదమును కలిగించు మద్యములను సేవింపరాదు, యానములను (ఏనుగు, గుఱ్ఱము మొదలగు వానిని) అధిరోహింపరాదు, మాంసమును భుజింపరాదు అన్ని ఇంద్రియములకు ప్రతికూలములగు భావములను దూరమునుండియే వర్జింపవలెను. ఇంకను స్త్రీలకు తెలిసిన గర్భోపఘాతకర భావములను వర్జింపవలెను.

**ఆయుర్వేదదీపిక :** "దారుణాశ్చేష్టాః" అనగా మైథునము చేయుట మొదలగునవి. దేవతా రాక్షస అనుచరుల నుండి పరిరక్షించుకొనుట దేవతారక్షోఽనుచర పరిరక్షణమనబడును. "యత్" అను మొదలగునవి. ఇవికాక స్త్రీలు ఇతరములైన గర్భకాలమునందు సేవన యోగ్యము కానివానిని తెలిసికొని యుందురో వానిని కూడ వర్జింపవలెను. గర్భిణీ స్త్రీ బావిలోనికి చూడరాదు, నదిని దాటరాదు అని స్త్రీలు చెప్పుచునే యుందురు. వృద్ధ స్త్రీల యొక్క వచనమునూ ఆగమమూలమే అయి యున్నది. ఈ విషయములు ఇచట గ్రంథ విస్తరభీతిచే చూపబడలేదు అని భావము.

19. తీవ్రాయాం తు ఖలు ప్రార్థనాయాం కామమహితమప్యస్యై హితేనోపహితం దద్యాత్ ప్రార్థనావినయనార్థమ్-ప్రార్థనాసంధారణాద్ధి వాయుః ప్రకుపితోఽన్తఃశరీరమనుచరన్ గర్భస్యాపద్యమానస్య వినాశం వైరూప్యం వా కుర్యాత్.

**తాత్పర్యము :** అహితమైనదైనను కోరిక తీవ్రముగా నున్నపుడు అట్టి కోర్కెను హితమైనవానితో కలిపి ఇవ్వవలెను. కోర్కెను అణచివేసినచో వాతము ప్రకోపించి శరీరములోపల సంచరించి గర్భమునకు వినాశనమును గాని వికృతిని గాని కల్గించును.

**ఆయుర్వేదదీపిక :** ప్రార్థన యనగా కోరిన విషయమును పొందవలెనన్న కోర్కె దానియొక్క తీవ్రత్వమనగా బలమైన కోర్కె జనించుటయే. "హితోప హితం" అనగా హితమైనదానితో కలిపి; లేదా కల్పనా భేదముచే హితముగానున్నట్టి అని అర్థము. "ప్రార్థనాయా వినయనం" అనగా కోర్కెను త్రోసిపుచ్చుట. కోరిక యనునది కోరినది దొరికినపుడే తగ్గును. "ప్రార్థనా" అను మొదలగువాని ద్వారా కోర్కెను అణచివేయుటయందు దోషమును చెప్పుచున్నారు. ప్రార్థనయొక్క సరియగు ధారణము ప్రార్థనా సంధారణమనబడును. ఇదియును కోరినది స్వల్పక్రమముగ ఇచ్చుచున్ననూ ఉండును. యథోక్త ప్రకారముగా సరియైన వానిని ఇచ్చినపుడు కూడ కోరిక కొంచెముగా గాని పూర్తిగా గాని ఖండింపబడును. ఇవ్వావిధానము కూడ మనస్సునకు క్షోభను కలిగించు భయమువలె వాత ప్రకోపకరమగును. "ఆపద్యమానస్య" అనుటవలన గర్భము అతి చిన్నదగుటవలన (లేతదగుటవలన) కొంచెము వాతక్షోభమైనను సహింపలేకుండుటను చూపుచున్నారు. పై వాక్యమును నశింపజేయు వికల్పము మాత్రము అధికవాత కోపమును తగ్గించుటవలన కలుగునని తెలియవలెను.

## నాల్గవ మాసమునందు గర్భముయొక్క స్థితి

20. చతుర్థే మాసి స్థిరత్వమాపద్యతే గర్భః, తస్మాత్తదా గర్భిణీ
గురుగాత్రత్వమధికమాపద్యతే విశేషేణ.

**తాత్పర్యము :** నాల్గవ మాసమునందు గర్భము స్థిరత్వమును పొందును. అందుచే గర్భిణీ స్త్రీ విశేషించి శరీరమున గురుత్వమును (బరువును) పొందును.

**ఆయుర్వేదదీపిక :** తృతీయ మాసము ననుసరించి జరుగు విషయములను చెప్పు ప్రస్తావన వలన వచ్చిన గర్భముయొక్క విశేషమును మిక్కిలి క్రమముననుసరించి వచ్చుచున్న చతుర్థమాసక్రమమును — "చతుర్థే" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నారు. స్థిరత్వమనగా కఠినత్వము (అంగావయవములు దగ్గర

దగ్గరగా ఏర్పడి యుండుట) అందువలననే ఎక్కువగా బరువుకలిగి నిబిడముగానున్న గర్భమును కలిగియుండుటవలన గర్భిణి శరీరము బరువుగా నుండుననుట యుక్తముగా నున్నది.

## ఐదవ మాసమునందు గర్భముయొక్క స్థితి

21. పఞ్చమే మాసి గర్భస్య మాంసశోణితోపచయో భవత్యధికమన్యేభ్యో భావేభ్యః, తస్మాత్తదా గర్భిణీ కార్శ్యమాపద్యతే విశేషేణ.

**తాత్పర్యము :** ఐదవ మాసమునందు గర్భమునకు ఇతర మాసములందు కంటె మాంసము రక్తము అను రెండును అధికముగా వృద్ధి చెందును. అందుచేత ఆ సమయమున గర్భిణి విశేషించి బలహీనముగా నుండును.

**ఆయుర్వేదదీపిక :** "అధికమన్యేభ్యః" అనుట వలన ఇతర మాసము లందును కొంచెము కొంచెముగా మాంస శోణితములు వృద్ధి యగుటను చూపుచున్నాడు. యే శారీరక భావముల వలన గర్భము వృద్ధి పొందునో ఆ శారీరక భావముల వలన గర్భిణి క్షీణించును అనుట యుక్తమే. గర్భము యొక్క మాంసాదులను పోషించుట వలననే క్షీణించిన ఆహార రసము తల్లియొక్క మాంసాదులను సరిగా పోషింపదు.

## ఆరవ మాసమునందు గర్భముయొక్క స్థితి

22. షష్ఠే మాసి గర్భస్య బలవర్ణోపచయో భవత్యన్యేభ్యో మాసేభ్యః, తస్మాత్తదా గర్భిణీ బలవర్ణహానిమాపద్యతే విశేషేణ.

**తాత్పర్యము :** ఆరవ మాసమునందు తక్కిన మాసములందు కంటె గర్భమునకు బలము వర్ణములు వృద్ధి చెందును. అందుచే ఆ సమయమున గర్భిణికి బలము వర్ణములు విశేషముగా క్షీణించును.

**ఆయుర్వేదదీపిక :** బలము మరియు వర్ణము-ఈ రెండింటి వృద్ధి బలవర్ణోపచయమనబడును. లేదా, ఉపచయమనగా ధాతుపుష్టి అని అర్థము.

## ఏడవ మాసమునందు గర్భముయొక్క స్థితి

23. సప్తమే మాసి గర్భః సర్వైర్భావైరాప్యాయ్యతే, తస్మాత్తదా
గర్భిణీ సర్వాకారైః క్లాన్తతమా భవతి.

**తాత్పర్యము :** ఏడవ మాసమునందు గర్భమునకు అన్ని భావములును వృద్ధి నొందును. అందుచే అపుడు గర్భిణి అన్ని విధములుగ ఎక్కువ సీరసించి యుండును.

**ఆయుర్వేదదీపిక :** "సర్వభావైః" అనగా మాంస శోణితాదులచే అని అర్థము. ఏడవ మాసమునందు అన్నింటి వలనను ఒకే మారుగా గర్భము పోషింప బడును (వృద్ధి చెందును) క్రిందటి మాసములందు మాత్రము అన్నింటి వలన ఒకే మారుగా వృద్ధి చెందదు అనునది విశేషము. "సర్వాకారైః" అనగా మాంస శోణితాది అన్నింటి వలన కలుగు బాధల చేత అని అర్థము. "క్లాన్తతమా" అనగా అతిగా క్షీణించియున్నది.

## ఎనిమిదవ మాసమునందు గర్భముయొక్క స్థితి-గర్భము ఎనిమిదవ మాసమునందు జన్మించరాదనుటకు కారణము

24. అష్టమే మాసి గర్భశ్చ మాతృతో గర్భతశ్చ మాతా రసవాహినీభిః
సంవాహినీభిర్ముహుర్ముహురోజః పరస్పరత ఆదదాతే గర్భస్యాసంపూర్ణ
త్వాత్. తస్మాత్తదా గర్భిణీ ముహుర్ముదాయుక్తా భవతి ముహుర్ముదా-
హుశ్చ గ్లానా, తథా గర్భః, తస్మాత్తదా గర్భస్య జన్మ వ్యాపత్తిమద్భవత్యో-
జసోఽనవస్థితత్వాత్. తం చైవార్థమభిసమీక్ష్యాష్టమం మాసమగణ్యమిత్యాచ-
క్షతే కుశలాః.

**తాత్పర్యము :** ఎనిమిదవ మాసమునందు గర్భము సంపూర్ణముగా నుండకపోవుట వలన మాటిమాటికి తల్లినుండి గర్భము, గర్భము నుండి తల్లియు ఓజస్సును పరస్పరము, రసవాహినులగు నాడుల ద్వారా గ్రహించుచుందురు. అందువలన అపుడు గర్భిణీ స్త్రీ ఒకొక్కప్పుడు సంతోషముగను ఒకొక్కప్పుడు నిరుత్సాహముగ నుండును గర్భము కూడ అట్లే యుండును. ఓజస్సు స్థిరముగ లేక పోవుట వలన ఎనిమిదవ మాసమునందు గర్భము జన్మించినను ఆపత్తితో కూడి యుండును. ఇట్లుండుట చూచి బుద్ధిమంతులగువారు ఈ ఎనిమిదవ మాసము జరుగు చున్నదని గర్భిణికి లెక్కించి చెప్పరాదని చెప్పుదురు.

ఆయుర్వేదదీపిక : "అష్టమే" అను మొదలగునవి. "రసవాహినీభిః" అనగా మాతృహృదయమునందు, గర్భనాడి ద్వారానూ సంబద్ధమైయున్న రసవాహినుల వలన అని అర్థము. "పరస్పరత ఓజ ఆదదాతే" అనగా తల్లియొక్క ఓజస్సు గర్భమునకు వచ్చును. అట్లే గర్భము యొక్క ఓజస్సు తల్లికి వచ్చును. ఓజస్సు స్థిరముగా నుండకపోవుటకు కారణమును - "గర్భస్యాసంపూర్ణత్వాత్" అనుట ద్వారా చెప్పుచున్నాడు. గర్భము అసంపూర్ణముగా నుండుట వలన గర్భమునందు ఓజస్సు సరియగు ఆశ్రయము లేనిదై అనవస్థితముగా నుండును. తల్లి యొక్క ఓజస్సు గర్భమునకు వెళ్ళునని ఏది చెప్పబడుచున్నదో అది గర్భము యొక్క ఓజస్సే యగును, తల్లితో సంబద్ధమై యుండుట వలన అది మాతృ ఓజస్సని చెప్పబడుచున్నది. ఒకవేళ తల్లి యొక్క ఓజస్సే గర్భమునకు వెళ్ళుచున్నదను అర్థమున్నచో అపుడు గర్భము అసంపూర్ణముగా నుండుట వలన అను హేతువు సంపూర్ణమగు తల్లి దేహమునందున్న ఓజస్సు యొక్క గమనమునందు అసంగతము కావలెను. మరియు, ఏ విధముగా గర్భము యొక్క ఓజస్సు తల్లి యందున్నపుడు గర్భము జన్మించినపుడు ఆ గర్భము మరణించునో అదే విధముగా తల్లి యొక్క ఓజస్సు గర్భమునందున్నపుడు గర్భము జనించినచో తల్లియును మరణింపవలెను. కాని ఇట్లు జరుగుట లేదు, ఎందువలననగా రెండు పరిస్థితులయందును గర్భమునకే మరణము జరుగుచున్నదని చెప్పుదురు కాని తల్లికి మరణము సంభవింపదు – "తదా గర్భస్య జన్మ వ్యాపత్తిమద్భవతి" అను వచనము వలన (పై విధముగా అనుకొనవలెను). జతూకర్ణ సంహితయందునూ అష్టమమాసమందు జన్మించుట గర్భము యొక్క వినాశనము కొరకే యని చూపబడినది. అచట "స్త్రీగర్భావన్యోన్యస్య ఓజ ఆదదాతేఽష్టమే, తస్మాత్తదా ప్రసూతిర్గర్భవినాశాయైవ" అని చెప్పబడియున్నది. "సత్యపి మాతురోజసో గర్భగమనే జన్మాదృష్టవశాదేవ గర్భస్యైవ మరణాయ భవతి,న మాతుః" అని ఇతరులు వర్ణించుచున్నారు. సుశ్రుత వ్యాఖ్యానకారులు— "అష్టమమాసే నైరృతభాగత్వాచ్చ గర్భస్య సత్యప్యోజసోఽనవస్థానే తుల్యే గర్భస్యైవ నాశో న మాతుః" అని వర్ణించుచున్నారు. "గర్భిణీ ముహుర్ముహుర్ముదాయుక్తా భవతి" అనగా గర్భము యొక్క ఓజస్సును పొందినపుడు హర్షయుక్తముగా నుండును, ఓజస్సు తిరిగి వెళ్ళుటచే మాత్రము మాటిమాటికిని అలసటగా నుండునని అన్వయించుకొనవలెను. "తథా గర్భః" అనగా గర్భిణి వలెనే గర్భము కూడ మాటిమాటికి సంతోషముతో కూడియు, మాటిమాటికి

గ్లానితో కూడియు ఉండునని అర్థము. "తస్మాత్" అనగా పూర్వము చెప్పబడిన గర్భవ్యాపత్తి కారణము సాక్షాత్తు చెప్పబడుచున్నది. "ఓజసో అనవస్థితత్వాత్" అను నది వివరింపబడియేయున్నది. అష్టమ మాసము యొక్క మరియొక విశేషమును "తం చైవార్థమ్" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "తం చైవార్థమ్" అనగా గర్భవ్యాపత్తి విషయమును "అగణ్యమ్" అనగా గర్భిణికి లెక్కించుట ద్వారా చెప్పకూడదు అని అర్థము. ఒకవేళ గర్భము జన్మించుట వలన వ్యాపత్తిని కలిగించు ఎనిమిదవ మాసమును గురించి లెక్కించి వినినచో అపుడు ఆమె భయము నొందును. ఆ భయము వలననూ గర్భమునకు వాత ప్రకోపము వలన వ్యాపత్తు కలుగ వచ్చునని భావము.

## ప్రసవమునకు తగిన కాలము

25. తస్మిన్నేకదివసాతిక్రాన్తేఽపి నవమం మాసముపాదాయ
ప్రసవకాలమిత్యాహురాదశమాన్మాసాత్. ఏతావాన్ ప్రసవకాలః,
వైకారికమతః పరం కుక్షావస్థానం గర్భస్య.

**తాత్పర్యము :** ఎనిమిదవ మాసము దాటి ఒక్కరోజు గడచిననూ ఆ తొమ్మిదవ మాసమునుండి పదవ మాసము వరకు "ప్రసవ కాలము" అని అందురు. ఇది ప్రశస్తమైన ప్రసవకాలము. అటుపైన గర్భము కుక్షియందుండుట వికృతి కల్గించునదగును.

**ఆయుర్వేదదీపిక :** "తస్మిన్" అనగా అష్టమమాసము యొక్క "ఆదశ మాత్" అను వచనము ప్రశస్తతరముగు ప్రసవ కాలమని సూచించుటకు. సుశ్రుతమునందు ద్వాదశ మాసము వరకు ప్రసవకాలమని చెప్పినను కొంచెము దోషము గల ఏకాదశ ద్వాదశ మాసములను అల్పదోషము వలన దోషపక్షమే యగు నని తెలియవలెను.

26. ఏవమనయాఽనుపూర్వ్యాఽభినిర్వర్తతే కుక్షౌ.

**తాత్పర్యము :** ఇవ్విధముగ పైన చెప్పబడిన క్రమమున గర్భము కుక్షి యందు ఏర్పడును.

**ఆయుర్వేదదీపిక :** "ఏవమ్" అను మొదలగు ద్వారా ఇచ్చిన సమా ధానమును ఉపసంహరించుచున్నాడు.

## గర్భము వృద్ధిచెందుటకు కారణములు

27. మాత్రాదీనాం ఖలు గర్భకరాణాం భావానాం సంపద స్తథా
వృత్తస్య సౌష్ఠవాన్మాతృతశ్చైవోపస్నేహోపస్వేదాభ్యాం
కాలపరిణామాత్ స్వభావసంసిద్ధేశ్చ కుక్షౌ వృద్ధిం ప్రాప్నోతి.

**తాత్పర్యము :** తల్లి మొదలగు గర్భకరములగు భావములు మంచివిగా నుండుట వలన, మరియు తల్లియొక్క ఆహార విహారములు బాగుగా నుండుట వలన, తల్లివలన కలుగు ఉపస్నేహ, ఉపస్వేదముల వలననూ, కాల పరిణామము వలననూ గర్భము కుక్షియందు వృద్ధి చెందును.

**ఆయుర్వేదదీపిక :** "యశ్చాస్య వృద్ధిహేతుః" అను ప్రశ్న యొక్క సమాధానము—"మాత్రాదీనామ్" అను మొదలగునవి. 'ఆది' అని చెప్పుట వలన "మాతృజశ్చాయం" (శారీర స్థానము 4వ అధ్యాయము) అను మొదలగు సూత్రము లందు చెప్పబడిన పితృ, ఆత్మ, సాత్మ్య, రస, సత్త్వములు గ్రహింపబడు చున్నవి. తల్లి యొక్క ఆచార రూపమగు వృత్తము యొక్క సౌష్ఠవము (బాగుగా నుండుట) వృత్త సౌష్ఠవమనబడును. "మాతృతః" అను పదము వృత్త సౌష్ఠవమ్, ఉపస్నేహోపస్వేదాభ్యాం అను రెండింటికి సంబంధించియున్నది. రస సాత్మ్య సౌష్ఠవము మాత్రము తల్లి మొదలగువాని సంపత్తు అనుటద్వారా వచ్చియే యున్నది. ఉప స్నేహమనగా ధాతునిష్యందనమునకు సంబంధించినది. ఉప స్వేదనము—తల్లి యొక్క శరీరపు వేడిమి వలన గర్భమునకు స్వేదనము కలుగుట ఇదీ గర్భవృద్ధికరమే యగును. ఉదాహరణకు అండజములకు రెక్కల ద్వారా ఉపస్వేదనము చేయుట వానిని వృద్ధి పొందించునదిగా చూచుచున్నాము. "కాలపరిణామాత్" అనగా కాలము ఎక్కువగుచున్న కొలది గర్భము వృద్ధి చెందుచుండును అని భావము. గర్భము వృద్ధి చెందుటకు ఇంకొక కారణమును "స్వభావ సంసిద్ధేశ్చ" అనుట ద్వారా చెప్పుచున్నాడు. కర్మజన్యమగు స్వభావము వలననే గర్భము పెరుగు చుండునని భావము. భోగ కారణమగు శరీరమును కలిగించు కర్మ వలన గర్భ శరీరము పెరుగుచుండు స్వభావము వలననే ఏర్పడినట్టిదైనందువలన వృద్ధి చెందును అని భావము.

## గర్భము ఏర్పడకుండుటకు కారణము

28. మాత్రాదీనామేవ తు ఖలు గర్భకరాణాం భావానాం వ్యాపత్తి నిమిత్తమ-స్యాజన్మ భవతి.

**తాత్పర్యము :** గర్భ కరములగు తల్లి మొదలగు భావములు వ్యాపత్తితో కూడియుండుటయే కారణమగుటవలన గర్భము ఏర్పడదు.

**ఆయుర్వేదదీపిక :** "కుతశ్చాస్యాజన్మ భవతి" అను ప్రశ్నకు సమాధానము- "మాత్రా" .... అను మొదలగునవి. "వ్యాపత్తినిమిత్తమ్" అనగా వ్యాపత్తి కారణమగుట. అచట మాతృ వ్యాపత్తి యనగా యోనిరోగము గర్భాశయము మొదలగు వాని దోషము. పితృవ్యాపత్తు అనునది శుక్రదుష్టి అను మొదలగునవి తెలిసికొనవలెను.

## పెరుగుచున్న గర్భము వినాశమును పొందుటకు కారణము

29. యే హ్యస్య కుక్షౌ వృద్ధిహేతుసమాఖ్యాతా భావాస్తేషాం విపర్యయాదుదరే వినాశమాపద్యతే, అథవాఽప్యచిరజాతః స్యాత్.

**తాత్పర్యము :** ఈ గర్భము కుక్షియందు వృద్ధి పొందుటకు కారణములుగా చెప్పబడిన భావములేవి కలవో వానియొక్క వ్యతిరేకత వలన ఉదరమునందు గర్భము వినాశమును పొందును లేదా అచిరకాలమునందు జనించును (అందువలన విపత్తును పొందును అని అర్థము).

**ఆయుర్వేదదీపిక :** "యతశ్చ జాయమానః... " అను మొదలగు ప్రశ్న యొక్క సమాధానము- "యే హి" అను మొదలగునవి. వృద్ధి హేతువులుగా చెప్పబడిన భావములు అనగా "మాత్రాదీనాం తు ఖలు గర్భకరాణాం భావానాం సంపదః" అను మొదలగు సూత్రమునందు చెప్పబడినవి. "అథవాఽప్యచిరజాతః" అనగా ఎప్పుడైతే తల్లి మొదలగువానికి అన్ని విధములుగ దోషప్రాప్తమగునో, అపుడు గర్భము వినాశమును పొందును; ఎప్పుడైతే అల్పదోషత్వము వలన కొంచెము విపర్యయము కలుగునో, అపుడు అచిరజాతమగును అనగా విపత్తిని పొందును అని తెలియవలెను.

## గర్భము పూ_ర్తిగా నశింపక వికృతి నొందుటకు కారణము

30. యతస్తు కా_ర్త్స్న్యేనావినశ్యన్ వికృతిమాపద్యతే, తదనువ్యాఖ్యాస్యామః— యదా స్త్రియా దోషప్రకోపణోక్తాన్యాసేవమానాయా దోషాః ప్రకుపితాః శరీరమనుసర్పన్తః శోణితగర్భాశయావుపపద్యన్తే, న చ కా_ర్త్స్న్యేన శోణిత గర్భాశయౌ దూషయన్తి,తదేయం గర్భం లభతే స్త్రీ: తదా తస్య గర్భస్య మాతృజానామవయవానామన్యతమోఽవయవో వికృతిమాపద్యత ఏకోఽథవాఽనేకే, యస్య యస్య హ్యావయవస్య బీజే బీజభాగే వా దోషాః ప్రకోపమాపద్యన్తే, తం తమయవం వికృతిరావిశతి. యదా హ్యస్యాః శోణితే గర్భాశయబీజభాగః ప్రకోపమాపద్యతే, తదా వన్ధ్యాం జనయతి: యదా పునరస్యాః గర్భాశయబీజభాగావయవః ప్రకోపమాపద్యతే, తదా పూతిప్రజాం జనయతి: యదా త్వస్యాః శోణితే గర్భాశయబీజభాగావయవః స్త్రీకరాణాం చ శరీరబీజభాగానామేకదేశః ప్రకోపమాపద్యతే, తదా స్త్ర్యాకృతిభూయిష్ఠామస్త్రియం వార్తాం నామ జనయతి, తాం స్త్రీవ్యాపదమాచక్షతే.

**తాత్పర్యము :** గర్భము పూ_ర్తిగ నశింపక వికృతి నొందుటకు కారణమును చెప్పుచున్నాము. దోషములను ప్రకోపింపచేయు ఆహార విహారములను సేవించు స్త్రీకి దోషములు ప్రకోపించి శరీరమునందు వ్యాపించుచు ఆ_ర్తవమును, గర్భాశయమును జేరి వానిని పూ_ర్తిగ దూషింపజేయని యెడల గర్భము కలుగవచ్చును. అట్టి గర్భము యొక్క మాతృజములగు అవయవములలో నొకటిగాని, ఎక్కువగాని అవయవములు వికృతి నొందును. ఏ యే అవయవము యొక్క బీజమునందు గాని, బీజ భాగమునందు గాని దోషములు ప్రకోపించునో, ఆ యా అవయవము వికృతి నొందును. ఆ_ర్తవము నందలి గర్భాశయమును కలిగించు బీజ భాగమంతయు మిక్కిలి దూషింపబడిన యెడల వంధ్యాస్త్రీయును, కొంత భాగము మిక్కిలి దూషింపబడినయెడల దుర్గంధము కల అవయవములతో కూడిన స్త్రీయును, స్త్రీ లక్షణములను కలిగించు బీజములలో కొంతభాగము మిక్కిలి దూషింపబడినచో, స్త్రీ యొక్క ఆకారము కలిగి స్త్రీ లక్షణములు లేనట్టియు వార్త యనబడు స్త్రీయును జన్మించును. పై చెప్పబడిన వికృతులు స్త్రీ వ్యాపత్తులనబడును.

**ఆయుర్వేదదీపిక :** మిగిలిన ప్రశ్నకు సమాధానమును చూపుటకు "యతస్తు" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "అత్రావినశ్యన్" అనుచోట వినాశ

శబ్దమువలన వికృతి అభిప్రేతమైయున్నది. వికృతియందును వినాశశబ్దము వాడబడును. ఉదాహరణకు- దుశ్శీలము వలన వికృతి చెందిన పురుషుని వీడు నశించినాడు (వినష్టోఽయం) అని చెప్పబడును. ఇట్లే కొంత భాగము వికృతి జరిగినప్పుడు వినాశ శబ్దమును వాడునప్పుడు కార్త్స్న్యేన అను విశేషణము యుక్తముగా నున్నది. దోషప్రకోషణము అనుటవలననే దోషప్రకోపణములను సేవించుచున్నట్టి అను అర్థము వచ్చుచున్ననూ, మరల "దోషప్రకోపణోక్తాన్యాసేవమానాయా" అను పదము స్వహేతు సేవనవలన దోషములకు బలవంతమగు ప్రకోపము కల్గునని సూచించుటకు వాడబడినది. పరహేతుసేవనవలన కూడ కొంచెముగా అనుబంధ రూపమగు దోషప్రకోపము కలుగును. ఉదాహరణకు- అమ్లరస సేవనవలన కలుగుచున్న పిత్తము శ్లేష్మములతో కూడి కల్గుచుండును. "న తు కార్త్స్న్యేన దూషయన్తి" అను పదము వలన పూర్తిగా దూషింపబడినపుడు గర్భమే జనింపదు అను విషయమును చూపుచున్నాడు. "మాతృజానామ్" అనగా త్వక్కు, రక్తము మొదలగువానికి అని అర్థము. "అన్యతమ" అని జాతియందు ఏకవచన ప్రయోగము. అచట ఒకే అవయవము అన్యతమము, మరియు అనేకములైన అవయవములు అన్యతమ శబ్దము వలన చెప్పబడినవి. అందువలననే "ఏకోఽప్యథవాఽనేకే" అని అన్యతమమునకు వివరణము వచ్చియున్నది. లేనియెడల, అన్యతమమను పదము వలన ఒకే అవయవమును గ్రహించుటచేత "అనేకే" అను వివరణము అసంగతము కావలెను. "యస్య "అను మొదలగువానిద్వారా మరల ఒకదానికిగాని అనేకములగు వానికిగాని వికృతి ఎందువలన కలుగునో చెప్పుచున్నాడు. "బీజే" అనగా గర్భకారణమగు మొత్తము బీజమునందు అని అర్థము. "బీజభాగే వా" అనగా బీజమునందు కొంత భాగమునందైననూ అని అర్థము. వీనియొక్క వికృతినే శృంగగ్రాహికముగా చెప్పుటకు "యదా" అను మొదలగువానిని చెప్పుచున్నాడు. "శోణితే" అనగా ఆర్తవమునందు. గర్భాశయమును కలిగించు బీజభాగము గర్భాశయ బీజభాగము అనబడును; లేదా గర్భాశయము యొక్కయు ఆర్తవ రూపమగు బీజము యొక్కయు జనకమగు (పుట్టించునదగు) భాగము గర్భాశయ బీజభాగము అనబడును. గర్భాశయ ఆర్తవములు రెండును మాతృజావయవములయందు వచ్చుననియు, శోణితజన్యములునూ అయియున్నవి. అందువలన, ఆర్తవమును కలిగించు బీజమునకు కూడ గర్భకాలమున దోషము కలుగుట సాధ్యమే యగును. "ప్రదోష" అనుచోట ప్ర శబ్దము వలన ఎక్కువయగు వంధ్యత్వమను కార్యమును కలుగజేయు అతి దుష్టిని చూపుచున్నాడు. "గర్భాశయ బీజభాగావయవః" అనుచోట కూడా పూర్వమువలెనే వ్యాఖ్యానించుకొన

వలెను. అవయవ శబ్దము వలన గర్భాశయము యొక్కయు ఆర్తవము యొక్కయు కొంత భాగమని ఇచట చెప్పబడుచున్నది. "పూతిప్రజామ్" అనగా చనిపోవుచున్న సంతానమును అని అర్థము. ఇతరులు మాత్రము క్లేదముతో కూడిన అంగప్రత్యంగములు కల సంతానమును పూతిప్రజయని అందురు. "స్త్రీకరాణాం శరీరబీజ భాగానామ్" అనగా స్త్రీత్వమును తెలియజేయు స్తనములు, ఉపస్థ, లోమరాజి మొదలగువానిని కలిగించు బీజ భాగములకు అని అర్థము. "అస్త్రియమ్" అనగా అసంపూర్ణమగు స్త్రీ లక్షణములు కలదానిని "వార్తాం నామ" అనగా-వార్తయను సంజ్ఞ శాస్త్రసమయ నిర్దేశము. "స్త్రీవ్యాపత్" అనగా స్త్రీ నిమిత్తమగు ఆర్తవ దోషమువలన కలిగిన వ్యాపత్తు. ఇటులనే "తాం పురుషవ్యాపదమాచక్షతే" అనుచోట కూడ పురుష వ్యాపత్తును వ్యాఖ్యానించుకొనవలెను.

31. ఏవమేవ పురుషస్య యదా బీజే బీజభాగః ప్రదోషమాపద్యతే, తదా వన్ధ్యం జనయతి: యదా పునరస్య బీజే బీజభాగావయవః ప్రదోషమాపద్యతే, తదా పూతిప్రజం జనయతి:యదా త్వస్య బీజే బీజభాగావయవః పురుషకరాణాం చ శరీర బీజభాగానామేకదేశః ప్రదోషమాపద్యతే, తదా పురుషాకృతిభూయిష్ఠమపురుషం తృణపుత్రికం నామ జనయతి: తాం పురుషవ్యాపదమాచక్షతే.

**తాత్పర్యము :** స్త్రీకి చెప్పిన విధముననే పురుషుని యొక్క శుక్రమునందలి బీజభాగమంశయు మిక్కిలి దూషింపబడిన యెడల వంధ్య పురుషుడును, కొంతభాగము దూషింపబడిన యెడల దుర్గంధయుక్తములగు అవయవములతో కూడిన పురుషుడును, శుక్రమునందలి బీజభాగావయవము పురుషలక్షణ జనకములగు బీజభాగములలో కొంతభాగమును మిక్కిలి దూషింపబడినచో పురుషునియొక్క ఆకారము కలిగినట్టియు, పురుష లక్షణములు లేనట్టియు "తృణపుత్రిక" యను పేరు గల పురుషుడు జనించును. పై చెప్పబడిన వికృతులు పురుష వ్యాపత్తులు అనబడును.

**ఆయుర్వేదదీపిక :** బీజే అనగా శుక్రమునందు. శుక్రరూపమగు బీజమును జనింపజేయు భాగము బీజభాగము. "తదా వంధ్యం" అనుటవలన పురుష వంధ్యుడు చెప్పబడుచున్నాడు. "పూతి ప్రజ"కు ఇదివరకటి వలెనే వ్యాఖ్యానము చెప్పుకొనవలెను. "అపురుషమ్" అనగా అసంపూర్ణ పురుష లక్షణములు కలవానిని అని అర్థము. "తృణపుత్రిక" యను సంజ్ఞయను శాస్త్ర సమయము వలన సిద్ధించి

నదే. వార్త మరియు తృణ పుత్రికలకు మైథునేచ్ఛ ఎక్కువగ నుండును కాని వ్యవాయ సామర్థ్యముండదని చెప్పబడుచున్నది.

32. ఏతేన మాతృజానాం పితృజానాం చావయవానాం
వికృతివ్యాఖ్యానేన సాత్మ్యజానాం రసజానాం సత్వజానాం
చావయవానాం వికృతిర్వ్యాఖ్యాతా భవతి.

**తాత్పర్యము :** దీనివలన - తల్లివలనను, తండ్రివలననూ కలుగు వికారములను చెప్పుటవలన సాత్మ్యజ, రసజ, సత్త్వజ అవయవములకు కలుగు వికృతిని చెప్పబడియున్నది అని తెలిసికొనవలెను.

**ఆయుర్వేదదీపిక :** ఇట్లు మాతా పితృజ అవయముల కొన్నింటి వికృతి వలెనే సాత్మ్య, రస, సత్త్వముల వలన కలుగు అవయవములకు కలుగు వికారమును అతిదేశముగా వర్తింపజేసి చెప్పుటకు "ఏతేన" అను మొదలగునవి చెప్పుచున్నాడు. సాత్మ్య విభ్రమము చేత సాత్మ్యజములగు ఆరోగ్యము, అనాలస్యము అనువానిలో నేదోయొకటి క్షీణింపబడుచున్నది. ఇదే విధముగా రసము సత్త్వముల రెండింటికినీ ఊహింపవలసియున్నది.

## ఆత్మకు వికారములు కలుగు విధము

33. నిర్వికారః పరస్త్వాత్మా సర్వభూతానాం నిర్విశేషః,
సత్త్వశరీరయోస్తు విశేషాద్విశేషోపలబ్ధిః.

**తాత్పర్యము :** ఆత్మ సమస్త భూతములలో ఒక్కటిగనే (సమానముగనే) యుండి ఉత్కృష్టమైనదిగను, వికారరహితమైనదిగను ఉండును. కాని మనస్సు యొక్కయు శరీరము యొక్కయు విశేషముల చేత దీనికి సుఖదుఃఖాది విశేషములు కలుగుచుండును.

**ఆయుర్వేదదీపిక :** ఈ గర్భము ఆత్మజముగా కూడ ఉన్నదని చెప్పబడినది. అట్లుండగా గర్భమునకు కలుగు వికృతి ఆత్మ వికృతిగా నేల చెప్పబడదో, ఆ విషయమును "నిర్వికారః" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. 'పరః' అనుట వలన మనస్సు శరీరము మొదలగు సముదాయము నుండి ఆత్మను వేరు ఛేయుచున్నాడు. "సర్వభూతానాం నిర్విశేషం" అనగా ఆత్మ అన్ని భూతముల

యందు ఉన్నప్పటికీ పరమాత్మ సమానమే (ఒక్కటియే అయియున్నది). అచట (ఆత్మకు) సుఖదుఃఖాది విశేషములు ఏవి కలుగుచున్నవో, అవి శరీర విశేషము లగు, మానసిక విశేషములగు సుఖదుఃఖాది విశేష కారణము యొక్క విశేషము వలన కలుగుచున్నవి. ఈ విషయమే "శరీరసత్త్వ యోస్తు" అను మొదలగువాని ద్వారా చెప్పబడినది. సుఖాదులు మాత్రము పరమాత్మయొక్క వికారములు గావు: కాని బుద్ధియొక్క ధర్మములేయని చూపబడియేయున్నది. గర్భమునందు ఆత్మ జములుగా నుండునవి—"తాసు తాసు యోనిషూత్పత్తిః" (శారీర స్థానము 3వ అధ్యాయము) అను మొదలగు సూత్రమునందు చెప్పబడినవేవి కలవో అవియును పరమాత్మ యొక్క వికారములు అగుటలేదు, కాని సత్త్వరజస్తమముల ప్రబలత్వ రూపమగు వికారము వలన కలుగు మనో వికారముల వలన పుట్టిన ధర్మాధర్మముల వలన కలిగినవియే. అందువలన సూక్ష్మ చింతన వలన చూచినచో ఆత్మజములుగానేవి చెప్పబడినవో, అవియునూ సత్త్వజములే అని తెలియును. అటుపైన ఇచట ఆత్మజావయవ వికారములును సత్త్వజావయవ వికారములుగనే తెలియవలెనని భావము.

## శారీరిక మానసిక దోషములు - వాని కృత్యములు

34. తత్ర త్రయః శరీరదోషా వాతపిత్తశ్లేష్మాణః, తే
శరీరం దూషయన్తి; ద్వౌ పునః సత్త్వదోషా రజస్తమశ్చ,
తౌ సత్త్వం దూషయతః. తాభ్యాం చ సత్త్వశరీరాభ్యాం
దుష్టాభ్యాం వికృతిరుపజాయతే, నోపజాయతే చాప్రదుష్టాభ్యామ్.

**తాత్పర్యము** : వాతపిత్త కఫములు మూడును శరీర దోషములు. ఇవి శరీరమును దూషించును. రజస్సు, తమస్సు అను రెండును మనోదోషములు ఇవి సత్త్వము (మనస్సు)ను దూషింపజేయును. మనస్సు శరీరము దూషితము లైనపుడు వాటివలన వికృతి కలుగును. అవి దూషింపబడనపుడు వికారములు కలుగును.

**ఆయుర్వేదదీపిక** : "శరీర సత్త్వయోస్తు" అను మొదలగువాని వలన శరీర మనస్సులు రెండును దుఃఖరూప వికారమునందును కారణములుగా చెప్పబడినవి. అచటనే ఏ దోషముల వలన శరీరము, ఏ రెండు దోషములవల్ల మనస్సును కూడియుండి దుఃఖమునకు కారణమగుచున్నవో ఆ దోషములను "తత్ర త్రయ" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "వికృతిరుపజాయతే" అనగా శారీరిక, మానసిక రోగముల రూపమగు వికృతి కలుగును అని అర్థము.

**35.** తత్ర శరీరం యోనివిశేషాచ్చతుర్విధముక్తమగ్రే.

**తాత్పర్యము :** శరీరము యోని భేదముచేత నాల్గు విధములని మొదట చెప్పబడినది.

**ఆయుర్వేదదీపిక :** ప్రస్తుతము "శరీరసత్త్వయోస్తు విశేషాం" అనుట వలన చూపబడిన శరీరసత్వ విశేషములనే "తత్ర" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "చతుర్విధమ్" అనగా జరాయుజ, అండజ, ఉద్భిజ్జ, సంస్వేదజ అను నాల్గు విధములు. "అగ్రే" అనగా ఖుడ్డికాగర్భావక్రాన్తి శారీరమునందు అని అర్థము.

## సత్త్వము యొక్క త్రైవిధ్యము

**36.** త్రివిధం ఖలు సత్త్వం —శుద్ధం,రాజసం,తామసంచేతి తత్ర శుద్ధమదోషమాఖ్యాతం కళ్యాణాంశత్వాత్.రాజసం సదోషమాఖ్యాతం రోషాంశత్వాత్,తామసమపి సదోషమాఖ్యాతం మోహాంశత్వాత్.తేషాం తు త్రయాణామపి సత్త్వానామేకైకస్య భేదాగ్రమపరిసఙ్ఖ్యేయం తరతమ యోగాచ్ఛరీరయోనివిశేషేభ్యశ్చాన్యోన్యానువిధానత్వాచ్చ.శరీరం హ్యపి సత్త్వమనువిధీయతే,సత్త్వం చ శరీరమ్.తస్మాత్కతిచిత్సత్వభేదాననూకాభినిర్దేశేన నిదర్శనార్థమనువ్యాఖ్యాస్యామః.

**తాత్పర్యము :** సత్త్వము అనునది శుద్ధము రాజసము తామసము అని మూడువిధములు. శుద్ధసత్త్వము కళ్యాణాంశము గలదగుట వలన దోషరహితముగ నుండును. రాజసము రోషాంశము కలదగుటవలన దోషయుక్తముగనుండును. మోహాంశము కలదగుట వలన తామసముకూడ సదోషమనియే చెప్పబడినది. ఈ మూడు విధములగు సత్త్వములను ప్రత్యేకముగ తరతమాది భేదము వలనను, శరీర విశేషములవలనను, యోని విశేషముల వలనను, మనశ్శరీరములు పరస్పరము అనుసరించుట వలననూ అపరి సంఖ్యేయములగు భేదములను పొందును. సత్త్వము శరీరమునుకూడ అనుసరించును. శరీరమునూ సత్త్వము ననుసరించును. అందుచేత కొన్ని సత్త్వభేదముల అనూకమగు సాదృశ్య నిర్దేశముతో ఉదాహరణ నిమిత్తము చెప్పుచున్నాము.

**ఆయుర్వేదదీపిక :** "కల్యాణాంశత్వాత్" అనగా శుభరూపమగు అంశమును కలిగి యుండుటచేత. మనస్సు అనునదియేకల్యాణ, రోష, మోహాభాగముల

వలన మూడు భాగములుగా విభజింపబడి యున్నది. అచట రోషాంశ మోహాంశ ములు రెండును అధర్మహేతువులగుట వలన దోషయుక్తములు. "భేదాగ్రమ్" అనగా భేదపరిణామము. "తరతమయోగాత్" అనగా శుచితర - శుచితమ మనోభేదముల యోగముల వలన. "శరీరవిశేషాః" అనగా బాల్య, యౌవన, వృద్ధాది విశేషములు, యోని విశేషములు మాత్రము మనుష్య పశు మొదలగు జాతి విశేషములు. లేదా శరీరమునకు నరపశు మొదలగు జాతికృతమైన విశేషములు — శరీరయోని విశేష ములు—వీనివలన. ఇక శరీర భేదముచేత మనోభేదము ఎట్లు కలుగునో, ఆ విషయ మును "అన్యోన్యానువిధానాచ్చ" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. ఇదియే "శరీరం హ్యపి" అను మొదలగు వానిద్వారా విభజించి చెప్పబడుచున్నది. శరీరము సత్త్వానురూపముగా నుండును. సత్త్వము శుద్ధముగా నున్నపుడు దేవాది శరీరము కలుగును. అట్లే శరీరమునకు అనురూపమగు సత్త్వమును కలుగును,— అది ఎట్లనగా — పశు శరీరమునందు తామసము, మనుష్య శరీరమునందు రాజ సము, దేవ శరీరమునందు సాత్త్వికము (శుద్ధము) అగు సత్త్వముండును. లేదా, "అన్యోన్యాను విధానాత్" అనగా సత్త్వ రజస్తమస్సులకు పరస్పర అనుసరణ మున్నందుచేత అని అర్థము. ఈ పక్షమునందు, "శరీరం హ్యపి సత్త్వమను విధీయతే" అను మొదలగు సూత్రమువలన చెప్పబడినప్పటికీ మనస్సు శరీరమును అనుసరించుట యనునది సరిగా బోధపడకుండుటచే వివరింపబడుచున్నదని తెలిసి కొనవలెను. "సత్త్వభేదాన్" అనగా మనోభేదములు. "అనూకాభినిర్దేశేన" అనగా సాదృశ్యమును నిర్దేశించుటవలన అని అర్థము.

## బ్రాహ్మసత్త్వము

37. 1) తద్యథా —శుచిం సత్యాభిసంధం జితాత్మానం సంవిభాగినం జ్ఞానవిజ్ఞానవచనప్రతివచనసంపన్నం స్మృతిమన్తం కామక్రోధలోభమాన-మోహేర్ష్యాహర్షామర్షామపేతం సమం సర్వభూతేషు బ్రాహ్మం విద్యాత్.

## ఆర్షసత్త్వము

2) ఇజ్యాధ్యయనవ్రతహోమబ్రహ్మచర్యపరమతిథివ్రతముపశాన్త-మదమానరాగద్వేషమోహలోభరోషం ప్రతిభావచనవిజ్ఞానోపధారణ-శక్తిసంపన్నమార్షం విద్యాత్.

## ఐంద్రసత్త్వము

3) ఐశ్వర్యవన్తమాదేయవాక్యం యజ్వానం శూరమోజస్వినం
తేజసోపేతమక్లిష్టకర్మాణం దీర్ఘదర్శినం ధర్మార్థకామాభిరతమైన్ద్రం
విద్యాత్.

## యామ్యసత్త్వము

4) లేఖాస్థవృత్తం ప్రాప్తకారిణమసంప్రహార్యముత్థానవన్తం స్మృతిమన్త-
మైశ్వర్యలమ్బినం వ్యపగతరాగేర్ష్యాద్వేషమోహం యామ్యం విద్యాత్.

## వారుణసత్త్వము

5) శూరం ధీరం శుచిమశుచిద్వేషిణం యజ్వానమమ్భోవిహార-
రతిమక్లిష్టకర్మాణం స్థానకోపప్రసాదం వారుణం విద్యాత్.

## కౌబేర సత్త్వము

6) స్థానమానోపభోగపరివారసంపన్నం ధర్మార్థకామనిత్యం శుచిం
సుఖవిహారం వ్యక్తకోపప్రసాదం కౌబేరం విద్యాత్.

## గాంధర్వ సత్త్వము

7) ప్రియనృత్యగీతవాదిత్రోల్లాపకశ్లోకాఖ్యాయికేతిహాస-
పురాణేషు కుశలం గన్ధమాల్యానులేపనవసనస్త్రీవిహార-
కామనిత్యమనసూయకం గాన్ధర్వం విద్యాత్.
ఇత్యేవం శుద్ధస్య సత్త్వస్య సప్తవిధం భేదాంశం
విద్యాత్ కల్యాణాంశత్వాత్‌తత్సంయోగాత్తు
బ్రాహ్మమత్యన్తశుద్ధం వ్యవస్యేత్.

**తాత్పర్యము :** శుచి, సత్యసంధత, ఇంద్రియ నిగ్రహము, వివేచనా శక్తి, జ్ఞానము, విజ్ఞానము, సంభాషణాశక్తి, సమాధానశక్తి, స్మృతి, కామ-క్రోధ-లోభ-అభిమాన-మోహ-ఈర్ష్య-అనురాగ-మాత్సర్యములు లేకుండుట, సమస్త భూతములయందు సమత్వము— ఈ లక్షణములతో కూడియున్న వానిని బ్రహ్మ సత్త్వమున్నవానిగా తెలియవలెను.

యాగము, అధ్యయనము, వ్రతములు, హోమములు, బ్రహ్మచర్యము, అతిథిపూజ— వీనిని ఆచరించునట్టియు: మదము-అభిమానము- రాగము- ద్వేషము- మోహము-లోభము-క్రోధము ఇవి లేనట్టియు: ప్రతిభ, వచనశక్తి, విజ్ఞానము, ధారణా శక్తి వీనితో కూడుకొన్నట్టియు మనుజుని ఆర్ష సత్త్వము కలవానిగా తెలియవలెను.

ఐశ్వర్యము, వినదగిన-ఆచరింపదగినట్టియు వాక్యములు, యాగములు, శౌర్యము, ఓజస్సు, తేజస్సు, యోగ్యమైన కర్మలు, దూరదృష్టి, ధర్మార్థ కామముల యందు కోరిక, వీనితో కూడియున్న వానిని ఐంద్రసత్త్వము కలవానినిగా తెలిసి కొనవలెను.

కర్తవ్యాకర్తవ్యములు తెలిసినట్టియు, కార్యములను సకాలమున చేయు నట్టియు, వారింప శక్యముగానట్టియు, ఔన్నత్యము కలిగినట్టియు, స్మరణశక్తి కలిగి నట్టియు, ఐశ్వర్యము కలిగినట్టియు, రాగము ద్వేషము మోహములు లేనట్టియు మనుజుని యామ్య సత్త్వము కలవానినిగ తెలిసికొనవలెను.

శౌర్యము, ధైర్యము, శుచి, అశుచిని ద్వేషించుట, యాగములను చేయుట, జలవిహారమునందు కోరిక, యోగ్యములగు కర్మలను చేయుట, కోపము, దయయు, సరియైన కాలమునందు కలుగుట – ఈ లక్షణములతో కూడినవానిని వారుణ సత్త్వము కలవానినిగ తెలిసికొనవలెను.

అభిమానము, ఉపభోగములు, పరివారము ఇవి అధికముగా నున్నవాడు: సుఖవిహారములను, ధర్మార్థ కామములు, శుచిత్వమును కలిగినట్టియు కోపము, దయ ఇవి వ్యక్తములు గానున్నట్టియు మనుజుని కౌబేర సత్త్వము గలవానినిగా తెలియ వలెను.

ప్రియములగు నృత్యము, గానము, వాద్యము, స్తోత్రము, శ్లోకములు, చరిత్రలు, ఇతిహాసము, పురాణము – వీటియందు నేర్పరియైనట్టియు, సుగంధములు, పుష్పమాలికలు, శరీర లేపములు, వస్త్రములు, స్త్రీలు, విహారములు వీనియందు ఆసక్తి కలిగినట్టియు, అసూయ లేనట్టియు మనుష్యుడు గాంధర్వ సత్త్వము కలవాడని తెలిసికొనవలెను.

ఈ ఏడు విధములు కళ్యాణాంశకములగుట వలన శుద్ధ సత్త్వము యొక్క భేదములని తెలియవలెను. కళ్యాణాంశము అధికముగా నుండుటవలన బ్రాహ్మ సత్త్వము మిక్కిలి శుద్ధమైనదని తెలిసికొనవలెను.

ఆయుర్వేదదీపిక : "సంవిభాగినమ్" అనగా సరిగా ఫలమును విభజించు గుణము కలవానిని అని అర్థము. అతిథులయెడ యథోచితముగా అర్ఘ్యాదులతో కూడిన వ్రతము నాచరించువాడు అతిథివ్రతుడు. "లేఖా" అనగా కర్తవ్యా కర్తవ్య మర్యాద. ఎవని పనులు అట్టి మర్యాదయందు నిలకడగా యుండునో అట్టివాడు లేఖాస్థవృత్తుడు-అట్టివానిని; కర్తవ్యాకర్తవ్యములను దాటనివానిని అని అర్థము. "అసంప్రహార్యమ్" అనగా వారించుటకు శక్యముగాని వానిని అని అర్థము ఐశ్వర్యమును సంపాదించువాడు ఐశ్వర్యలంభి యనబడును. ఉచితమగు స్థానమునందు కోపము మరియు ప్రసన్నత ఎవరికి కలుగునో అట్టివాడు "స్థానకోప ప్రసాదుడ"న బడును. "సుఖవిహారమ్" అనగా సుఖవంతమైన క్రీడలను క్రీడించువానిని, "ఉల్లాపః" అనగా స్తోత్రము. "విహారః" అనగా క్రీడ (ఆట). లేదా స్త్రీలతో కలిసి విహరించుట స్త్రీవిహార మనబడును. "గాన్ధర్వమ్" గాంధర్వ సత్త్వని. ఇట్లే "బ్రాహ్మాద్య" అను మొదలగు శబ్దములకుకూడా అర్థమును తెలిసికొనవలెను. ఇచే విధముగను బ్రాహ్మ మొదలగు సత్త్వమును తెలియజేయు పదములతో సత్త్వమును కలిపి ఏడు విధము లగు భేదములను చెప్పుట సహానకారణమువలన సిద్ధించుచున్నది. "శుద్ధస్య" అనగా సత్త్వగుణమెక్కువగా నున్నవానికి అని అర్థము. ఇక ఏ విధముగా ఈ బ్రహ్మా, దులు శుద్ధసత్త్వమునకే భేదములగునో - "కల్యాణాంశత్వాత్" అనుట ద్వారా చెప్పుచున్నాడు. "తత్సంయోగాత్" అనగా కల్యాణాంశ సత్త్వము యొక్క సరియగు కలయికచేత అని అర్థము.

## రాజస సత్త్వ భేదములు - అసుర సత్త్వము

38. 1) శూరం చణ్డమసూయకమైశ్వర్య వన్త మౌపధికం
రౌద్ర మననుక్రోశమాత్మపూజకమాసురం విద్యాత్.

## రాక్షస సత్త్వము

2) అమర్షిణ మనుబద్ధకోపం ఛిద్రప్రహారిణం క్రూరమాహారాతిమాత్రరుచి
మామిషప్రియతమం స్వప్నాయాసబహులమీర్ష్యం రాక్షసం విద్యాత్

## పిశాచ సత్త్వము

3) మహాశనం స్త్రైణం స్త్రీరహస్కామమశుచిం శుచిద్వేషిణం భీరుం
భీషయితారం వికృత విహారాహారశీలం పైశాచం విద్యాత్.

## సర్ప సత్త్వము

4) క్రుద్ధశూరమక్రుద్ధభీరుం తీక్ష్ణమాయా సబహులం
సంత్ర స్తగోచర మాహారవిహారపరం సార్పం విద్యాత్

## ప్రేత సత్త్వము

5) ఆహారకామమతిదుఃఖశీలాచారోపచారమ సూయకమసంవిభాగిన మతి
లోలుపమకర్మశీలం ప్రైతం విద్యాత్

## శకున సత్త్వము

6) అనుషక్త కామమజస్రమాహారవిహార మనవస్థిత మమర్షణ మసంచయం
శాకునం విద్యాత్
ఇత్యేవం ఖలు రాజస్య సత్త్వస్య షడ్విధం
భేదాంశం విద్యాత్, రోషాంశత్వాత్

**తాత్పర్యము :** శౌర్యము, అధికమగుకోపము, అసూయ, ఐశ్వర్యము, కపటము, రౌద్రస్వభావము, విచారింపదగకుండుట, తన్ను తాను పొగడుకొనుట - ఈ లక్షణములు కలిగినవానిని అసుర సత్త్వము కలవానినిగ తెలియవలెను.

అసహనము, కోపము ఎక్కువ కాలముండుట, తరచు తప్పులు చేయుట, క్రౌర్యము, ఆహారము నందు ఎక్కువ కోరిక, మాంసమును తినుటయందు అధికమగు ఇచ్ఛ, అధిక నిద్ర, అధిక పరిశ్రమ, ఈర్ష్య - ఈ లక్షణములున్నవానిని రాక్షస సత్త్వము కలవానినిగ తెలిసికొనవలెను.

అధికమగు మాంద్యము, స్త్రీలతో నుండుట, స్త్రీలతో రహస్యముగా నుండుట యందు కోరిక, అపరిశుభ్రత, పరిశుభ్రతను ద్వేషించుట, భయపడుట, భయపెట్టుట, విహారము - ఆహారములను వికృతముగా సేవించు స్వభావము - ఈ లక్షణములు కలవాడు పైశాచిక సత్త్వము గలవాడని తెలిసికొనవలెను.

కోపము కలిగినప్పుడు శౌర్యము, కోపము లేనపుడు భయము, తీవ్రత, అధిక పరిశ్రమ, భయపడినట్లు కనబడుట, ఆహారవిహారముల నెక్కువగ సేవించుట ఈ లక్షణములు కలవాడు సార్పసత్త్వుడు అని తెలిసికొనవలెను.

ఆహారమును కోరుకొనుట, దుఃఖకరములగు స్వభావమును ఆచారములను ఉపచారములను కలిగియుండుట, అసహనము, వివేచనాశక్తి లేకుండుట, విషయముల యందాసక్తి, పనిచేయుటయందు అయిష్టత ఈ లక్షణములతో నున్నవాడు ప్రేత సత్త్వుడుగా తెలిసికొనవలెను.

ఎల్లప్పుడు కోరికలను కలిగియుండుట, తొందరపాటు, (అసహనముగా నుండుట), ఎల్లప్పుడు ఆహార విహారములను సేవించుచుండుట స్థిరత్వము లేక యుండుట, మాత్సర్యమును కలిగియుండుట ధనమును సంపాదింప లేకుండుట - అను నీ లక్షణములను కలవానిని శాకున సత్త్వము కలవానినిగా తెలియవలెను.

ఈ విధముగా రోషాంశమున్నందుచేత రాజసనత్త్వముల ఆరు విధములుగ భేదములుండునని తెలియవలెను.

**ఆయుర్వేదదీపిక** : "ఔపధికమ్" అనగా కపటవేషమునందు సంచరించు వానిని; "అనన్ముక్రోశమ్" అనగా దయలేని వానిని. స్త్రీతో కలిసి రహస్యముగా నుండుటను కోరువాడు స్త్రీ రహస్కాముడనబడును. "క్రుద్ధశూరమక్రుద్ధ-భీరుమ్" అనగా కోపము నందున్నపుడు శూరుని కోపమునందు లేనప్పుడు పిరికివానిని. "గోచర" శబ్దమువలన గోచరించుచున్న విషయమునందు ఎక్కువగా చరించుట చెప్పబడును, అందువలన సంత్రస్తగోచరమ్ అనగా సంత్రస్త విషయముల యందు చరించుచున్నవానిని. పిశాచము కంటె ప్రేతముయొక్క ఆచారములు భిన్నమైనవే కనుక పైత్రికసత్వము వేరుగా చెప్పబడినది.

## తామస సత్త్వభేదములు

### పశుసత్త్వము

39. 1) నిరాకరిష్ణుమమేధం జుగుప్సితాచారాహారం మైథునపరం స్వప్నశీలం పాశవం విద్యాత్.

### మత్స్యసత్త్వము

2) భీరుమబుధమాహారలుబ్ధమనవస్థితమనుషక్తకామక్రోధం సరణశీలం తోయకామం మాత్స్యం విద్యాత్.

## వానస్పత్య సత్త్వము

3) అలసం కేవలమభినివిష్టమాహారే సర్వబుద్ధ్యఙ్గహీనం వానస్పత్యం విద్యాత్.

ఇత్యేవం తామసస్య సత్త్వస్య త్రివిధం భేదాంశం విద్యాన్మోహాంశత్వాత్.

**తాత్పర్యము** : నిరాకరించు స్వభావము, నీచమైన వేషము, జుగుప్సాకరములగు ఆచార ఆహారములను సేవించువాడు, మైథునమునందు ఇచ్ఛ కలవాడు, నిద్రించు స్వభావము కలవాడు – ఈ లక్షణములు కలవాడు పశుసత్త్వుడు అని తెలిసికొనవలెను.

భయము, మూర్ఖత్వము, ఆహారమునందు అధికమగు ఆసక్తి, స్థిరత్వము లేకపోవుట, కామక్రోధములు కలిగియుండుట, ఎల్లప్పుడు తిరుగుచుండు స్వభావము కలిగియుండుట, నీటిని కోరుట - అను లక్షణములు గలవాడు మత్స్య సత్త్వుడుగ గ్రహింపవలెను.

మాంద్యము, ఆహారమునందే లగ్నమై యుండుట, ఏ విధమైన బుద్ధియు లేకుండుట, అను లక్షణములు గలవానిని వానస్పత్య సత్త్వునిగ తెలిసికొనవలెను.

ఇట్లు మోహాంశముచేత తామసనత్త్వము మూడు విధములుగా తెలియవలెను.

**ఆయుర్వేదదీపిక** : "సరణశీలమ్" అనగా తిరుగుచుండు స్వభావము కలవానిని "బుద్ధ్యఙ్గాని" అనగా బుద్ధికి చెప్పబడిన ఊహాపోహ విచారస్మృతులు అని అర్థము.

40. ఇత్యపరిసంఖ్యేయభేదానాం త్రయాణామపి సత్త్వానాం భేదైకదేశో వ్యాఖ్యాతః, శుద్ధస్య సత్త్వస్య సప్తవిధో బ్రహ్మర్షిశక్రయమవరుణకుబేరగన్ధర్వసత్త్వానుకారేణ, రాజసస్య షడ్విధో దైత్యపిశాచరాక్షససర్పప్రేతశకునిసత్త్వానుకారేణ, తామసస్య త్రివిధః పశుమత్స్యవనస్పతిసత్త్వానుకారేణ, కథం చ యథాసత్త్వముపచారః స్యాదితి.

**తాత్పర్యము** : అపరి సంఖ్యేయములైన భేదములు కల మూడు విధములగు సత్త్వములయొక్క భేదములలో కొద్దిభాగము మాత్రము ఈ విధముగా చెప్పబడినవి. బ్రహ్మ, ఋషులు, దేవేంద్రుడు, వరుణుడు, యముడు, కుబేరుడు, గంధ

ర్వేలు - వీరలయొక్క సత్త్వముల ననుసరించి శుద్ధసత్త్వము ఏడు విధములుగ చెప్పబడినది. దైత్యులు, రాక్షసులు, పిశాచములు, సర్పములు, ప్రేతములు, పక్షులు - వీనియొక్క సత్త్వములననుసరించి రాజససత్త్వము ఆరు విధములుగ చెప్పబడినది. పశువులు, మత్స్యములు, వనస్పతులు వీటియొక్క సత్త్వములననుసరించి తామస సత్త్వము మూడు విధములుగ చెప్పబడినది. ఆ యా సత్త్వములకు ఎట్లు ఉపచారము చేయవలసియుండునో అందుకొరకు ఈ విషయము చెప్పబడినది.

**ఆయుర్వేదదీపిక :** తేలికగా జ్ఞాపకముంచుకొనుటకు శుద్ధాదిభేదము వలన నిబద్ధము చేసి సత్త్వభేదములను "శుద్ధస్య" అను మొదలగువానిద్వారా చెప్పు చున్నాడు. "వనస్పతిసత్త్వానుకారేణ" అను చివరి సూత్రము వేరు క్రియ లేనందు వలన భేదైకదేశోవ్యాఖ్యాతః" అను దానితో అన్వయించుకొనవలెను. సాధారణ ముగా ఈ సత్త్వభేదములు మనుష్యులయందు కలుగుచుండటం చేసి ఇవియే ఉదా హరణము కొరకు చెప్పబడినవి. ఇదే విధముగా ఇచట చెప్పబడనప్పటికీ విష్ణు, శంకర, వ్యాఘ్రాదిసత్త్వములననుసరించియే సత్త్వభేదములను తెలిసికొనవలెనని చూపుచున్నాడు. "కథమ్" అను మొదలగునవి. "కథమ్" అనగా సత్త్వమునను రించి సర్వప్రాణుల మనస్సుల వలన మనుష్యులకు ఉపచారము చేయవలసి యుండు ననియు ఇందుకొరకు ఉదాహరణ రూపములగు ఈ సత్త్వభేదములు వివరింపబడి నవి అని వాక్యార్థము.

41. కేవలశ్చాయముద్దేశో యథోద్దేశమభినిర్దిష్టో భవతి గర్భావక్రాన్తి-
సంప్రయుక్తః తస్య చార్థస్య విజ్ఞానే సామర్థ్యం గర్భకరాణాం చ
భావానామనుసమాధిః, విఘాతశ్చ విఘాతకరాణాం భావానామితి.

**తాత్పర్యము :** గర్భావక్రాంతి సందర్భమున ఈ విషయమంతయు ఉద్దేశముననుసరించి చెప్పబడినది. దీనిని తెలిసికొనినచో గర్భమునకు హితకర మైన భావములను ఆచరించుటయు, విఘాతకర భావములను వర్జించుటయు జరుగును.

**ఆయుర్వేదదీపిక :** ప్రతిజ్ఞననుసరించి వ్యాఖ్యానించబడిన విషయమును ఉపసంహరించుచున్నాడు. "కేవలః" అను మొదలగునవి. 'కేవలః' అనగా సంపూర్ణము. "ఉద్దేశః" అనగా "యతశ్చాయం గర్భః" అను మొదలగు సూత్రము నందు చెప్పబడినది. "యథోద్దేశమ్" అనగా ఉద్దేశక్రమమును అతిక్రమించకుండగ. "సామర్థ్యమ్" అనగా ప్రయోజనము. "అనుసమాధిః" అనగా అనుసరించుట.

"విఘాతః" అనగా వర్జించుట. "విఘాతకరాణాం" అనగా గర్భమునకు విఘాత మును కలిగించువాని యొక్క అని అర్థము.

## అధ్యాయ సంగ్రహము

తత్ర శ్లోకాః—

42. నిమిత్తమాత్మా ప్రకృతిర్వృద్ధిః కుక్షౌ క్రమేణ చ,
వృద్ధిహేతుశ్చ గర్భస్య పఞ్చార్థాః శుభసఞ్జ్ఞితాః,

43. అజన్మని చ యో హేతుర్వినాశో వికృతావపి,
ఇమాం స్త్రీనశుభాన్ భావానాహుర్గర్భవిఘాతకాన్.

44. శుభాశుభసమాఖ్యాతానష్టౌ భావానిమాన్ భిషక్,
సర్వథా వేద యః సర్వాన్ స రాజ్ఞః కర్తుమర్హతి.

45. అవాప్త్యుపాయాన్ గర్భస్య స ఏవం జ్ఞాతుమర్హతి,
యే చ గర్భవిఘాతోక్తా భావాంస్తాంశ్చాప్యుదారధీః.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే శారీరస్థానే మహతీగర్భావ-క్రాన్తి శారీరం నామ చతుర్థోఽధ్యాయః.

**తాత్పర్యము :** గర్భము యొక్క కారణములు, ఆత్మ, ప్రకృతి, కుక్షి యందు వృద్ధి నొందుటకు కారణములు-శుభ నిమిత్తములగు ఈ అయిదును: గర్భము ఏర్పడకుండుటకు - వినాశము నొందుటకు - వికృతి నొందుటకు కార ణము అను అశుభ నిమిత్తములగు ఈ మూడును స్త్రీలకు గర్భ విఘాతకర భావములు గను ఈ అధ్యాయము నందు చెప్పబడినవి. శుభాశుభములుగ చెప్పబడిన ఈ ఎనిమిది భావములను బాగుగ తెలిసికొనిన వైద్యుడు రాజులకు వైద్యము చేయతగియుండును. కావున గర్భకరములను భావములను, గర్భ విఘాతకరములగు భావములను అట్టి ఉదారధీమంతుడు తెలిసికొనియుండవలెను.

**ఆయుర్వేదదీపిక :** ఇక వీనియందు గర్భ కాలమందు అనుసరింప దగిన గర్భమునకు శుభములగునవి ఏవియో, ఏవి వర్జనీయములగు అశుభకరములో ఆ విషయమును "నిమిత్తమ్" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "నిమిత్తమ్" అనగా "యతశ్చ గర్భః" అను సూత్రమునకు చెప్పిన విషయము.

'ఆత్మా' అనగా గర్భరూపమగు ఆత్మ - 'యస్మింశ్చ గర్భసంజ్ఞా' అను సూత్రమునకు చెప్పబడిన విషయము. ప్రకృతియనగా 'ప్రక్రియతేఽస్మాద్గర్భః'—ఈ గర్భము దేనితో చేయబడినదో అని - 'యద్వికారశ్చ గర్భః' అను సూత్రమునకు చెప్పబడిన విషయము. 'వృద్ధిః కుక్షౌ క్రమేణ చ' అనగా 'యయాఽనుపూర్వ్యా కుక్షి-వభినిర్వర్తతే గర్భః' అను సూత్రమునకు చెప్పబడిన విషయము. 'వృద్ధి హేతుః' అనగా "యశ్చాస్య వృద్ధిహేతుః" అను మొదలగువాని ద్వారా చెప్పబడిన విషయము. 'అజన్మని చ యో హేతుః' అనుట వలన 'యతశ్చాస్యాజన్మ భవతి' అను దానికి చెప్పబడిన విషయము తీసికొనబడుచున్నది. వినాశే చ యో హేతుః" అనుట వలన "యతశ్చ జాయమానః కుక్షౌ వినాశం ప్రాప్నోతి" అనుదానికి చెప్పిన విషయమును తీసికొనబడుచున్నది. 'వికృతావపి యో హేతుః' అనుట వలన 'యతశ్చ కార్త్స్న్యేన' అను మొదలగువానికి చెప్పిన విషయమును తీసికొనబడుచున్నది. గర్భ విఘాతములుగా చెప్పబడినవి—గర్భవిఘాతోక్తములు అని అర్థము.

ఇది శ్రీ చక్రపాణిదత్తునిచే రచింపబడిన ఆయుర్వేదదీపిక యనెడి చరక తాత్పర్యటీక యందలి శారీర స్థానమున మహతీ గర్భావక్రాన్తి శారీరమను పేరుగల నాల్గవ అధ్యాయము.

—x—

# పంచమాధ్యాయము

# పురుషవిచయ శారీరము

1. అథాతః పురుషవిచయం శారీరం వ్యాఖ్యాస్యామః.

2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః.

**తాత్పర్యము :** ఇకపై పురుషవిచయమను శారీరమును చెప్పు కొందము.

అని ఆత్రేయ భగవానుడు చెప్పియుండెను.

**ఆయుర్వేదదీపిక :** పూర్వాధ్యాయమునందు చెప్పబడిన "యావన్తో హి లోకే భావాస్తావన్తః పురుషే" (శారీరస్థానము - 4వ అధ్యాయము) అనుదానికి ఎక్కువగా చెప్పవలసి యున్నందున వివరణము ఇవ్వబడలేదు. అందువలన వివరముగా పేర్కొనుటకు పురుష విచయము చెప్పబడుచున్నది. పురుషుని యొక్క- విచయమనగా లోక సామ్యము వలన లెక్కించి చెప్పుట పురుష విచయమన బడును. దాని నాధారముగ చేసికొని చెప్పబడిన అధ్యాయము పురుష విచయా ధ్యాయము.

3. "పురుషోఽయం లోకసంమితః" ఇత్యువాచ భగవాన్
పునర్వసురాత్రేయఃయావన్తో హి లోకే (మూర్తిమన్తో)
భావవిశేషావన్తః పురుషే, యావన్తః పురుషే తావన్తో
లోకే; ఇత్యేవంవాదినం భగవన్తమాత్రేయ మగ్నివేశ ఉవాచ
నైతావతా వాక్యేనోక్తం వాక్యార్థమవగాహామహే, భగవతా బుద్ధ్యా
భూయస్తరమతోఽనువ్యాఖ్యాయమానం శుశ్రూషామహ ఇతి.

## లోక - పురుష సామ్యము

4. తమువాచ భగవానాత్రేయః—అపరిసంఖ్యేయా లోకావయవ-విశేషాః;
పురుషావయవవిశేషా అపరిసంఖ్యేయాః; తేషాం యథాస్థూలం కతిచిద్భావాన్
సామాన్యమభిప్రేత్యోదాహరిష్యామః, తానేకమనా నిబోధ సమ్యగుపవర్ణ్య-
మానానగ్నివేశ ! షడ్ధాతవః సముదితాః "పురుష"ఇతిశబ్దం లభన్తే; తద్యథా-
పృథివ్యాపస్తేజో వాయురాకాశం బ్రహ్మ చావ్యక్తమితి,ఏత ఏవ చ
షడ్ధాతవః సముదితాః "పురుష" ఇతి శబ్దం లభన్తే.

**తాత్పర్యము :** ఈ పురుషుడు లోకముతో సమానముగా నున్నాడు: లోకమునందు ఎన్ని మూర్తిమంతములగు భావ విశేషములున్నవో, అవి అన్నియు పురుషుని యందు కలవు-అని చెప్పుచున్న ఆత్రేయ భగవానునితో అగ్నివేశుడిట్లనెను-ఇప్పటివరకు ఈ వాక్యము వలన చెప్పబడిన వాక్యార్థము మాకు అవగాహన యగుటలేదు. భగవంతులగు మీచే విస్తారముగా దీనిని వినగోరుచున్నాము. అగ్నివేశునితో ఆత్రేయ భగవాను డిట్లనెను- లోకము నందున్న అవయవ విశేషములు లెక్కకు మించియున్నవి. పురుషుని యందున్నవియును అపరి సంఖ్యేయములే. (లెక్కకు మించి యున్నవి.) వానిలో స్థూలమైనవాటిని వివరించుచున్నాము. ఓ అగ్నివేశుడా ! ఈ విషయమును ఏకాగ్రచిత్తుడవై వినుము. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము మరియు అవ్యక్తమగు బ్రహ్మ అను నీ ఆరుధాతువుల యొక్క సముదాయము లోకమని చెప్పబడును. ఈ ఆరు ధాతువులయొక్క సముదాయమే పురుషుడనియు చెప్పుచున్నారు.

**ఆయుర్వేదదీపిక :** "సంమితః" అనగా సమానమైనవాడు అని అర్థము. లోకముతో సమానముగా నుండుటయే- "యావన్తో హి" అను మొదలగువానిద్వారా విభజింపబడుచున్నది (వివరింపబడుచున్నది). "భగవతా బుద్ధ్యానువ్యాఖ్యాయ మానమ్" అని అన్వయము. లోకమునకు చెట్లు, గడ్డి మొదలగునవి అవయవములు; అట్లే పురుషునకును స్నాయువులు కండరములు ధమనులు అగు అవయవములు – ఇవి లెక్కకు మించియున్నవి. అందువలన, సంపూర్ణముగా చెప్పుటకు అశక్యము. ఇందువలన లోకము-పురుషుడు అను రెండింటికి ఏ ఏ అవయవములు స్థూలముగా నున్నవో, ఆ యా అవయవములు సామాన్య (సమానత్వ) ప్రతిపాదన కొరకు చెప్పబడుచున్నవని వాక్యార్థము. అవ్యక్తమనునది బ్రహ్మమునకు వివరణము (విశేషణము).

## లోక-పురుష సామ్యతకు వివరణము

5. తస్య పురుషస్య పృథివీ మూర్తిః, ఆపః క్లేదః, తేజోఽభి సన్తాపః, వాయుః ప్రాణః, వియత్ సుషిరాణి, బ్రహ్మ అన్తరాత్మా. యథా ఖలు బ్రాహ్మీ విభూతిర్లోకే తథా పురుషేఽప్యన్తరాత్మికీ విభూతిః, బ్రహ్మణో విభూతిర్లోకే ప్రజాపతిరన్తరాత్మనో విభూతిః పురుషే సత్త్వం, యస్త్విన్ద్రో లోకే స పురుషేఽహఙ్కారః, ఆదిత్యస్త్వాదానం, రుద్రో రోషః, సోమః ప్రసాదః,

వసవః సుఖమ్, అశ్వినౌ కాన్తిః, మరుదుత్సాహః, విశ్వేదేవాః సర్వేన్ద్రియాణి సర్వేన్ద్రియార్థాశ్చ, తమో మోహః, జ్యోతిర్జ్ఞానం, యథా లోకస్య సర్గాదిస్తథా పురుషస్య గర్భాధానం, యథా కృతయుగమేవం బాల్యం, యథా త్రేతా తథా యౌవనం, యథా ద్వాపరస్తథాస్థావిర్యం, యథా కలిరేవమాతుర్యం, యథా యుగాన్తస్తథా మరణమితి. ఏవమేతేనానుమానేనానుక్తానామపి లోకపురుషయోరవయవ విశేషాణామగ్నివేశ ! సామాన్యం విద్యాదితి.

**తాత్పర్యము :** అట్టి పురుషునికి భూమి కాఠిన్యముగను, జలము క్లేద రూపముగను, అగ్ని సంతాప రూపముగను, వాయువు ప్రాణ రూపముగను, ఆకాశము రంధ్రముల రూపముగను, బ్రహ్మ అంతరాత్మ రూపముగను ఉండును. లోకమునందు బ్రహ్మ సంబంధమగు విభూతి యుండు నటుల పురుషుని యందు అంతరాత్మ సంబందమగు విభూతి యుండును. లోకమునందు దక్ష ప్రజాపతి బ్రహ్మ సంబంధమగు విభూతిగ నుండునటుల పురుషుని యందు మనస్సు అంతరాత్మ సంబంధమగు విభూతిగ నుండును. లోకమునందలి ఇంద్రుడు పురుషుని యందు అహంకారముగను, సూర్యుడు గ్రహణ శక్తిగను, ఈశ్వరుడు కోపముగను, చంద్రుడు శాంత రూపముగను, వసువులు సుఖ రూపముగను, అశ్వనీ దేవతలు కాంతి రూపముగను, వాయుదేవుడు ఉత్సాహ రూపముగను, విశ్వ దేవతలు సమస్త ఇంద్రియములు మరియు ఇంద్రియార్థములుగను, చీకటి మోహ రూపముగను, వెలుతురు జ్ఞాన రూపముగను ఉండును. లోకమునకు సృష్టియొక్క ఆదికాలమువలె పురుషునకు గర్భాదాన కాలముండును. లోకమునందు కృతయుగము వలె పురుషునియందు బాల్యము, త్రేతాయుగము వలె యౌవనము, ద్వాపరము వలె వార్థక్యమును, కలి యుగము వలె వ్యాధి పీడితావస్థయును, యుగాంతము వలె మరణమును ఉండును. లోక - పురుషుల సంబంధమైన చెప్పబడని అవయవముల సాదృశ్యమును ఊహించి ఇటులనే తెలిసికొనవలెను.

**ఆయుర్వేదదీపిక :** "తస్య" అను మొదలగువానిద్వారా పురుషుని యందు షడ్ధాతువులదు చూపుచున్నాడు. "మూర్తిః" అనగా కాఠిన్యము. లోకము నందు షడ్ధాతువులు వ్యక్తములుగనే యున్నవని తిరిగి వివరింపబడినవి. "బ్రాహ్మీ" అనగా ఆత్మ విశేషమునకు జగత్తును సృష్టించు విభూతి. "ప్రజాపతి" అనగా దక్షుడను పేరుగల ప్రజాపతి. "ఆదానమ్" అనగా గ్రహించుట, సూర్యుడును గ్రహించు

వాడగుటచే ఆ దానమునకు సూర్యుడు సామ్యముగా చెప్పబడినాడు. ఇచట మనస్సు మొదలగునవి ప్రజాపతి మొదలగు రూపములుగా నుండుట ఆగమ సిద్ధమనియే తెలియవలెను. సర్వేంద్రియార్థములును విశ్వదేవతలే. "సర్గాదిః" అనగా ప్రళయము తరువాతి కాలము. "అనుక్తానామ్" అనుట వలన మతి బృహస్పతి యొక్క రూపము, కామము గంధర్వ రూపము అను మొదలగు సామ్యము డూహింపబడవలెను.

## అగ్నివేశుని ప్రశ్న

6. ఏవంవాదినం భగవన్తమాత్రేయమగ్నివేశ ఉవాచ-ఏవమేతత్ సర్వమనపవాదం యదోక్తం భగవతా లోకపురుషయోః సామాన్యమ్. కిన్న్వస్య సామాన్యోపదేశస్య ప్రయోజనమితి.

## ఆత్రేయుని సమాధానము - లోకపురుషుల సామ్యమును చెప్పుటవలన కలుగు ప్రయోజనము

7. భగవానువాచ-శృణ్వగ్నివేశ సర్వలోకమాత్మన్యాత్మానం చ సర్వలోకే సమమనుపశ్యతః సత్యా బుద్ధిః సముత్పద్యతే. సర్వలోకం హ్యాత్మని పశ్యతో భవత్యాత్మైవ సుఖదుఃఖయోః కర్తా నాన్య ఇతి. కర్మాత్మకత్వాచ్చ హేత్వాదిభిర్యుక్తః సర్వలోకోఽహమితి విదిత్వా జ్ఞానం పూర్వముత్థాప్యతేఽపవర్గాయేతి. తత్ర సంయోగాపేక్షీ లోకశబ్దః. షడ్ధాతుసముదాయో హి సామాన్యతః సర్వలోకః.

**తాత్పర్యము :** ఈ విధముగా చెప్పుచున్న ఆత్రేయుని, అగ్నివేశుడిట్లు అడిగెను. మీరు చెప్పిన లోక పురుషుల రెండింటి యొక్క సాదృశ్యము నిర్వివాద ముగ యున్నది. కాని ఇట్టి సాదృశ్యమును చెప్పుట వలన కలుగు ప్రయోజనమేమి?

ఆత్రేయ భగవానుడిట్లనెను — ఓ అగ్నివేశుడా ! వినుము సర్వలోకమును తననుగను తను సర్వలోకముగను చూచువానికి సత్యమగు బుద్ధి కలుగును. సర్వ లోకమును తననుగా చూచువాడు సుఖదుఃఖములకు ఆత్మయే కర్తయనియు ఇతరుడు కర్తగాడనియు తెలిసికొనును. కర్మవశము వలన హేత్వాదులతో కూడిన సర్వలోక మును నేనే అని తెలిసికొనినవాడు జ్ఞానమును పొంది మోక్షమునకు ప్రయత్నిం చును. లోకశబ్దము పురుషుని అపేక్షించియుండును. నమస్త లోకమును సామాన్య ముగ షడ్ధాతుసముదాయ రూపముగ నుండును.

ఆయుర్వేదదీపిక : "అనపవాదమ్" అనగా బాధింపబడకుండ - (నిర్వివాదముగ). "కిన్న్వస్యప్రయోజనమ్" అనగా ఆయుర్వేదమునందును ఈ సామ్యమును చెప్పుటవలన ప్రయోజనమేమి? అని అర్థము. "సత్యా బుద్ధిరుత్పద్యతే" అని అన్వయించుట యందు పై ప్రశ్నకు అన్వయముగా "కిం చాస్యా ప్రయోజనమ్" అను ప్రశ్నను తెలియవలెను - లోక పురుష సామ్యము ఏ విధముగా సత్యజ్ఞానమును కలిగించునో ఆ విషయమును "సర్వలోకం హి" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "ఆత్మని పశ్యతః" అనగా తనకు అభేదముగా (సమానముగా) చూచుచున్నట్టి అని అర్థము. ఆత్మశబ్దము వలన ఇచట షడ్ధాతు సముదాయాత్మకమగు పురుషుడు చెప్పబడుచున్నాడు; అందువలన లోకమునందు ఏ కొంచెమైననూ దుఃఖమును కల్గించునదేది కలదో అది ఆత్మరూపమే; అందువలన బాహ్యలోకకృతమైననూ ఆత్మకృతమైనట్టియు నిత్యము దుఃఖమును కలిగించునదగుటవలన సుఖము హేయమగును మరియు నిసర్గహేయమగు దుఃఖమును చూచుచు రాగద్వేషనిర్ముక్తుడగుచు సత్యజ్ఞానవంతుడగునని భావము. ఇక సత్యజ్ఞానము యొక్కయీ ప్రయోజనమేమి యనుదానిని "కర్మ" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. లోక పురుష సామ్యజ్ఞానమునందునూ సత్యజ్ఞానముయొక్క అపవర్గానుష్ఠానము అను ప్రయోజనము కలుగునని వాక్యార్థము. ఇచట "కర్మాత్మకత్వాత్" అనగా కర్మపై ఆధారపడి యుండుటచేత అని అర్థము. హేత్వాదులు ముందు చెప్పబడుచున్నవి. కర్మవశుడగుచు హేత్వాదులచే కూడియున్న ఈ ఆత్మ కర్మలయందు ప్రవర్తించును. ఆ కర్మకు తత్త్వజ్ఞానముచేత ప్రవృత్తి లేనపుడు కారణము లేనందువలన అది సిద్ధింపదు. కర్మ ఉత్పన్నమైననూ కర్మలయందు అనురక్తి లేనివానికి తత్త్వజ్ఞానము వలన, అదృష్టము (పూర్వజన్మకర్మ) యొక్క ఉపభోగముచేత, ప్రస్తుతపు కర్మ క్షీణించుటచేతనూ ఇపుడు చేయుచున్న కర్మఫలము లేనందువలన మోక్షము కలుగునని భావము. "సంయోగాపేక్షీ" అనగా షడ్ధాతుమేలకమగు పురుషరూపమునందు ప్రవర్తించును అని అర్థము. లోకశబ్దము వలన ఈ ప్రకరణము నందు లోకముగా చేసి పురుషుడే చెప్పబడును కాని జగద్రూపమగు లోకము కాదు. ఎందువలననగా, ఇచట కర్మ పరవశములుగా ఏ హేత్వాదులు లోకమునందు చెప్పబడవలయునో, అవి పురుషునియందే సంభవించును. "సర్వ" అను శబ్దము వలన సర్వ ప్రాణులను గ్రహించుచున్నాడు.

## లోక - పురుషులకు గల్గు హేత్వాది పంచకము

8. తస్య హేతుః,ఉత్పత్తిః, వృద్ధిః,ఉపప్లవః, వియోగశ్చ. తత్ర హేతురుత్పత్తికారణం, ఉత్పత్తిర్జన్మ,వృద్ధిరాప్యాయనమ్,ఉపప్లవో దుఃఖాగమః,షడ్ధాతువిభాగో వియోగః స జీవాపగమః స ప్రాణనిరోధః స భఙ్గః స లోక స్వభావః తస్య మూలం సర్వోపప్లవానాం చ ప్రవృత్తిః, నివృత్తిరుపరమః. ప్రవృత్తిర్దుఃఖం, నివృత్తిః సుఖమితి యజ్ఞానముత్పద్యతే తత్ సత్యమ్. తస్య హేతుః సర్వలోకసామాన్యజ్ఞానమ్. ఏతత్ప్రయోజనమ్ సామాన్యోపదేశస్యేతి.

**తాత్పర్యము :** అట్టి లోకమునకు హేతువు- ఉత్పత్తి- వృద్ధి -ఉపప్లవము మరియు వియోగము అనునవి ఉండును. ఉత్పత్తికి కారణము హేతువనబడును. జన్మ ఉత్పత్తి యనబడును. ఆప్యాయనము పొందుట వృద్ధియనబడును. దుఃఖములు కలుగుట ఉపప్లవమనబడును. షడ్ధాతువులు విభజింపబడుట వియోగమనియు, జీవాపగమనమనియు, ప్రాణనిరోధమనియు, భంగమనియు, లోక స్వభావమనియు చెప్పబడును. లోకము రాగద్వేషాదులతో కూడి ప్రవర్తించుట సమస్త దుఃఖములు కలుగుటకు కారణముగ నుండును. రాగద్వేషాదులు లేకుండుట దుఃఖములు కలుగకుండుటకు కారణముగ నుండును. ప్రవృత్తి దుఃఖముగను, నివృత్తి సుఖముగను ఉండునని కలుగు జ్ఞానము సత్యజ్ఞానము. పురుషుడు లోకము సమానముగా నుందురను జ్ఞానము సత్యజ్ఞానమునకు హేతువుగనుండును. ఇదియే లోక పురుష సామ్యమును చెప్పుటవలన కలుగు ప్రయోజనము.

**ఆయుర్వేదదీపిక :** హేత్వాది పంచకము నిర్దేశించి విభజింపబడుచున్నది-"తస్య హేతుః" అను మొదలగునవి. "తస్య మూలమ్" అనగా ఆ జీవాపగమమునకు కారణము అని అర్థము. "సర్వోపప్లవానామ్" అనగా అన్ని దుఃఖములకు. ప్రవృత్తి యనగా రాగద్వేషములకు కారణమగు ప్రవృత్తి. నివృత్తియనగా ప్రవృత్తి లేకుండుట. ఉపరమశబ్దము తస్య అనుదానితోను మరియు సర్వోపప్లవానాం అనుదానితోనూ సంబంధింపబడుచున్నది (అన్వయింపబడుచున్నది). అందువలన దుఃఖములకు, మరణమునకు కలుగు వినాశనము నివృత్తి వలననే కలుగుచున్నది. నివృత్తి వలన కలుగుచుండుట వలననూ, కార్యకారణముల రెండింటికి అభేదముగా నెంచుటచేత ఉపరమము అనునది కూడ నివృత్తి శబ్దమునకు సమానాధికరణము వలన

చెప్పబడుచున్నది. ప్రవృత్తి దుఃఖమనియు నివృత్తి సుఖమనియు చెప్పుట కూడ కార్యకరణములకు అభేదముగా చేసి చెప్పుటయే అని తెలియవలెను. "ఇతి యజ్ఞానమ్" అను మొదలగువానిద్వారా సత్యజ్ఞానము యొక్క స్వరూపమును చెప్పుచున్నాడు. "ఇతి" అనునది పూర్వపు విషయమును తెలియజేయును. "తస్య" అను మొదలగువానిద్వారా ఈ సత్యజ్ఞానమునందు లోక పురుష సామాన్య జ్ఞానము యొక్క హేతుత్వమును చూపుచున్నాడు.

## ప్రవృత్తికి మూలము, నివృత్తి ఉపాయము - అగ్నివేశుని ప్రశ్న

9. అథాగ్నివేశ ఉవాచ-కింమూలా భగవన్ ప్రవృత్తిః,
నివృత్తౌ చ క ఉపాయ ఇతి.

## ఆత్రేయుని సమాధానము

10. భగవానువాచ—మోహేచ్ఛాద్వేషకర్మమూలా ప్రవృత్తిః, తజ్జా
హ్యహఙ్కారసఙ్గసంశయాభిసంప్లవాభ్యవపాతవిప్రత్యయావిశేషాను-
పాయాస్తరుణమివ ద్రుమమతివిపులశాఖాస్తరవోఽభిభూయ పురుషమవత-
త్యైవోత్తిష్ఠన్తే; యైరభిభూతో న సత్తామతివర్తతే. తత్రైవంజాతిరూపవిత్త-
వృత్తబుద్ధిశీలవిద్యాభిజనవయోవీర్యప్రభావసంపన్నోఽహమిత్యహఙ్కారః,
యన్మనోవాక్కాయకర్మ నాపవర్గాయ స సఙ్గః, కర్మఫలమోక్షపురుష-
ప్రేత్యభావాదయః సన్తి వా నేతి సంశయః, సర్వావస్థాస్వనన్యోఽహమహం
స్రష్టా స్వభావసంసిద్ధోఽహమహం శరీరేన్ద్రియబుద్ధిస్మృతిరాశిరితి
గ్రహణమభిసంప్లవః, మమ మాతృపితృభ్రాతృదారాపత్యబన్ధుమిత్రభృత్యగణో
గణస్య చాహమిత్యభ్యవపాతః, కార్యాకార్యహితాహితశుభాశుభేషు
విపరీతాభినివేశో విప్రత్యయః, జ్ఞాజ్ఞయోః ప్రకృతివికారయోః ప్రవృత్తి-
నివృత్త్యోశ్చ సామాన్యదర్శనమవిశేషః, ప్రోక్షణానశనాగ్నిహోత్రత్రిషవణా-
భ్యుక్షణావాహనయాజనయజనయాచనసలిలహుతాశనప్రవేశాదయః
సమారమ్భాః. ప్రోచ్యన్తే హ్యనుపాయాః ఏవమయమధీధృతిస్మృతి-
రహఙ్కారాభినివిష్టః సక్తః ససంశయోఽభిసంప్లుతబుద్ధిరభ్యవపతితోఽ
న్యథాదృష్టిరవిశేషగ్రాహీ విమార్గగతిర్నివాసవృక్షః సత్త్వశరీరదోష-
మూలానాం సర్వదుఃఖానాం భవతి. ఏవమహఙ్కారాదిభిర్దోషైర్భ్రామ్య-
మాణోఽనువర్తతే ప్రవృత్తిం, సా చ మూలమఘస్య.

**తాత్పర్యము :** ఇక అగ్నివేశుడిట్లడిగెను - ఓ భగవానుడా! ప్రవృత్తికి మూలమేది? మరియు నివృత్తికి ఉపాయమేది?

ఆత్రేయుడిట్లు చెప్పెను - మోహము ఇచ్ఛా ద్వేషము కర్మ అనునవి ప్రవృత్తికి కారణము. ప్రవృత్తి వలన కలిగిన అహంకారము, సంగము, సంశయము, అభిసంప్లవము, అభ్యవపాతము, విప్రత్యయము, అవిశేషము, అనుపాయము అనునవి అధికముగ పెరిగిన పెద్ద వృక్షములు చిన్న వృక్షమును ఆవరించినట్లు పురుషుని ఆవరించును. వీనిచే ఆవరింపబడిన పురుషుడు ప్రవృత్తి హేతువును అతిక్రమింపజాలడు. జాతి, రూపము, ధనము, ఆచారము, బుద్ధి, నడవడిక, విద్య, కులము, వయస్సు, శక్తి, ప్రభావము వీనిచే నేను సంపన్నుడనని తలచుట అహంకారమనబడును మనోవాక్కాయ కర్మలు మోక్షముకొరకు కానపుడు ఆ స్థితి సంగమనబడును. కర్మఫలము, మోక్షము, ఆత్మ, పునర్జన్మ ఇవి కలవా, లేవా యని తలచుట సంశయమనబడును. సమస్త విషయములందును నాతో సమానుడు లేడనియు, నేను సృష్టించువాడననియు, స్వభావసిద్ధుడననియు, శరీరము - ఇంద్రియములు - బుద్ధి - స్మృతి వీని విశేషములయొక్క సమూహము మాత్రమే నేననియు తలచుట అభిసంప్లవ మనబడును. తల్లిదండ్రులు, సోదరులు, భార్య, సంతానము, బంధువులు, మిత్రులు, సేవకులు - వీరు నా సంబంధమైనవారనియు, నేను వారి సంబంధమైన వాడననియు తలచుట అభ్యవపాత మనబడును. కార్యములు, అకార్యములు, హితములు, అహితములు, శుభములు, అశుభములు, దీనిని వ్యతిరేకముగ తలచుట విప్రత్యయమనబడును. తెలిసినవాడు, తెలియనివాడు, ప్రకృతి - వికృతి, ప్రవృత్తి-నివృత్తి వీనియందు సామాన్యదృష్టి కలుగుట అవిశేషమనబడును. ప్రోక్షణము, ఉపవాసము, అగ్నిహోత్రము, త్రికాలములయందు స్నానము చేయుట, అభ్యుక్షణము, ఆవాహనము చేయుట, యజ్ఞములను చేయుట, చేయించుట, యాచింపకుండుట, జలప్రవేశము, అగ్ని ప్రవేశము మొదలగు కృత్యములు అనుపాయము లనబడును. బుద్ధి, ధృతి, స్మృతి ఇవి లేనివాడై అహంకార - సంగ - సంశయ - అభిసంప్లవ-అభ్యవపాత - విప్రత్యయయ - అవిశేష - అనుపాయములతో కూడిన మనుజుడు మనస్సంబంధమైనట్టియు, శరీర సంబంధమైనట్టియు దోషమువలన కలుగు సమస్త దుఃఖములకును నివాస స్థానముగ నుండును. అహంకారము మొదలగు దోషములతో కూడుకొనినవాడు పునర్జన్మను పొందును ప్రవృత్తిని అతిక్రమింపజాలడు. ఆ ప్రవృత్తి పాపకర్మలకు కారణముగ నుండును.

ఆయుర్వేదదీపిక : సంసార రూపమగు ప్రవృత్తికి కారణమును, మోక్ష రూపమగు నివృత్తికి ఉపాయమును "కిం మూలా" అను మొదలగువాని ద్వారా అడుగుచున్నాడు. "మోహ" అను మొదలగునవి సమాధానము. "మోహేచ్ఛాద్వేష కర్మమూలా"అనగా మిథ్యాజ్ఞానరూపమగు మోహము వలన ఇచ్ఛాద్వేషము కలుగును. వానివలన ధర్మాధర్మ రూపమగు కర్మ జరుగును. అది సంసారమునకు మూలము అగునవి అర్థము. ఈ మోహదులు సంసారమునకు కారణమెట్లగునో - "తజ్ఞా హి" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. ఇచటయును యోగ్యతనుబట్టి అహంకారాదుల యందు మోహాదులు కారణమగునని తెలియవలెను. అహంకారము మొదలగు ఎనిమిది ముందు చెప్పబడనున్నవానిగా తెలియవలెను. "అవతత్య" అనగా వ్యాపించి "న సత్తామతి వర్తతే" అనగా సంసారమునందు స్థితిని దాటజాలడు. ఇచట మొదట చెప్పబడిన అహంకారమును "తత్రైవమ్" అను మొదలగువాని ద్వారా వివరించుచున్నాడు. జాతి మొదలుకొని ప్రభావమువరకు సంపన్నుడగు నేను గొప్పవానిని అనుజ్ఞానము అహంకారమనబడును. యత్ అను మొదలగువవి సంగము యొక్క వివరణము. కర్మఫలము మొదలగునవి ఉన్నవా లేవా అను జ్ఞానము సంశయమనబడును, ఆత్మయందు అభిమతము అనాత్మయందు అభిసంప్లవము అభిసంప్లవమనబడును. ఆత్మయందు ఆత్మగా చూడకుండుట, ఆత్మ బుద్ధియని యర్థము. "సర్వావస్థాసు" అనగా అన్ని శరీరావస్థలయందు షడ్ధాతు సముదాయ రూపమే అనన్యమను జ్ఞానము ఇక్కడ కలుగునని తెలియవలెను. పరమాత్మకు మాత్రము సర్వావస్థలయందు అనన్యత్వ ముండునని కలుగుజ్ఞానముసరియగుజ్ఞానమే. ఇట్లే "నేను సృష్టికర్తను, నేను స్వభావ సంసిద్ధుడను" అనుచోటకూడ శరీరమే అహంకార విషయమగుచున్నదని తెలియవలెను. "అహం శరీరేన్ద్రియ బుద్ధి విశేష రాశిః" అనుచోట అచేతనములగు శరీరాదులయందు అహంకారాస్పదత్వము వలన చేతనత్వమును అపాదించుకొనుట విరుద్ధమని తెలియవలెను. "మమ" అను మొదలగువాని ద్వారా అభ్యవపాతమును చెప్పుచున్నాడు. అభ్యవపాతమనగా పరమార్థమున అనాత్మీయ విషయమునందు మమతను కలిగి యుండుట, "కార్య" అను మొదలగువానివలన విప్రత్యయము చెప్పబడుచున్నది. విప్రత్యయమనగా విపరీత అభినివేశము - వ్యతిరేకమగు జ్ఞానము: ఉదాహరణకు - కార్యమునందు అకార్యముగను, అకార్యమునందు కార్యముగను ఈ మొదలగు జ్ఞానమును కలిగి యుండుట. "జ్ఞాజ్ఞయో" అను మొదలగు వానివలన అవిశేషమును చెప్పుచున్నాడు. అవిశేష

మనగా విశేషము తెలియకుండుట. విప్రత్యయమనునది మాత్రము విశేషములను వ్యతిరేకముగా గ్రహించుట అని ఈ రెండింటికి భేదము. "ప్రోక్షణ" అను మొదలగు వానివలన అనుపాయమును చెప్పుచున్నాడు. "అనుపాయాః" అనగా ఇతర ఉపాయములైనప్పటికీ పరమపురుషార్థమగు మోక్షమునందు అనుపాయములైనవి (ఉపాయములు కానివి) అని అర్థము. "త్రిషవణం" అనగా మూడు సంధ్యలయందును స్నానమాచరించుట. "ఏవమ్" అను మొదలగువాని వలన ప్రస్తుతము ధీధృతి స్మృతి అనువాని విభ్రంశము కారణముగా గల అహంకారాదులు ధీధృతి స్మృతి అను పేరుతో సంసార రూపమగు ప్రవృత్తి నిత్యానుబంధ శరీరమానస దుఃఖములకు కారణమగుట సంక్షిప్తముచేసి చెప్పుచున్నాడు. నివాస వృక్షము వంటిది నివసవృక్షము. అందువలన ఏ విధముగా నివాసవృక్షము పక్షులకు నిత్యము ఆశ్రయముగా నుండునో అటులనే అహంకారాదులతో కూడినవాడును రోగమునకు నివాసమగునని చూపుచున్నాడు. "భ్రామ్యమాణః" అనగా మాటిమాటికిని వేర్వేరు శరీరములకు తీసికొనిపోబడు చున్నవాడు అని అర్థము. "నాతి వర్తతే ప్రవృత్తిమ్". అనగా సంసారమును పరిత్యజింపడు. ఈ విధముగా మోహము ఇచ్ఛలవలన కలిగిన కర్మకు ప్రవృత్తి కారణమగుటను చూపి ప్రవృత్తికిని కర్మకారణమగుటను "సా చ మూలమఘస్య" అని చెప్పుచున్నాడు. ప్రవృత్తియును ధర్మాధర్మరూపమగు పాపమునకు మూలమగును. ఇచట ధర్మా ధర్మములు రెండును అవిశేషములుగా సంసారరూపమగు దుఃఖ కారణములుగా "అఘ"శబ్దము వలన చెప్పబడినవి.

## మోక్షము - మోక్షమును సాధించు నుపాయము

11. నివృత్తిరపవర్గః; తత్ పరం ప్రశాన్తం తదక్షరం తద్బ్రహ్మ స మోక్షః.

12. తత్ర ముముక్షూణాముదయనాని వ్యాఖ్యాస్యామః. తత్ర లోకదోషదర్శినో ముముక్షోరాదిత ఏవాచార్యాభిగమనం, తస్యోపదేశానుష్ఠానమ్, అగ్నేరేవోపచర్యా, ధర్మశాస్త్రానుగమనం, తదర్థావబోధః, తేనావష్టమ్భః, తత్ర యథోక్తాః క్రియాః, సతాముపాసనమ్, అసతాం పరివర్జనమ్, అసఙ్గతిర్దుర్జనేన, సత్యం సర్వభూతహితమపరుషమనతికాలే పరీక్ష్య వచనం, సర్వప్రాణిషు చాత్మనీవాపేక్షా, సర్వాసామస్మరణమసఙ్కల్పనమప్రార్థనమనభిభాషణం చ స్త్రీణాం, సర్వపరిగ్రహత్యాగః, కౌపీనం ప్రచ్ఛాదనార్థం, ధాతురాగనివసనం, కన్థాసీవనహేతోః సూచీపిప్పలకం, శౌచాధానహేతోర్జలకుణ్డికా, దణ్డధారణం,

భైక్షచర్యార్థం పాత్రం, ప్రాణధారణార్థమేకకాలమగ్రామ్యో యథోపపన్నో-
భ్యవహారః, శ్రమాపనయనార్థం శీర్ణశుష్కపర్ణతృణాస్తరణోపధానం,
ధ్యానహేతోః కాయనిబన్ధనం, వనేష్వనికేతవాసః, తన్ద్రానిద్రాలస్యాది-
కర్మవర్జనం, ఇన్ద్రియార్థేష్వనురాగోపతాపనిగ్రహః, సుప్తస్థితగతప్రేక్షితా-
హారప్రత్యఙ్గచేష్టాదికేష్వారమ్భేషు స్మృతిపూర్వికా ప్రవృత్తిః, సత్కారస్తు-
తిగర్హావమానక్షమత్వం, క్షుత్పిపాసాయాసశ్రమశీతోష్ణవాతవర్షాసుఖదుఃఖ-
సంస్పర్శసహత్వం, శోకదైన్యమానోద్వేగమదలోభరాగేర్ష్యాభయక్రోధాది-
భిరసంచలనమ్, అహఙ్కారాదిషూపసర్గసంజ్ఞా,లోకపురుషయోః సర్గాది-
సామాన్యావేక్షణమ్, కార్యకాలాత్యయభయం, యోగారమ్భే సతతమనిర్వేదః,
సత్త్వోత్సాహః, అపవర్గాయ ధీధృతిస్మృతిబలాధానం, నియమనమిన్ద్రియాణాం
చేతసి, చేతస ఆత్మని, ఆత్మనశ్చ; ధాతుభేదేనశరీరావయవసంఖ్యానమభీక్ష్ణం,
సర్వం కారణవద్దుఃఖస్వమనిత్యమిత్యభ్యుపగమః, సర్వప్రవృత్తిష్వఘసంజ్ఞా,
సర్వసంన్యాసే సుఖమిత్యభినివేశః, ఏష మార్గోఽపవర్గాయ,అతోఽన్యథా
బధ్యతే; ఇత్యుదయనాని వ్యాఖ్యాతాని.

**తాత్పర్యము :** నివృత్తి యనగా అపవర్గము. అది పరము, ప్రశాంతము, అక్షరము, బ్రహ్మ, అదియే మోక్షము.

మోక్షమును కోరు వారలకు ఉపాయములను చెప్పుకొందము — మొదట గురువు వద్దకు వెళ్ళుట, గురూపదేశములను అనుష్ఠించుట, అగ్నిని ఉపచరించుట, ధర్మశాస్త్రములను పఠించి అర్థమును తెలిసికొనుట, దానిచే ధైర్యమును కలిగి యుండుట, వానియందు చెప్పబడిన ప్రకారము క్రియలను చేయుట, సత్పురుషులను సేవించుట, దుర్మార్గులను సేవింపకుండుట, దుర్జనులతో సాంగత్యము చేయకుండుట, సత్యము - సర్వప్రాణిహితము - పరుషము కానట్టి - అధికముగ లేనట్టి వాక్యములను యోచించి అవసరమైన కాలమునందు పలుకుట, సమస్త ప్రాణులను తనవలె చూచుట, స్మరించుట - సంకల్పించుట - ప్రార్థించుట - మాట్లాడుట, వీనిని ఏ స్త్రీతోనైననూ చేయకుండుట, అన్ని కోరికలను విడచిపెట్టుట, కౌపీనమును ధరించుట గైరికాది ధాతువులతో రంగు వేసిన వస్త్రములను ధరించుట, బొంతలను కుట్టుకొనుటకు సూదులతో కూడిన పాత్రలను ఉంచుకొనుట, శౌచకర్మ కొరకు జల

పాత్రను ఉంచుకొనుట, దండమును ధరించుట, భిక్షాటనము నిమిత్తము భిక్షా పాత్రను ఉంచుకొనుట, ప్రాణధారణ నిమిత్తము గ్రామ్యము కానట్టి ఆహారమును లభ్యమైనంత మాత్రమే ఒకపూట భుజించుట, బడలికను పోగొట్టుకొనుటకు రాలి యెండిన ఆకులచేతను, గడ్డితోడను శయ్యను ఏర్పరచుకొనుట, ధ్యానము నిమిత్తము యోగపట్టను ధరించుట, గృహము లేకుండ వనమునందు నివసించుట, ప్రాలు మాలిక - నిద్ర - సోమరితనములను విడిచిపెట్టుట, ఇంద్రియార్థములందు అనురాగము లేక ద్వేషమును లేకయుండుట, నిద్ర - స్థితి - గమనము - చూచుట - ఆహారము అంగప్రత్యంగ చేష్టలు మొదలగువానియందు ఆలోచించి ప్రవర్తించుట, సత్కారము-స్తుతి - నింద - అవమానములను ఓర్చుకొనుట, ఆకలి - దప్పిక - బడలిక - శ్రమ - చలి - వేడిమి - గాలి - వర్షము - సుఖము - దుఃఖము వీనిని సహించుట, శోకము - దీనత్వము - ఉద్రేకము - మదము - అభిమానము - లోభము - అనురాగము - ద్వేషము - భయము - కోపము మొదలగువానిచే చలింపకుండుట, అహంభావము (అహంకారము) మొదలగువానిని అనర్థకములగు వానినిగ తలచుట, లోకమునకు పురుషునకును ఉత్పత్తి మొదలగు వానియందు సామ్యమును తెలిసికొనుట, కార్యమును ఆచరింపదగిన కాలము మించిపోవునను భయము కలిగియుండుట, యోగము నారంభించుటయందు ఎల్లప్పుడును బాధలేకుండుట, మనస్సంబంధమైన ఉత్సాహమును కలిగియుండుట, మోక్షముకొరకు బుద్ధి, ధృతి, స్మృతి వీనియొక్క బలమును కలిగి యుండుట, ఇంద్రియములను మనస్సునందును, మనస్సును ఆత్మయందును, ఆత్మను ఆత్మ (పరమాత్మ?) యందును నిలుపుట. ధాతుభేదములచే తనయొక్క శరీర మందలి అవయవములను తెలిసికొనుట, ఆత్మ వ్యతిరిక్తమైనట్టియు, కారణయుక్త మైనట్టియు సమస్తమును దుఃఖరూపమైనదానినిగ తెలిసికొనుట, సమస్త ప్రవృత్తులను దుఃఖకరములైనవానినిగ తెలుసుకొనుట, సమస్తమును వర్జించుట యనునది సుఖకర మైనదానినిగ తలచుట, ఇవి మోక్షమును కలిగించుట కుపాయములుగ నుండును. దీనికి వ్యతిరేకములన్నియు బంధనమును కలుగజేయును. ఇట్లు మోక్షసాధక ఉపాయములు చెప్పబడినవి.

ఆయుర్వేదదీపిక : ప్రస్తుతము నివృత్తి కలుగుటయందు ఉపాయమును చెప్పుటకు నివృత్తినే దానిని గ్రహింపవలసివచ్చుటను ప్రతిపాదించు పర్యాయములచే- "నివృత్తి" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "ఉప్" అను అవ్యయము మోక్షమునందు అను అర్థమున ప్రయోగింపబడినది. "ఉపయుంజ్ని" అనగా మోక్షోపా

యములు అని అర్థము. "లోకదోష దర్శినః" అని హేతుగర్భము విశేషణము అందువలన ఎల్లప్పుడు దుఃఖాక్రాంతమగు లోకమును చూచుటచే విరక్తుడైన వానికి మోక్షము గలుగునని చూపుచున్నాడు. ఆచార్యుడనగా ఇచట మోక్షశాస్త్రము నుపదేశించువాడు. "తేనావష్టబ్ధః" అనగా శాస్త్రమును తెలిసికొనుట వలన ధైర్యమును పొందవలెను. కొంచము కూడ అచట సంశయము పొందరాదని అర్థము. "యథోక్తా క్రియాః" అనుచోట "కర్తవ్యాః" అని అన్వయించుకొనవలెను. "ఆత్మనీవావేక్షా" అనగా ఏ విధముగా తనయందు అపకారము చేసికొనకూడదను బుద్ధి యుండునో అదే విధముగా అన్ని ప్రాణులయందును చేయవలెను. "అసంకల్పనమ్" అనగా భావింపకుండుట, "కౌపీనం ప్రచ్ఛాదనార్థం" అనగా మొలకు చుట్టుకొనుటకు, లేదా కౌపీనము కొరకు, ప్రచ్ఛాదనము కొరకును అని అర్థము. "సూచీపిప్పలకం" అనగా సూదులను ఉంచు పాత్ర అని అర్థము. "ప్రాణయాత్రార్థమ్" అనుటవలన ఎంత మోతాదు ఆహారమువలన ప్రాణములు నిలచియుండునో అంత మోతాదు ఆహారమునే తీసికొనవలెను కాని ఆహారముపైన అనురాగమువలన కాదని అర్థము. ఇట్లే "శ్రమాపనయనార్థమ్" అను మొదలగువానియందునూ అంతమాత్రమే ప్రయోజనమువలన అని వ్యాఖ్యానించుకొనవలెను. "కాయనిబంధనమ్" అనగా యోగపట్ట. అనికేతవాసః అనగా అగృహనివాసము. ఇందువలన వనమునందునూ ఇల్లు కట్టుకొనక నివసింపవలెనని చూపుచున్నాడు. శబ్దాది ఇంద్రియార్థముల యందు అనురాగము, మరియు ద్వేషరూపమగు ఉపతాపమును నిగ్రహింపవలెను. "స్మృతి-పూర్వికా ప్రవృత్తిః" అనగా నేనెవడను ? ఎందులకు రాగత్యాగాదులు చేయబడుచున్నవి ? అను మొదలగునవి ఎల్లప్పుడును స్మరించుకొనుచుండవలెనని అర్థము. సత్కారమనగా పూజ. సత్కారము మరియు స్తుతి అను నీ రెండింటియందు హర్షము లేకుండుట, మరియు నిందయందును అవమానము నందునూ ద్వేషము లేకుండుట సత్కారాదిక్షమిత్వమని తెలియవలెను. క్షుధాదుల యందు అనుద్వేగమనగా క్షుధాదులను సహించుట. అసంవాసమనగా అసంవసనము. అహంకారాదులు ఎనిమిదియు ఇచటనే చెప్పబడినవి. "ఉపసర్గసంజ్ఞా" అనగా అనర్థ హేతువులుగా భావించుట. "లోకపురుషయోః సర్గాదిసామాన్యాపేక్షణం" అనగా ఇచటనే లోకపురుషులకు ఆదిసర్గమునుండి సామ్యమును చెప్పినట్లుగనే సామ్యమును చూచుట. "కార్యకాలాత్యయభయమ్" అనగా మోక్షమునకు అనుగుణమైన పనికి కాలము మించిపోవునను భయమును కలిగియుండవలెనని అర్థము. "నియమనమిష్టిశ్రూషాం

చేతసి" అనగా ఇంద్రియములను బాహ్య విషయముల నుండి నివృత్తపరచి మనస్సునందే లగ్నము చేయవలెను. మనస్సును చింత్యాది విషయముల నుండి మరల్చి ఆత్మజ్ఞానముకొరకు పరమాత్మయందు నియమించవలెను. అందువలన, ఆత్మను కూడ ఇంద్రియాది విషయముల నుండి మరల్చి ఆత్మయందు నియమింపవలెను. "ధాతు-భేదేన శరీరావయవసంఖ్యానమ్" అనగా శరీరమును రసమలస్నాయ్వాది రూపముగా తెలిసికొనుట. శరీరమును రసమలస్నాయ్వాది రూపముగా భావించుటయే వైరాగ్యహేతువగును. ఉదాహరణకు — మజ్జాస్నా రజసా ప్లీహా యకృతా శకృతాఽపి చ, పూర్ణాః స్నాయుసిరాభిశ్చ త్రియశ్చర్మప్రసేవికాః." అను మొదలగునవి వైరాగ్యభావనములు. "కారణవత్" అనుటవలన నిత్యమగు ఆత్మకు వ్యతిరేకములైనవన్నియు అనిత్యములని చూపుచున్నాడు. దుఃఖమనగా దుఃఖహేతువు. అన్యమనగా ఆత్మ వ్యతిరిక్తము, అనాత్మీయమును. "సర్వసంన్యాసే" అనగా అన్ని ప్రవృత్తుల నాశనమునందు అని అర్థము.

## శుద్ధ సత్త్వ లక్షణములు

భవన్తి చాత్ర—

13. ఏతైరవిమలం సత్త్వం శుద్ధ్యుపాయైర్విశుధ్యతి,
మృజ్యమాన ఇవాదర్శస్తైలచేల కచాదిభిః.

14. గ్రహామ్బుదరజోధూమనీహారైరసమావృతమ్,
యథార్కమణ్డలం భాతి భాతి సత్త్వం తథాఽమలమ్.

15. జ్వలత్యాత్మని సంరుద్ధం తత్ సత్త్వం సంవృతాయనే,
శుద్ధః స్థిరః ప్రసన్నార్చిర్దీపో దీపాశయే యథా.

**తాత్పర్యము :** కల్మషయుక్తమైన మనస్సు పైన చెప్పబడిన మోక్షోపాయములచే శుద్ధి నొందును. అట్లు శుద్ధినొందిన సత్త్వము, తైలము, వస్త్రము, కుంచె మొదలగువానిచే తుడువబడిన అద్దమువలె; గ్రహములు, మేఘములు, దుమ్ము, పొగ, మంచు వీనిచే ఆవరింపబడని సూర్యమండలము వలెను ప్రకాశించును. నియమింపబడిన ఇంద్రియములు కల్గి ఆత్మయందు నిలుపబడిన మనస్సు మూయబడిన ద్వారములు గల్గిన గృహమునందు శుద్ధమైనట్టియు, స్థిరమైనట్టియు, నిర్మలమైన జ్వాల [illegible] దీపమువలె ప్రకాశించును.

ఆయుర్వేదదీపిక : "అవిమలమ్" అనునది క్రియా విశేషణము, గ్రహమనగా రాహుగ్రహము. సత్త్వమునకు ఐదు ఇంద్రియములే జ్ఞానమును కప్పి యుంచునట్లుగనే సూర్యునకును ఆవరకములుగా గ్రహము మొదలగు ఐదు ఆవరకములుగా చెప్పబడినవి. "జ్వలతి" అనగా కేవలము ఆత్మ జ్ఞానమును కలిగించుట వలన ప్రకాశించును. "ఆత్మని సంరుద్ధమ్" అనగా ఇంద్రియములనుండి మరల్చి ఆత్మయందు నియమింపబడినది. "సంవృతాయనే" అనగా ఆత్మపక్షమునందును సంవృతమైన ఇంద్రియ రూపఛిద్రమున అని అర్థము. దీపాశయమనగా దీపపుశెమ్మె లేదా ఇల్లు.

### సత్వ్యబుద్ధి స్వరూపము దానివలన కల్గు ఫలితము

16. శుద్ధసత్త్వస్య యా శుద్ధా సత్యా బుద్ధిః ప్రవర్తతే,
యయా భినత్త్యతిబలం మహామోహమయం తమః.

17. సర్వభావస్వభావజ్ఞో యయా భవతి నిస్పృహః,
యోగం యయా సాధయతే సాంఖ్యం సంపద్యతే యయా.

18. యయా నోపైత్యహఙ్కారం నోపాస్తే కారణం యయా,
యయా నాలమ్బతే కిఞ్చిత్ సర్వం సంన్యస్యతే యయా.

19. యాతి బ్రహ్మ యయా నిత్యమజరం శాన్తమవ్యయం,
విద్యా సిద్ధిర్మతిర్మేధా ప్రజ్ఞా జ్ఞానం చ సా మతా

తాత్పర్యము : శుద్ధ సత్త్వము గలవానికి శుద్ధమైనట్టియు, స్వచ్ఛమైనట్టియు, ఏ బుద్ధి కలుగునో, అతి బలవంతమైనట్టియు, మహా మోహమయమైనట్టియు తమస్సు (అజ్ఞానము) దేనిచే భేదింపబడునో, దేనివలన సర్వ భావముల యొక్క సర్వభావముల స్వభావమును తెలిసికొనినవాడై నిస్పృహుండగునో, దేనిచే యోగమును సాధించునో, దేనిచే తత్త్వజ్ఞానము కలవాడగునో, దేనివలన అహంకారమును పొందడో, దేనివలన సుఖదుఃఖములకు కారణములైన వానిని సేవింపడో, దేని వలన ఏ ఒక్కదానిని అవలంబింపక సర్వసంగ పరిత్యాగమును చేయునో, నిత్యమైనట్టియు, నశింపనట్టియు, శాంతమైనట్టియు, క్షీణింపనట్టియు, మోక్షమును దేని వలన పొందునో అది విద్యయనియు, సిద్ధియనియు, మతియనియు, మేధమనియు, ప్రజ్ఞయనియు, జ్ఞానమనియును చెప్పబడును.

**ఆయుర్వేదదీపిక :** శుద్ధసత్త్వమును పేర్కొని దాని వలన కలుగు మోక్షసాధకమగు అత్యర్థముగా గ్రహింపదగిన సత్యబుద్ధిని వివిధ ఉపయుక్తముల తోడను స్వరూపములతోడను "శుద్ధా" అను మొదలగువాని వలన చెప్పుచున్నాడు. "మహామోహః" అనగా అనాదియగు మిథ్యాజ్ఞానము. "నిఃస్పృహః" అనగా తీసి కొనవలెనన్నెడి కోరిక లేనివాడు. "యోగమ్" అనగా విషయములనుండి మరల్ప బడిన మనస్సును ఆత్మయందే కలసియుండుట. "సంఖ్యా" అనగా తత్వజ్ఞానము. అది దానివలన కలుగుట వలన సాంఖ్యమనబడును. "నోపాస్తే కారణం" అనగా సుఖదుఃఖకారణములు సేవింపబడవు. "నాలమ్బతే కిఞ్చిత్" అనగా కొంచెము కూడ ఆధారముగా తీసికొనడు. "సంన్యస్యత" అనగా ఎల్లెడలను ఉదాసీనుడుగ నుండును. "బ్రహ్మ" అనగా మోక్షము. విద్యా, సిద్ధి మొదలగునవి తత్వజ్ఞాన విశేషము నందును ప్రసిద్ధములైనప్పటికీ, ఇచట ప్రకరణముచేత తత్త్వజ్ఞానపరము లేయని తెలియవలెను.

20. లోకే వితతమాత్మానం లోకం చాత్మని పశ్యతః,
పరావరదృశః శాన్తిర్జ్ఞానమూలా న నశ్యతి.

**తాత్పర్యము :** తనను లోకమునందు వ్యాపించియున్నవానిగను, లోక మును తనయందు వ్యాపించియున్నదానిగను చూచుచు ఆత్మ ప్రవృత్తి మొదలగు వానిని తెలిసికొనినవానికి జ్ఞాన మూలమగు శాంతి నశింపదు.

**ఆయుర్వేదదీపిక :** "లోకే వితతమాత్మానం" అనగా తనను లోక రూపమున, మరియు లోకమును శరీరాత్మ సంయోగరూపమగు తన యందును చూచువాడు. ఇచట వ్యవస్థిత అని అన్వయము. "పరావరదృశ" అనగా "పరమ్" ఆత్మను, "అవరాణి" ఆత్మ వ్యతిరేకములగు ప్రవృత్తి మొదలగునవి ఎవడు చూచునో వానికి పరావరదృశుడు అని పేరు. "జ్ఞానమూలా" అనుట వలన మోహ మూలమగు అస్థిరమైన శాంతిని నిరసించుచున్నాడు.

జీవన్ముక్తునకు సుఖదుఃఖ సంబంధము లేదనుట

21. పశ్యతః సర్వభావాన్ హి సర్వావస్థాసు సర్వదా.
బ్రహ్మభూతస్య సంయోగో న శుద్ధస్యోపపద్యతే.

తాత్పర్యము : సర్వావస్థలయందును, ఎల్లప్పుడును సమస్త భూతములను చూచుచున్నను జీవన్ముక్తుడైనట్టి, [illegible], పురుషునకు దేనితోడను సంబంధము కలుగదు.

ఆయుర్వేదదీపిక : ఇక జీవన్ముక్తునకు ఎందువలన సుఖదుఃఖ హేతువులను ధర్మాధర్మ సంయోగము కలుగదో "పశ్యతః" అను మొదలగువాని వలన చెప్పుచున్నాడు. పశ్యత అనగా ఉత్కృష్టమైన దానినిచూచుచునేయున్నాడు కాని కోపముగానీ ద్వేషమునుగానీ ప్రదర్శింపడు అని అర్థము. "బ్రహ్మభూతస్య" అనగా బ్రహ్మ సదృశుడైన జీవన్ముక్తునికి అని చెప్పుకొనవలెను. ఎల్లెడల ముక్తియందు మాత్రమే జ్ఞానమునూ ఉండదు, అందువలన "పశ్యతః" అని ఉండరాదు. "సంయోగః" అనగా ధర్మాధర్మ సంబంధము.

## ముక్త లక్షణములు

22. నాత్మనః కరణాభావాల్లిఙ్గమప్యుపలభ్యతే,
స సర్వకరణాయోగాన్ముక్త ఇత్యభిధీయతే.

తాత్పర్యము : ముక్తి పొందిన ఆత్మకు మనస్సు మొదలగు కరణములు లేకపోవుటవలన ఏ విధమగు లక్షణములు లేనివాడగును. అట్టి ఆత్మ కరణములతో సంబంధము లేనివాడగుటచేత ముక్తుడు అని పేర్కొనబడును.

ఆయుర్వేదదీపిక : ఇక ముక్తుడగు ఆత్మకు ఏ లక్షణముండునో "స" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "ఆత్మనః" అనగా ముక్తుడగు ఆత్మకు, "కరణాభావాత్" అనగా మనస్సు మొదలగు కరణములు లేకపోవుటచేత. "కరణాని మనో బుద్ధిర్బుద్ధికర్మేన్ద్రియాణి చ" అని శారీరస్థానము ఒకటవ అధ్యాయమునందు చెప్పబడియే యున్నది. మనస్సు మొదలగువాని అభావమువలన శరీరము యొక్క అభావముకూడ అర్థమగుచునే యున్నది. సర్వముల అభావము వలన ఆత్మయందు ఏ లక్షణమును ఉండదు. స్వరూపము వలన ఆత్మ అతీన్ద్రియమే. అందువలన ఆత్మ ఉపలబ్ధియోగ్యత లేనందువలన దాని ఉనికి తెలియదు. దాని లక్షణములను లేనందువలన దొరుకవు అని భావము.

## ముక్తికి పర్యాయనామములు

23. విపాపం విరజః శాన్తం పరమక్షరమవ్యయమ్,
అమృతం బ్రహ్మ నిర్వాణం పర్యాయైః శాన్తిరుచ్యతే.

24. ఏతత్తత్ సౌమ్య!విజ్ఞానం యజ్ఞాత్వా ముక్తసంశయాః,
మునయః ప్రశమం జగ్ముర్వీతమోహరజఃస్పృహాః.

**తాత్పర్యము :** విపాపము, విరజము, శాంతము, పరము, అక్షరము, అవ్యయము, అమృతము, బ్రహ్మ, నిర్వాణము అనునవి శాంతిరూపమగు మోక్షమునకు పర్యాయనామములు.

ఓ అగ్నివేశుడా ! ఇట్టి విజ్ఞానమును పొంది మునీశ్వరులు సంశయము వదలి మోహము రజస్సు, స్పృహలనువీడి శాంతిని పొందిరి.

**ఆయుర్వేదదీపిక :** "విపాపమ్" అను మొదలగువాని వలన మోక్షము యొక్క స్వరూపమును తెలియజేయు పర్యాయములను చెప్పుచున్నాడు. "యజ్ఞాత్వా" అనగా జ్ఞానమును పొంది అని అర్థము. లేదా జ్ఞానమునకు స్వప్రకాశకత్వ ముండుటచేత జ్ఞానముకూడ తెలియదగినదగునని తెలిసికొనవలెను.

## అధ్యాయ సంగ్రహము

తత్ర శ్లోకా—

25. సప్రయోజనముద్దిష్టం లోకస్య పురుషస్య చ,
సామాన్యం మూలముత్పత్తౌ నివృత్తౌ మార్గ ఏవ చ.

26. శుద్ధసత్త్వసమాధానం సత్యా బుద్ధిశ్చ నైష్ఠికీ,
విచయే పురుషస్యోక్తా నిష్ఠా చ పరమర్షిణా.
ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే శారీరస్థానే
పురుషవిచయశారీరం నామ పఞ్చమోఽధ్యాయః.

**తాత్పర్యము :** ఈ పురుష విచయ శారీరమునందు లోకపురుషులకు గల సాదృశ్యము, అట్టి సాదృశ్యమును చెప్పుటకు గల ప్రయోజనము, ప్రవృత్తికి కారణములు, నివృత్తికి ఉపాయములు శుద్ధసత్త్వము, నైష్ఠికమగు సత్యబుద్ధి, మోక్షము అనునవి పరమ ఋషియగు ఆత్రేయునిచే చెప్పబడినవి.

ఇది అగ్నివేశునిచే రచింపబడి చరకునిచే ప్రతిసంస్కరింపబడిన తన్త్రము నందలి శారీరస్థానమున పురుష విచయ శారీరము అను పంచమాధ్యాయము.

**ఆయుర్వేదదీపిక :** సంగ్రహమునందు "శుద్ధసత్త్వ సమాధానమ్" **అనుటవలన** "సత్త్రైరవిమలం" అను మొదలుకొని "దీపాశయే యథా" **అనువరకు** ఉన్న విషయము గ్రహింపబడినది. "శుద్ధసత్త్వస్య" అను మొదలగువాని **వలన సత్యజ్ఞానము** చెప్పబడినది. నైష్టికీ అనునది సత్యబుద్ధి అనుదానికే విశేషణము. నైష్టికీ అనగా మోక్షమును సాధించునది. "నిష్ఠా" అనగా మోక్షము.

ఇది శ్రీ చక్రపాణిదత్తునిచే రచింపబడిన ఆయుర్వేదదీపిక యనెడు చరక తాత్పర్యటీక యందలి శారీరస్థానమున పురుష విచయ శారీరము **అను** పంచమాధ్యాయము.

—×—

# షష్ఠాధ్యాయము

# శరీరవిచయ శారీరము

1. అథాతః శరీరవిచయం శారీరం వ్యాఖ్యాస్యామః.

2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః.

## శరీర విచయము యొక్క ప్రయోజనము

3. శరీరవిచయః శరీరోపకారార్థమిష్యతే. జ్ఞాత్వా హి
శరీరతత్త్వం శరీరోపకారకరేషు భావేషు జ్ఞానముత్పద్యతే.
తస్మాచ్ఛరీరవిచయం ప్రశంసన్తి కుశలాః.

**తాత్పర్యము :** ఇక ఇపుడు శరీర విచయమను శారీరమును చెప్పబోవు చున్నాము.

అని ఆత్రేయ భగవానుడు చెప్పియుండెను. శరీరముయొక్క విజ్ఞానము శరీరముయొక్క ఉపకారము కొరకు ఉపయోగపడును. శరీరతత్త్వమును తెలిసికొనియే శరీరమునకు ఉపయోగపడు భావములందు జ్ఞానము కలుగును. అందువలన శరీరము యొక్క విశ్లేషణా జ్ఞానమును బుద్ధిమంతులు ప్రశంసింతురు.

**ఆయుర్వేదదీపిక :** మోక్షమునకు ఉపయోగించుటవలన పురుషునికి ఉపకారకమగు పురుష విచయమును పేర్కొని వివరింపబడుచున్న చికిత్సకు ఉపయోగ పడునట్టి శరీరోపకారకమగు శరీర విచయము చెప్పబడుచున్నది. శరీరముయొక్క విచయనము విచయము అనగా శరీరము యొక్క ప్రతిభాగ (విశ్లేషణాత్మక) జ్ఞానము అని అర్థము. "శరీరోపకారార్థమ్" శరీర ఆరోగ్యము కొరకు. ఇక శరీర జ్ఞానము శరీరోపకారక మెట్లగునో "జ్ఞాత్వా హి" అను మొదలగువాని ద్వారా చెప్పు చున్నాడు. శరీరముయొక్క రక్తాది రూపమగు దానియొక్క, స్వభావరూపమును - జ్ఞానమును తెలిసికొనియే ఇది ఇచట వృద్ధిపొందిన ధాతువునకు వ్యతిరేక గుణము కలిగియుండుటచే శరీరమునకు ఉపకరించును. అందులకు వ్యతిరేకముగా నున్నది శరీరమునకు అపకారము చేయును అను జ్ఞానము కలుగును. శరీరతత్త్వ జ్ఞానము లేకుండ ఉపకారమన్నునది చేయుట జరుగదని వాక్యార్థము.

## శరీరముయొక్క నిరుక్తి - ధాతువైషమ్యము అనారోగ్యమును లేదా మరణమును కలిగించుననుట, ధాతువైషమ్యముయొక్క నిరుక్తి

4. తత్ర శరీరం నామ చేతనాధిష్ఠానభూతం పఞ్చమహాభూతవికార-
సముదాయాత్మకం సమయోగవాహి.యదా హ్యస్మిఞ్ శరీరే ధాతవో
వైషమ్యమాపద్యన్తే తదా క్లేశం వినాశం వా ప్రాప్నోతి. వైషమ్యగమనం
హి పునర్ధాతూనాం వృద్ధిహ్రాసగమనమకార్త్స్న్యేన ప్రకృత్యా చ.

**తాత్పర్యము :** చేతనకు ఆధారభూతమైనది, పంచమహాభూత వికారముల యొక్క సముదాయ రూపమైనది, ధాత్వాదులను సమముగ వహించునదియును అనునది శరీరమనబడును. ఈ శరీరమునందు ధాతువులు వైషమ్యమును పొందినపుడు వ్యాధిగానీ మరణముగానీ సంభవించును. ధాతువులు కొంతమేరగానీ సంపూర్ణముగా గానీ వృద్ధి లేదా క్షీణతను పొందుట వైషమ్యమనబడును.

**ఆయుర్వేదదీపిక :** సముదాయ రూపముగా నున్న శరీరము యొక్క స్వరూపమును "తత్ర" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. చేతనా శబ్దము వలన జ్ఞానకారణమగు ఆత్మను చెప్పుచున్నాడు. భూత శబ్దము ఉపమానమునందుప యోగింపబడినది. అందువలన ఆత్మ సంబంధమగు చేతన యనునది శరీరమునందే ఆలంబనము కలిగియుండుట వలన ఆత్మకు శరీరము అధిష్ఠానమగుచున్నది. పర మార్థమున చేతన ఆత్మను ఆశ్రయించుకొనియుండును. ఆత్మకు ఆశ్రయము లేదు. లేదా, చేతనావంతమైన ఆత్మకు అధిష్ఠాన భూతమగునది చేతనాధిష్ఠాన భూతమగు నని చెప్పవచ్చును. ఐదు మహా భూతముల యొక్క వికారములగు రసాదులు శరీ రోత్పత్తికి కారణములు. వాని యొక్క సముదాయము అనగా సమ్మేళనము- అది ఏ స్వరూపమున నున్నదో అది- (శరీరము) అట్లున్నది. సముదాయ శబ్దము వలన సముదాయమునకు కారణములగు ధాతువులే చెప్పబడుచున్నవి. అందువలన సంయో గము వలన మాత్రమే కలుగు శరీరము యొక్క ప్రసక్తియేకాదు. లేదా సముదాయ మనగా సంయోగమనియే చెప్పబడవచ్చును. అయినప్పటికీ సముదాయ రూపమునకు కారణమగు ఏ శరీరము ద్రవ్య రూపమున నున్నదో అది పంచ మహా భూత సము దాయాత్మకమగు శరీరమే. "సమేన" అనగా తగు ప్రమాణము వలన ధాతువుల కల యిక వలన సరిగా రోగములు లేకుండా వహించునది (నడిపించునది) అని "సమ యోగవాహి" అనుదాని అర్థము.

ఎప్పుడైతే ధాతువుల యొక్క తక్కువ ఎక్కువల వలన విషమ సంయోగము జరుగునో అపుడది అసమయోగవాహి అని చూపుచు "యదా హి" అను మొదలగువానిని చెప్పుచున్నాడు. తక్కువ వైషమ్యము వలన రోగమును మాత్రమే కలిగించుటవలన దుఃఖము, గొప్ప వైషమ్యము వలన అసాధ్య రోగమును కలిగించుట వలన శరీరము వినాశమును అనగా మరణమును పొందును. ఇక ఆ వైషమ్య మేమియని - "వైషమ్యగమనమ్" అను మొదలగువానిని చెప్పుచున్నాడు. వైషమ్యగమనమనగా వైషమ్య అవస్థను పొందుట; వైషమ్యమే ఏదో ఒకప్పుడు కలుగును అని అర్థము, ఒకవేళ వైషమ్యమే అని చెప్పవలసినచో అపుడు ధాతువుల న్యూనాతిరిక్తత వలన కలుగు వైషమ్యము సహజసిద్ధమైనను అదియును శిష్యునిచే వైషమ్యముగా గ్రహింపబడును; అందువలన, గమన పదమును వేయుట చేత సహజమగు వైషమ్యమును వదలి స్వప్రమాణాపేక్ష వలననే ఏదో ఒకప్పుడు కలుగు వైషమ్యమును చూపుచున్నాడు. ఇచటయును వృద్ధి హ్రాసగమనము తప్ప మిగిలినదంతయు వైషమ్యమని తెలియవలెను. వృద్ధి హ్రాసము యొక్కయే విశేషములను "అకార్త్స్న్యేన ప్రకృత్యా చ" అని చెప్పుచున్నాడు. "అకార్త్స్న్యేన" అనగా కొంతభాగము వలన, "ప్రకృత్యా" అనగా అంతయు (పూర్తి స్వభావము వలన). ఇందువలన రసాదుల యొక్క కొంతభాగము నందు జరుగు వృద్ధి హ్రాసములు మరియు పూర్తిగా కలుగు వృద్ధి హ్రాసములు గ్రహించబడినవి. ఇతరులు మాత్రము "అకార్త్స్న్యేన" అను పదమును "క్లేశం వా వినాశం ప్రాప్నోతి" అనుదానితో అన్వయింతురు. అందువలన ధాతువులు వైషమ్యమును పొందినపుడును క్లేశము వినాశములు తప్పనిసరిగా కలుగనవసరము లేదు. ఎందువలననగా "అకార్త్స్న్యేన" అను పదము వలన క్లేశ వినాశములు కలుగకపోవుటయు అభిహితమగుచున్నందు వలన. ఇది (కొన్ని విషయములందు) చూడబడుచున్నది - ఉదాహరణకు - వృష్య ప్రయోగముచే కలుగు శుక్ర వృద్ధియందు క్లేశ వినాశములు కలుగవు. మరియు బాలునకు వృద్ధి చెందుచున్న ధాతువునకును గుణమే ఉత్కృష్టముగా చూడబడును. అదియును అంతగా బాగుండలేదు, ఎందువలననగా బాలునకు ధాతువులు వృద్ధి చెందుచున్నప్పటికీ అవి వయోనురూపమగు ప్రాకృత ప్రమాణమునందేయుండు ధాతువులగును. అందువలన ప్రాకృత ప్రమాణములోనున్న ధాతువులు వృద్ధిమైన వని చెప్పబడుటలేదు. వృష్య ప్రయోగమువలన కల్గిన శుక్రవృద్ధి యేది కలదో అది వికారములను కలుగజేయునది కానపుడు ప్రాకృత ప్రమాణములోనికి వచ్చి

యున్నదియే. ఇదియే ధాతువుల యొక్క అవికార కారిత్వమును కల్గియున్న ప్రాకృత మానము. అంజలి మొదలగు మానము మాత్రము దగ్గరగా చెప్పబడినప్పటికీ నిత్య పరోక్షత్వము వలన మరల స్వాభావిక ధాతులక్షణములచేతనే తెలియవలెను; అందు చేత శుక్రవృద్ధి యనునది దోషమును కలిగించనంతవరకు ప్రాకృత ప్రమాణములో నున్న రూపముగనే గ్రహింపవలెను. ఇచట ప్రాకృత మానమును మించినట్టి వృద్ధి హ్రాసములు "వైషమ్యగమన" శబ్దము వలన చెప్పబడుచున్నవి. కావున మొదట వలెనే వ్యాఖ్యానించుకొనవలెను. మరియు కేవలము వృద్ధి హ్రాసగమనమే వైషమ్య గమనము కాదు కాని స్వభావమువలననూ ధాతువులకు వైషమ్యగమనము కలుగునని వ్యాఖ్యానింతురు. అటులనే "ప్రకృతిస్థం యదా పిత్తం మారుతః శ్లేష్మణః క్షయే" (సూత్రస్థానము 17వ అధ్యాయము) అను మొదలగువానియందు ప్రాకృత స్థితిలో నున్న దోషమునకును వికారమును కలిగించుట చెప్పబడుచున్నది. ప్రాకృత స్థితిలో నున్ననూ వికారమును కలిగించు దోషమునకు వైషమ్యము కొరకు క్రియలను చేయుటవలన వైషమ్య శబ్దము వలన చెప్పబడుచున్నది. అదియును అంతగా బాగుండలేదు. ఎందువలననగా-ధాతువులు ఇతర ప్రదేశములందున్ననూ వానికి త్రివిధములగు గతిని ప్రతిపాదించి (ఆయా గతులలో) ప్రాకృత స్థితిలోనున్నట్లుగానే భావించి అవి నిర్వికారములుగానే చెప్పబడినవి-"క్షీణాః జహతి లిఙ్గం స్వం, సమాః స్వం కర్మ కుర్వతే. దోషాః ప్రవృద్ధాః స్వం లిఙ్గం దర్శయన్తి యథాబలమ్." (సూత్రస్థానము-17వ అధ్యాయము) మరియు "వికారో ధాతువైషమ్యం సామ్యం ప్రకృతిరుచ్యతే, సుఖసంజ్ఞకమారోగ్యం వికారో దుఃఖమేవ చ. (సూత్రస్థానము-9వ అధ్యాయము) అను మొదలగువానియందు ఈ విషయము చెప్పబడినది. "ప్రకృతిస్థం యదా పిత్తం" అను మొదలగువానియందు స్వప్రమాణమునందేయున్న పిత్తాదులకు ఏ వికారకర్తృత్వము చెప్పబడినదో, అది శరీరమునందలి ఇతర ప్రదేశములకు తీసికొనిపెళ్ళబడినట్టియు ఆ యా ప్రదేశములందు వృద్ధి చెందినట్టియు పిత్తాదులకు మాత్రమే యుండునది. దోషము స్వమానమునందున్నప్పటికీ ఇతర ప్రదేశమునకు తీసికొనిపెళ్ళబడినదగును ఆ ప్రదేశముననున్న దోషము కంటె ఎక్కువగనే యుండును. అందువలన అచటయును వృద్ధి చెందినదానికే వికార కర్తృత్వము ఆ సూత్రమునందే వివరింపబడియున్నది. ఎచట స్వమానమునందున్న రక్తాదులకు వాతాదులచే దుష్టి కలుగుచున్నందువలన వికారకర్తృత్వము కలుగునో, అచటయును వృద్ధి చెందిన వాతాదులే ప్రధానముగా వికారకరములగును. రక్తాదుల

కును అచట దుష్ట దోష సంబంధముపై ఆధారపడి స్వగుణములను కలిగియుండుట లేక గుణవృద్ధి కలుగుట జరుగును. అందువలన గుణముల యొక్క హాని వృద్ధుల వలన ప్రమాణవృద్ధి హ్రాసములు దూష్యమునందును కలుగుటచే ప్రకృతావస్థలో నున్న ధాత్వాదులకు వికారత్వము లేకపోవుట చూచుచున్నాము.

## ఔషధ ఆహార ద్రవ్యముల వలన ధాతువులయందు పరస్పరము వృద్ధిక్షయములు ఏకకాలమునందే జరుగుట

5. యౌగపద్యేన తు విరోధినాం ధాతూనాం వృద్ధిహ్రాసౌ భవతః. యద్ధి యస్య ధాతోర్వృద్ధికరం తత్తతో విపరీతగుణస్య ధాతోః ప్రత్యవాయకరం సంపద్యతే.

**తాత్పర్యము :** పరస్పర విరుద్ధ గుణములు కల ధాతువులకు ఒకేమారు వృద్ధిక్షయములు కలుగును. ఒకానొక ఆహార-ఔషధ ద్రవ్యము ఒకానొక ధాతువును వృద్ధి చెందించినచో అదే ద్రవ్యము ఆ ధాతువుకు వ్యతిరేక గుణములు కల మరియొక ధాతువును క్షీణింపజేయును.

**ఆయుర్వేదదీపిక :** ఉపయోగించిన ఔషధ ద్రవ్యము వలన వృద్ధి క్షయములెట్లు కలుగునో ఆ విషయమును "యౌగపద్యేన" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "విరోధినామ్" అనగా పరస్పర విరుద్ధ గుణములుకల వానికి. ఇదే విషయమును ఉపపత్తిద్వారా సాధించుటకు "యద్ధి" అను మొదలగు నవి చెప్పుచున్నాడు. ఏ ఔషధము ఉదా-క్షీరము-కఫ శుక్రములను వృద్ధి పొందించు నునో అది కఫశుక్రాదులకు విపరీత గుణములుకల వాతాదులకు హ్రాసకరము అగును అని అర్థము. (ప్రత్యవాయమనగా క్షయము లేదా హ్రాసము అని అర్థము). "విపరీతస్య" అనగా పనిచేయుదానియందు విపరీత గుణములు కలదానికి అదీ చేయును. (హ్రాసమును కలుగజేయును), అందువలన జాతి వ్యతిరేకతకంటే గుణ వ్యతిరేకతనే ప్రాధాన్యముగా చూపుచున్నాడు. అందువలన, గోమూత్రము ద్రవ త్వమును కలిగియుండుటచే కఫముతో సమానమైనప్పటికీ కటు ఉష్ణరూక్షాది కఫ వ్యతిరేకగుణముల వలన కఫమును తొలగించునదిగనే యుండును.

6. తదేవ తస్మాద్భేషజం సమ్యగవచార్యమాణం యుగపన్న్యూనాతిరిక్తానాం ధాతూనాం సామ్యకరం భవతి, అధికమపకర్షతి న్యూనముపప్యాయయతి.

**తాత్పర్యము :** అందువలన ఔషధము సరిగా ఉపయోగింపబడినదై వృద్ధి పొందియున్నట్టి మరియు క్షీణించి యున్నట్టి ధాతువులకు ఒకేమారు సమత్వమును కలిగించును. ఎక్కువగా నున్నదానిని తగ్గించి తక్కువగా నున్నదానిని పెంచును. (ఈ విధముగా ధాతువులకు సమత్వమును కలిగించును).

**ఆయుర్వేదదీపిక :** చెప్పబడుచున్నట్టి ధాతువులకు ఒకేమారు వృద్ధి హ్రాసములు కలుగుట యనుదాని ఉపసంహరించుచు "తదేవ" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "సమ్యగుపచర్యమాణమ్" అనుట వలన ఔషధమును తగు మోతాదులో ప్రయోగించుట మొదలగునవి మరియు ధాతుసామ్యము కలుగు వరకు ప్రయోగించుట అనువానిని చూపుచున్నాడు. మోతాదు మొదలగునవి సరిగాలేని ఔషధము అది చేయదగిన కార్యమును చేయదు. ఎట్లనగా—వృద్ధి చెందిన కఫమునకు మరియు క్షయము నొందిన పిత్తమునకును ఈ రెండింటి వృద్ధి క్షయముల యొక్క సామ్యత కొరకు కటు రసము మొదలగునవేవి ప్రయోగింపబడునో, అది సామ్యము కలిగిన తరువాత కాలమునందును ఉపయోగింపబడినచో, పిత్తము వృద్ధి చెందుట మరియు కఫము క్షీణించుట వలన మరల వైషమ్యమును కలిగించును. కావున ఈ దోషమును నివారించుటకుగాను "సమ్యగుపచర్యమాణమ్" అని చెప్పబడినది. మొదట, ఔషధము వలన విరుద్ధ గుణములు కల ధాతువులకు వృద్ధి హ్రాసములు కలుగునని చెప్పబడినది గదా ! చివరన మాత్రము ధాతువులకు ఔషధము సామ్యమును కలిగించునదిగను చెప్పబడుచున్నది. అట్లైనచో అర్థభేదమెట్లు కలుగుచుండును అని సందేహపడి వృద్ధి హ్రాసములను కలిగించునదియే సామ్యతను చేకూర్చునదగు నని చూపుచు- "అధికమపకర్షతి న్యూనమాప్యాయయతి" అని చెప్పుచున్నాడు. ఇటువంటి ధాతు సామ్యత్వమును కలుగజేయుట యనునది ఎచ్చట విరుద్ధ గుణములు గల ధాతువుల వృద్ధి హ్రాసములుండునో అచటనే జరుగును, కాని అన్నిచోట్లను జరుగదు అని తెలిసికొనవలెను. అందువలన ఎచట దోషములకు కొంచెమైనను క్షయము లేకుండగ వృద్ధియే ఎక్కువ కలిగియుండునో అచట వృద్ధి చెందిన దోషమునకు క్షయత్వమును తెచ్చు విధము చెప్పబడినట్లు క్షీణించిన దానిని వృద్ధి పొందించుట చెప్పబడలేదని తెలియవలెను.

## ఔషధోపయోగము వలన, స్వస్థవృత్తమును అనుసరించుట వలననూ ధాతుసామ్యము కలుగుననుట

7. ఏతావదేవ హి భైషజ్యప్రయోగే ఫలమిష్టం స్వస్థవృత్తానుష్ఠానే చ యావద్ధాతూనాం సామ్యం స్యాత్.స్వస్థా హ్యపి ధాతూనాం సామ్యాను-గ్రహార్థమేవ కుశలా రసగుణానాహారవికారాంశ్చ పర్యాయేణేచ్ఛన్త్యుప-యోక్తుం సాత్మ్యసమాజ్ఞాతాన్: ఏకప్రకారభూయిష్ఠాంశ్చోపయుఞ్జానా స్త-ద్విపరీతకరసమాజ్ఞాతయా చేష్టయా సమమిచ్ఛన్తి కర్తుమ్.

**తాత్పర్యము :** ఔషధ ప్రయోగము నందును, స్వస్థ వృత్తమును అను ష్ఠించుట యందునూ ధాతుసామ్యము కలుగుటయే ఫలముగా కోరవలెను. కుశలురైన స్వస్థులు కూడ ధాతుసామ్యమును పొందుట కొరకే సాత్మ్యములుగ చెప్పబడిన రస ములను, గుణములను, ఆహార పదార్థములను ఉచితమైన క్రమమున ఉపయోగింప వలెను. ఒకే విధమైన వానిని ఉపయోగించువారు వానికి విపరీతముగ చెప్పబడిన కృత్యములచే సమత్వమును కలిగించుకొనెదరు.

**ఆయుర్వేదదీపిక :** చెప్పబడిన ధాతుసామ్యము యొక్క ఉపయోగ మును చూపుటకు ఔషధ ప్రయోగమునకునూ మరియు స్వస్థవృత్తానుష్ఠానమున కునూ ధాతుసామ్యము తప్ప వేరు ఫలమును నిషేధించుచూ-"ఏతావదేవ" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "ఏతావదేవ" అనుట వలన చెప్పబోవుచున్న ధాతు సామ్యము బోధపడుచున్నది. ఔషధ సాధ్యమగు ధాతు సామ్యకమైన రోగప్రశమ నము ధాతుసామ్యము నతిక్రమింపదు, మరియు స్వస్థునకు ఓజస్కరమగు రసాయ నము వలన కూడ విశిష్టమగు ధాతుసామ్యమే తెలబడుచున్నది. అందువలన ఆయు ర్వేదము వలన ధాతుసామ్యము తప్ప వేరొకటి సాధ్యపడదని భావము. "ధాతు సామ్యక్రియా చోక్తా తన్త్రస్యాస్య ప్రయోజనమ్" (సూత్రస్థానము 1వ అధ్యా యము) అని చెప్పబడియే యున్నది. స్వస్థునియందు ధాతుసామ్యము సిద్ధమే గదా! మరియు సిద్ధించినది సాధింపబడదు, అట్లైనచో స్వస్థవృత్తానుష్ఠానమునందును ధాతు సామ్యమే ఫలము ఎట్లగును అని - స్వస్థా హ్యపి" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "సామ్యానుగ్రహార్థమ్" అనగా నిలచియున్న సామ్యమునకే పరాపర సామ్యము నుత్పత్తి చేయుటవలన దానిని పరిపాలించుట కొరకు అని అర్థము. "రసాః అనగా మధురాది రసములు. "గుణాః" అనగా గుర్వాది

గుణములు. "ఆహారవిహారాః"అనగా తినదగిన, నములదగిన, నాకదగిన, త్రాగదగిన మొదలగు రూపములు గల యవాగు మొదలైనవి. "పర్యాయేణ" అనగా తగు క్రమమున అని అర్థము. ఆ క్రమమెట్టిదనగా - మధురరసము నుపయోగించి దానివలన కలుగు కఫవృద్ధి మొదలగువానిని నిరోధించుటకు కటురసము మొదలగువాని నుపయోగించుట ఈ మొదలగు రసక్రమము, అట్లే గురుగుణము నుపయోగించి దాని కార్యమును నిరోధించుటకు లఘు గుణము నుపయోగించుట అని ఈ విధమైన పద్ధతి గుణములను ఉపయోగించు క్రమము. ఆహార విహారములయందు గూడ ఖాద్యాదుల నుపయోగించి అవి పచనము నొందుటకు పేయము నుపయోగించుట ఈ మొదలైన క్రమము గలదు. గుణశబ్దము వలన రసములు కూడ ప్రాప్తించును, అయినప్పటికీ రసములు ప్రాధాన్యముచేత విడిగా చెప్పబడినవి. "సాత్మ్య సమామ్నాతాన్" అనుట "రసగుణాన్" అనుదానికి మరియు "ఆహారవిహారాంశ్చ" అనుదానికిని విశేషణము. అభ్యాసమువలన సాత్మ్యములైనవియును మరియు సమత్వమువలన తీసికొనదగినవిగా చెప్పబడినవి. సాత్మ్య సమామ్నాతములని తెలియవలెను. "సమ" శబ్దము వలన ఇచట పథ్యము చెప్పబడుచున్నది. లేదా, ఎల్లప్పుడు సాత్మ్యములుగా ఆదేశింపబడినవి - సాత్మ్య సమామ్నాతములు: అందువలన అసాత్మ్యములగు రసాదులయొక్క సేవనమునే ప్రతిక్షేపించుచున్నాడు. ఇక అటువంటి రసాదులు ఎచట పర్యాయములుగా ఉపయోగింపబడుచున్నవో అచట సరిగానే యుండును, ఎచటనైతే ఏవో ఒక కారణమువలన ఒకేవిధమైన రసాదులు అభ్యసింపబడుచున్నవో అచట ఏ విధిని అనుసరింపవలయును అని — "ఏకప్రకార" అను మొదలగునవి చెప్పుచున్నాడు. అటుపైన ఉపయోగింపబడిన ఏకరసాదుల ఆధిక్యతచేత ఆ రసాదులకు విపరీతమగు అర్థమును చేయునని దానికి విపరీత అర్థకారకమగు చేష్ట చెప్పబడినది; అనగా ఆ చేష్టవలన సమత్వమును చేయుటకు ఇష్టపడుదురని భావము. ఒకే ప్రకారముయొక్క ఆధిక్యతవలన కలుగుచున్న వైషమ్యమును పొందిన శరీరమును సమధాతుత్వముచేత సమత్వమును చేయుటకు ఇష్టపడుదురని అర్థము. దీనికి ఉదాహరణము — మధురరసము అధికముగానున్న ఆహారము నెవడు అధికముగా భుజించునో, అట్టివానికి మధురమునకు సమానమగు కఫాదులయొక్క వృద్ధి కలుగునని శంక కలిగి కఫాదులయొక్క కర్మను క్షీణింపజేయు ఏ వ్యాయామాది చేష్టగలదో దానివలన సామ్యము తేబడుచున్నది. లేదా, దానికి వ్యతిరేకమగునది మరియు సమ

ముగా నున్నదిగా చెప్పబడినట్టి ఏ చేష్ట కలదో అది తద్విపరీతకరముగా ఆదేశింప బడినది, అందువలన చేయబడుచున్న అతియోగాదులను నిషేధించుచున్నాడు.

## సంగ్రహముగా స్వస్థవృత్తము యొక్క స్వరూపము

8. దేశకాలాత్మగుణవిపరీతానాం హి కర్మణామాహారవిహారాణాం చ
క్రియోపయోగః సమ్యక్,సర్వాతియోగసంధారణమ్,అసన్ధారణముదీర్ణానాం
చ గతిమతాం,సాహసానాం చ వర్జనమ్,స్వస్థవృత్తమేతావద్ధాతూనాం
సామ్యానుగ్రహార్థముపదిశ్యతే.

**తాత్పర్యము :** దేశము, కాలము, శరీరము వీనికి వ్యతిరేక గుణములు కల కర్మలను చేయుట, అట్టి ఆహారవిహారములను సరిగా ఉపయోగించుట, ఎల్లెడలను అతియోగమును చేయకుండుట, గతిమంతములైనట్టి వచ్చుచున్నట్టి మల మూత్రాది వేగములను అరికట్టకుండుట, సాహసములను వర్జించుట అనునది ధాతు సామ్యము కొరకు అనుసరింపవలసిన స్వస్థవృత్తము.

**ఆయుర్వేదదీపిక :** ఇపుడు ప్రస్తావనయందు వచ్చుచున్న స్వస్థవృత్తమును సంగ్రహముగా — "దేశ" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. దేశము మొదలగు వానికి గుణశబ్దము అన్వయించును. ఆత్మశబ్దము వలన ఇచట శరీరము చెప్పబడును. దేశ విపరీతమగు కర్మకు ఉదాహరణము — ఎడారియందు నిద్రించుట; కాలవిపరీతమగు కర్మకు ఉదాహరణ — వసంత ఋతువునందు వ్యాయామము చేయుట, ఆత్మ విపరీతమగు కర్మకు ఉదాహరణ — శరీరము స్థూలముగా నున్నపుడు వ్యాయామము జాగరణము మొదలగునవి చేయుట. ఇట్లే దేశ కాలాది విపరీతములగు ఆహారపు భేదములను కూడ ఊహించుకొనవలెను. "కర్మణాం-క్రియా, ఆహారవిహారాణాం చోపయోగః" అని లెక్కించదగినన్నింటిని అన్వయించుకొనవలెను — అనగా కర్మలు, ఆహారపదార్థముల ఉపయోగము అనువాటిని లెక్కించదగినన్నింటిని లెక్కించి తెలిసికొనవలెనని అర్థము. "సమ్యక్" అనగా క్రియవలన, ఉపయోగించుట వలననూ సమమైనట్టి అని అర్థము. అతిక్రమించినట్టి యోగము అతియోగము - అనగా అతియోగ మిథ్యాయోగ అయోగరూపమైనదని తెలియవలెను. అందువలన ఎల్లెడలను కాలము బుద్ధి ఇంద్రియములకు కలుగు మిథ్యా యోగాదులను వర్జించుట సర్వాతియోగ సంధారణమగును. కాలము యొక్క మిథ్యా యోగాదులు పరిహరింప శక్యముగానందున వానికి ప్రతిక్రియను చేయుటయే వర్జన

మగును. "గతిమతామ్" అనగా బయటకువెళ్ళు గుణము కల పురీషము మొదలైన వానిని. 'సాహసానామ్' అనగా బలమునకు తగినట్లు లేనట్టి వానిని.

## ధాతువులకు వృద్ధిక్షయమును కలిగించు ఆహారములు

9. ధాతవః పునః శారీరాః సమానగుణైః సమానగుణభూయిష్ఠైర్వాఽప్యా— హారవికారై రభ్యస్యమానైర్వృద్ధిం ప్రాప్నువన్తి, హ్రాసం తు విపరీతగుణై— ర్విపరీతగుణభూయిష్ఠైర్వాఽప్యాహారైరభ్యస్యమానైః.

**తాత్పర్యము :** శరీరమునందలి ధాతుపులు తమతో సమాన గుణములు కలిగినట్టి లేదా సమాన గుణములు అల్పముగా కలిగినట్టి ఆహార పదార్థములను అభ్యాసముగా సేవించుట వలన వృద్ధిని పొందును. తమకు వ్యతిరేక గుణములు కలిగినట్టి లేదా వ్యతిరేక గుణములు అల్పముగా కలిగినట్టియు ఆహారములను అభ్యాసముగా సేవించుటవలన క్షయమును పొందును.

**ఆయుర్వేదదీపిక :** రసాది ధాతుపులకు చెప్పబడిన వృద్ధిక్షయములు ఎటువంటి ఆహారముల వలన జరుగునో అది చూపుటకు - "ధాతవః" అను మొద లగువానిని చెప్పుచున్నాడు. "శారీరాః" అను పదము వలన ఆధ్యాత్మికములగు బుద్ధ్యాదులను వ్యవచ్ఛేదనము చేయుచున్నాడు. ఎందువలననగా బుద్ధ్యాదులు సమాన గుణము వలన వృద్ధిపొందవు. లేక, విపరీత గుణములు కలవాని వలననైననూ క్షీణింపవు. ధాతువుతో గుణములందు సమాన గుణములను కలిగియుండునది సమాన గుణమనబడును, ఎట్లనగా మాంసమునకు మాంసమువలె; సమానగుణ భూయిష్ఠ మనగా అల్పమైన సమాన గుణములు కలిగినట్టి. ఉదాహరణకు శుక్రమునకు క్షీరము వలె. క్షీరము అతిద్రవత్వము వలన శుక్రము కంటె అల్పగుణములను కలిగి యుండును. "అభ్యస్యమానైః" అనుటవలన ఒక్కసారి మాత్రమే ఉపయోగించుట వలన వృద్ధిగాని క్షయముగాని జరుగుట నిషేధించుచున్నాడు. ధాతువుతో వ్యతిరేక ముగా నున్న గుణము విపరీతగుణమనబడును. అల్ప సమాన గుణము మాత్రము విపరీత గుణ భూయిష్ఠమగును.

## ద్రవ్యములందున్న గుర్వాది గుణములు చేయు కృత్యములు

10. తత్రేమే శరీరధాతుగుణాః సంఖ్యాసామర్థ్యకరాః తద్యథా-గురులఘుశీతోష్ణ-స్నిగ్ధరూక్షమన్దతీక్ష్ణస్థిరసరమృదు కఠినవిశదపిచ్ఛిలశ్లక్ష్ణఖర సూక్ష్మస్థూల - సాన్ద్రద్రవాః. తేషు యే గురవస్తే గురుభిరాహారవికారగుణై రభ్యస్యమానై-రాప్యాయ్యన్తే, లఘవశ్చ హ్రసన్తిఃలఘవస్తు లఘుభిరాప్యాయ్యన్తే, గుర-వశ్చహ్రసన్తి. ఏవమేవ సర్వధాతుగుణానాం సామాన్యయోగాద్వృద్ధిః, విపర్యయాద్ధ్రాసః. తస్మాన్మాంసమాప్యాయ్యతేమాంసేన భూయ స్తరమన్యేభ్యః శరీరధాతుభ్యః, తథా లోహితం లోహితేన, మేదో మేదసా, వసా వసయా, అస్థి తరుణాస్థ్నా,మజ్జా మజ్జ్ఞా, శుక్రం శుక్రేణ, గర్భస్త్వామగర్భేణ.

**తాత్పర్యము :** శరీరమునందున్నవగు ధాతువుల యొక్క గుణములు, సంఖ్యాజ్ఞానముతో కూడినవి, ఏవనగా- గురు-లఘు- శీత-ఉష్ణ- స్నిగ్ధ- రూక్ష-మంద తీక్ష్ణ- స్థిర- సర- మృదు- కఠిన- విశద- పిచ్ఛిల- శ్లక్ష్ణ- ఖర- సూక్ష్మ- స్థూల- సాంద్ర- ద్రవ గుణములు. వీనియందు గురుగణములలవేవో అవి గురు గుణము కల ఆహారములను అభ్యసించుచున్నప్పుడు వృద్ధి నొందును. మరియు లఘుగుణము కల ధాతువులు క్షీణించును. లఘు గుణము కల ధాతువులు లఘు గుణము కలిగిన ఆహారములను అభ్యసించుటచే వృద్ధిపొందును. మరియు గురుగుణము కల ధాతువులు హ్రాసము నొందును. ఇటులనే సమస్త ధాతువులకును సమాన గుణము వలవానిని ఉపయోగించుటచే వృద్ధియు, వ్యతిరేకగుణముల ఉపయోగముచే హ్రాసమును కలుగును. అందువలన మాంసము నుపయోగించుటచే శరీరమునందలి ఇతర ధాతువుల కంటె మాంసము ఎక్కువగా వృద్ధిపొందును. అట్లే రక్తము వలన రక్తము, మేదస్సు వలన మేదస్సు, వసవలన వస, తరుణాస్థుల వలన అస్థులు, మజ్జ వలన మజ్జ, ఆమగర్భము వలన గర్భము వృద్ధిపొందును.

**ఆయుర్వేదదీపిక :** ఔషధ గుణములతో సమానముగా గానీ లేక వ్యతిరేకములుగా గానీ చెప్పబడుచున్న ధాతువుల గుణములేవియో "తత్ర" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. "శరీర ధాతుగుణాః" అను విశేషణము వలన అప్రస్తుతమగునట్టి, పేర్కొనబడనట్టియు ఆత్మ గుణములగు బుద్ధ్యాదులను నిరసించుచున్నాడు. సరాదులు మాత్రము శరీర గుణములైనప్పటికి అవి వృద్ధి హ్రాస

ముల పట్ల ఎక్కువ ప్రయోజనము లేకయుండుట వలన ఇచట చెప్పబడలేదు. రసము మాత్రము ప్రధానమగుట వలన ఇతర ప్రకరణమునందు చెప్పబడియే యుండుట చేత ఇచట చెప్పబడలేదు. స్పర్శ యనునది శీతోష్ణ గుణముల ద్వారా గ్రహింపబడియేయున్నది. శబ్ద రూప గంధములు మాత్రము పరాదులవలె వృద్ధియందు, హ్రాసమునందు ఎక్కువ ప్రయోజనము గలిగియుండకపోవుట వలన చెప్పబడలేదు. "సంఖ్యా" అనగా జ్ఞానము, లేక లెక్కించుట అట్టి సామర్థ్యమును కలిగించునవగుటచే "సంఖ్యాసామర్థ్యకరములు"గా చెప్పబడినవి. ఇవియే గుర్వాదులు తెలిసికొనబడినవై ఇరువది గుర్వాదులు ఉండునని సంఖ్యా సామర్థ్య రూపమగు ఏ జ్ఞానము కలుగునో అట్టిదానిని కలుగజేయుచున్నవి. పరస్పరము వ్యతిరేకములగు పది ద్వంద్వ గుణములను చూపించి, అవి ద్రవ్యమునందు సంబద్ధములై యున్నపుడు కలుగు కర్మను సవివరముగా "తేషు" అను మొదలగువానిద్వారా శృంగగ్రాహికముగా చెప్పుచున్నాడు. "లఘువశ్చ హ్రసన్తి" అనునది భేదము. మిగిలిన శీతాది గుణములకు వృద్ధిని అతి దేశము వలన 'ఏవమ్' అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "సామాన్య యోగాత్" అనగా సమానమగునట్టి ఒకే రూపమును కలిగియున్నందువలన అట్టి సామాన్యము అన్ని విధముల సమాన గుణ జాతి రూపమగును. ఎట్లనగా-పోషింపబడు మాంసము మరియు పోషించుచున్న మాంసములకు గల సామాన్యము వలె. కొన్నింటి విజాతీయ ద్రవ్యమునందునూ గుణములే పోష్య పోషక ధర్మమును కలిగియుండును. ఎట్లనగా- క్షీరము, శుక్రములకు వలె. అచట ఎక్కువ వృద్ధిని కలిగించుటవలన మొదట సర్వగుణ సామాన్యయుక్తమగు జాతి రూపమగు సామాన్యమునే ఉదహరించుచున్నాడు—"తస్మాత్" అను మొదలగునవి. "భూయిస్తరమన్యేభ్యః" అనుటవలన మాంసము వలన సమాన భూయిష్ఠత చేత రక్తాదులకును వృద్ధి కలుగుచున్నప్పటికీ ఎక్కువ వృద్ధి మాత్రము అన్ని విధముల సామాన్య యోగము చేత మాంసమునకు చేయునని చూపుచున్నాడు.'లోహితం లోహితేన' అను ఈ మొదలగువానియందు 'భూయస్తర మన్యేభ్యః' అని అన్వయించుకొనవలెను. 'గర్భస్త్వామగర్భేణ' అనుచోట అండము మొదలగు రూపము కల ఆమగర్భము వలన గర్భమునందు సరిగా ఏర్పడని మాంసాదులకు వృద్ధి చెప్పబడుచున్నది.

## సమాన గుణ భూయిష్ఠత కల్గిన విజాతీయ ద్రవ్యములచే ధాతువులకు వృద్ధి క్షయములు కల్గుట

11. యత్ర త్వేవం లక్షణేన సామాన్యేన సామాన్యవతామాహార వికారాణా-మసాన్నిధ్యం స్యాత్, సన్నిహితాం వాఽప్యయుక్తత్వాన్నోపయోగో ఘృణిత్వాదన్యస్మాద్వా కారణాత్. స చ ధాతురభివర్ధయితవ్యః స్యాత్,-తస్య యే సమానగుణాః స్యురాహారవికారా అసేవ్యాశ్చ, తత్ర సమానగుణ-భూయిష్ఠానామన్యప్రకృతీనామప్యాహారవికారాణాముపయోగః స్యాత్. తద్యథా—శుక్రక్షయే క్షీరసర్పిషోరుపయోగో మధురస్నిగ్ధశీతసమాఖ్యా-తానాం చాపరేషాం ద్రవ్యాణాం, మూత్రక్షయే పునరిక్షురసవారుణీమణ్డద్రవ మధురామ్లలవణోపక్లేదినాం, పురీషక్షయే కుల్మాషమాషకుష్కుణ్డాజమధ్య-యవశాకధాన్యామ్లానాం, వాతక్షయే కటుతిక్తకషాయరూక్షలఘుశీతానాం, పిత్తక్షయేఽమ్ల లవణకటుకక్షారోష్ణతీక్ష్ణానాం, శ్లేష్మక్షయే స్నిగ్ధగురుమధుర-సాంద్రపిచ్ఛిలానాం ద్రవ్యాణాం. కర్మాఽపి యద్యస్య ధాతోర్వృద్ధికరం తత్తదాసేవ్యమ్. ఏవమన్యేషామపి శరీరధాతూనాం సామాన్యవిపర్యయాభ్యాం వృద్ధిహ్రాసౌ యథాకాలం కార్యౌ. ఇతి సర్వధాతూనామేకైకశోఽతిదేశతశ్చ వృద్ధిహ్రాసకరాణి వ్యాఖ్యాతానిభవన్తి.

**తాత్పర్యము :** పైన చెప్పబడినట్టి సామాన్య లక్షణము వలన సామాన్యము లైనట్టి ఆహార పదార్థములు దొరుకకపోవచ్చును. దొరికినప్పటికీ అవి యుక్తముగా లేకపోవుట చేత, అసహ్యము చేతనూ, ఇంకేదైననూ కారణము చేత ఆ ధాతువుతో సమాన లక్షణములున్న ఆహార వికారములు సేవింపదగనివిగా నుండ వచ్చును. కానీ ఆ ధాతువు వృద్ధి నొందింపవలసియుండును. అచట ఆ ధాతువుతో అల్ప సమాన గుణములున్నట్టి వేరు జాతి ద్రవ్యములనుపయోగింపవలసియుండును. అది యెట్లనగా—శుక్రక్షయమునందు క్షీరము ఘృతములనుపయోగించుట, మధుర రసము, స్నిగ్ధ శీత గుణములు కలవిగా చెప్పబడినట్టి ఇతర ద్రవ్యములను ఉప యోగించి చేయవలెను.

మూత్రక్షయమునందు చెరకురసము వారుణియను మద్యముయొక్క తేట, మధుర అమ్ల లవణరసము కలిగినట్టి ద్రవ్యములు, ఉపక్లేదిత్వమును కల్గించు ద్రవ్య ములను ఉపయోగింపవలెను.

పురీషము క్షీణించినపుడు ఉలవలు, మినుములు, కుష్మాండము (కుక్కగొడుగు) మేక యొక్క అంతరాధియందుండెడు మాంసము, యవలు, ఆకుకూరలు ధాన్యామ్లము అనువానిని ఉపయోగింపవలెను.

వాతము క్షీణించినపుడు కటు తిక్త కషాయరసములు, రూక్ష లఘు శీత గుణములు కలిగిన ద్రవ్యములను ఉపయోగింపవలెను.

పిత్తము క్షీణించినపుడు అమ్ల లవణ కటు రస ద్రవ్యములను, క్షారమును, ఉష్ణ తీక్ష్ణ గుణములు కల ద్రవ్యములను ఉపయోగింపవలెను.

శ్లేష్మ క్షయమునందు మధుర రస ద్రవ్యములను, స్నిగ్ధగురు సాంద్ర పిచ్ఛిల గుణములు కలిగి యున్న ద్రవ్యములను ఉపయోగింపవలెను. ఇంకనూ ద్రవ్యముల నేగాక ఆ యా ధాతువులను వృద్ధి నొందించు కర్మలనుగూడ ఆచరింపవలెను. ఇటులనే ఇతరములైన శారీరిక ధాతువులకును వాని గుణములతో సమాన గుణములు కలవానిని ఉపయోగించి వృద్ధిని, వ్యతిరేక గుణములుగల ద్రవ్యముల నుపయోగించి క్షయమును కల్గింపవలెను. ఈ విధముగా అన్ని ధాతువులకును ఒక్కొక్కదానికి వివరముగా వృద్ధి హ్రాసములను కల్గించు ద్రవ్యములు చెప్పబడినవి.

ఆయుర్వేదదీపిక : ప్రస్తుతము అల్ప సమాన గుణములు కల్గిన విజాతీయ ద్రవ్యముల వలన (ధాతువులకు) వృద్ధి కలుగుటను "యత్ర" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "ఏవం లక్షణేన" అనగా తుల్యజాతి రూపమువలన. "ఘృణిత్వాత్" అను మొదలగువానిద్వారా చెప్పబడిన విషయమును వివరించుచున్నాడు. "అన్నస్మాద్వా కారణాత్" అనగా భక్షింపదగని ఆమగర్భము, శుక్రము మొదలగు వానిని భక్షించుటవలన కలుగు అధర్మముచేత అని అర్థము. "తత్ర" అనుట వలన లభ్యము కానట్టివియు, లభ్యమైననూ అసహ్యముచేత, ఇంకేదైననూ కారణముచేతనూ సేవింపదగని వానిని తెలియచేయు చున్నాడు. "అన్యప్రకృతీనామ్" అనగా విజాతీయములైన వానిని. 'తద్యథా' అను మొదలగువాని ద్వారా ఇచట ఉదాహరణమును చెప్పుచున్నాడు. శుక్రము క్షీణించియున్న సమయమునందు ఒకవేళ వేరు శుక్రము లభించనపుడు, లభించిననూ అసహ్యము మొదలగువానిచేత ఉపయోగింప దగినదిగా నుండదు, అట్టి సమయమున శుక్రముతో అల్ప సమాన గుణములు కలిగిన క్షీరాదులను ఉపయోగింపవలెనని అర్థము. మూత్రాదుల క్షయమునందునూ సజాతీయ ద్రవ్యముల నుపయోగించుటయందు అసహ్యము కలుగుటచేత అల్పసమాన గుణము

మును కలిగిన ద్రవ్యముల నుపయోగింపవలెనని "మూత్రి" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. కుష్మాండ మనగా పలలాది చ్ఛత్రిక (కుక్క గొడుగు లేక పుట్టి కొక్కు?) "అజమధ్యం" అనగా మేకమొక్క అంతరాధి. "ద్రవ్యాణాం" అనుచోట "ఉపయోగః" అని అన్వయించుకొనవలెను. వృద్ధిని కలిగించు ఆహార మును పేర్కొని వృద్ధిని కలిగించు విహారమునుకూడ "కర్మ" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. కర్మ శబ్దమువలన ఇచట కూర్చొనుట, చింతించుట అను మొదలగునవి కూడ తీసికొనబడును. కర్మసూత్రము సాధారణముగా ప్రభావము వలననే వృద్ధి కరమగుటంజేసి ఇచట సమాన గుణము గలదానిగా గ్రహించుట జరుగ లేదు. సాక్షాత్తు ఇచట చెప్పబడనట్టి ధాతువులకునూ పై చెప్పబడిన న్యాయము ననుసరించి వృద్ధిహ్రాసములు కలుగునని "ఏవం" అను మొదలగువాని ద్వారా చూపు చున్నాడు. "యథాకాలమ్" అనగా క్రియాకాలమును దాటకుండగ, "ఇతి సర్వ" అను మొదలగువాని ద్వారా చెప్పబడిన ప్రకరణమును ఉపసంహరించుచున్నాడు. "ఏకైకశ" అనుటవలన "మాంసమాప్యాయ్యతే మాంసేన" అను మొదలగువానిద్వారా చెప్ప బడినదానిని గ్రహించుచున్నాడు. "అతిదేశతశ్చ" అనుటవలన "ఏవమన్యేషామపి ధాతూనాం" అను మొదలగువాని ద్వారా చెప్పబడినదానిని గ్రహించుచున్నాడు.

## సర్వ శరీర వృద్ధిని కలిగించు భావములు

12. కార్త్స్న్యేన శరీరవృద్ధి కరాస్త్విమే భావా భవన్తి: తద్యథా — కాలయోగః, స్వభావసంసిద్ధిః, ఆహారసౌష్ఠవమ్, అవిఘాతశ్చేతి.

**తాత్పర్యము :** యౌవన కాలముతో కూడియుండుట, స్వభావముగా వృద్ధిని కలిగియుండుట (పూర్వజన్మ కర్మ ఫలమువలన వృద్ధిని కలిగియుండుట), మంచి ఆహారమును సేవించుట మరియు శరీరవృద్ధికి విఘాతమును కలిగించు పనులను చేయకుండుట అనునవి సర్వశరీరమునకు వృద్ధిని కలిగించు భావములు.

**ఆయుర్వేదదీపిక :** వృద్ధి ప్రస్తావము వచ్చియుండుటచేత "కార్త్స్న్యేన" అను మొదలగువాని ద్వారా వృద్ధిని గూర్చి చెప్పుచున్నాడు. "కాలయోగః" అనగా వృద్ధిని కలిగించు యౌవన కాలముతోకూడి యుండుట. పదునేడవ సంవత్సరము మొదలగు యౌవనాది కాలమునందే కాలమహిమ వలననే వృద్ధి కలుగును. స్వభావ శబ్దము వలన అదృష్టము (పూర్వజన్మ కర్మ) చెప్పబడుచున్నది. అందువలన

అదృష్టము స్వభావ సంసిద్ధముగా శరీరమునకు కలుగు వృద్ధికి హేతువగు చున్నది. "ఆహారసౌష్ఠవమ్" అనగా ఆహారము యొక్క సంపత్తు. "అవిఘాతశ్చ" అనగా శరీరము యొక్క వృద్ధికి విఘాతమును కలిగించు అతి వ్యవాయము, మనస్సున కభిఘాతము కలుగుట మొదలగునవి లేకుండుట.

## బలవృద్ధికర భావములు

13. బలవృద్ధికరా స్త్విమే భావా భవన్తి. తద్యథా — బలవత్పురుషే దేశే జన్మ, బలవత్పురుషే కాలే చ, సుఖశ్చ కాలయోగః, బీజక్షేత్రగుణ సంపచ్చ ఆహార సంపచ్చ, శరీరసంపచ్చ, సాత్మ్య సంపచ్చ, సత్త్వసంపచ్చ, స్వభావ సంసిద్ధిశ్చ, యౌవనం చ, కర్మ చ, సంహర్షశ్చేతి.

**తాత్పర్యము :** బలవంతులగు పురుషులుగల దేశమునందు జన్మించుట, బలవంతులు జన్మించు కాలమునందునూ (హేమంతాదిఋతువు) జన్మించుట, కాలయోగము సుఖముగా నుండుట, మంచి గుణములతో కూడిన శుక్రశోణిత గర్భాశయముల వలన జన్మించుట, మంచి ఆహారమును తీసికొనుచుండుట, మంచి శరీరమును కలిగియుండుట, సాత్మ్యములైన ఆహార విహారములను సేవించుట, మంచి సత్త్వమును కలిగియుండుట, స్వభావమువలన బలముగా నుండుట, యౌవనము, బలమును కలిగించు వ్యాయామాది కర్మలను చేయుట సంతోషముతో నుండుట అనునవి బలవృద్ధిని కలిగించు భావములు.

**ఆయుర్వేదదీపిక :** వృద్ధిని గురించిన ప్రస్తావన వచ్చియున్నందున బలవృద్ధి కరములగు భావములనుకూడ "బల" అను మొదలగుదానిద్వారా చెప్పుచున్నాడు. దేశమహిమవలన బలవం తులగు పురుషులు సైంధవాది యే దేశమునందు ఉంటెదరో, అది "బలవత్పురుషోదేశః" అనబడును. అచట పుట్టినవాడు సింధు దేశమునందలి బలవంతులగు పురుషులవలె దేశమహిమ వలననే బలవంతుడగును. కాలపరిణామము కూడా బలమునకు గొప్ప కారణమగుటను "బలవత్పురుషే కాలే చ" అని చెప్పుచున్నాడు. కాలమనునది హేమంత శిశిరాది రూపమగు కాలము. హేమంతము లేదా శిశిరములందు జనించువానికి ఆ కాలము బలమును కలిగించును. "సుఖశ్చ కాలయోగః" అనగా సాధారణ కాలయోగము. శుక్రరూపమగు బీజము మరియు ఆర్తవ గర్భాశయ రూపమగు క్షేత్రము - ఇవి యొక్క ప్రశస్త ధర్మములను కలిగియుండుట బీజక్షేత్ర గుణసంపత్తు అనబడును. ఇచట బీజక్షేత్రములకు

దోషము లేకుండుటయు సంపత్తగును. అందువలన నిర్దోషత్వమును మించి సార త్వము మొదలగు మంచి గుణములు బీజక్షేత్రములకు ప్రాప్తించుటవలెననుట కొరకు గుణమనునది గ్రహింపబడినదని తెలియవలెను. "సత్త్వసంపచ్చ" అనగా సత్త్వ సంపద వలననూ శరీరమునందు బలము కలుగునని తెలియవలెను. "శరీరం హ్యపి సత్త్వమనువిధీయతే" (శారీరస్థానము 4వ అధ్యాయము) అని చెప్పబడియేయున్నది. "స్వభావసంసిద్ధిః" అనగా బలమును కలిగించు పూర్వజన్మ కర్మ సిద్ధించి యుండుట. "కర్మ" అనగా వ్యాయామాది కర్మ అని అర్థము. వ్యాయామాది కర్మలను అభ్య సించుటవలననే బలము కలుగును.

### ఆహార పరిణామకర భావములు

14. ఆహారపరిణామకరాస్త్విమే భావా భవన్తి. తద్యథా—
ఊష్మా, వాయుః, క్లేదః, స్నేహః, కాలః, సమయోగశ్చేతి.

**తాత్పర్యము :** వేడిమి, వాయువు, క్లేదము, స్నేహము, కాలము మరియు సమయోగము అనునవి ఆహార పరిణామకర భావములు.

**ఆయుర్వేదదీపిక :** ప్రశస్త గుణములను పేర్కొను ప్రస్తావనచేత ఆహార పరిణామమునకునూ ప్రశస్త హేతుత్వమును "ఆహార" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. "కాలః" అనగా రాత్రియొక్క అవసానాది రూపమగు పాకకాలము. "సంయోగః" అనగా ప్రకృతి మొదలగు ఎనిమిది ఆహార విధివిశేషా యతనముల సరియగు కలయిక అని అర్థము.

### ఆహార పరిణామకర భావములు పనిచేయు విధము

15. తత్ర తు ఖల్వేషామూష్మాదీనామాహారపరిణామకరాణాం భావానామిమే
కర్మవిశేషా భవన్తి. తద్యథా — ఊష్మా పచతి, వాయురపకర్షతి
క్లేదః శైథిల్యమాపాదయతి, స్నేహో మార్దవం జనయతి, కాలః
పర్యాప్తిమభినిర్వర్తయతి, సమయోగస్త్వేషాం పరిణామధాతుసామ్యకరః
సంపద్యతే.

**తాత్పర్యము :** పై చెప్పిన ఆహార పరిణామకర భావములగు ఊష్మాదు లకు ఇటువంటి కర్మ విశేషములుండును. అవి యేవనగా వేడిమి యనునది ఆహార

మును పచనము చేయును, వాయువు (అగ్ని వద్దకు) ఆహారమును తీసికొనిపోవును. క్లేదము ఆహారమునకు శైథిల్యమును కలిగించును. స్నేహము మృదుత్వమును కలిగించును, కాలము పాక నిష్పత్తిని (మొత్తము పాక క్రియను పూర్తిచేయుటను) కలిగించును. ఆహార విధి విశేషాయతనముల సమయోగము ఆహార పరిణామమును ధాతుసామ్యమును కలిగించును.

**ఆయుర్వేదదీపిక :** ఇచట ఆహార పరిణామకర భావములందు వేడిమియే సాక్షాత్తు పాకమునందు ఉపయోగపడును. వాయువు మొదలైనవి మాత్రము పచనము నొందుచున్నట్టి ఆహారమునకు తమ వ్యాపార విశేషముచే సహాయమును ఇచ్చునని చూపుటకు "తత్ర" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "వాయురపకర్షతి" అనగా ఉష్మస్థానము నుండి దూరముగానున్న అన్నమును ఉష్మము యొక్క సమీపమునకు తెచ్చును. "అన్నమాదానకర్మా తు ప్రాణః కోష్ఠం ప్రకర్షతి" (చికిత్సాస్థానము 15వ అధ్యాయము) అని వాయువుయొక్క కర్మ చెప్పబడియున్నది. "వాయురపకర్షతి" అనునది ఉపలక్షణమగును. అందువలన సమానమను పేరుగల వాయువునకు అగ్నిని ఉత్తేజపరచుట అను కర్మ యుండునని తెలియవలెను. "సమానేనావధూతోఽగ్నిః........పచతి" (చికిత్సా స్థానము 15 అధ్యాయము) అని చెప్పబడియే యున్నది. "పర్యాప్తమ్" అనగా పాక నిష్పత్తిని అని అర్థము. ఉష్మాదుల వ్యాపారమునందునూ కాలవశముననే పాకము జరుగుచున్ననూ, ఉష్మాదుల వ్యాపారముచేత మాత్రమే పాకము జరుగుట లేదని భావము. "సమయోగస్త్వేషాం" అనగా ఈ ఆహార ద్రవ్యములకు ప్రకృత్యాదుల సమయోగమేది కలదో అది ఆహార పరిణామకరముగను ధాతుసామ్యకరముగను ఉండును. ప్రకృతి మొదలైన వాని వలన ఆహారము విరుద్ధముగా నున్నపుడు ప్రకృత్యాదుల దోషముచేతనే సరియైన పరిణామము జరుగదు. ఈ ఉష్మాదుల వ్యాపారములను ప్రతిపాదించునట్టి మరియొక చోట ఈ క్రింది పాఠము చెప్పబడినది — "అన్నమాదానకర్మా తు ప్రాణః కోష్ఠం ప్రకర్షతి, తద్ద్రవైర్భిన్నసంఘాతం స్నేహేన మృదుతాం గతమ్. సమానేనావధూతోఽగ్నిరుదర్యః పవనేన తు,కాలే పక్వం సమం సమ్యక్ పచత్యాయుర్వివృద్ధయే" (చికిత్సాస్థానము - 15వ అధ్యాయము.)

పరిణమించిన ఆహారము యొక్క గుణములు శరీరమును వృద్ధి నొందించుట, అందలి దోషములు శరీరమునకు చెరుపును చేయుట

16. పరిణమతస్త్వాహారస్య గుణాః శరీరగుణభావమాపద్య న్తే యథాస్వమవిరుద్ధాః, విరుద్ధాశ్చ విహన్యుర్విహతాశ్చ విరోధిభిః శరీరమ్.

**తాత్పర్యము :** పరిణామము నొందుచున్న ఆహారము యొక్క గుణములు శరీరగుణములకు విరుద్ధములు కానప్పుడు శరీరగుణముల భావమును పొందును. విరుద్ధములైనపుడు శరీరగుణములను క్షయింపజేయును. విరుద్ధగుణములచే క్షీణింపబడిన శరీరగుణములు శరీరమునకు చెరుపును కలిగించును.

**ఆయుర్వేదదీపిక :** ఇక ఏ విధముగా పరిణామము నొందుచున్న ఆహారము ధాతుసామ్యకరమగునో — "పరిణమతః" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "పరిణమతః" అని వర్తమాన నిర్దేశము చేయుటవలన ఆహారాంశము యే యే విధముగా పరిణామము నొందునో ఆ యా విధముగా శరీర గుణములతో సమాన రూపమును పొందును. అంతేగాని ఆహారమంతయు ఒకేమారు పరిణామము చెందదు అని చూపుచున్నాడు. "యథాస్వమవిరుద్ధాః" అనగా యే ఆహార గుణములు యే శరీరమునందు అవిరుద్ధములుగా నుండునో అవియే ఆ రూపమును పొందును. ఎట్లనగా — ఆహారము యొక్క కఠిన భాగము శరీరమునందలి మాంసము అస్థులు మొదలగు కఠిన భాగములను పోషించునదగును; ద్రవాంశము మాత్రము ద్రవరూపములగు శోణితాది రూపమును పొందునను మొదలగువానిని తెలియవలెను. "విరుద్ధాశ్చవిహన్యుః" అనగా శరీర గుణములకు విరుద్ధములగు ఆహార గుణములు తగ్గింపజేయును (శరీరగుణములను క్షయింపజేయును) అని అర్థము. ఇక ఆహార గుణములచే క్షీణింపబడిన శరీర గుణములేమి చేయునో "విహతా" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. "విహతాస్తు విరోధిభిః శరీరంవిహన్యుః" అని అన్వయించుకొనవలెను. విరోధిభిః అనగా విపరీతములగు ఆహారగుణములచేత, విహతాః అనగా క్షయమును పొందినవై. లేదా విరోధిభిః అనగా ఉదా - దుగ్ధ - మత్స్యాది విరుద్ధాహారములచే క్షీణింపబడిన శరీరగుణములు శరీరమును క్షీణింపజేయును; చకారప్రయోగమువలన విరుద్ధ గుణములచేతను క్షయము పొందినవి శరీరమును నశింపజేయును అని చూపుచున్నాడు.

## శరీర గుణముల స్వరూపము

17. శరీరగుణాః పునర్ద్వివిధాః సంగ్రహేణ—మలభూతాః ప్రసాదభూతాశ్చ. తత్ర మలభూతాస్తే యే శరీరస్యాబాధకరాః స్యుః. తద్యథా—శరీరచ్ఛిద్రేషూపదేహాః పృథగ్జన్మానో బహిర్ముఖాః, పరిపక్వాశ్చ ధాతవః, ప్రకుపితాశ్చ వాతపిత్తశ్లేష్మాణః, యే చాన్యేఽపి కేచిచ్ఛరీరే తిష్ఠన్తో భావాః శరీరస్యోపఘాతాయోపపద్యన్తే,సర్వాంస్తాన్మలే సంచక్ష్మహే; ఇతరాంస్తు ప్రసాదే, గుర్వాదీంశ్చ ద్రవాన్తాన్ గుణభేదేన, రసాదీంశ్చ శుక్రాంతాన్ ద్రవ్యభేదేన.

**తాత్పర్యము :** శరీర ధాతువులు సంగ్రహముగా మలస్వరూపములనియు, ప్రసాద స్వరూపములనియు రెండు విధములు. శరీరమునకు బాధను కలిగించునవి మల స్వరూపములు. అవి యేవనగా- శరీరఛిద్రములందుండునట్టియు, అనేక విధము లైనట్టియు, బయటకు వెడలు స్వభావమును కలిగినట్టి మలములును, పరిపక్వము నొంది మలరూపమును పొందిన ధాతుభాగములును, ప్రకోపించిన వాతపిత్త శ్లేష్మము లును, శరీరము నందుండి శరీరమునకు బాధను కలిగించునట్టి ఇతర భావములన్ని యును మలములుగ నుండును. వీటికి భిన్నమైనవి ప్రసాద స్వరూపములుగ నుండును. గురు మొదలగౌని ద్రవము వరకు గల గుణములు, రసము మొదలుగౌని శుక్రము వరకు గల ద్రవ్యములును ప్రసాద రూపములు.

**ఆయుర్వేదదీపిక :** ఇక ఆ శరీర గుణములు ఎన్ని ప్రకారములో— "శరీర" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "సంగ్రహేణ" అనగా సంక్షేప ముగా; అందువలన విస్తారముగా ధాతు ఉపధాతుభేదము వలన అధికముగనుండును. భూత శబ్దము స్వరూపమునందు ప్రయోగింపబడినది. "అబాధకరాః" అనగా బాధను కలిగించునవి అని అర్థము. "పృథగ్జన్మానః" అనగా గులిమి, చీమిడి మొదలగు భేదము వలన నా నా రూపములు కలిగియున్నవి. "బహిర్ముఖాః" అనుట వలన ఛిద్ర మలములు ఏవి కలవో అవియే ఎక్కువగా నున్నపుడు బయటకు ప్రసరించుచు బాధను కలిగించుట వలన మలములని పేర్కొనబడుచున్నవి. ఏవి స్రోతస్సులకు ఉపలేపమును మాత్రమే కలిగించుచూ గుణమును (మంచిని) చేయునో అవి మలము లని చెప్పబడుట లేదు. "పరిపక్వాశ్చ ధాతవః" అనగా పాకము చెందుట వలన పూయత్వమును పొందిన [illegible] రూపములును మలములని పేర్కొనబడుచున్నవి. లేదా

"అపరిపక్వాః" అనియును పాఠమును చెప్పుకొనినచో అప్పుడు సామ ధాతువులు మలములుగా పిలువబడునని తెలియవలెను. "కుపితాశ్చ" అను పదము వలన క్షీణించినట్టి గానీ, వృద్ధి చెందినట్టిగాని వాతాదులు గ్రహింపబడుచున్నవి. వికృతి చెందుటయే వాతాదులకు కోపము నొందుట యగును. "యే చాన్యేపి" అను మొదలగువాని వలన విమార్గమును (వ్యతిరేక మార్గమును) పొందిన శరీర ధాతువులు మరియు అజీర్ణాదులును గ్రహింపబడుచున్నవి. "మలః" అని ఏకవచనము జాతియందు ప్రయోగింపబడినది. "ఇతరాన్" అనగా వికారమును కల్గించనట్టి సమానముగా నున్నట్టియు పురీషము వాతము మొదలగునవి. పురీషము వాతము మొదలగునవి యును గుణ కర్తృత్వము చేత శరీరమునకు ఆధారము నిచ్చునట్టివై ప్రసాదములే అగుచున్నవి. మలప్రసాద భేదము వలన శరీరగత భావములను చెప్పికొని మరల ద్రవ్య గుణభేదములను "గుర్వాదీంశ్చ" అని చెప్పుచున్నాడు. గురు మొదలు ద్రవము వరకు తరువాత చెప్పబడినవి ఇచటయును ఏ మలములు ఉపధాతువులు చెప్పబడలేదో అవి గుర్వాది గుణాధారత్వము వలన గ్రహింపబడవలయును. లేదా నిరా బాధకములైన ఇతర మలములను ప్రసాదములందు చెప్పుచున్నాడు, మరియు నిర్వికారములగు గుర్వాదులను (రసాదులను) (ద్రవ్య గుణస్వభావములను) కూడ ప్రసాదమునందు చెప్పుచున్నాడు అని వ్యాఖ్యానించుకొనవలెను.

## వాతపిత్త శ్లేష్మములు మలాదులను దూషింపజేయుట

18. తేషాం సర్వేషామేవ వాతపిత్తశ్లేష్మాణో దుష్టా దూషయితారో భవన్తి, దోషస్వభావాత్. వాతాదీనాం పునర్ధాత్వన్తరే కాలాన్తరే ప్రదుష్టానాం వివిధాశితపీతీయేఽధ్యాయే విజ్ఞానాన్యుక్తాని. ఏతావత్త్యేవ దుష్టదోషగతిర్యావత్ సంస్పర్శనాచ్ఛరీరధాతునామ్. ప్రకృతిభూతానాం తు ఖలు వాతాదీనాం ఫలమారోగ్యమ్. తస్మాదేషాం ప్రకృతిభావే ప్రయతితవ్యం బుద్ధిమద్భిరితి.

**తాత్పర్యము :** వాతపిత్త శ్లేష్మములు చెడినవై తమ యందలి దోష స్వభావము వలన రసము పురీషము మొదలగువాటినన్నింటిని దూషింపజేయును. ఆ యా ధాతువుల యందును, కాలాంతరము నందును, వాతపిత్త శ్లేష్మములు ప్రకోపించినపుడు కలుగు లక్షణములు వివిధాశిత పీతీయాధ్యాయమునందు చెప్పబడినవి. దుష్టమైన దోషముల యొక్క గమనము స్పర్శస్థానము కల శరీర ధాతువుల యందే

కలుగును. వాతపిత్త శ్లేష్మములు సమస్థితి యందున్నచో ఆరోగ్యము కలుగును. అందువలన బుద్ధిమంతులు వాతపిత్త శ్లేష్మములు సమానస్థితియందుండునట్లు ప్రయత్నింపవలెను.

ఆయుర్వేదదీపిక : ఇక ఈ పురీషాదులకు దూషణము వలన మలత్వము కలుగును. అందువలన ఆ దూషక హేతువులను "తేషాం" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. "తేషాం" అనగా పురీషాదులకు మరియు రసాదులకును. "దుష్టాః" అనగా స్వహేతువుల వలన వృద్ధి చెందియున్నవి. క్షీణించినవి మాత్రము ఇతరములను దూషింపజేయవని చెప్పబడియేయున్నది. ఇక ధాత్వంతరముల నాశ్రయించి యున్న దుష్టములగు వాతాదుల లక్షణమేమి ? వేనివలన అవి తెలియబడునో "వాతాదీనామ్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "విజ్ఞానాని" అనగా లక్షణములు రసాదులను ఆశ్రయించియున్న దుష్టవాతాదుల లక్షణము అంతయు వివిధాశిత పీతీయాధ్యాయము (సూత్రస్థానము) నందు చెప్పబడినది. "అచట చెప్పబడి నట్టి కేశమూత్రనఖాదులనాశ్రయించియున్న దుష్టదోష లక్షణమును ఎట్లు తెలిసికొనవలెనో-"ఏతావత్యేవ" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. వాతాదులు దుష్టి చెందియున్ననూ అవి కేశాదులయందు తమ గతిని పొందవు అని వాక్యార్థము. "యావత్ సంస్పర్శనాత్" అనగా స్పర్శనేన్ద్రియమును వ్యాపించి. అందువలన శరీర ధాతువులు దూషించుటయందు స్పర్శనేన్ద్రియము వరకే దుష్టదోషగతి కలుగును; అందువలన కేశాదులయందు దుష్టదోషముల గతి యుండదు. పలితాది కేశమునందు, చెడిన నఖమునందుగల దుష్టిస్పర్శ శరీరమునందున్న దోషము వలననే కలిగినది. అంతేగాని చెడిన నఖమునందు, కేశమునందునూ స్వమార్గమున వెళ్ళుచున్న దోషము ప్రసరింపదు" అని కొందరందురు. మేమిట్లు చెప్పుదుము—వివిధాశిత పీతీయాధ్యాయమునందు చెప్పబడిన దుష్టి వలన సర్వదుష్టి సంగ్రహముగా కలుగునని చూపుటకు "ఏతావత్యేవ" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "యావత్ సంస్పర్శనాత్" అనగా స్పర్శసంబంధము వలన, శరీర ధాతువులకు స్పర్శయున్నంతవరకు దోషములయొక్క గతి యుండును. అది అంతయు వివిధాశిత పీతీయాధ్యాయమునందు చెప్పబడియేయున్నది. దేహమునకు అంతకంటె ఎక్కువ దోషము లేదు. అచటనే—"మలానాశ్రిత్య దుష్టాస్తు భేదశోషప్రదూషణమ్" (సూత్రస్థానము 28వ అధ్యాయము) అని చెప్పబడిన గ్రంథము వలన మలములన్నింటినీ గ్రహింపబడవలెను మలములుచేయుగు కేశనఖములు గ్రహింపబడియేయున్నవి. ఇందు

వలన నఖాగ్రములు కేశాగ్రములు చిట్లిపోవుట మొదలగునవి స్మృతనఖాగ్రములు కేశాగ్రములయందున్న దోషముల వలననే కలుగును. ఇక దుష్టములైన వాతాదులు దుష్టిని కల్గించును, ప్రకృతిస్థములైనవి మాత్రము ఏమి చేయునో ఆ విషయమును "ప్రకృతిభూతానామ్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు.

## శారీరజ్ఞానము వలన కలుగు ఫలము

భవతి చాత్ర—

19. శరీరం సర్వథా సర్వం సర్వదా వేద యో భిషక్,
ఆయుర్వేదం స కార్త్స్న్యేన వేద లోకసుఖప్రదమ్.

**తాత్పర్యము :** ఏ వైద్యుడు సంపూర్ణ శరీరమును అన్ని విధములుగను ఎల్లవేళలయందునూ తెలిసికొని యుండునో, అతడు లోకమునకు సుఖప్రదమగు ఆయుర్వేదము సంపూర్ణముగా తెలిసికొనియుండును.

**ఆయుర్వేదదీపిక :** ప్రస్తుతము చెప్పబడిన ప్రకరణము వలన కలిగిన శరీర జ్ఞానము యొక్క ఫలమును-"శరీరమ్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు.

## గర్భ విషయమున అగ్నివేశుని ప్రశ్నలు

20. ఏవంవాదినం భగవన్తమాత్రేయమగ్నివేశ ఉవాచ—శ్రుతమేతద్యదుక్తం భగవతా శరీరాధికారే వచః. కిన్ను ఖలు గర్భస్యాఙ్గం పూర్వమభినిర్వర్తతే కుక్షౌ,కుతో ముఖః కథం చాన్తర్గతస్తిష్ఠతి,కిమాహారశ్చ వర్తయతి, కథంభూతశ్చ నిష్క్రామతి, కైశ్చాయమాహారోపహారైర్జాతః సద్యో హన్యతే, కైరవ్యాధిరభివర్ధతే,కిం చాస్య దేవాదిప్రకోపనిమిత్తా వికారాః సంభవన్తి ఆహోస్విన్న,కించాస్య కాలాకాలమృత్యోర్భావాభావయోర్భగ-వానధ్యవస్యతి, కించాస్య పరమాయుః,కాని చాస్య పరమాయుషో నిమిత్తానీతి.

**తాత్పర్యము :** ఈ విధముగా చెప్పుచున్న ఆత్రేయ భగవానుని అగ్నివేశుడు, శరీరమును గురించిన మీరు చెప్పినదంతయు వింటిమి. ఓ భగవానుడా ! కుక్షియందు గర్భమునకు తొలుత యే అవయవమేర్పడును ? గర్భము ఏ వైపునకు ముఖముంచుకొని యెట్లు లోపల ఉండును ? ఎట్టి ఆహారముచే జీవించి ఎట్లు బయలు

వెడలును ? జనించిన శిశువు ఎట్టి ఆహారోపహారములచేత వెంటనే మృతి చెందును ? జనించిన పిదప పేనివలన వ్యాధి లేనిదై వృద్ధి నొందును ? దేవతలు మున్నగువారి కోపము వలన కలుగు వ్యాధులు శిశువునకు సంభవించునా, సంభవింపవా ? కాలాకాల మృత్యువుల యొక్క భావాభావములను మీరు దీనికి ఎట్లు నిర్ణయించెదరు ? దీనికి పరమాయుష్యమేది ? అట్టి పరమాయుష్యమునకు కారణములేవి ? అని అడిగెను.

ఆయుర్వేదదీపిక : శరీర విచయకమగు ప్రకరణమును సమాప్తి జేసి గర్భ శరీర విషయకమగు ప్రకరణము, "ఏవంవాదినమ్" అను మొదలగువాని ద్వారా ఆరంభించుచున్నాడు. "కుక్షౌ" అనువరకును ఒక ప్రశ్న. "కుతోముఖః కథం చాంతర్గత స్తిష్ఠతి" అనునది రెండవ ప్రశ్న. "నిష్క్రామతి" అనువరకు మూడవ ప్రశ్న. "కైశ్చాయమాహారోపహారై ర్జాతః సద్యో హన్యతే" అని నాల్గవది. "కై రవ్యాధిరభివర్ధతే" అని ఐదవది. "అహోస్విన్న" అనువరకు గలది ఆరవ ప్రశ్న. మిగిలిన మూడు ప్రశ్నలును ఇంతకుముందటి రెండు ప్రశ్నలకును వ్యవచ్ఛేదకములే (అంతర్భాగములే) ఇట్లు తొమ్మిది ప్రశ్నలు (అడుగబడినవి). "అధ్యవస్యతి" అనగా నిశ్చయించుచున్నాడు.

## ఆత్రేయుని సమాధానము

21. తమేవముక్తవ న్తమగ్నివేశం భగవాన్ పునర్వసురాత్రేయ ఉవాచపూర్వముక్త-మేతద్గర్భావక్రాన్తే యథాఽయమభినిర్వర్తతే కుక్షౌ,యచ్చాస్య యదా స న్నిష్ఠ-తేఽఙ్గజాతమ్.విప్రతివాదా స్త్వత్ర బహువిధాః సూత్రకృతామృషీణాం స న్తి సర్వేషాం;తానపి నిబోధోచ్యమానాన్-శిరః పూర్వమభినిర్వర్తతే కుక్షావితి కుమారశిరా భరద్వాజః పశ్యతి,సర్వేన్ద్రియాణాం తదధిష్ఠానమితికృత్వా:-హృదయమితి కాఙ్కాయనో బాహ్లీకభిషక్, చేతనాధిష్ఠానత్వాత్,నాభిరితి భద్రకాప్యః,ఆహారాగమ ఇతి కృత్వా:పక్వాశయగుదమితి భద్రశౌనకః,మారుతాధిష్ఠానత్వాద్:హ స్తపాదమితి బడిశః,తత్కరణత్వాత్ పురుషస్య: ఇన్ద్రియాణీతి జనకో వై దేహః,తాన్యస్య బుద్ధ్యధిష్ఠానానీతి కృత్వా:పరోక్షత్వాద-చిన్త్యమితి మారీచిః కశ్యపః;సర్వాఙ్గాభినిర్వృత్తిర్యుగపదితి ధన్వన్తరిః,-తదుపపన్నం,సర్వాఙ్గానాం తుల్యకాలాభినిర్వృత్తత్వాద్ధృదయప్రభృతీనామ్.-

సర్వాఙ్గానాం హ్యస్య హృదయం మూలమధిష్ఠానం చ కేషాఞ్చిద్భావానాం,న చ తస్మాత్ పూర్వాభినిర్వృత్తిరేషాం; తస్మాద్హృదయప్రభృతీనామపి సర్వాఙ్గానాం తుల్యకాలాభినిర్వృత్తిః,సర్వే భావా హ్యన్యోఽన్యప్రతిబద్ధాః;తస్మాద్యథా-భూతదర్శనం సాధు.

తాత్పర్యము : ఇట్లు అడుగుచున్న అగ్నివేశునికి పునర్వసు ఆత్రేయ భగవానుడు ఈ క్రింది విధముగా సమాధానమిచ్చెను. కుక్షియందు గర్భమేర్పడు విధము, అంగప్రత్యంగములు ఎప్పుడు కలుగునదియు గర్భావక్రాన్తి శరీరము నందు ఇదివరలో చెప్పబడినది. అంగ ప్రత్యంగములు ఏర్పడు విషయమై సూత్ర కారులైన ఋషీశ్వరులయొక్క అనేక విధములైన విరుద్ధవాదములు కలవు. వాని నన్నింటిని చెప్పెదను వినుము. సమస్తేన్ద్రియములకును శిరస్సు అధిష్ఠానముగ నుండును గావున కుక్షియందు గర్భమునకు తొలుత శిరస్సు ఏర్పడునని కుమార శిరుడను భరద్వాజుడు చెప్పెను. చేతనా ధాతువునకు అధిష్ఠానముగావున తొలుత హృదయము ఏర్పడునని బాహ్లీక దేశస్థుడగు కాంకాయనుడు చెప్పెను. (తల్లినుండి) ఆహారము వచ్చుటకు స్థానముగావున తొలుత నాభి ఏర్పడునని భద్రకాప్యుడు చెప్పెను. వాతమునకు స్థానములగుట వలన తొలుత పక్వాశయము మరియు గుదము ఏర్పడునని భద్రశౌనకుడు చెప్పెను. పురుషునకు ముఖ్య సాధనములగుటచే తొలుత హస్తపాదము లేర్పడునని బడిశుడు చెప్పెను. బుద్ధికి అధిష్ఠానములు గావున తొలుత ఇంద్రియములు ఏర్పడునని విదేహరాజగు జనకుడు చెప్పెను. ఇదియంతయు పరోక్ష ముగా నుండుటవలన ఊహింపశక్యముగాదని మరీచికశ్యపుడను మహర్షి చెప్పెను. అంగప్రత్యంగములన్నియు ఒకేమారు ఏర్పడునని ధన్వంతరి చెప్పెను. ఈ అభి ప్రాయము సిద్ధమైనదగుట వలన సరిగానున్నది. హృదయము సమస్తములైన అంగ ప్రత్యంగములకును ఓజస్సు మొదలగు భావములకును మూలముగను అధిష్ఠానము గను ఉండును గావున తొలుత అంగ ప్రత్యంగములు ఏర్పడనేరవు. హృదయము మొదలగు సమస్తావయవములును ఏకకాలమునందే ఏర్పడును. శరీరమందలి సమస్త భావములును ఒకదానితో నింకొకటి సంబంధమును కలిగియుండును. కావున మేము చెప్పినది (సర్వాంగ ప్రత్యంగములు ఒకేమారు ఏర్పడుననునది) సరిగానుండును.

ఆయుర్వేదదీపిక : (అగ్నివేశుని ప్రశ్నలకు) యథాక్రమముగా "పూర్వమ్" అను మొదలగువానిద్వారా సమాధానములను చెప్పుచున్నాడు. "పూర్వ ముక్తమ్" అనగా ఏ అంగములు ఎపుడు ఏర్పడును అనుదానికి ఇచట గర్భావ

క్రాంతి శారీరమునందు (4వ అధ్యాయమునందు) "ఏవమస్య యుగపదింద్రియాణ్య-ఙ్గావయవాశ్చ యౌగపద్యేనాభినిర్వర్తన్తేఽన్యత్ర తేభ్యో భావేభ్యో యేఽస్య జాతస్యోత్తరకాలం జాయన్తే" అను మొదలగు సూత్రములద్వారా సమాధానము చెప్పబడినది. "గర్భమెట్లు కుక్షియందేర్పడును" అను ప్రశ్న ఇచట అడుగబడక పోయినప్పటికీ గర్భముయొక్క అభినిర్వృత్తి క్రమమును చూపుటవలన "కిన్ను ఖలు గర్భస్యాఙ్గం పూర్వమభినిర్వర్తతే" అను ప్రశ్నకు పై చెప్పబడిన ఉత్పత్తి క్రమమును చూపుటచేత గర్భావక్రాంతి శారీరమున చెప్పిన పై సూత్రమునందు సమాధానముండునని భావించి "ఉక్తమేతద్గర్భావక్రాన్తౌ యథాయమభినిర్వర్తతే కుక్షౌ" అని చెప్పబడినది. ఒకేమారుగా అంగములన్నియు కలుగునని చెప్పబడినప్పటికీ మతాంతరములను ఎత్తిచూపుటవలన స్థిరీకరించుటకుగాను - "విప్రతివాదాస్త్వత్ర" అను మొదలగునవి చెప్పుచున్నాడు. పక్వాశయము మరియు గుదమునూ - అని "పక్వాశయగుదం" అనుదానికి అర్థము. లేదా, పక్వాశయమునకు సమీపముననున్న గుదము పక్వాశయగుదమనబడును. అనగా ఉత్తరగుదము (గుదమునందలి పైభాగము) అని అర్థము. "ఇంద్రియాణి" అనగా ఇంద్రియాధిష్ఠానములైన కనుగ్రుడ్డు మొదలైనవి. "తదుపపన్నమ్" అనగా ధన్వంతరియొక్క వాక్యము సిద్ధించియున్నది అని అర్థము. ఇచట "సర్వాఙ్గానామ్" అని మొదలుకొని "హృదయప్రభృతీనామ్" అను వరకును కారణమును చెప్పుచున్నాడు. ఇచట ప్రతిజ్ఞ మరియు హేతువు రెండునూ ఒక్కటిగానే యున్నవని అనుమానింపరాదు. "ధన్వన్తరి వచనముపపన్నమ్" అనునది ప్రతిజ్ఞ. అది చెప్పబడిన ఏకకాలమునందే అంగములు అభినిర్వృత్తియగుట యనుట ద్వారా సిద్ధించుటచేత అని హేతువిషయము. ఇట్టిది ప్రతిజ్ఞా విషయముకంటె వేరుగనేయున్నది. ఎవరు "తుల్యకాలాభివృద్ధత్వాత్" అని పఠింతురో వారికి హేత్వర్థము స్పష్టముగనే తెలియును. ఎందువలననగా ఉత్తరకాలమునందును సర్వాంగములకు ఒకేమారుగా వృద్ధి (అన్ని అంగములు కలసి కాలమునను సరించి తోడుగా వృద్ధి చెందుట) కలుగుచున్నందున; సమానకాలమునందు వృద్ధిచెందుచున్న ఫలములన్నియు ఒక్కకాలమునందే పుట్టినవని అనుమానించబడును. అసమాన కాలమునందు జన్మించినవాటికి సమానకాలమునందు వృద్ధి కలుగదు. పూర్వ ఋషులయొక్క మతములను హృదయము ముందుగా యేర్పడుటను పోషించుటవలననే సమాన న్యాయముచేత దూషించుచు "సర్వాంగానాం హ్యస్య" అని చెప్పుచున్నాడు. మూలమువంటిదగుటచే మూలమనబడును, అది నశించుటవలన

శరీరమంతయు నశించుటచే (మూలమని చెప్పబడినది) అధిష్ఠానమునగా ఆశ్రయము అచట ఓజస్సు మొదలగువానికి హృదయము ఆశ్రయమగును అందువలననూ అది (హృదయము) మొదటగా ఏర్పడదు. మరియు అట్లు మూలమగుటచేతనూ, ఆశ్రయ మగుటచేతనూ మొదటగా ఏర్పడదు. ఒకవేళ మూలమను శబ్దమునకు కారణము అని అర్థము ఉన్న యెడల కార్యరూపములగు అంగములకును హృదయము ముందుగా యేర్పడవలెను. ఇచట హృదయము మిగిలిన అంగములకు కారణముకాదు. కాని అది ప్రధానమైయున్నది. అది నశించుటచే శరీరమంతయు నశించుటచేత ప్రాధాన్యము కూడ చెప్పబడియున్నది. ఆశ్రయాశ్రయిభావము కూడ నేదికలదో అదియును ఒక్క సారిగనే ఉత్పన్నమగుటచేతనే హృదయము ఆశ్రితములగు ఓజస్సు మొదలగువానికి ఆశ్రయముగా నుండునని భావము. అది ఇట్లైనచో ప్రధానమగు హృదయమునకు గూడ మొదట ఉత్పత్తియగుట యనునదిలేదు. అపుడు శిరస్సు మొదలు వానికిగూడ మొదట ఉత్పత్తియగుట లేనేలేదని చెప్పి ఉపసంహరించుచు "తస్మాత్" అను మొదలగునవి చెప్పుచున్నాడు. ఒకేసారిగా అభినిర్వృత్తి యగుటయందు మరియొక కారణమును — "సర్వభావా హి" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "భావాః" అనగా శరీరభావములు. "అన్యోన్యప్రతిబద్ధాః" అనగా ఏమిచేత శరీర భావములు సిరాస్నాయువులు మొదలగువానిచే పరస్పరము కట్టబడి యుండునో, అందు వలన సమానముగా కట్టబడి యుండుటవలన ఒక్కసారిగనే (సర్వాంగ ప్రత్యంగ ములు) కలుగుచున్నవి. "యథాభూతదర్శనమ్" అనగా అదియును ధన్వంతరి యొక్క అభిప్రాయమే.

## గర్భము ఏ వైపునకు ముఖము నుంచుకొని యెట్లు లోపలనుండును అను ప్రశ్నకు సమాధానము

22. గర్భస్తు ఖలు మాతుః పృష్ఠాభిముఖ ఊర్ధ్వశిరాః సంకుచ్యాఙ్గాన్యాస్తేఽన్తః కుక్షౌ.

**తాత్పర్యము** : కుక్షియందు గర్భము తల్లి యొక్క వెనుకవైపునకు (పృష్ఠము వైపునకు) ముఖమునుంచుకొని శిరస్సు ఊర్ధ్వభాగమున నుంచి ముడుచు కొనియున్న శరీరావయవములు కలదిగను, మావిచే ఆవరింపబడినదిగను ఉండును.

**ఆయుర్వేదదీపిక** : "గర్భస్తు" అను మొదలగు వానిద్వారా రెండవ ప్రశ్నకు సమాధానము నిచ్చుచున్నాడు.

## గర్భమునకు తల్లిద్వారా పోషణ లభించు విధము

23. వ్యపగతపిపాసాబుభుక్షస్తు ఖలు గర్భః పరతంత్రవృత్తిర్మాతరమాశ్రిత్య వర్తయత్యుపస్నేహోపస్వేదాభ్యాం గర్భాశయే సదసద్భూతాఙ్గావయవః, తదనన్తరం హ్యస్య కశ్చిల్లోమకూపాయనైరుపస్నేహః కశ్చిన్నాభినాడ్యయనైః. నాభ్యాం హ్యస్య నాడీ ప్రసక్తా,నాడ్యాం చాపరా,అపరా చాస్య మాతుః ప్రసక్తా హృదయే,మాతృహృదయం హ్యస్య తామపరామభిసంప్లవతే సిరాభిః స్యన్దమానాభిః; స తస్య రసో బలవర్ణకరః సంపద్యతే,స చ సర్వరసవానాహారః. స్త్రియా హ్యాపన్నగర్భాయాస్త్రిధా రసః ప్రతిపద్యతే— శరీరపుష్టయే, స్తన్యాయ,గర్భవృద్ధయే చ.స తేనాహారేణోపష్టబ్ధః (పరతన్త్రి వృత్తిర్మాతరమాశ్రిత్య) వర్తయత్యన్తర్గతః.

**తాత్పర్యము :** గర్భము దప్పికయు, ఆకలియు లేనిదై, పరతంత్ర వృత్తి కలదియై ఉండును. వ్యక్తా వ్యక్తములైన అంగ ప్రత్యంగములు గల గర్భము తల్లి వలన కలుగు ఉపస్నేహ, ఉపస్వేదముల వలన పోషింపబడును. అంగ ప్రత్యంగ ములు వ్యక్తములైన పిదప ఈ గర్భమునకు ఉపస్నేహము, రోమకూప మార్గముల నుండి కొంతయు, నాభియందలి నాడీ మార్గముల నుండి కొంతయు సంక్రమించును. గర్భముయొక్క నాభియందు నాడి కూర్చబడియుండును. ఆనాడియందు మావి కూర్చ బడియుండును. ఆ మావి తల్లియొక్క హృదయముతో సంబంధమును కల్గి యుండును. ఆ హృదయము రసాదులను స్రవించుచున్న నాడులద్వారా మావితో సంబంధమును కలిగించును. అట్లు స్రవించు రసము గర్భమునకు సమస్త విధములైన బలమును వర్ణమును కల్గించును. గర్భమును పొందియున్న స్త్రీయొక్క సమస్త రసములతో కూడిన ఆహారసంబంధమైన రసము మూడు విధములుగా ఉపయోగిం చును. ఎట్లనగా — తల్లియొక్క శరీరపోషణ కొరకును స్తన్యము కొరకును, గర్భముయొక్క వృద్ధికొరకును ఉపయోగించును. లోనయున్న గర్భము అట్టి ఆహా రముచే పోషింపబడుచు పరతంత్ర వృత్తికలదై తల్లిని ఆశ్రయించును.

**ఆయుర్వేదదీపిక :** "కిమాహారశ్చ వర్తయతి" అను ప్రశ్నకు సమా ధానమును "వ్యపగత" అను మొదలగువానిద్వారా ఇచ్చుచున్నాడు. "పరతంత్ర వృత్తిః" అనగా తల్లిపై ఆధారపడియుండు ప్రవృత్తి. ఇదే విషయమును "మాత రమ్" అను మొదలగువానిద్వారా వివరించుచున్నాడు. ఉపస్నేహమనగా నిస్యందము

(కొద్దిగా బిడ్డుతనము). "సదసద్భూతాఙ్గావయవః" అనునది భేదము. "తదనన్తరమ్" అనగా అంగ ప్రత్యంగముల వ్యక్తీభావమున్నపుడు నాభిలో పూర్వబడియున్న నాడిని నాభినాడి అందురు. "అయనైః" అనగా మార్గములచేత. అపరా అనగా గర్భము యొక్క నాభినాడికి బంధింపబడియున్నది, ఇది "అమరా" అని లోకమునందు ప్రసిద్ధమై యున్నది. అభిసంప్లవతే అనగా వ్యాపించును. ఈ అపరా మొదలగునవి కలుగుట గర్భము యొక్క నాళ్ణజన్మకర్మ వశముచేత కలుగును.

## గర్భము బయల్పడు విధము

**24.** న చోపస్థితకాలే జన్మని ప్రసూతిమారుతయోగాత్ పరివృత్యావాక్శిరా నిష్క్రామత్యపత్యపథేన.ఏషా ప్రకృతిః, వికృతిః పునరతోఽన్యథా.పరం త్వతః స్వతన్త్రవృత్తిర్భవతి.

**తాత్పర్యము :** ఆ గర్భము ప్రసవకాలము సమీపించినపుడు ప్రసూతిని కలుగజేయు వాతము (అపానవాతము) యొక్క సంబంధము చేత శిరస్సు క్రింది వైపునకు త్రిప్పబడినదై అపత్య మార్గము ద్వారా బయలు వెడలును. ఇట్లు జరుగుట ప్రకృతి. దీనికి వ్యతిరేకముగ జరుగుట వికృతియనబడును. అటుపైన గర్భమునకు స్వతంత్ర ప్రవృత్తి కలుగును.

**ఆయుర్వేదదీపిక :** "న చోపస్థితకాలే" అను మొదలగునవి "కథం-భూతః స నిష్క్రామతి" అను ప్రశ్నకు సమాధానము. "ఉపస్థితకాలే" అనగా ప్రత్యాసన్న కాలమునందు. "వికృతిఃపునరతోఽన్యథా" అనుట వలన వికృత కృత్యము వలననూ గర్భము బయటకు వెడలునని చూపుచున్నాడు. "స్వతన్త్ర-వృత్తిర్భవతి" అనగా స్తన్యపానము మొదలగు స్వయముగా చేయు క్రియల వలన వృద్ధి పొందును గాని గర్భమునందున్నపుడువలె తల్లి యొక్క ఆహారము వలననే వృద్ధి చెందుట జరుగదు అని అర్థము.

## జనించిన పిదప గర్భము ఏ ఆహార ఉపచారములచే నశించును ఏ ఆహార వికారములచే రోగములు లేక వృద్ధినొందునను ప్రశ్నలకు సమాధానము

**25.** తస్యాహారోపచారౌ జాతిసూత్రీయోపదిష్టావవికారకరౌ చాభివృద్ధికరౌ భవతః.

26. తాభ్యామేవ చ విషమసేవితాభ్యాం జాతః సద్య ఉపహన్యతే
తరురివాచిరవ్యపరోపితో వాతాతపాభ్యామప్రతిష్ఠితమూలః.

**తాత్పర్యము :** జాతి సూత్రీయ శారీరమునందు (ఎనిమిదవ అధ్యాయము) చెప్పబడనున్న ఆహార ఉపచారములు రెండును రోగములను కలుగనీయవియు వృద్ధిని కలుగజేయనివియు అయియున్నవి. కొద్దికాలము క్రితమే పెట్టబడినట్టియు, సరిగా వ్యాపించని వేళ్ళు కలిగినట్టియునగు వృక్షము గాలి, ఎండల వలన నశించు నట్లుగా విషమముగా సేవింపబడిన ఆహార ఉపచారములచే శిశువు పుట్టిన వెంటనే నశించును.

ఆయుర్వేదదీపిక : "క్లైశ్యాయమ్" అను ప్రశ్నకు సమాధానము— "తస్య" అను మొదలగునవి. "జాతిసూత్రీయోపదిష్టౌ" అనగా రానున్న దానిని చూచుట వలన (అనాగతా వేక్షణము వలన) రాబోవు దానియందు జరిగిన దానివలె ప్రయోగించుటగా తెలియవలెను. "అచిరవ్యపరోపితః" అనగా కొద్ది కాలము క్రితమే నాటబడినది అని అర్థము. (జాతి సూత్రీయ శారీరము నుందు రాబోవు 8వ అధ్యాయము)

## దేవతలు మొదలగువానివలన కలుగు వికారములు
## దీనికి కలుగునా లేదా అను ప్రశ్నకు సమాధానము

27. ఆప్తోపదేశాదద్భుతరూపదర్శనాత్ సముత్థానలిఙ్గచికిత్సిత విశేషాచ్చాదోష-
ప్రకోపానురూపా దేవాదిప్రకోపనిమిత్తా వికారాః సముపలభ్యన్తే.

**తాత్పర్యము :** ఆప్తుల యొక్క ఉపదేశము చేత, అద్భుతమైన రూపములను (శిశువునందు?) చూచుట చేత, కారణములు లక్షణములు చికిత్సలు విశేషముగా నుండుట చేతనూ, దోషము ప్రకోపమునకు సంబంధము లేనట్టి లక్షణములు కలిగి యుండుట చేతనూ దేవాదుల ప్రకోపము చేత కలుగు వ్యాధులు శిశువునకు కల్గుచున్నవి.

ఆయుర్వేదదీపిక : "ఆప్తోపదేశాత్" అను మొదలగునవి "కించాస్య" అను మొదలగు ప్రశ్నకు సమాధానము. ఇచట ఆప్తోపదేశమనగా బ్రహ్మాదులచే ప్రణీతమైన కుమార తంత్రమును గూర్చిన ఉపదేశము. అచటనే శిశువులకు (కుమారులకు) దేవాదుల వలన కలుగు వ్యాధులు ప్రతిపాదింపబడుచున్నవి. "దేవాది"

అని గ్రహించుటచే దేవతలు వారి అనుచరులు కూడ గ్రహింపబడుచున్నారు. సుశ్రుతు నిచే స్కందగ్రహము మొదలగునవి ఎనిమిది గ్రహములు చెప్పబడినవి.

> దేవాస్తథా శత్రుగణాశ్చ తేషాం గన్ధర్వయక్షాః పితరో భుజఙ్గాః, తథైవ రక్షాంసి పిశాచజాతిరేషోఽష్టకో దేవగణో గ్రహాఖ్యః"–(సుశ్రుత-ఉత్తర-తంత్రము - 60వ అధ్యాయము).

"అద్భుత" అను మొదలగువాని ద్వారా ఇచట అనుమానమును గూడ చెప్పుచున్నాడు. ఏది జరుగకూడదనిదో అది అద్భుతము అనగా ఆశ్చర్యము అని అర్థము. అదియును అమానుషమగు బలము, జ్ఞానము, శోభ మొదలగునవి అని తెలియవలెను. ఇదియే దోషము వలన కలుగకుండుటచేత దేవాదుల కారణము చేతనే అనుటకు దారి తీయుచున్నది. ఆగన్తుకములగు వ్యాధులయందు ఆగంతుకము లగు సముత్థానాది విశేషములు స్పష్టముగనే యుండును. "అదోషప్రకోపానురూపాః" అనగా దోషప్రకోపముల వలన కలుగు రోగములకు వ్యతిరేక ధర్మములు కలిగి యున్నట్టివి అని అర్థము.

## కాలాకాల మృత్యు సంబంధమగు వివరము

28. కాలాకాలమృత్యోస్తు ఖలు భావాభావయోరిదమధ్యవసితం నః—"యః కశ్చిన్ మ్రియతే స కాల ఏవ మ్రియతే,న హి కాలచ్ఛిద్రమస్తి" ఇత్యేకే భాషన్తే.తచ్చాసమ్యక్. న హ్యచ్ఛిద్రతా సచ్ఛిద్రతా వా కాలస్యోపపద్యతే, కాల స్వలక్షణ స్వభావాత్. తత్రాహురపరే—యో యదా మ్రియతే స తస్య నియతో మృత్యుకాలః; స సర్వభూతానాం సత్యః, సమక్రియత్వాదితి.ఏత-దపి చాన్యథాఽర్థగ్రహణమ్. న హి కశ్చిన్న మ్రియత ఇతి సమక్రియః.కాలో హ్యాయుషః ప్రమాణమధికృత్యోచ్యతే. యస్యచేష్టం యో యదా మ్రియతే స తస్య మృత్యుకాల ఇతి,తస్య సర్వే భావా యథాస్వం నియతకాలా భవి-ష్యన్తి. తచ్చ నోపపద్యతే,ప్రత్యక్షం హ్యకాలాహారవచనకర్మణాం ఫలమ-నిష్టం, విపర్యయే చేష్టం, ప్రత్యక్షతశ్చోపలభ్యతే ఖలు కాలాకాలవ్యక్తిస్తాసు తాస్వవస్థాసు తం తమర్థమభిసమీక్ష్య, తద్యథా-కాలోఽయమస్య వ్యాధేరాహార-స్యౌషధస్య ప్రతికర్మణో విసర్గస్య అకాలో వేతి.లోకేఽప్యేతద్భవతి— కాలే దేవో వర్షత్యకాలే దేవో వర్షతి, కాలే శీతమకాలే శీతం, కాలే తపత్య-కాలేతపతి, కాలే పుష్పఫలమకాలే చ పుష్పఫలమితి. తస్మాదుభయమస్తి—

కాలే మృత్యురకాలే చ: నైకాన్తికమత్ర. యదిహ్యకాలే మృత్యుర్న స్యాన్ని-
యతకాలప్రమాణమాయుః సర్వం స్యాత్; ఏవం గతే హితాహితజ్ఞానమ
కారణం స్యాత్, ప్రత్యక్షానుమానోపదేశాశ్చాప్రమాణాని స్యుర్యే ప్రమాణ-
భూతాః సర్వత న్త్రేషు,యైరాయుష్యాణ్యనాయుష్యాణి చోపలభ్య న్తే.
వాగ్వస్తుమాత్రమేతద్వాదమృషయో మన్య న్తే-నాకాలే మృత్యురస్తీతి.

**తాత్పర్యము :** కాలమృత్యువు, అకాల మృత్యువు కలవా లేవా అను విషయమున మన అభిప్రాయము ఇట్లున్నది — కొందరు - "లోకమున నెవడు మరణించిననూ కాలమునసే మృతి నొందును. కాలమునకు ఛిద్రము (విరామము) ఉండదు" అని యందురు. అట్లు చెప్పుట సరికాదు. కాలలక్షణ స్వభావమును బట్టి కాలమునకు ఛిద్రముండుట ఛిద్రము లేకుండుట గానీ కలుగనేరదు. కొందరు — ఎవడు ఏ కాలమున మరణించునో అదివానికి నియతమగు మృత్యుకాలముగ నుండును. కాలము సమస్త భూతములయెడలను సమక్రియలు కలిగి యుండుట వలన సత్యమై నదిగ నుండును" అని చెప్పుదురు. ఇదియును విషయమును వ్యతిరేకముగా గ్రహించుట యగును. ప్రతి జీవియు మరణించు విషయమై కాలము సమ క్రియలు కలదిగ నుండును. ఆయుష్ప్రమాణము ననుసరించి కాలము చెప్పబడును. "ఎవడు ఏ కాలము నందు మరణించునో, వానికి అది నియతమైన మృత్యుకాలముగ" నుండునని ఎవరు చెప్పుదురో వారి అభిప్రాయమునందు ఆహారాది సమస్తభావములుకూడ నియతమైన కాలమును కలిగియుండును. కావున అట్లు చెప్పుట సరికాదు. అకాలమునందు చేయబడిన ఆహార సేవనము, సంభాషణము, కృత్యము దీనియొక్క ఫలము అనిష్టముగ నుండుటయు, సకాలమునందు సేయబడిన వానియొక్క ఫలము హితకరముగ నుండుటయు ప్రత్యక్షముగ చూచుచున్నాము. ఆ యా అవస్థలయందు ఆ యా ప్రయోజనములను బట్టి కాలాకాల సంబంధమగు యుక్తి ప్రత్యక్షముగ కన్పడుచున్నది. ఎటుల ననగా - వ్యాధి, ఆహారము, ఔషధము, చికిత్స, వ్యాధి నివారణము వీనికి కాలాకాలములు కనబడుచున్నవి. లోకమునందుకూడ ఈ విషయము సంభవించుచున్నది. ఎటులననగా — వరుణదేవుడు సకాలమునందు వర్షించుచున్నాడు — అకాలమునందు వర్షించుచున్నాడు, సకాలమునందును అకాలమునందును చలి కలుగుచున్నది; కాలమునందును అకాలమునందును ఎండవలన తాపము కలుగుచున్నది; కాలమునందును అకాలమునందును పుష్పములు ఫలములు కలుగుచున్నవి అని జరుగుట చూచుచున్నాము. అందువలన కాలమునందును అకాలమునందు గూఢ

మృత్యువు కలుగును. అందువలన ఏకాంతవాద ముచ్చటలేదు. ఒకవేళ అకాల మృత్యువు లేనపుడు ఆయువు అందరికిని నియత కాల ప్రమాణముగా నుండును. ఇట్టి పరిస్థితియందు హితాహిత జ్ఞానమునకు కారణము ఉండదు.(వాటినిగూర్చి తెలిసికొనవలసిన అవసరము ఉండదు). మరియు సర్వ శాస్త్రములయందు ప్రమాణములుగా అంగీకరింపబడినట్టి ఆయుష్యము ఆనాయు ష్యములను గూర్చి చెప్పునట్టి ప్రత్యక్షము - అనుమానము-ఉపదేశము (ఆప్తోప దేశము) అను ప్రమాణములు అప్రమాణములుగ నుండవలసి వచ్చును. పై చెప్పిన అకాల మృత్యువు లేదనెడి వాదము కేవలము వాగ్వస్తువు మాత్రమే (అందు నిజములేదు) అని ఋషులు భావింతురు.

ఆయుర్వేదదీపిక : "కాలాకాల" అని మొదలగు వానియందు "ఇదమధ్యవసితమ్" అనుటవలన ప్రకరణమున స్థాపించవలసిన "తస్మాదుభయ మస్తి కాలే మృత్యురకాలే చ" అను గ్రంథము (వాక్యము) నందు చెప్పబోవు ఈ విషయమును తెలుపుచున్నాడు. "యః కశ్చిత్" అను మొదలగువానిద్వారా ఏకీయ (ఒక) మతమును చెప్పుచున్నాడు. "న హి కాలచ్ఛిద్రమస్తి" అనగా కాలము లేకుండ ఏ అవకాశమును లేదు (కాలమునకు విరామము లేదు) ఏ కాలము లేనట్టి విరామమును పొంది అకాల మృత్యువు కలుగునో అట్టి విరామము కాలమునకు లేదని భావము. "తచ్చ" అను మొదలగువానిద్వారా దీనిని దూషించుచున్నాడు. అంతము కల్గియున్న అవయవి యను ద్రవ్యమేది కలదో అది సచ్ఛిద్రమనబడును. ఏది అంతము లేక, ఎడతెగక యుండునో అది అచ్ఛిద్రము. అందువలన "కాలస్యాచ్ఛిద్రత్వాన్న కాల మృత్యు రస్తి" అని ఏది చెప్పబడినదో అది యుక్తముగా లేదు అని భావము. అకాల మృత్యువ్యాపకత్వమువలన కాలమునకు ఛిద్రత్వమేది చెప్పబడినదో అది తరువాత చెప్పబడనున్న ఏకీయ మతమును దూషించుటవలననే దూషింపబడును. "కాల స్వలక్షణ స్వభావాత్" అనగా కాలము యొక్క స్వలక్షణమునందు సచ్ఛిద్రత గానీ అచ్ఛిద్రతగానీ లేకుండుటచేత అని అర్థము. మరియొక ఏకీయమతమును — "తత్రాహుః" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. ఎవడు ఎప్పుడు మరణించునో అదియే అతనికి నియతమగు మృత్యుకాలము అని ఎట్లు తెలియనగునో — "న సర్వభూతానాం సత్యః సమక్రియత్వాత్" అని చెప్పుచున్నాడు. కాలము సర్వ భూతములకు అవిశేషముగా మారకముగా సమక్రియగలదగుటచేత (చంపుటయందు సమక్రియ గలదగుటచే) రాగము చేత ఒకానొక భూతమును చంపుట, ద్వేషముచేత ఒకదానిని చంపుటగానీ చేయక సర్వభూతములను చంపుటచేతనూ ఈ సత్యమగు

కాలము సర్వభూతముల యెడనూ రాగద్వేష శూన్యమై యుండునని అర్థము. అటు పైననూ రాగద్వేషములు లేక తగిన సమయమునందే చంపునుగాని ఇతర సమయములయందు చంపదు అని భావము. "ఏతదపి" అను మొదలగువానిద్వారా దూషించుచున్నాడు. "న హి కశ్చిన్న మ్రియతే" అనుటం జేసి (ఎవరునూ మరణింపక యుండకపోవుటంజేసి) కాలము సమక్రియముగలదే యగును. ఆయువుయొక్క ప్రమాణము శతవర్షము మొదలగు లక్షణములతోకూడి యున్న దాని నాధారముగా జేసికొని కాలము సమక్రియ గలదిగా పేర్కొనబడుట యేదిగలదో, ఒకవేళ శతవర్షము మొదలగునవి ఆయువుయొక్క ప్రమాణముగా నున్నచో అపుడు శత వర్షములకు (నూరు సంవత్సరములకు) ముందుగానీ తరువాతగానీ ఎవడునూ మరణించగూడదు. కాని అట్లు జరుగుట (నూరు వర్షములకు ముందుగానీ తరువాతగానీ మరణించుట)చూడబడుచున్నది. అందువలన ఇటువంటి కాలముయొక్క సమక్రియత్వమునందు తగిన శతవర్షములు మొదలగు ఆయువుయొక్క ప్రమాణము దాటిన పిదప కలుగు మరణమును అకాల మరణమని పేర్కొనుట ఆయుర్వేదమునందు తిరస్కరింపబడినదని భావము. "యస్య" అను మొదలగువానిద్వారా అకాల మృత్యువు లేదనుటను మరియొక విధమున దూషణమును చెప్పుచున్నాడు. "సర్వభావాః" అనగా మృత్యువ్యతిరిక్తములైన ఆహారము పచనము మొదలగునవి. "ప్రత్యక్షమ్" అనుటవలన బాగుగా తెలిసియున్న ప్రమాణము వలన అని అర్థము. "కాలకాల వ్యక్తిస్తాసు తాస్వవస్థాను" అనగా శరీరముయొక్క ఆ యా అవస్థలు ఆ యా వ్యాధి ఆహారము మొదలగు విషయములను మనసునందుంచుకొని కాలాకాల శబ్దమువలన చెప్పబడునని అర్థము. అచట తృతీయకము మొదలగు జ్వరముతో కూడియున్న తృతీయక జ్వరము కలిగియున్నవానికి ఇది ఇతనికి తృతీయక జ్వరము యొక్క కాలము అని చెప్పబడును. తద్వ్యతిరేకముగా నున్నపుడు అకాలమని చెప్పబడును. అట్లే గ్లాని మొదలగు వానితో కూడియున్న శరీరావస్థయందు ఆహారరూపమగు విషయము నుద్దేశించి ఇది ఇతనికి ఆహారకాలము అను జ్ఞానము కలుగును. వ్యతిరేకముగా నున్నపుడు అకాలము అని ఇట్లు ఉదాహరణమును అనుమానించి తెలిసికొనవలెను. "విసర్గస్య" అనగా వ్యాధి మోక్షమునకు. ఈ ప్రకరణమునందు కాల శబ్దమువలన ఉచిత కాలము, అకాల శబ్దమువలన అనుచితకాలము పేర్కొనబడుచున్నవి. అంతేగాని అకాలమనగా కాలము లేనట్టి అని అర్థము కాదు. "తస్మాత్" అను మొదలగువాని ద్వారా సిద్ధాంతమును ఉపసంహరించు చున్నాడు. "నైకాన్తికమ్" అనగా కాలమృత్యువే

కలుగును, లేక అకాల మృత్యువే కలుగును అను ఏకాంతిక పక్షము లేదు అని భావము. ''యది హి'' అను మొదలగువాని ద్వారా అకాల మృత్యువు లేదను పక్షము నందు ఇంకొక దూషణమును చెప్పుచున్నాడు. హితహితజ్ఞానము అకాలమృత్యువు నిరోధించుటకొరకు చెప్పబడును. అకాల మృత్యువే లేనపుడు హితహిత జ్ఞానము నిష్ప్రయోజనము గావలెనని యర్థము. ''ప్రత్యక్షానుమానోప దేశాశ్చప్రమాణాని స్యుః'' అనగా ఆయుర్వేదముతో సంబంధము కలిగియున్నట్టియు ఆయుష్యానాయు ష్యములను గూర్చి తెలియ జేయునట్టియు ప్రత్యక్షాదులు ఆయుష్యానాయుష్య విష యము లేనపుడు ప్రమాణములుగా లెక్కింపబడరాదని భావము దూషితమగు పక్ష మును నిస్సారమని చూపుచు "వాక్'' అను మొదలగునవి చెప్పుచున్నాడు,

## ఆయువు యొక్క ప్రమాణము

29. వర్షశతం ఖల్వాయుషః ప్రమాణమస్మిన్ కాలే.

**తాత్పర్యము :** ఈ కలియుగమునందు ఆయువు యొక్క ప్రమాణము నూరు సంవత్సరములు.

**ఆయుర్వేదదీపిక :** "కింవాస్య పరమాయుః" అను ప్రశ్నకు సమాధా నము— "వర్షశతమ్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "అస్మిన్ కాలే" అనగా కలియుగమునందు అని అర్థము.

## పరమాయువు కలుగుటకు కారణములు

30. తస్య నిమిత్తం ప్రకృతిగుణాత్మసంపత్ సాత్మ్యోపసేవనం చేతి.

**తాత్పర్యము :** పరమాయువు కలుగుటకు ప్రకృతి, గుణము, ఆత్మ ఇవి సంపన్నములుగా నుండుట, సాత్మ్యములగు ఆహార విహారములను సేవించుట అను నవి కారణములు.

**ఆయుర్వేదదీపిక :** "తస్య" అను మొదలగువాని ద్వారా మిగిలిన ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాడు. "ప్రకృతిగుణాత్మసంపత్" అనగా ప్రకృతి సంపత్తు, గుణసంపత్తు, ఆత్మసంపత్తు అని అర్థము. అచట ప్రకృతి సంపత్తనగా సమవాతాది ప్రకృతి గలిగియుండుట, సమప్రకృతియే చిరాయువగును. గుణసంపత్తు

అనునది సారము సంహననము మొదలగు ఆయుష్మంతములైన లక్షణములు కూడి యుండుట; లేదా, ప్రకృతముగా నుండవలసిన తల్లి తండ్రి మొదలగు గుణముల సంపత్తు ప్రకృతి గుణముల సంపత్తు అనబడును. ఆత్మకు మాత్రము చిరాయుష్షును కలిగించి ధర్మములతో కూడియుండుట ఆత్మ సంపత్తు అనబడును.

## అధ్యాయ సంగ్రహము

తత్రశ్లోకాః —

31. శరీరం యద్యథా తచ్చ వర్తతే క్లిష్టమామయైః,
యథా క్లేశం వినాశం చ యాతి యే చాస్య ధాతవః.

32. వృద్ధిర్హ్రాసో యథా తేషాం క్షీణానామౌషధం చ యత్,
దేహవృద్ధికరా భావా బలవృద్ధికరాశ్చ యే.

33. పరిణామకరా భావా యా చ తేషాం పృథక్ క్రియా,
మలాఖ్యాః సంప్రసాదాఖ్యా ధాతవః ప్రశ్న ఏవ చ.

34. నవకో నిర్ణయస్త్వస్య విధివత్ సంప్రకాశితః,
తథ్యః శరీరవిచయే శారీరే పరమర్షిణా.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే శారీరస్థానే
శరీరవిచయశారీరం నామషష్ఠోఽధ్యాయః.

**తాత్పర్యము :** శరీరము యొక్క స్వరూపము వ్యాధులచే బాధింపబడి అది క్లేశము మరియు వినాశమును పొందు విధము, శరీరమునందలి ధాతువులు, వీని యొక్క వృద్ధి క్షయములు; అవి క్షీణించినపుడు చేయవలసిన విధానము; శరీరమును వృద్ధి పొందించు భావములు, బలమును వృద్ధి పొందించు భావములు, ఆహారమును పాకముచేయు భావములు- అవి పనిచేయు విధము; మల స్వరూపములు-ప్రసాద స్వరూపములు- ఈ సంబంధమగు తొమ్మిది ప్రశ్నలు వీనికి సమాధానమును నిక్కముగా విధి పూర్వకముగా పరమఋషిచేత శరీర విచయ శారీరమునందు వివరింప బడినవి.

ఇది అగ్నివేశునిచే రచింపబడి చరకునిచే సంస్కరింపబడిన తంత్రము నందలి శారీరస్థానములోని శరీరవిచయ శారీరమను ఆరవ అధ్యాయము.

ఆయుర్వేదదీపిక : సంగ్రహముగా "యే చాస్య ధాతవః" అనగా దీని ధాతువులెట్లుండును అని అర్థము. ఇదియును "వైషమ్యగమనం పునర్ధాతూనాం" అను మొదలగు సూత్రము వలన ధాతుధర్మములను వివరించుట వలన ఆ విషయము చెప్ప బడినదని తెలిసికొనవలెను. ఇతరులు మాత్రము "యే చాస్య ధాతవః" అనుట వలన "మాంసం మాంసేన వర్ధతే" అను మొదలగు మాంసాది ధాతుహ్రాసములకిది సంగ్ర హమని చెప్పుదురు. "వృద్ధి హ్రాసౌ యథా తేషాం" అనుట వలన "ధాతవః పునః" అను మొదలగు సూత్రమునందలి విషయమును గ్రహించుచున్నాడు. "క్షీణానాం- మౌషధం చ యత్" అనగా "మాంసమాప్యాయ్యతే మాంసేన" అను మొదలగు వానిని గ్రహించుచున్నాడు. "యా చ తేషాం పృథక్ క్రియా" అనుట వలన ఆహార పరిణామ కరములగు ఉష్మా మొదలగువానికి వేర్వేరుగా "ఉష్మా పచతి" అను మొదలగువానిద్వారా చెప్పబడిన క్రియలు తీసికొనబడుచున్నవి.

ఇది శ్రీ చక్రపాణి దత్తునిచే రచింపబడిన ఆయుర్వేదదీపికయను చరక తాత్పర్యటీక యందలి శరీర విచయ శారీరమను ఆరవ అధ్యాయము.

# సప్తమాధ్యాయము

# శరీర సంఖ్యా శారీరము

1. అథాతః శరీరసంఖ్యాశారీరం వ్యాఖ్యాస్యామః.
2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః

## అగ్నివేశుని ప్రశ్న

3. శరీరసంఖ్యామవయవశః కృత్స్నం శరీరం ప్రవిభజ్య సర్వశరీరసంఖ్యాన-ప్రమాణజ్ఞానహేతోర్భగవన్తమాత్రేయమగ్నివేశః ప్రపచ్ఛ.

**తాత్పర్యము :** ఇక ఇప్పుడు శరీర సంఖ్యా శారీరమును గూర్చి చెప్పుకొందము అని ఆత్రేయభగవానుడనెను.

సర్వ శరీరము యొక్క సంఖ్యా ప్రమాణమును తెలిసికొనుటకు శరీరమును అవయవ రూపముగ విభజించి శరీర సంఖ్యను చెప్పవలసినదని భగవంతుడగు ఆత్రేయుని అగ్నివేశుడు ప్రశ్నించెను.

**ఆయుర్వేదదీపిక :** క్రిందటి అధ్యాయమునందు శరీరము ధాతు భేదము వలన పేర్కొని, ఇదే శరీరమును అవయవ సంఖ్యా భేదము వలన ప్రతిపాదించుటకు శరీర సంఖ్యాధ్యాయము పేర్కొనబడుచున్నది. అవయవ సంఖ్యా భేదమువలననూ శరీర జ్ఞానము ప్రాధాన్యముగా సాక్షాత్తూ చికిత్సోపయుక్తమగు సాధనముగా ఈ అధ్యాయము చివరన "శరీరసంఖ్యాం యో వేద" అను మొదలగువానిద్వారా చెప్పబోవుచున్నాడు. ఒక్కొక్క అవయవముగా విభజించి శరీర సంఖ్యను అగ్నివేశుడు అడిగెనని అన్వయించుకొనవలెను. "సర్వ శరీర సంఖ్యానప్రమాణజ్ఞాన-హేతోః" అన్న ప్రశ్న యొక్క ప్రయోజనమును చెప్పుచున్నాడు. సంఖ్యానము యొక్క ప్రమాణజ్ఞానము సంఖ్యాన ప్రమాణమనబడును. అదియును "షట్ త్వచః" అను మొదలగు పాఠమున చెప్పబడనున్నది. లేదా, సంఖ్యానము మరియు ప్రమాణము సంఖ్యాన ప్రమాణమగును. అచట "షట్ త్వచః" అను మొదలగునవి సంఖ్యానము (లెక్కించుట), "దశోదకాంజలయః" అను మొదలగునవి శరీరావయవముల ప్రమాణము; లేక, "సంఖ్యా-మాన-ప్రమాణజ్ఞానహేతోః" అని పాఠము.

అచట (అష్టైన) సంఖ్యానమునకును, ప్రమాణమునకు పైన ఉదాహరణము లివ్వ బడినవి, నామజ్ఞానము మాత్రము "ఏకా గోజిహ్వా" అను మొదలగు గ్రంథము వలన కలుగును అని వ్యాఖ్యానింతురు.

## ఆత్రేయుని సమాధానము

4. తమువాచ భగవానాత్రేయః - శృణు మత్తోఽగ్నివేశ ! సర్వశరీరమాచక్షణస్య యథాప్రశ్నమేకమనా యథావత్.శరీరే షట్ త్వచః, తద్యథా - ఉదకధరా త్వగ్బాహ్యా, ద్వితీయా త్వసృగ్ధరా, తృతీయా సిధ్మకిలాససంభవాధిష్ఠానా, పఞ్చమీ త్వలజీవిద్రధిసంభవాధిష్ఠానా షష్ఠీ తు యస్యాం ఛిన్నాయాం తామ్యత్యన్ధ ఇవ చ తమః ప్రవిశతి యాం చాప్యధిష్ఠాయారూంషి జాయన్తే పర్వసు కృష్ణరక్తాని స్థూలమూలాని దుశ్చికిత్స్యతమాని చ;ఇతి షట్ త్వచః. ఏతాః షడఙ్గం శరీరమవతత్య తిష్ఠన్తి.

**తాత్పర్యము :** అతనితో ఆత్రేయ భగవానుడిట్లనెను. ఓ అగ్నివేశుడా సర్వశరీరమును నుద్దేశించి నీవడిగిన ప్రశ్నానుసారముగ (నా మతమును) ఏకాగ్ర చిత్తుడవై వినుము. శరీరమునందు ఆరు త్వక్కులు ఉండును. ఎట్లనగా - వెలుపల నుండునది ఉదకధరాత్వచా అనబడును. రెండవది అసృగ్ధర. మూడవది సిధ్మకుష్ఠము, కిలాసము సంభవించుటకు అధిష్ఠానముగా నుండును. నాల్గవది చర్మకుష్ఠము సంభవించుటకు అధిష్ఠానముగా నుండును. ఐదవది అలజి, విద్రధి కలుగుటకు టకు అధిష్ఠానముగ నుండును. ఆరవ త్వక్కును ఛేదించినచో మనుజుడు గ్రుడ్డివాని వలెనై చీకటియందు ప్రవేశించిన వానివలె మోహము నొందును ఈ త్వక్కులను (ఆరవ త్వక్కును) ఆధారముగ చేసికొని నలుపు, ఎరుపు రంగులు కలిగినట్టి స్థూలములైన మూలమును కలిగినట్టియు, చికిత్సకు అసాధ్యములైనట్టియు వ్రణ ములు అవయవ సంధుల యందు జనించును. ఈ విధముగ ఆరు త్వక్కులు చెప్ప బడినవి ఇవి షడంగములతో కూడిన శరీరమును ఆవరించియుండును.

**ఆయుర్వేదదీపిక :** ఆచక్షణస్య అనుచోట "వచనం" అని శేషము: అందువలన "సర్వం శరీరమాచక్షణస్య మే వచనం శృణు" అని అన్వయము. అచ టను "నటస్య శృణోతి" అనుట మొదలగా అనుప్రయోగమునందు షష్ఠీవిభక్తి ప్రయోగము చేయబడినది. కాని "మే వచనం శృణు" అనుటవలన శరీరావయవ

సంఖ్యానమునందు మతాంతరము గూడ కలదని సూచించుచున్నాడు. ఇచట చెప్ప బడిన సంఖ్యకు విరుద్ధముగా సుశ్రుతమునందు "సప్తత్వచః, త్రీణ్యస్థిశతాని" (సుశ్రుత శారీరము - 5వ అధ్యాయము) అను మొదలుగా చెప్పబడిన సంఖ్య అచట శల్య శాస్త్రమునకు ఉపయోగకరముగా నుండుటవలన అని తెలియవలెను. సుశ్రు తమునందు గూడ "వేదవిదులు అస్థుల సంఖ్య 360 గా చెప్పుదురు. శల్యతన్త్రము నందు 300 అస్థులే యుండును" — "త్రీణి సషష్టీని శతాన్యస్థ్నాం వేదవిదో భాషన్తే,శల్యతన్త్రే తు త్రీణ్యేవ శతాని" (సుశ్రుత శారీరము - 5వ అధ్యాయము) అని చెప్పబడినది. ఈ వచనమువలన చరక సుశ్రుతములయందు త్వక్కు మొద లైన వానియొక్క సంఖ్యాభేదమేది కలదో అది ఆ యా తంత్రములకు ఉపయుక్త ముగా నుండు సంఖ్యను తీసికొను ఉద్దేశ్యముతో చెప్పబడినది అని ఊహించవలెను. "సిధ్మకిలాస సంభవాధిష్ఠానా" అనగా సిధ్మకిలాసము ఏ దోషమువలన జనించు చున్నవో ఆ దోషమునకు అధిష్ఠానభూతమై యున్నది అని అర్థము. ఇట్లే తరువాతి వాటికి గూడ వ్యాఖ్యానించుకొనవలెను. "తామ్యతి" - అనుదానికి వివరణము - "అన్ధ ఇవ తమః ప్రవిశతి" అని. (అంధునివలె చీకటిని పొందును) లేదా తామ్యతి అనగా తమస్సును పొందినవానివలె చేష్టలు చేయును. "అరూంషి" అనగా వ్రణ ములు. "పర్వసు" అనగా అవయవసంధుల యందు అని అర్థము.

## శరీరమునందలి షడంగ విభాగము

5. తత్రాయం శరీరస్యాఙ్గవిభాగః: తద్యథా – ద్వౌ బాహూ, ద్వే సక్థినీ, శిరోగ్రీవమ్, అన్తరాధిః, ఇతి షడఙ్గమఙ్గమ్.

**తాత్పర్యము :** రెండు చేతులు, రెండు కాళ్ళు, కంఠముతో కూడిన శిరస్సు, శరీర మధ్యభాగము (అంతరాధి) అని ఆరు అంగములు. ఇది శరీరము యొక్క అంగ విభాగము.

**ఆయుర్వేదదీపిక :** శరీరముయొక్క చెప్పబడిన షడంగత్వము "తత్రా యమ్" అను మొదలగు వానిద్వారా విభజింపబడుచున్నది. శిరస్సు మరియు గ్రీవ మును శిరోగ్రీవమనబడును. ఈ రెండును ఒకటిగానే తెలిసికొనవలెను. "అన్తరాధిః" అనగా మధ్యము.



## అస్థుల సంఖ్య మరియు వాని వివరము

5. త్రీణి సషష్టీని శతాన్యస్థ్నాం సహ దన్తోలూఖలనఖేన. తద్యథా - ద్వాత్రింశద్దన్తాః, ద్వాత్రింశద్దన్తోలూఖలాని, వింశతిర్నఖాః షష్టిః పాణిపాదాఙ్గుల్యస్థీని, వింశతిః పాణిపాదశలాకాః, చత్వారి పాణిపాదశలాకాధిష్ఠానాని, ద్వే పార్ష్ణ్యోరస్థినీ, చత్వారః పాదయోర్గుల్ఫాః,ద్వౌ మణికౌ హస్తయోః, చత్వార్యరత్న్యోరస్థీని, చత్వారి జఙ్ఘయోః, ద్వే జానునీ, ద్వే జానుకపాలికే, ద్వావూరూనలకౌ, ఏకం జత్రు,ద్వే తాలుకే, ద్వే శ్రోణీఫలకే, ఏకం భగాస్థి, పఞ్చచత్వారింశత్ పృష్ఠగతాన్యస్థీని, పఞ్చదశ గ్రీవాయాం, చతుర్దశోరసి, ద్వయోః పార్శ్వయోశ్చతుర్వింశతిః పర్శుకాః, తావన్తి స్థాలకాని, తావన్తి చైవ స్థాలకార్బుదాని, ఏకం హన్వస్థి, ద్వే హనుమూలబన్ధనే ఏకాస్థినాసికాగణ్డకూటలలాటం, ద్వౌ శఙ్ఖౌ, చత్వారి శిరఃకపాలానీతి; ఏవం త్రీణి సషష్టీని శతాన్యస్థ్నాం సహ దన్తోలూఖలనఖేనేతి.

**తాత్పర్యము :** శరీరమునందలి అస్థులు దంతోలూఖలములు గోళ్ళతో కలిపి మూడువందల అరువది యగును.

అది యెట్లనగా —

దంతములు — 32
దంతమూలములు — 32
గోళ్ళు — 20
హస్తపాదములయందలి వేళ్ళయందలి అస్థులు — 60
హస్తపాదములందలి శలాకాస్థులు — 20
శలాకాస్థులకు ఆధారమైన అస్థులు — 4
కాలిమడమల యందలి అస్థులు — 2
పాదములయందలి చీలమండలు (గుల్ఫములు) — 4
హస్తముల యొక్క మణిబంధములు — 2
అరత్ని అస్థులు (ముంజేతి ఎముకలు) — 4
కాలిపిక్కల రెండిటి యందుండు అస్థులు — 4

| | |
|---|---|
| మోకాళ్ళ యందుండు అస్థులు (జాన్వస్థులు) | — 2 |
| జానుకపాలములు మోకాలిచిప్పలు | — 2 |
| తొడలయందలి నలకాస్థులు (ఊర్వస్థులు) | — 2 |
| బాహువులందలి నలకాస్థులు | — 2 |
| అంసములు | — 2 |
| అంసఫలకములు | — 2 |
| అక్షకములు | — 2 |
| జత్రువునందుండు అస్థి | — 1 |
| తాలువులు | — 2 |
| శ్రోణిఫలకములు | — 2 |
| భగాస్థి | — 1 |
| వెన్నెముక యందుండు అస్థులు | — 45 |
| కంఠమునందు | — 15 |
| వక్షమునందు | — 14 |
| రెండు పార్శ్వముల యందుండు పర్శుకాస్థులు | — 24 |
| స్థాలకములు (ప్రక్కటెముకల మూలస్థానముననుండు అస్థులు) | — 24 |
| స్థాలకములతో బంధింపబడియుండు అర్బుదాకార అస్థులు | — 24 |
| తాలు సంధులయందు | — 1 |
| తాలు మూలబంధనమునందు | — 2 |
| ముక్కు, గండస్థలములు, కనుబొమల నడిభాగము, సుదురు - వీటికి సంబంధించిన అస్థి | — 1 |
| శంఖాస్థులు కణతలయందలివి | — 2 |
| శిరస్సునందలి కపాలాస్థులు | — 4 |
| మొత్తము | — 360 |

ఈ విధముగా దంతములు దంతోలూఖలములు నఖములతో గూడి అస్థుల సంఖ్య మొత్తము మూడువందల అరువది యగుచున్నది.

**ఆయుర్వేదదీపిక :** "సషష్టిని" అనగా అరువది ఎక్కువగా నున్న అని అర్థము. వివిధాశితపీతీయాధ్యాయము (సూత్రస్థానము)నందు నఖములు మల

భాగముచే పోషింపబడుచుండుట వలన మలములంచే చేర్చి చెప్పబడినప్పటికీ, ఇచట అస్థిరూపమును కలిగియుండుట చేతనూ, కనుపించుచుండుట చేత అస్థి గణనయందు చేర్చి చెప్పబడినవి. ఒక్కొక్క వేలునందు మూడు పర్వములు (కణుపులు) ఉండును, అందువలన ఇరువది వేళ్ళయందును మొత్తము మూడు ఇరువదులు (అరువది) అస్థులుండును. పెద్దవ్రేలు (బొటనవ్రేలు) నందు మూడవ కణుపు హస్తమునందు, పాదము నందును ప్రవేశించి యుండునని తెలిసికొనవలెను. వృద్ధాంగుళి యొక్క శలాకాస్థి గూడ స్వల్ప ప్రమాణమున నుండునని తెలిసికొనవలెను. వేళ్ళయొక్క శలాకాస్థి ఎచట సంలగ్నమై యుండునో అది శాలాకాధిష్ఠానము. జంఘ మరియు ఊరువుల సంధి స్థానము జానువనబడును. జత్రు సంధికి పై భాగమున నుండు రెండు కీలకాస్థులు అక్షకములనబడును. తాలువు నందుండునవి రెండును తాల్వస్థులనబడును. కటీ సంధాన కారకముగ నుండి అభిముఖముగ తిర్యగాకారముగ నుండునది భగాస్థి యనబడును. "స్థాలకాని" అనగా పర్శుకల యొక్క మూల స్థానమునందు లగ్నమైయున్నవి. స్థాల కార్బుదములు మాత్రము పర్శుకలకు మూలములైన అర్బుదాకారపు అస్థులు. ముక్కు, గండ కూటము, లలాటములకు ఒకే మూలము అగుట చేత ఒకే అస్థిగా లెక్కించవలెను. వేర్వేరుగా మూడు అస్థులను లెక్కించువారికి 360 సంఖ్య సరిగా రాదు.

## జ్ఞానేంద్రియాధిష్ఠానములు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు మరియు హృదయము

7. పఞ్చేన్ద్రియాధిష్ఠానాని: తద్యథా—త్వగ్, జిహ్వా, నాసికా, అక్షిణీ,కర్ణౌ చ. పఞ్చబుద్ధీన్ద్రియాణి: తద్యథా—స్పర్శనం, రసనం, ఘ్రాణం, దర్శనం, శ్రోత్రమితి. పఞ్చ కర్మేన్ద్రియాణి: తద్యథా—హస్తౌ, పాదౌ, పాయుః ఉపస్థః, జిహ్వా, చేతి.

8. హృదయం చేతనాధిష్ఠానమేకమ్.

**తాత్పర్యము :** చర్మము, నాలుక, ముక్కు, కన్నులు రెండు, రెండు చెవులు ఇవి ఐదును ఇంద్రియములకు అధిష్ఠానములుగ నుండును. స్పర్శనము, రసనము, ఘ్రాణము, దర్శనము, శ్రోత్రము అనునవి ఐదును బుద్ధీన్ద్రియములనబడును. రెండు హస్తములు, రెండు పాదములు, గుదము, ఉపస్థ మరియు జిహ్వయను ఐదును కర్మేన్ద్రియములనబడును. చేతనాధిష్ఠానము హృదయము ఒకటి.

**ఆయుర్వేదదీపిక :** రెండు కన్నులు, రెండు చెవులునూ వేర్వేరుగా నున్నప్పటికీ ఒక్కొక్క ఇంద్రియమునకే అధిష్ఠానముగా నుండుట వలన ఒక్కొక్కటిగనే గ్రహింపవలెను. ఇట్లే రెండు హస్తములు, రెండు పాదములను కూడ గ్రహింపవలెను.

## ప్రాణాయతనములు

9. దశ ప్రాణాయతనాని: తద్యథా — మూర్ధా, కణ్ఠః, హృదయం, నాభిః, గుదం, వస్తిః, ఓజః, శుక్రం, శోణితం, మాంసమితి. తేషు షట్ పూర్వాణి మర్మసంఖ్యాతాని.

**తాత్పర్యము :** శిరస్సు, కంఠము, హృదయము, నాభి, గుదము, వస్తి, ఓజస్సు, శుక్రము, శోణితము, మాంసము అను పదినీ ప్రాణాయతనములన బడును. వాటిలో మొదటి ఆరున్నూ (శిరస్సు, కంఠము, హృదయము, నాభి, గుదము, వస్తి) మర్మములుగా చెప్పబడినవి.

**ఆయుర్వేదదీపిక :** ఇచట చెప్పిన దశ ప్రాణాయతనములయందు దశ ప్రాణాయతనీ యాధ్యాయమునందు (సూత్ర స్థానము 29వ అధ్యాయము) చెప్పబడిన రెండు శంఖములను (కణతలను) వదలి నాభి మరియు మాంసము గ్రహించబడినవి. అందువలన నాభి మాంసములను మరియు పాఠద్వయము వలన శంఖములను కూడ ప్రాణాయతనములుగా తెలిసికొనవలెను. దశ ప్రాణాయతనీయాధ్యాయమునందు— "దశైవాయతనాన్యాహుః ప్రాణా యేషు ప్రతిష్ఠితాః, శఙ్ఖౌ మర్మత్రయం కణ్ఠో రక్తమ్ శుక్రౌజసీ గుదమ్. (సూత్ర స్థానము-29వ అధ్యాయము) అని చెప్పబడినది.

## కోష్ఠాంగములు

10. పఞ్చదశ కోష్ఠాఙ్గాని: తద్యథా — నాభిశ్చ,హృదయం చ, క్లోమ చ, యకృచ్చ, ప్లీహా చ, వృక్కౌ చ, బస్తిశ్చ,పురీషాధారశ్చ, ఆమాశయశ్చ, పక్వాశయశ్చ, ఉత్తరగుదం, చ, అధరగుదం చ, స్థూలాన్త్రం చ, వపావహనం చేతి.

**తాత్పర్యము :** నాభి, హృదయము, క్లోమము, యకృత్తు, ప్లీహ, రెండు వృక్కలు, వస్తి, పురీషాధారము, ఆమాశయము, పక్వాశయము, గుదమునందలి పై

భాగము, క్రింది భాగము, స్థూలాంత్రము మరియు, వపావహనము అనునవి పదునైదు కోష్ఠాంగములు అనబడును.

**ఆయుర్వేదదీపిక :** క్లోమమనగా పిపాసా స్థానము. "బస్తిః" అనగా మూత్రాశయము ఎచట పురీషము నిలచియుండునో అది ఉత్తరగుదము. దేని ద్వారా పురీషము బయటకు వెడలునో అది అధరగుదము. వపావహన మనగా తైలవర్తిక యని పిలువబడుచు మేదస్సునకు స్థానమై యున్నది.

## ప్రత్యంగముల వివరము

**11.** షట్పఞ్చాశత్ ప్రత్యఙ్గాని షట్స్వంగేషూపనిబద్ధాని, యాన్యపరిసంఖ్యాతాని పూర్వమఙ్గేషు పరిసంఖ్యాయమానేషు, తాన్యన్యైః పర్యాయైరిహ ప్రకాశ్యాని భవన్తి.తద్యథా-ద్వే జఙ్ఘాపిణ్డికే,ద్వే ఊరుపిణ్డికే,ద్వౌ స్ఫిచౌ,ద్వౌ వృషణౌ,ఏకం శేఫః,ద్వే ఉఖే,ద్వౌ వఙ్క్షణౌ,ద్వౌ కుకున్దరౌ,ఏకం బస్తిశీర్షమ్, ఏకముదరం, ద్వౌ స్తనౌ,ద్వౌ శ్లేష్మభువౌ,ద్వే బాహుపిణ్డికే, చిబుకమేకం, ద్వావోష్ఠౌ, ద్వే సృక్కణ్యౌ,ద్వౌ దన్తవేష్టకౌ,ఏకం తాలు, ఏకా గలశుణ్డికా,ద్వే ఉపజిహ్వికే,ఏకా గోజిహ్వికా,ద్వౌ గణ్డౌ,ద్వే కర్ణశష్కులికే,ద్వౌ కర్ణపుత్రకౌ,ద్వే అక్షికూటే, చత్వార్యక్షివర్త్మాని,ద్వే అక్షికనీనికే,ద్వే భ్రువౌ, ఏకాఽవటుః, చత్వారి పాణిపాదహృదయాని.

**తాత్పర్యము :** ప్రత్యంగములు ఏబది యారు. ఇవి ఆరు అంగములందు (షడంగములందు) చేరియుండును. ఇంతకు ముందు అంగములను లెక్కింపక వదలి వేసినవి. కొన్నింటిని ముందు లెక్కించియున్ననూ ఇచట అవి పర్యాయనామములతో చెప్పబడుచున్నవి.

అవి యేవనగా

| | | |
|---|---|---|
| జంఘా పిండికలు (పిక్కలు) | — | 2 |
| ఊరు పిండికలు (తొడ పిక్కలు) | — | 2 |
| పిరుదులు | — | 2 |
| వృషణములు | — | 2 |
| మేఢ్రము | — | 1 |
| ఉఖలు (చంకలయందలి పల్లములు) | — | 2 |

| | | |
|---|---|---|
| వంక్షణములు (గజ్జలు) | — | 2 |
| కుకుందరములు (పెన్నెముకకు ఇరుప్రక్కల పిరుదులపై భాగమున నుండు గుంటలు) | — | 2 |
| వస్తిశీర్షము | — | 1 |
| ఉదరము | — | 1 |
| చన్నులు (స్తనములు) | — | 2 |
| భుజములు | — | 2 |
| బాహువులందలి కండలు | — | 2 |
| గడ్డము | — | 1 |
| పెదవులు | — | 2 |
| పెదవులకౌన ప్రదేశములు | — | 2 |
| దంతవేష్టములు (చిగుళ్ళు) | — | 2 |
| తాలు (అంగిలి) | — | 1 |
| గళశుండిక (గొంతులోపలి భాగము) | — | 1 |
| ఉపజిహ్వికలు (చిన్న నాలుకలు) | — | 2 |
| గోజిహ్విక (నాలుక) | — | 1 |
| గండస్థలములు | — | 2 |
| కర్ణశష్కులి (చెవి లోపలనుండు వలయములు) | — | 2 |
| కర్ణపుత్రకములు (చెవి బయటి దొప్పలు) | — | 2 |
| అక్షికూటములు (కన్ను ఉండు భాగములు) | — | 2 |
| కనురెప్పలు | — | 4 |
| కనుపాపలు | — | 2 |
| కనుబొమ్మలు | — | 2 |
| అవటు (పెదతల) | — | 1 |
| పాణిపాదహృదయములు (అరచేతులు అరికాళ్ళకు మధ్యనుండు పల్లపు భాగములు) | — | 4 |
| | మొత్తము | 56 |

ఆయుర్వేదదీపిక : "షట్పఞ్చాశత్ ప్రత్యఙ్గాని" అనగా "తద్యథా— ద్వే జఙ్ఘాపిణ్డికే" అను గ్రంథము ద్వారా చెప్పబడనున్న ఏబదియారు ప్రత్యఙ్గములు అని అర్థము. "యాని" అను మొదలగునవి— చెప్పబోవుచున్న ఏబదియారు ప్రత్యంగము లేవికలవో అవి పూర్వము హస్తాది ఆరు అంగములయందు లెక్కింపబడనివి; వాటిని వేరు పర్యాయములతో చెప్పబడవలసి యున్నవని అన్వయించుకొనవలెను. జఙ్ఘాపిండికాది పర్యాయములు శబ్దములే. ఇందువలన హస్తములు మొదలగు షడంగములను చెప్పుటవలననే వానిని ఆశ్రయించుకొని యుండియూ జంఘాపిండికాదులు చెప్పబడియే యున్నవి. ప్రస్తుతము సూత్రము అవయవ విశేష వ్యవహారముకొరకు ఇచట జఙ్ఘా పిండికాదులు వేరుగా చెప్పబడినవని వాక్యార్థము. "పూర్వమఙ్గేషు" అనుదాని స్థానమునందు "పూర్వమన్యేషు" అనియునూ పాఠము గలదు. అచటనూ 'అన్య' శబ్దము వలన హస్తాది షడఙ్గములు గ్రహింపనగును. "ఉఖే" అనగా కక్షశిరము మరియు పార్శ్వముల రెండింటికి నిమ్న భాగములు, కుకుందరములనగా పిరుదులకు పైభాగమున నుండు రెండు గుంటలు. "వస్తి శిరః" అనగా నాభికి దిగువనుండు భాగము. శ్లేష్మభువములనగా కంఠమునకు రెండు పార్శ్వముల యందుండు కఠినభాగములు. సృక్కణ్యములనగా ముఖమునకు చివరిభాగములు. "ద్వే ఉపజిహ్వికే" అనగా జిహ్వకు పైనను అడుగుననూ ఉండు రెండు చిన్న నాలుకలను గ్రహించవలెను. "ఏకా గోజిహ్వికా" అనగా - గౌః అనగా వాక్కు దానికి కారణభూతమైన జిహ్వ గోజిహ్వ యనబడును. అందువలన మాట్లాడుటకు కారణభూతమైన ప్రధానమైన జిహ్వయే గ్రహింపబడును. "కర్ణ శష్కులికే" అనగా చెవియందున్న వలయములు. కర్ణపుత్రకములు మాత్రము బాహ్యకర్ణములే (చెవి దొప్పలు) అక్షి కూటములనగా అక్షిగోళములు. "ద్వే అక్షికనీనికే" అనుచోట "కనీనికా" శబ్దమువలన ముక్కువద్ద నుండు అక్షిసంధి పేర్కొనబడుచున్నది. అవటుః అనగా ఘాటా (మెడ వెనుకభాగము). "చత్వారి పాణిపాదహృదయాని" అనగా చేతులకు కాళ్ళకు తలమున మధ్యనుండు భాగములు నాలుగు అని అర్థము. ఇంత వరకే ఏబదియారు ప్రత్యంగములు పూర్తియగుచున్నవి.

## శరీరమునందలి రంధ్రములు

**12.** నవ మహాన్తి ఛిద్రాణి—సప్త శిరసి,ద్వే వాధః

**13.** ఏతావద్దృశ్యం శక్యమపి నిర్దేష్టుమ్.

**తాత్పర్యము :** శరీరమునందు తొమ్మిది పెద్ద రంధ్రములున్నవి (చిన్న రంధ్రములు లెక్కకుమించినన్ని స్వేదరంధ్రములు మొదలగునవి ఉన్నవని భావము.) అందు ఏడురంధ్రములు శిరస్సునందును (రెండు చెవులు, రెండు ముక్కులు, రెండు కన్నులు, నోరు) మరియు రెండు క్రింది భాగమున (మేఢ్రము లేక యోని ద్వారము మరియు గుదము) ఉండును.

ఇంతవరకు చెప్పబడినవి ప్రత్యక్షముగా కన్పడును, నిర్దేశించుటకును వీలగును.

**ఆయుర్వేదదీపిక :** "నవ మహాన్తి ఛిద్రాణి" అను గ్రంథమును — "సప్త శిరసి,ద్వే బాధః" అనుటద్వారా వివరించుచున్నాడు. "ఏతావద్దృశ్యమ్" అనగా ఇంతవరకు చెప్పబడిన త్వక్కు మొదలైనవి చూడబడుచున్నవై ఎక్కువగా ప్రత్యక్షము ద్వారా లభించు విషయమై యున్నదని అర్థము.

## స్నాయు సిరాది సంఖ్యా వివరణము

14. అనిర్దేశ్యమతః పరం తర్క్యమేవ. తద్యథా - నవ స్నాయుశతాని, సప్త సిరాశతాని,ద్వే ధమనీశతే, చత్వారి పేశీశతాని, సప్తోత్తరం మర్మశతం,ద్వే సన్ధిశతే, ఏకోనత్రింశత్సహస్రాణి నవ చ శతాని షట్పఞ్చాశత్కాని సిరాధమనీనామణుశః ప్రవిభజ్యమానానాం ముఖాగ్రపరిమాణం, తావన్తి చైవ కేశశ్మశ్రులోమానీతి. ఏతద్యథావత్సం- ఖ్యాతం త్వక్ప్రభృతి దృశ్యం, తర్క్యమతః పరమ్. ఏతదుభయమపి న వికల్పతే, ప్రకృతిభావాచ్ఛరీరస్య.

**తాత్పర్యము :** ఇకపై చెప్పబోవునది నిర్దేశించుటకు వీలుగాక తర్కించియే తెలిసికొనవలెను. అవి యేవనగా —

| | | |
|---|---|---|
| స్నాయువులు | — | 900 |
| సిరలు | — | 700 |
| ధమనులు | — | 200 |
| పేశీలు | — | 400 |
| మర్మములు | — | 107 |

| | | |
|---|---|---|
| సంఘులు | — | 200 |
| అతి సూక్ష్మములను సిరాధమనుల | | |
| యొక్క అణురూప ముఖభాగములు | — | 29,956 |
| శరీరమునందలి కేశములు | | |
| శ్మశ్రువులు నీచరోమములు | — | 29,956 |

త్వక్కు మొదలగునవి దృశ్యములుగ (చూడదగినవిగ) నుండును. మిగిలినవి ఊహించి తెలిసికొనదగినవిగ నుండును. శరీరము ప్రకృతావస్థలో నున్నచో ఇవన్నియు వికల్పము చెందక సరిగా నుండును.

**ఆయుర్వేదదీపిక :** "అతః పరం తర్క్యమేవ" అనగా అతః-త్వగాదులకు, పరంబైన ఏస్నాయుప్రు మొదలైనవి కలవో, ప్రాయః తర్క్యమేవ - అనుమానగమ్యమే యని అర్థము. స్నాయువు మొదలగునవి కూడ ప్రత్యక్షముగా చూడబడుచున్ననూ, ఇచట చెప్పబోవుచున్న సంఖ్యలో కూడియున్న స్నాయువు మొదలైన వన్నియు ప్రత్యక్షము వలన తేలికగా గ్రహింపబడకపోవుటవలన తర్క్యము అని చెప్పబడినది. స్నాయువు మొదలగువాని భేదములనే- "నవ స్నాయుశతాని" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "అణుశః ప్రవిభజ్యమానానామ్" అనగా అణుప్రభేదము వలన విభజింపబడుచున్నవానికి. "ముఖాగ్రపరిమాణమ్" అనగా ముఖరూపమగు సంఖ్యయొక్క (చివరలయొక్క) పరిమాణము. ఇచట ఏ సప్త సిరాశతము ధమనీ ద్విశతము చెప్పబడినదో అదియే సూక్ష్మ ప్రతానాగ్రముల భేదములను లెక్కించుటవలన 29, 956 అగుచున్నవి. స్థూలమైన లెక్కవలన పూర్వము చెప్పబడిన సిరాధమనుల లెక్కలోనే వచ్చుచున్నవి అనుటలో విరోధము లేదు. తావన్తి చైవ కేశశ్మశ్రులోమాని" అనగా కేశశ్మశ్రు లోమములు కూడ 29, 956 అగునని అర్థము ఈ కేశాదుల లెక్క స్థూల సిరల ముఖద్వారము వద్దనున్న కేశాది విభాగము వలన తెలిసికొనవలెను. సూక్ష్మతమమగు విభాగము వలన మాత్రము కేశాదులు ఇతర శాస్త్రములందు చెప్పిన బహుసంఖ్యలో నుండునని తెలిసికొనవలెను. ఈ దృశ్యములగు త్వక్కు మొదలు తర్క్యమగు స్నాయువు మొదలైనవాని వరకు యథాక్రమముగా లెక్కించబడినదని (తెలియపర్చబడినదని) తెలిసికొనవలెను. ప్రస్తుతము యథోక్త త్వక్కు మొదలైనవాని మానము ప్రకృతి స్థితిలోనుండు శరీరమునందు తప్పకయుండునని చూపుచు "ఏతదుభయమ్" అను మొదలగునవి చెప్పు

చున్నాడు. "ఉభయమ్" అనగా దృశ్యము మరియు తర్క్యము అను రెండును. "ప్రకృతిభావాత్" అనగా శరీరము యొక్క అవికృతత్వముచేత అని అర్థము. ఎచట శరీరము వికృతమగునో అచట ఇప్పుడు చెప్పబడిన త్వక్కు మొదలగువాని మానము కూడ వికృతమగునని భావము. లేదా, ఇది యథావత్తుగా లెక్కింపబడిన దని భేదము. ఇచట ఏకీయ మతమును చెప్పుచున్నాడు— "త్వక్ప్రభృతి దృశ్యం తర్క్యమేవ చైకే" అని పాఠము గలదు. దీని అర్థము — దృశ్యమగు త్వక్కు మొదలుకొని చెప్పబడినదేది కలదో అది తర్క్యముగూడ అగునని కొందరు ఆచార్యులు చెప్పుదురు. "తదుభయమ్" అది ఏకీయమతము మరియు మనమతము గూడనదియే. "న వికల్పతే" అనగా చెప్పబడిన అవయవ సంఖ్యకు వ్యతిరేకముగా చెప్పబడదు. "ప్రకృతిభావాచ్ఛరీరస్య" అనుదానికి మొదటవలెనే వ్యాఖ్యానించు కొన వలెను. ఇందువలన, త్వగాదులు తర్క్యములే యగుగాక, దృశ్యమనునది తర్క్యము యొక్క భేదముచే భిన్నమేయగుగాక, అయినప్పటికీ యథోక్త సంఖ్యను అతిక్ర మింపదని వాక్యార్థము.

## శరీరమునందలి ఉదకాదుల కొలత

15. యత్త్వఞ్జలిసంఖ్యేయం తదుపదేక్ష్యామః;తత్ పరం ప్రమాణమభిజ్ఞేయం,-తచ్చ వృద్ధిహ్రాసయోగి,తర్క్యమేవ.తద్యథా— దశోదకస్యాఞ్జలయః శరీరే స్వేనాఞ్జలిప్రమాణేన,యత్తు ప్రచ్యవమానం పురీషమనుబధ్నాత్యతియోగేన తథా మూత్రం రుధిరమన్యాంశ్చ శరీరధాతూన్,యత్తు సర్వశరీరచరం బాహ్యా త్వగ్బిభర్తి,యత్తు త్వగన్తరే వ్రణగతం లసీకాశబ్దంలభతే,యచ్చోష్మణాఽను-బద్ధం లోమకూపేభ్యో నిష్పతత్ స్వేదశబ్దమవాప్నోతి,తదుదకం దశాఞ్జ-లయః విప్రమాణం; నవాఞ్జలయః పూర్వస్యాహారపరిణామధాతోః,యం'రస'-ఇత్యాచక్షతే;అష్టౌ శోణితస్య,సప్త పురీషస్య,షట్ శ్లేష్మణః,పఞ్చ పిత్తస్య, చత్వారో మూత్రస్య,త్రయో వసాయాః,ద్వౌ మేదసః,ఏకో మజ్జాయాః, మస్తిష్కస్యార్ధాఞ్జలిః,శుక్రస్యతావదేవప్రమాణం,తావదేవ శ్లైష్మికస్యౌజస ఇతి.ఏతచ్ఛరీరతత్త్వముక్తమ్.

**తాత్పర్యము :** శరీరమునందు అంజలిచే కొలవదగియున్న (ద్రవ) భావములను చెప్పుచున్నాము. ఈ పరిమాణము శ్రేష్ఠమైన సహజ పరిమాణముగ నుండును. ఈ పరిమాణమునకు వృద్ధిగానీ, క్షయముగానీ యున్నచో తర్కించి తెలిసి

కొనవలెను. శరీరమునందలి ఉదకము ఆ వ్యక్తియొక్క స్వంత దోసిలి (అంజలి)తో పది అంజలుల ప్రమాణమున నుండును. ఏది అతిగా స్రవించు పురీషము, మూత్రము, రక్తము మరియు ఇటువంటి ఇతర ధాతువులను ఆశ్రయించి యుండునో, ఏది సర్వ శరీరమునందు వ్యాపించుచున్నదై బాహ్యత్వక్కును పోషించుచుండునో, ఏది త్వక్కుల మధ్యయందుండి వ్రణమేర్పడినపుడు లసీక రూపమున బయటకు వచ్చు చుండునో, ఏది వేడిమి (ఉష్మ)తో కూడుకొని రోమ కూపములనుండి బయలువెడలి స్వేదమని చెప్పబడునో అట్టి ఉదకము పది దోసిళ్ళ ప్రమాణములో నుండును. రస మని పేర్కొనబడు ఆహారముయొక్క మొదటి పరిణామధాతువు తొమ్మిది దోసిళ్ళ ప్రమాణమున నుండును. రక్తము ఎనిమిది దోసిళ్ళ పరిమాణము, పురీషము ఏడు దోసిళ్ళ పరిమాణము, శ్లేష్మము ఆరు దోసిళ్ళ ప్రమాణము, పిత్తము ఐదు దోసిళ్ళ ప్రమాణము, మూత్రము నాలుగు దోసిళ్ళ పరిమాణము, వస మూడు దోసిళ్ళ పరి మాణము, మేదస్సు రెండు దోసిళ్ళ పరిమాణము, మజ్జ ఒక దోసిలి పరిమాణము, మెదడు అరదోసిలి ప్రమాణము, శుక్రము అరదోసిలి ప్రమాణము, ఓజస్సు (శ్లేష్మ రూపమగు ఓజస్సు) అరదోసిలి ప్రమాణము ఉండును. ఇట్లు శరీరముయొక్క జ్ఞానము చెప్పబడినది.

**ఆయుర్వేదదీపిక :** నిజమునకు ఏ విధముగా ప్రకృతిస్థమగు శరీరము నందు యథోక్తమగు త్వగాదుల మానము తప్పదో, అట్లే ప్రకృతిస్థమగు శరీరము నందు ఆ ఉదకాదులును యథోక్తమానమును తప్పవా ఏమి అను విషయమును "యత్త్వంజలి" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. ఉదకాదులకు ఇక ముందు చెప్పబోవు అంజలి సంఖ్య యేదికలదో అది వాటికి పరమ ఉత్కృష్టమగు ప్రమాణము. అందువలన ప్రకృతిస్థమగు శరీరమునందుగూడ ఉదకాదులకు వృద్ధి హ్రాసములు కలుగునని తర్కించియే తెలియదగియున్నది. ఇందువలన, ఇచట ఉద కాదుల ప్రమాణమేది పేర్కొనబడునో అది ప్రకృష్టములగు ఉదకాదుల ప్రమాణము. అందువలన చెప్పిన ప్రమాణము కంటె కొంచెము తక్కువైననూ అట్లే కొంచెము ఎక్కువైననూ అదియునూ ప్రాకృతమానమేయని తెలిసికొనవలెను. "దశోదకాఞ్జ లయః" అని మొదటపేర్కొనిగూడ "తదుదకం దశాఞ్జలిప్రమాణమ్" అని మరల నేది చెప్పుచున్నాడో, అందువలన గ్రంథము మధ్యన చెప్పబడిన లసీక, స్వేదాదుల సంజ్ఞకు ఉదకము వేరుగాదని చూపుచున్నాడు. "పూర్వస్య" మొదటిదానికి. "వసా" అనగా మాంసము నందుండు స్నేహపదార్థము. "మస్తిష్కః" అనగా శిరస్సు

నందుండు స్నేహపదార్థము. "శ్లైష్మికస్యౌజసః" అనుటవలన అష్టబిందుకమగు ఓజస్సేది కలదో దానికి అతిరిక్తమగునట్టి, ఓజోవహ ధమనులచే వహింపబడునట్టి విశుద్ధమగు శ్లేష్మముతో సమానమగు గుణములు గల ఓజస్సునకు అర్ధాంజలి ప్రమాణ ముండుట చూపుచున్నాడు. ఓజస్సు పర అవర భేదమువలన (పర-అపర ?) రెండు విధములుగా నుండునని అర్థేదశ మహామూలీయాధ్యాయమునందు (సూత్రస్థానము) చూపబడియేయున్నది.

## శరీరము పాంచభౌతికమనుటకు వివరణము

16. తత్ర యద్విశేషతః స్థూలం స్థిరం మూర్తిమద్గురుఖరకఠినమఙ్గం నఖాస్థి-దన్తమాంసచర్మవర్చఃకేశశ్మశ్రులోమకణ్డరాది తత్ పార్థివంగన్ధో ఘ్రాణం చ;యద్ద్రవసరమన్దస్నిగ్ధమృదుపిచ్ఛిలం రసరుధిరవసాకఫపిత్తమూత్రస్వేదాది తదాప్యం రసో రసనం చ; యత పిత్తమూష్మా చ యో యా చ భాః శరీరే తత్ సర్వమాగ్నేయం రూపం దర్శనం చ; యదుచ్ఛ్వాసప్రశ్వాసోన్మేష-నిమేషాకుఞ్చనప్రసారణగమనప్రేరణధారణాది తద్వాయవీయం స్పర్శః స్పర్శనం చ;యద్వివిక్తం యదుచ్యతే మహాన్తి చాణూని స్రోతాంసి తదాన్త-రిక్షం శబ్దః శ్రోత్రం చ;యత్ప్రయోక్తృ తత్ ప్రధానం బుద్ధిర్మనశ్చ.ఇతి శరీరావయవసంఖ్యా యథాస్థూలభేదేనావయవానాం నిర్దిష్టా.

**తాత్పర్యము :** శరీరమునందు స్థూలముగ, స్థిరముగ, మూర్తిమంతముగ గురు ఖర కఠినత్వములను కలిగియుండు గోళ్ళు, ఎముకలు, దంతములు, మాంసము, చర్మము, మలము, కేశములు, శ్మశ్రువులు, రోమములు, కండరములు మొదలగునవి మరియు గంధము ఘ్రాణేన్ద్రియములుకూడ పార్థివములుగ నున్నవి. ద్రవముగను, ప్రసరించునవిగను, మంద స్నిగ్ధ మృదు పిచ్ఛిలగుణములతో కూడియున్నట్టియు రసము, రక్తము, వస, కఫము, పిత్తము, మూత్రము, స్వేదము మొదలగునవి మరియు రసము రసనేన్ద్రియములు గూడ ఆప్యములుగ నుండును. పిత్తము, ఊష్మము, శరీరకాంతి మొదలగునవి మరియు రూపము దర్శనేన్ద్రియములు కూడ ఆగ్నేయములుగ నుండును. ఉచ్ఛ్వాసము, నిశ్వాసము, ఉన్మేషము, నిమేషము, ఆకుంచనము, ప్రసారణము, గమనము. ప్రేరణము, ధారణము మొదలగునవి మరియు స్పర్శ, స్పర్శనేన్ద్రియములుగూడ వాయవ్యములుగ నుండును. శరీరము నందలి పెద్దరంధ్రములును, చిన్నవియునగు స్రోతస్సులు మరియు శబ్దము

శ్రోత్రముగూడ అంతరిక్షసంబంధమైనవిగా నుండును. ఏది ప్రయోక్తగా నుండునో అది ఆత్మ బుద్ధి మరియు మనస్సు అయియున్నది. ఇట్లు అవయవముల సంఖ్య శరీరావయవముల స్థూల భేదము వలన యథావిధిగా చెప్పబడినది.

**ఆయుర్వేదదీపిక :** శరీరావయవముల సంఖ్యను ప్రమాణము వలన పేర్కొని పార్థివాది భేదమువలన అవయవములను పేర్కొనుటకు "తత్ర" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "సరమ్" అనగా కొంచెము గలిమంతమైనది. మంద క్రియలు గలది మంద మనబడును. వివిక్తమ్ అనగా విభజింపబడియున్నది. "యదుచ్యతే" అనగా వచనము (చెప్పబడుట) అని అర్థము. శబ్దము అని ఇచట గ్రహించుట వలన వచన వ్యతిరేకమగు శారీరిక శబ్దము గ్రహించబడును. వచనము అనునది "యదుచ్యతే" అను పదము వలననే గ్రహింపబడినది. "ప్రయోక్తృ" అనగా శరీరాదులకు ప్రేరకమగు నేది కలదో అట్టి చేతనాతత్త్వము "యథాస్థూల భేదేన" అను వచనమువలన పరమాణు రూపమగు సూక్ష్మావయవ భేదమువలన చెప్పబోవు లెక్కించుటను సూచించుచున్నాడు. "అతి బహుత్వాత్" అని అనుటవలన గంగ యందలి ఇసుకకువలె అతి బహుత్వముగూడ లెక్కించ లేకపోవుటకు కారణమగుచున్నదని చూపుచున్నాడు.

## పరమాణు రూపమగు శరీరావయవముల అసంఖ్యేయత్వము

17. శరీరావయవాస్తు పరమాణు భేదేనాపరిసంఖ్యేయా భవన్తి, అతిబాహుల్యాదతి సౌక్ష్మ్యదతీన్ద్రియత్వాచ్చ. తేషాం సంయోగవిభాగే పరమాణూనాం కారణం వాయుః కర్మ స్వభావశ్చ.

**తాత్పర్యము :** శరీరావయవములు పరమాణు భేదము ననుసరించి మిక్కిలి అధికముగ నుండుటవలనను, మిక్కిలి సూక్ష్మముగ నుండుటవలనను, ఇంద్రియ గోచరములు కానివగుట వలనను లెక్కకు మించినవిగ నుండును. అట్టి పరమాణువులు కలియుటకుగాని విడిపోవుటకుగాని వాయువును, కర్మ స్వభావమును కారణములుగ నుండును.

**ఆయుర్వేదదీపిక :** "అతి సౌక్ష్మ్యాత్" అనగా అతి సూక్ష్మమగు బుద్ధిచే తెలిసికొన దగినవగుటచేత అని అర్థము. పరమాణువుల యొక్క అతీంద్రియత్వము మనలందరి యెడల స్వభావ సిద్ధమే. ఏది సూక్ష్మము మరియు అతీంద్రియముగా

నుండునో అది లెక్కించుటకును ఎవరికినీ సాధ్యపడనిదగుటచే లెక్కింపలేక పోవు టకు చెప్పబడిన హేతుత్రయము యుక్తముగానే యున్నది. ఇక ఈ విషయములతో కూడియున్న పరమాణువులు ఎట్లు శరీరారంభమున సంయోగించును, శరీర వినాశ నమునందు ఎట్లు వియోగించును అను విషయమును "తేషామ్" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. నిజమునకు పరమాణువుల సంయోగ విభాగముల యందు వాయువు కారణముగదా అది ఎట్లు ఎల్లప్పుడును సంయోగ విభాగములను పరమాణు వులకు కల్గించదు అను విషయమును "కర్మ స్వభావశ్చ" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. కేవలము వాయువేకాక కర్మ స్వభావముకూడ తీసికొనబడియే యున్నది. అందువలన సంయోజక స్వభావముకల కర్మవలన పరిగ్రహింప బడిన వాయువు పరమాణువులకు సంయోగమును కలిగించుచూ శరీరమును ఆరంభింప జేయును, ఎప్పుడైతే వియోజక స్వభావము కల కర్మవలన వాయువు పరిగ్రహింప బడునో అపుడు వినాశరూపమగు పరమాణువుల వియోగమును జనింపజేయును అని అర్థము.

## శరీరావయవ సంఖ్యా పరిజ్ఞాన ప్రయోజనము

18. తదేతచ్ఛరీరం సంఖ్యాతమనేకావయవం దృష్టమేకత్వేన సఙ్గః, పృథక్త్వే నాపవర్గః. తత్ర ప్రధానమసక్తం సర్వసత్తా నివృత్తౌ నివర్తతేఇతి.

**తాత్పర్యము :** అనేకావయవములు కలదిగ చెప్పబడిన ఈ శరీరమును ఏకత్వముగ చూచినచో రాగద్వేషములతో కూడుకొనిన వాడగును. భిన్నముగా చూచినచో మోక్షమును పొందును. రాగద్వేషములతో కూడుకొనని ఆత్మ సమస్త భావములతోను సంబంధములేని దగుట వలన మోక్షమును పొందును.

**ఆయుర్వేదదీపిక :** ఇపుడు "తదేతత్" అను మొదలగువానిద్వారా శరీర సంఖ్యానము యొక్క ఫలమును చెప్పుచున్నాడు. పరమార్థమున అనేకావయవము లతోగూడి యున్ననూ ఆ శరీరమును లెక్కించుట (తెలిసికొనుట) యందు మోహమువలన ఒక్కటిగానే చూచుట సంగము అనబడును అని అర్థము. శరీర మును ఒక్కటిగానే చూచుచు దానికి ఉపకారము చేయుటకు ప్రవర్తించు మనుష్యుడు రాగద్వేషములందు ఆసక్తుడై యుండును. "అపవర్గః" అనగా అపవర్గ హేతువు అని అర్థము. నేర్వేరు అవయవములుగా శరీరమును తెలిసికొనుటవలన దానిపై మమతా

స్పదము కలుగదు. మమత లేనందువలన దానికి ఉపకారము లేదా అపకారమును కలుగజేయు భావములందు రాగద్వేషములు కలుగవు. అది లేనపుడు ప్రవృత్తి నశించి నపుడును ధర్మాధర్మములు లేనందువల్ల మోక్షము కలుగునని భావము. శరీరమును వేర్వేరుగా తెలిసికొనుట యందు ఎట్లు మోక్షము కలుగునో ఆ విషయమును "తత్ర" అను మొదలగువాని ద్వారా చెప్పుచున్నాడు. ప్రధానమనగా ఆత్మ. "తత్ర" అనగా శరీరము విడివిడిగా నుండునను భావమునందు. "అసక్తమ్" అనగా యథోక్త క్రమమున రాగద్వేష రహితమగు అని అర్థము. "సర్వసత్తా నివృత్తౌ" అనగా సర్వత్రయు ఉపకారములగుగానీ అపకారకములగు భావములందు ఆశలేకుండగ నున్నపుడు. నివర్తతే అనగా సంసారము నివర్తించును అని అర్థము.

## శరీర సంఖ్యాజ్ఞానముచే వైద్యునకు కలుగు ప్రయోజనము

తత్ర శ్లోకా —

19. శరీరసంఖ్యాం యో వేద సర్వావయవశో భిషక్,
తదజ్ఞాననిమిత్తేన స మోహేన స యుజ్యతే.

20. అమూఢో మోహమూలైశ్చ న దోషైరభిభూయతే,
నిర్దోషో నిఃస్పృహః శాన్తః ప్రశామ్యత్యపునర్భవః.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే శారీరస్థానే
శరీర సంఖ్యా శారీరం నామ సప్తమోఽధ్యాయః

**తాత్పర్యము :** ఏ వైద్యుడు సర్వావయవములతోగూడ శరీర సంఖ్యను తెలిసికొనునో అట్టివాడు అజ్ఞాన నిమిత్తమున కలుగు మోహముతో సంబంధము కలిగియుండును. మూఢుడు కానివాడై (జ్ఞానవంతుడై) మోహము వలన కలుగు దోషములచే పీడింపబడడు (అవహింపబడడు.) అతడు నిస్పృహుడు శాంతుడునై సంసారమునుండి విరమించి పునర్జన్మ లేనివాడగును.

ఇది అగ్నివేశునిచే రచింపబడి చరకునిచే ప్రతిసంస్కరింపబడిన తంత్రమందలి శారీర స్థానమున శరీర సంఖ్యా శారీరమను ఏడవ అధ్యాయము.

**ఆయుర్వేదదీపిక :** గద్యమునందు చెప్పబడిన ఈ విషయమునే శ్లోకములతో "శరీర" అను మొదలగునవి చెప్పుచున్నాడు. "తదజ్ఞాన నిమిత్తేన" అనగా

శరీరము ఒక్కటియే అను మిథ్యా జ్ఞానము వలన కలుగునట్టి. "మోహేన" అనగా నేను ఒక్కటే స్థిరశరీరము గలవాడను. నాకు ఇది ఉపకారమును చేయును, ఇది అపకారమును చేయును ఇత్యాది రూపమగు మోహమువలన అని అర్థము. "మోహ మూలైః" అనగా మోహము వలన పుట్టిన వాటిచే. దోషైః అనగా రాగద్వేషముల చేత; నిర్దోషత్వమువలన నిస్పృహ కలుగును. ఇచ్ఛకు రాగద్వేషములు మూలము, అది లేనపుడు ఇచ్ఛ కలుగదు. నిస్పృహుడగుచు సర్వ క్రియలు నశించుట వలన శాంతుడగును. శాంతుడగుచునూ సంసారమునుండి "ప్రశామ్యతి" అనగా విశ్ర మించును. అటుపైనను ఆతనికి జన్మరూపమగు పునర్భవము కలుగదని భావము.

ఇది శ్రీ చక్రపాణిచే రచింపబడిన ఆయుర్వేద దీపిక యనెడు చరక తాత్పర్య టీక యందలి శరీరస్థానమున శరీరసంఖ్యా శారీరమను ఏడవ అధ్యాయము.

—×—

# అష్టమాధ్యాయము

# జాతిసూత్రీయ శారీరము

1. అథాతో జాతిసూత్రీయం శారీరం వ్యాఖ్యాస్యామః.

2. ఇతి హ స్మాహ భగవానాత్రేయః.

**తాత్పర్యము :** ఇక ఇపుడు జాతిసూత్రీయ శారీరమును గూర్చి చెప్పు కొందము.

అని ఆత్రేయ భగవానుడనెను.

**ఆయుర్వేదదీపిక :** ఇపుడు పరిశేషమగుటచేత జాతి సూత్రీయము చెప్ప బడుచున్నది. "జాతి" శబ్దము వలన జన్మకారణము చెప్పబడును దాని సూత్రమనగా జన్మోపాయమును చెప్పుట. దాని నాధారముగ చేసికొని చెప్పబడిన అధ్యాయము జాతిసూత్రీయాధ్యాయము.

3. స్త్రీ పుంసయోరవ్యాపన్నశుక్రశోణితగర్భాశయయోః శ్రేయసీం
ప్రజామిచ్ఛతో స్తదర్థాభినిర్వృత్తికరం కర్మోపదేక్ష్యామః.

**తాత్పర్యము :** దూషితములు కాని శుక్ర శోణిత గర్భాశయములు కలిగి నట్టి, మంచి సంతానమును కోరుచున్నట్టి స్త్రీ పురుషులకు అందుకొరకు ఉపయో గించు కర్మను ఉపదేశింపబోవుచున్నాము.

**ఆయుర్వేదదీపిక :** "స్త్రీ పుంసయోః" అని కర్మ నిర్దేశమును జేసి "అవ్యాపన్నశోణిత గర్భాశయ శుక్రయోః" అను నిర్దేశము యథాక్రమానురోధము వలన సరిగానున్ననూ "అల్పాక్షరం పూర్వం నిపతతి" అను న్యాయము నాశ్రయించి క్రమ భేదము వలన నిర్దేశము చేయబడినది. "శ్రేయసీం ప్రజామిచ్ఛతః" అనుచోట శ్రేయసీ ప్రజా అనునది గుణవంతుడగు పుత్రుడు గుణవంతురాలగు కన్యకను గూడ సూచించును. ఎందువలననగా ఇచట కన్యోత్పాదనా విధానము గూడ కొంచెముగా చెప్పబోవుచున్నాడు. అందువలన నిర్గుణములు కలవారగు పుత్రుడు, కన్య లేక నపుంసకుడును శ్రేయస్సు కలిగించువారు కానందున వదిలి పెట్టబడెను. ఇతరులు

మాత్రము పుత్రునియే మంచి సంతానమందురు. ఎందువలననగా ఇచట సర్వమునూ పుత్రుని ఉద్దేశించియే విధానమును చెప్పబోవుచున్నాడు. "తదర్థాభినిర్వృత్తికరమ్" అనగా మంచి సంతాన రూపమగు ప్రయోజనమును కలిగించునట్టి అర్థము.

## పుత్రోత్పత్తికి తగిన విధానమును చేయుట

4. అథాప్యేతౌ స్త్రీపుంసౌ స్నేహస్వేదాభ్యాముపపాద్య,
వమనవిరేచనాభ్యాం సంశోధ్య,క్రమేణ ప్రకృతిమాపాదయేత్.
సంశుద్ధౌ చాస్థాపనానువాసనాభ్యాముపాచరేత్, ఉపాచరేచ్చ
మధురౌషధసంస్కృతాభ్యాం ఘృతక్షీరాభ్యాం పురుషం,స్త్రియం తు తైలమా-
షాభ్యాం.

**తాత్పర్యము :** స్త్రీ పురుషులకు స్నేహస్వేదములను చేయించి, వమన విరేచనములతో శోధనము చేయించి పేయాదిక్రమమున ప్రకృత స్థితికి తేవలయును. సంశుద్ధిమైనప్పుడు ఆస్థాపన అనువాసన వస్తుల నివ్వవలెను. తరువాత పురుషునకు మధురౌషధములతో సంస్కరింపబడిన ఘృత క్షీరములను స్త్రీలకు తైలము, మాషములను ఇవ్వవలెను.

**ఆయుర్వేదదీపిక :** అథాపి అను మొదలగు వానియందు అథశబ్దము అధికారము నందు: అపి శబ్దము విశేషార్థముగను ఉపయోగింపబడినవి అందువలన దోషములు లేనట్టి శుక్రశోణిత గర్భాశయములు కల స్త్రీ పురుషులిరువురకును మంచి సంతానమును కలిగించు గుణములు వచ్చుట కొరకు స్నేహాది కర్మ చేయవలసి యుండునని చూపుచున్నాడు. "ఏతౌ" అను పదము వలననే అధికృతమగు స్త్రీ పురుషులిరువురు అను అర్థము వచ్చునప్పటికీ మరల "స్త్రీ పుంసౌ" అని చెప్పుట వలన స్త్రీ పురుషులరువురకూ ఒకే సమయమున స్నేహనము మొదలగు చెప్పబోవు కర్మలను ఉపయోగింపవలెనని చూపుచున్నాడు. "క్రమేణ" అనగా పేయాది క్రమమున అని అర్థము. ఆ క్రమము గూడ వమనమునందు, విరేచనము నందునూ వేర్వేరు ప్రదేశములందు చెప్పబడిన క్రమ న్యాయము వలన చేయవలెనని తెలిసికొనవలెను. మరల "సంశుద్ధౌ" అను వచనము వలన సమ్యక్ శుద్ధి జరిగిన వారికే ఆస్థాపనానువాసనముల నివ్వవలెనుగానీ సమ్యక్ శుద్ధి జరుగని వారికి ఇవ్వరాదు అని చూపుచున్నాడు. "మధురౌషధ" శబ్దము వలన మధురము విశేషముగా శుక్రమును

పెంపొందించుట వలన సర్వ మధురౌషధములను గ్రహించవలెను. ఇతరులు మాత్రము మధురౌషధ శబ్దము వలన జీవనీయ గణమును గ్రహింతురు.

## మైథునవిధి

5. తతః పుష్పాత్ ప్రభృతి త్రిరాత్రమాసీత బ్రహ్మచారిణ్యధఃశాయినీ, పాణిభ్యామన్నమజర్జరపాత్రాద్భుఞ్జానా, న చ కాఞ్చిన్మృజామాపద్యేత. తతశ్చతుర్థేఽహన్యేనాముత్సాద్య సశిరస్కం స్నాపయిత్వా శుక్లాని వాసాంస్యాచ్ఛాదయేత్ పురుషం చ.తతః శుక్లవాససౌ స్రగ్విణౌ సుమనసావన్యోన్యమభికామౌ సంవసేయాతాం స్నానాత్ ప్రభృతి యుగ్మేష్వహఃసు పుత్రకామౌ, అయుగ్మేషు దుహితృకామౌ.

6. న చ న్యుబ్జాం పార్శ్వగతాం వా సంసేవేత.న్యుబ్జాయా వాతో బలవాన్ స యోనిం పీడయతి,పార్శ్వగతాయా దక్షిణే పార్శ్వే శ్లేష్మా స చ్యుతః పిదధాతి గర్భాశయం,వామే పార్శ్వే పిత్తం తదస్యాః పీడితం విదహతి రక్తం శుక్రం చ,తస్మాదుత్తానా బీజం గృహ్ణీయాత్:తథాహి యథాస్థానమవతిష్ఠన్తే దోషాఃపర్యాప్తే చైనాం శీతోదకేన పరిషిఞ్చేత్. తత్రాత్యశితా క్షుధితా పిపాసితా భీతా విమనాః శోకార్తా క్రుద్ధాఽన్యం చ పుమాంసమిచ్ఛన్తీ మైథునే చాతికామా వా న గర్భం ధత్తే,విగుణాం వా ప్రజాం జనయతి. అతిబాలామతివృద్ధాం దీర్ఘరోగిణీమన్యేన వా వికారేణోపసృష్టాం వర్జయేత్. పురుషేఽప్యేత ఏవ దోషాః.అతః సర్వదోషవర్జితౌ స్త్రీపురుషౌ సంసృజ్యేయాతామ్.

7. సఞ్జాతహర్షౌ మైథునే చానుకూలావిష్టగన్ధం స్వాస్తీర్ణం సుఖం శయనముపకల్ప్య మనోజ్ఞం హితమశనమశిత్వా నాత్యశితౌ దక్షిణపాదేన పుమానారోహేత్ వామపాదేన స్త్రీ.

8. తత్ర మన్త్రం ప్రయుఞ్జీత—"అహిరసి ఆయురసి సర్వతః ప్రతిష్ఠాసి ధాతా త్వా దదతు విధాతా త్వా దధాతు బ్రహ్మవర్చసా భవ." ఇతి.
"బ్రహ్మా బృహస్పతిర్విష్ణుః సోమః సూర్యస్తథాఽశ్వినౌ,
భగోఽథ మిత్రావరుణౌ వీరం దదతు మే సుతమ్".
ఇత్యుక్త్వా సంవసేయాతామ్.

తాత్పర్యము : ఆర్తవ దర్శనము కలిగినది మొదలు మూడు రోజుల వరకు స్త్రీ బ్రహ్మచారిణిగను నేలమీద పరుండునదిగను నుండవలయును. మరియు క్రొత్తదియగు పాత్రలో చేతులతో తినవలయును. వేనిని స్పృశించకూడదు. నాల్గవ రోజున ఈ స్త్రీకి తైలమును పూసి శిరస్స్నానమును చేయింపవలెను. పిమ్మట స్త్రీయును, పురుషుడును తెల్లని వస్త్రములను ధరింపవలెను. అట్లు తెల్లని వస్త్రములను ధరించినట్టియు, పుష్పమాలికలను ధరించినట్టియు, నిర్మలమైన మనస్సు కలిగినట్టియు పరస్పరము ప్రేమ కలిగినట్టియు స్త్రీ పురుషులు మైథునమును ఆచరింపవలెను. పుత్ర సంతానమును కోరినచో ఋతు స్నానము చేసినది మొదలు యుగ్మదినములందును (సరిసంఖ్య గల దినములందును) పుత్రికను కోరినచో ఋతు స్నానము చేసినది మొదలు అయుగ్మ దినములందును (బేసి సంఖ్యగల దినములందును) మైథునమును ఆచరింపవలెను. వక్రముగా (వంగిగాని బోర్లపరుండిగాని) పడుకొని యుండిన స్త్రీతో సంభోగము చేయకూడదు. వక్రమముగా పరుండిన స్త్రీకి వాతము బలవంతముగ నుండి యోనిని పీడించును. పార్శ్వములచే పరుండిన స్త్రీ కుడి పార్శ్వమున నున్నచో శ్లేష్మము స్రవించి గర్భాశయమును మూసివేయును. ఎడమ పార్శ్వమున పరుండినచో పిత్తము ప్రకోపించి ఆర్తవమును శుక్రమును దహించివేయును. అందువలన స్త్రీ వెల్లకిల పరుండియే శుక్రమును గ్రహింపవలయును. స్త్రీ వెల్లకిల పరుండి యున్నపుడే దోషములు స్వస్థానమున నుండును. మైథునము నాచరించిన పిదప చన్నీటిలో స్నానమునాచరింపవలయును. అధికముగ భుజించినట్టిగాని, ఆకలితో కూడుకొనినట్టిగాని, దప్పికతో యున్నట్టిగాని, భయముతో నున్నట్టిగాని పరధ్యానముగా నున్నట్టిగాని, దుఃఖము కోపముతో యున్నట్టిగాని ఇతర పురుషుని కోరుచున్నట్టిగానీ, మైథునమునందు అధికమైన కోరిక గలిగియున్నట్టిగానీ స్త్రీ గర్భమును ధరింపదు. ధరించిననూ వికృత గుణములు కలిగిన సంతానమును కనును. మిక్కిలి బాల్యమునందున్నట్టిగానీ, మిక్కిలి వార్ధక్యము గలిగినట్టిగానీ దీర్ఘవ్యాధితో బాధపడుచున్నట్టియు, ఇంకేదైననూ వ్యాధితో పీడింపబడుచున్నట్టియు స్త్రీతో మైథునమును ఆచరింపకూడదు. ఇట్టి దోషములు కల పురుషుడు కూడ మైథునమును చేయరాదు ఏ విధమగు దోషమునూ లేనట్టి స్త్రీ పురుషులు మైథునమును ఆచరింపవలయును.

ఇష్టమైన సువాసనలను వెదజల్లబడినట్టి, బాగుగా పరచబడినట్టి సుఖమగు మనోజ్ఞమును అగు శయనమును ఏర్పరుచుకొని మైథునమునందు ఉత్సాహము

కల్గి హితమగు ఆహారమును అల్పమాత్రముగనే భుజించి స్త్రీ పురుషులు శయ్యను జేరవలెను. ఆ సమయమున పురుషుడు శయ్యను ఎక్కునపుడు కుడికాలు దానిపై ముందుగా పెట్టి ఎక్కవలెను. స్త్రీ తన ఎడమకాలిని శయ్యపై ముందుగా పెట్టి ఎక్కవలెను.

అచట "అహిరసి ఆయురసి సర్వతః ప్రతిష్ఠాఽసి ధాతా త్వా దదతు విధాతా త్వా దధాతు బ్రహ్మవర్చసా భవ" అను మంత్రమును
"బ్రహ్మా బృహస్పతిర్విష్ణుః సోమః సూర్య స్తథాశ్వినౌ,
భగోఽథ మిత్రావరుణౌ వీరం దదతు మే సుతమ్."
అను శ్లోకమును చెప్పి తరువాత మైథునము నాచరింపవలయును.

ఆయుర్వేదదీపిక : "పుష్పాత్" అనగా ఆర్తవదర్శనము నుండి "బ్రహ్మచారిణీ" "అధఃశాయినీ" అనువానిని "త్రిరాత్రమ్" అనుదానితో అన్వయించుకొనవలెను. "అధఃశాయినీ" అనగా ఎత్తుగా లేని శయ్యపై పరుండినది అని అర్థము. "పాణిభ్యామన్నమజర్జరపాత్రాద్భుఞ్జానా" అనగా చేతులపైన పగులని పాత్రను పెట్టుకొని దానిలోనున్న ఆహారమును భుజించునది అని అర్థము. "న చ కాంచిన్మృజామ్" అనగా శరీరావయవములందుగానీ సంపూర్ణ శరీరమునుగానీ మార్జనము చేయనట్టిది అని అర్థము. పురుషునికి కూడ నాల్గవరోజున "ఉత్సాద్య" అను మొదలగు గ్రంథమునందు చెప్పబడిన క్రియలతో స్నానాదికములు చేయించవలెను అని అర్థము. "స్నానాత్ ప్రభృతి" అనుదానికి "సంవసేయాతామ్" అని అన్వయించుకొనవలెను. అందువలన స్నానము మొదలుకొని మైథునము విధింపబడు చున్నది. కాని, స్నానము చేసిన రోజునుండిగాదు, ఎందువలననగా పుత్రకాములకు యుగ్మదినములందు మైథునము చేయవలెనని చెప్పియుండుటచేత అట్లు అనుకొనవలెను. యుగ్మదినమనునది (సరి సంఖ్య గల దినమనునది) ప్రథమ ఋతు దర్శన దినము మొదలుకొనియే లెక్కింపవలెను. హారీతసంహిత యందు— "చతుర్థీషష్ఠ్యష్టమీద్వాదశీషుగుణవ త్తమాయుష్మ న్తం పుత్రం జనయతి, పఞ్చమీ సప్తమ్యేకాదశీషు కన్యాం గుణవతీం, స ప్తమ్యాం దుర్భగాంకన్యాం" అని చెప్పబడియున్నది. "న్యుబ్జాం" అనగా అధోముఖముగా నున్నదానిని. "పర్యాప్తే" అనగా మైథునము పూర్తియైనపుడు. "మైథునే చాతికామా" అనగా మైథునేచ్ఛ నివర్తించిన పురుషునియందు కూడ తిరిగి మైథునము చేయించుకొనగోరుచున్న స్త్రీ అని అర్థము. "అన్యేన వా

వికారేణ" అనగా కుష్ఠరోగము మొదలగువానిచే జుగుప్సితమగు శరీరముగల స్త్రీ అని అర్థము. "ఆరోహేత్" అనుదానికి "శయనమ్" అని సంబంధము. "అహిరసి" మొదలుకొని "దదతు మే సుతమ్" అనువరకు మంత్రము.

### కోరిన పుత్రుని పొందుటకు అవలంబింపవలసిన నియమములు

9. సా చేదేవమాశాసీత – బృహన్తమవదాతం హర్యక్షమోజస్వినం శుచిం సత్త్వసంపన్నం పుత్రమిచ్ఛేయమితి,శుద్ధస్నానాత్ ప్రభృత్యస్యై మన్థమవదాతయవానాం మధుసర్పిర్భ్యాం సంసృజ్య శ్వేతాయాగోః స్వరూపవత్స్యాయాః పయసాఽఽలోడ్య రాజతే కాంస్యే వా పాత్రే కాలే కాలే సప్తాహం సతతం ప్రయచ్ఛేత్ పానాయ.ప్రాతశ్చ శాలియవాన్నవికారాన్ దధిమధుసర్పిర్భిః పయోభిర్వా సంసృజ్య భుఞ్జీత,తథా సాయమవదాతశరణ-శయానాసనభూషణా చ స్యాత్. సాయం ప్రాతశ్చ శశ్వచ్ఛ్వేతం మహాన్తం వృషభమాజానేయం వా హరిచన్దనాఙ్గం పశ్యేత్. సౌమ్యాభిశ్చైనాం కథాభిర్మనోనుకూలాభిరుపాసీత. సౌమ్యాకృతివచనోపచారచేష్టాంశ్చ-స్త్రీపురుషానితరానపి చేన్ద్రియార్థానవదాతాన్ పశ్యేత్,సహచర్యశ్చైనాం ప్రియహితాభ్యాం సతతముపచరేయుస్తథా భర్తా. న చ మిశ్రీభావమాప-ద్యేయాతామితి. అనేనవిధినా సప్తరాత్రం స్థిత్వాఽష్టమేఽహన్యాప్లుత్యాద్భిః సశిరస్కం సహ భర్త్రా అహతాని వస్త్రాణ్యాచ్ఛాదయేదవదాతాని, అవదాతాశ్చ స్రజో భూషణాని చ బిభృయాత్.

**తాత్పర్యము :** ఆ స్త్రీ తనకు గొప్పవాడును, పరిశుభ్రమైన వర్ణము కలవాడును, సింహ సమాన పరాక్రముడును, అధికమైన ఓజస్సు కలవాడును, శుచిమంతుడును, మంచిమనస్సు గలవాడును అగు పుత్రుని కోరుచున్నచో, ఆమెకు ఈ క్రింది విధముగ ఉపచారములను చేయవలెను— ఋతుస్నానము చేసిన మొదలు ఆమెకు తెల్లని యవల యొక్క మంథమునందు తేనె, నెయ్యిలను కలిపి దానిలో తెల్లని చూడ గలిగిన తెల్లని ఆవుయొక్క పాలను చేర్చి ఆ మంథమును వెండిపాత్ర యందుగానీ, కంచుపాత్రయందుగానీ ఉంచి సాయంత్రము, పాతఃకాలమందు త్రాగించవలెను. ఇట్లు ఏడు దినములు చేయించవలెను. మరియు, శాలిధాన్యము యవలు వీనితో తయారుచేయబడిన అన్నమును పదార్థములను పెరుగు, తేనె, నెయ్యిలతో గానీ పాలతోగానీ కలిపి ఇవ్వవలెను. సాయంకాలమునందు ఆమె ఉపయో

గించు ఇల్లు, శయ్య, ఆసనములు వాహనములు, వస్త్రములు, అభరణములు శుభ్ర మైనవిగ నుండవలెను. తెల్లటి పెద్ద ఆబోతును, హరిచందనముతో పూయబడిన గుఱ్ఱమును ప్రతిదినము సాయం ప్రాతఃకాలములందు చూడవలెను. సౌమ్యములై నట్టి, మనస్సున కనుకూలములైనట్టియు కథలను వినుచుండవలెను. సౌమ్యములైన ఆకృతియు, వాక్కులును, ఉపచారములను, చేష్టలను కలిగిన స్త్రీ పురుషులను ఇట్టివియే యగు ఇంద్రియార్థములను గ్రహించుచుండవలెను. ఆమెను చెలికత్తెలు ప్రియములగు, హితములును అగు కృత్యములచే ఉపచరించుచుండవలెను. భర్త కూడ ఆచరింపవలెను. కాని ఇరువురును ఈ సమయమునందు మైథునమును చేయ రాదు. ఇట్లు ఏడు రోజులు ఆచరించి ఎనిమిదవ రోజున భర్తయు, తానును శిర స్స్నానము చేసి నూతనములైనట్టియు, స్వచ్ఛములైనట్టియు వస్త్రములను స్వచ్ఛము లైన పుష్పమాలికలను, అభరణములను ధరింపవలెను.

ఆయుర్వేదదీపిక : "హర్యక్షం" అనగా సింహ సమాన పరాక్రముని హర్యక్షత్వము (సింహమువంటి ఆకృతి - విశాలమైన ఛాతీ సన్నని నడుము, గంభీ రత్వము, శత్రుభయంకరత్వము మొదలగు లక్షణములు) కలిగియుండుట సాముద్రిక శాస్త్రజ్ఞులచే పొగడబడును. అందువలన అట్టి పుత్రుని పొందుట కిష్టపడవలెను. "ఇచ్ఛేయమ్" అని ధాతువునకు అనేకార్థములుండుటవలన పొందవలసినది అని అర్థము వచ్చును. అందువలన "ఆశాసీత" అనుదానికి "ఇచ్ఛేయం" అనుటవలన పునరుక్తి కాజాలదని వ్యాఖ్యానింతురు. "కాలే కాలే" అనగా సాయం ప్రాతః సమ యములయందు అని అర్థము. ఇచట మంథపానము, శాలి యవాన్న భోజనమును చేయవలెనని చెప్పబడియున్నందున రెండింటినే సాయం ప్రాతఃకాలములందు చేయ వలెను. శరణమనగా గృహము, "ఆజానేయమ్" అనగా ఉత్తమకాలమునందు జన్మించిన గుఱ్ఱమును అని అర్థము. "హరిచందన" శబ్దమువలన ప్రశస్తమైనదగుట వలన శ్వేతచందనము ఉద్దేశింపబడినది; హరిశబ్దమునకు అనేకార్థములుండుటవలన- హరిశబ్దమువలన ప్రశస్తమైనదగుటచే శ్వేతమనియే గ్రహింపవలెను. "అఙ్గదః" అనగా శరీర లేపనము. లేదా "అఙ్గదః" అనగా బాహువులకు అలంకారము. "పశ్యేత్" అనగా పొందవలెను అని అర్థము. అందువలన శ్రోత్రము మనస్సుల తోడనూ ఉత్తమమైన వాని గ్రహింపవలెనని తెలియబడుచున్నది.

## కోరిన పుత్రులు కలుగుటకు పుత్రకామేష్టి విధానము

10. తత్ర ఋత్విక్ ప్రాగుత్తరస్యాం దిశ్యగారస్య ప్రాక్ప్రవణముదక్ప్రవణం వా ప్రదేశమభిసమీక్ష్య, గోమయోదకాభ్యాం స్థణ్డిలముపలిప్య, ప్రోక్ష్య చోదకేనా, వేదీమస్మిన్ స్థాపయేత్. తాం పశ్చిమేనాహతవస్త్రసంచయే శ్వేతార్షభే వాఽప్యజిన ఉపవిశేద్ బ్రాహ్మణప్రయుక్తః, రాజన్యప్రయుక్తస్తు వైయాఘ్రే చర్మణ్యానడుహే వా, రౌరవే బాస్తే వా. తత్రోపవిష్టః పాలాశీభిరైఙ్గుదిభిరౌదుమ్బరీభిర్మాధుకీభిర్వా సమిద్భిరగ్నిముపసమాధాయ, కుశైః పరిస్తీర్య పరిధిభిశ్చ పరిధాయ, లాజైః శుక్లాభిశ్చ గన్ధవతీభిః సుమనోభిరుపకిరేత్. తత్ర ప్రణీయోదపాత్రం పవిత్రపూతముపసంస్కృత్య సర్పిరాజ్యార్థం యథోక్తవర్ణానాజానేయాదీన్ సమన్తతః స్థాపయేత్.

11. తతః పుత్రకామా పశ్చిమతోఽగ్నిం దక్షిణతో బ్రాహ్మణం ఉపవిశ్యాన్వాలభేత సహ భర్త్రా యథేష్టం పుత్రమాశాసానా. తతస్తస్యా ఆశాసానాయా ఋత్విక్ ప్రజాపతిమభినిర్దిశ్య యోనౌ తస్యాః కామపరిపూరణార్థం కామ్యామిష్టిం నిర్వర్తయేచ్ "విష్ణుర్యోనిం కల్పయతు" ఇత్యనయర్చా తతశ్చైవాజ్యేన స్థాలీపాకమభిఘార్య త్రిర్జుహుయాద్యథామ్నాయమ్. మన్త్రోపమన్త్రితముద-పాత్రం తస్యై దద్యాత్ సర్వోదకార్థాన్ కురుష్వేతి. తతః సమాప్తే కర్మణి పూర్వం దక్షిణపాదమభిహరన్తీ ప్రదక్షిణమనుక్రామేత్ సహ భర్త్రా. తతో బ్రాహ్మణాన్ స్వస్తి వాచయిత్వాఽఽజ్యశేషం ప్రాశ్నీయాత్ పూర్వం పుమాన్, పశ్చాత్ స్త్రీ: న చోచ్ఛిష్టమవశేషయేత్. తతస్తౌ సహ సంవసేయాతామష్టరాత్రం, తథావిధపరిచ్ఛదావేవ చ స్యాతాం, తథేష్టపుత్రం జనయేతామ్.

12. యా తు స్త్రీ శ్యామం లోహితాక్షం వ్యూఢోరస్కం మహాబాహుం చ పుత్రమాశాసీత, యా వా కృష్ణం కృష్ణమృదుదీర్ఘకేశం శుక్లాక్షం శుక్లదన్తం తేజస్వినమాత్మవన్తమ్; ఏష ఏవానయోరపి హోమవిధిః. కిన్తు పరిబర్హో వర్ణవర్జం స్యాత్. పుత్రవర్ణానురూపస్తు యథాశీరేవ తయోః పరిబర్హోఽన్యః కార్యః స్యాత్.

## శూద్రులు చేయవలసిన విధి

13. శూద్రా తు నమస్కారమేవ కుర్యాత్ దేవాగ్నిద్విజగురుతపస్విసిద్ధేభ్యః.

14. యా యా చ యథావిధం పుత్రమాశాసీత తస్యాస్తస్యాస్తాం తాం
పుత్రాశిషమనునిశమ్య తాంస్తాఞ్జనపదాన్మనసానుపరిక్రామయేత్. తతో యాం
యాం యేషాం యేషాం జనపదానాం మనుష్యాణామనురూపం పుత్రమాశాసీత
సా సా తేషాం తేషాం జనపదానాం మనుష్యాణామాహారవిహారోపచారపరి-
చ్ఛదాననువిధత్స్వేతి వాచ్యా స్యాత్.ఇత్యేతత్ సర్వం పుత్రాశిషాం
సమృద్ధికరం కర్మ వ్యాఖ్యాతం భవతి.

**తాత్పర్యము :** ఋత్విక్కు తన ఇంటియొక్క ఈశాన్య భాగమున తూర్పువైపునకు గానీ, ఉత్తరపు వైపునకు గానీ, పల్లముగా నున్న ప్రదేశమునందు గోమయముతో కూడిన ఉదకముతో పూజా స్థానమును అలికి ఉదకమును చల్లి, అక్కడ వేదికను నిర్మింపవలయును. ఋత్విక్కు ఆ వేదికకు పశ్చిమ దిక్కున కూర్చుండవలయును. చేయబోవు విధానమును బ్రాహ్మణులకు చేయించవలసినచో నూతన వస్త్రములపై గానీ, తెల్లని ఎద్దుయొక్క చర్మముపై గానీ కూర్చుండవల యును. క్షత్రియులకైనచో పులి చర్మముపై గానీ, ఎద్దు చర్మముపై గానీ కూర్చుండ వలెను. వైశ్యులకైనచో లేడియొక్క చర్మముపైగానీ, మేకయొక్క చర్మముపై గాని కూర్చొనవలెను. అట్లు కూర్చున్నవాడై మోదుగ, గార, మేడి, ఇప్ప వీనిలో నేదో యొకదాని సమిధలను దెచ్చి వానితో అగ్నిని రగిల్చి చుట్టును దర్భలను పరచి దానిపై మోదుగ దండముల నుంచి: పేలాలను, సువాసనతో కూడిన తెల్లనిపుష్పము లను చల్లవలెను. పరిశుభ్రమైన, పవిత్రమైన మంత్రములతో సంస్కరింపబడినట్టియు ఉదక పాత్రను, హోమము కొరకు ఘృతమును అచ్చట ఉంచి యథోక్త వర్ణము కల గుఱ్ఱము మొదలగువానిని అచట నుంచవలెను. పుత్రునికోరు స్త్రీ అగ్నికి పశ్చిమ దిక్కునకును, బ్రాహ్మణునకు (ఋత్విక్కునకు) దక్షిణ దిక్కునకును కూర్చొని, ఋత్విక్కు చెప్పిన విధానమును భర్తతో కలిసి ఆచరింపవలయును. ఋత్విక్కు బ్రహ్మను పూజించి కుమారుని కోరుచున్న ఆ స్త్రీ కోరిక ఫలించుట కొరకు ఆమె యోనియందు "విష్ణుర్యోనిం కల్పయతు" అనెడి ఋక్కుచే పుత్రేష్టిని చేయించ వలెను. అటు పిమ్మట స్థాలీ పాకమును ఆజ్యముతో అభిఘరించి మూడు పర్యాయ ములు హోమమును చేయవలెను. వేదవిధిని అనుసరించి మంత్రింపబడిన ఉదక పాత్రను ఆ స్త్రీకి ఇచ్చి "ఆ పాత్రతో సమస్తమైన ఉదక కార్యములను చేసికొమ్మ"ని

చెప్పవలెను. ఈ కర్మ పూర్తియైన పిదప ఆ స్త్రీ తొలుత కుడి కాలును వేసి అగ్నికి చుట్టును ప్రదక్షిణము చేయవలెను. పిదప బ్రాహ్మణులయొక్క ఆశీర్వాదమును పొంది హోమము చేయగా మిగిలిన ఆజ్యమును భర్తతో కూడ కలిసి తినవలెను. తొలుత పురుషుడు తరువాత స్త్రీయును తినవలెను. ఆ ఆజ్యమును మిగల్చకూడదు. పిదప ఆ స్త్రీ పురుషులిరువురును పూర్వమునందు చెప్పబడిన విధానముల నాచరించుచు ఎనిమిది రోజులు సంభోగింపవలెను. ఇట్లు చేసినచో కోరిన పుత్రుడు జనించును.

శ్యామ వర్ణము కలిగినట్టియు, ఎఱ్ఱని నేత్రములు కలిగినట్టియు, విశాలమైన వృక్షస్థలము గలిగినట్టియు, దీర్ఘమైన బాహువులను కలిగినట్టియు స్త్రీ చేతను; నలుపు (కృష్ణ) వర్ణము కలిగినట్టియు, నల్లని-మృదువైన పొడవగు వెంట్రుకలను కలిగి యున్నట్టియు, తెల్లని నేత్రములు-తెల్లని దంతములు కలిగి తేజోవంతుడగునట్టి, ఆత్మశక్తి కలిగిన పుత్రుని కోరిన స్త్రీ చేతనూ- పూర్వము నందలి హోమ విధినే చేయించవలెను. కాని పూర్వము నందలి శయనము, ఆసనము మొదలగు సాధనము లను విడచిపెట్టి ఎటువంటి వర్ణము కల పుత్రుని కోరునో అటువంటి వర్ణమే కల శయనము, ఆసనము మొదలగు సాధనములను సేవింపవలెను.

శూద్ర స్త్రీ మాత్రము హోమాదులను చేయక దేవతలు, అగ్నిహోత్రము, బ్రాహ్మణులు, గురువులు, తపశ్శాలురు, సిద్ధులు మొదలగువారికి నమస్కారములు మాత్రమే చేయవలెను.

ఏయే స్త్రీ ఎటువంటి పుత్రుని కోరునో ఆ యా స్త్రీ యొక్క ఆయా కోరికను తెలిసికొని (పుత్రునికి తగిన) ఆ యా దేశమును మనస్సున తలచుకొనునట్లు చేయ వలెను. పిమ్మట ఆమె ఏ దేశమందలి మనుష్యుల వంటి పుత్రుని కోరునో ఆ దేశ మందలి ఆహారము, విహారము, ఉపచారము, శయనము మొదలగువానిని సేవించునట్లు చేయవలయును. ఈ విధముగా కోరిన పుత్రుడు కలుగుటకు అనుకూలమైన సమస్త కర్మయు చెప్పబడినది.

ఆయుర్వేదదీపిక : "స్థణ్డిలమ్" అనగా పూజాస్థలము. "వేదీమ్" అనగా పిండికను. "తాం పశ్చిమేన" అనగా వేదికకు పశ్చిమమునందు అని అర్థము. "శ్వేతార్షభే వాఽప్యజినే" అనగా తెల్లని ఎద్దుయొక్క చర్మమునందు గానీ అని అర్థము. "బ్రాహ్మణప్రయుక్తః" అనగా ఒకవేళ బ్రాహ్మణుని వలన పుత్రేష్టి కొరకు

కూడియున్నచో అపుడా ఋత్విక్కు తెల్లని వస్త్రముల యందుగానీ, తెల్లని ఎద్దు చర్మమునందు కానీ కూర్చొనవలెను. రాజుల కొరకు పుత్రేష్టి చేయువాడు పులి మొదలగువాని చర్మముపైన కూర్చుండవలెనని శేషము. "రురుః" అనునది హరిణ విశేషము. "పరిధిభిః" అనగా నాలుగు పెద్ద పెద్ద మోదుగ కర్రలతో. పరిధాయ అనగా చుట్టును అమర్చి. మంత్రపూతమైనది పవిత్రపూతము, అదియును ఉదక పాత్ర విశేషణము. "ఉపసంస్కృత్య" అనగా ఆ ఉదక పాత్రనే సంస్కార మంత్రములతో సంస్కరించి అని అర్థము. "సర్పిరాజ్యార్థమ్" అనగా నెయ్యి కొరకు వెన్న అని అర్థము; లేదా "సర్పి" యనగా నేయ్యియే; "ఆజ్యార్థ" మనగా మంత్రించిన నెయ్యిగా చేయుటకు; ఆజ్యశబ్దమువలన మంత్రములతో అభిమంత్రించిన నెయ్యి చెప్పబడును. "పశ్చిమతోఽగ్నిం దక్షిణతో బ్రాహ్మణమ్" అనగా తనకు తూర్పుగా (ఎదురుగా) అగ్ని, ఎడమప్రక్కన బ్రాహ్మణుడు ఉండునట్లుగా అని అర్థము. "అనులభేత" అనగా ఋత్విక్కుతో కలిసి ఋత్విగ్విధానమును అనుసరించి చేయవలెనని అర్థము. "ప్రజాపతిమభినిర్దిశ్య" అనగా బ్రహ్మను అభిమంత్రించి అని అర్థము. "యోనౌ తస్యాః కామపరిపూరణార్థం కామ్యామిష్టిం నివర్తయేత్" అనగా యోనియందు కోర్కెను (కోరిన పుత్రుడు కలుగవలెనను కోర్కెను) తీర్చుటకు అగ్నియందు యజ్ఞమును చేయవలెను అని అర్థము. "విష్ణుర్యోనిమ్" అని మొదలగునది హోమమును సాధించు మంత్రము. "పాకమ్" అనగా దేవతలకు హోమము ద్వారా ఇచ్చుటకు ధాన్యాదులతో తయారుచేసిన పదార్థము. "అభిఘార్య" అనగా మిశ్రమము చేసి. "యథామ్నాయమ్" అనగా వేదానుసారముగా. "కిన్తు పరిబర్హో వర్ణవర్జమ్" అనగా పరిబర్హ మనగా శయన ఆసన పుష్పాది సాధనములు; అందువలన ఎటువంటి పుత్రుని స్త్రీ కోరుచున్నదో అటువంటి శయనాదులను గ్రహింపవలెనని వాక్యార్థము. "శూద్రా తు" అను మొదలగువానిద్వారా శూద్రులు చేయవలసిన విధానమును చెప్పుచున్నాడు. "నమస్కారమేవ కుర్యాత్" అనగా శూద్ర స్త్రీకి మంత్రము హోమములందు అధికారము లేకపోవుటచేత నమస్కారమును మాత్రమే చేయవలెను.

### సంతానమునకు వర్ణవిశేషము కలుగుటకు ఇతర కారణములు

15. న ఖలు కేవలమేతదేవ కర్మ వర్ణవైశేష్యకరం భవతి. అపి తు
తేజోధాతురప్యుదకాన్తరిక్షధాతుప్రాయోఽవదాతవర్ణకరో భవతి,
పృథివీవాయుధాతుప్రాయః కృష్ణవర్ణకరః సమసర్వధాతుప్రాయః
శ్యామవర్ణకరః.

**తాత్పర్యము :** కేవలము పైన చెప్పిన కర్మను చేయుటవలననే వర్ణ విశేషము కలుగును. తేజోభూతము, జలము, వాయుపు (భూతముల) లతో ప్రధానముగా కలిసినచో మంచి వర్ణము కలుగును; పృథివి వాయువులతో కలిసినచో కృష్ణ వర్ణము, అన్ని భూతములతోడను కలిసినచో శ్యామవర్ణములను కలిగించును.

**ఆయుర్వేదదీపిక :** "న తు ఖలు" అను మొదలగువానిద్వారా వర్ణ విశేషమును కలిగించు ఇతర కారణములను చెప్పుచున్నాడు. తేజోధాతువు కృష్ణ వర్ణమునందు శ్యామవర్ణమునందుసూ గూడ యుండును.

### సత్త్వవిశేషమును కలిగించు భావములు

16. సత్త్వవైశేష్యకరాణి పునస్తేషాం తేషాం ప్రాణినాం మాతాపితృ-
సత్త్వాన్యన్తర్వత్న్యాః శ్రుతయశ్చాభీక్ష్ణం స్వోచితం చ కర్మ
సత్త్వవిశేషాభ్యాసశ్చేతి.

**తాత్పర్యము :** తల్లిదండ్రులయొక్క సత్త్వములు, గర్భిణీ స్త్రీ ఎక్కువగా విను కథలు, గర్భస్థశిశువుచే చేయబడిన కర్మ, సత్త్వ విశేషాభ్యాసము అనునవి ఆ యా సత్త్వవిశేషములను ఆ యా ప్రాణులకు కలిగించును.

**ఆయుర్వేదదీపిక :** వర్ణవిశేషమునకు కారణమును పేర్కొని సత్త్వ భేదమునకు కారణమును "సత్త్వ" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "మాతాపితృసత్త్వాని" అనగా సాధారణముగా ప్రభావము వలననే మాతాపితరుల సత్త్వము ననుసరించి సత్త్వములు ఉండును. "అన్తర్వత్నీ" అనగా గర్భిణి. "శ్రుతయశ్చాభీక్ష్ణమ్" అనగా గర్భిణి ఎటువంటి పాటలు మొదలగు వానిని వినునో అటువంటి సత్త్వము గల సంతానమును పొందును అని భావము. "స్వోచితం చ కర్మ" అనగా గర్భము చేత స్వంతముగా సంపాదించబడిన కర్మ తత్ ఫలానురూప

మగు సత్త్వమును కలిగించును. "సత్త్వవిశేషాభ్యాసశ్చ" అనగా జన్మాంతరము నందు పురుషుడు ఎటువంటి సత్త్వమును అభ్యసించునో అటువంటి సత్త్వమే కలుగును అని భావము. "జన్మ జన్మ యదభ్యస్తం దానమధ్యయనం తపః, తేనైవాభ్యాసయోగేన తచ్చైవాభ్యసతే నరః" అని చెప్పబడియున్నది.

## గర్భోత్పత్తి క్రమము

17. యథోక్తేన విధినోపసంస్కృతశరీరయోః స్త్రీపురుషయోర్మిశ్రీభావమాపన్నయోః శుక్రం శోణితేన సహ సంయోగం సమేత్యావ్యాపన్నమవ్యాపన్నేన యోనావనుపహతాయామప్రదుష్టే గర్భాశయే గర్భమభినిర్వర్తయత్యేకాన్తేన. యథా—నిర్మలే వాససి సుపరికల్పితే రఞ్జనం సముదితగుణముపనిపాతాదేవ రాగమభినిర్వర్తయతి, తద్వత్; యథా వా క్షీరం దధ్నాభిషుతమభిషవణాద్విహాయ స్వభావమాపద్యతే దధిభావమ్, శుక్రం తద్వత్.

**తాత్పర్యము :** పంచకర్మాది విధిచేత సంస్కరింపబడిన శరీరములు గల స్త్రీ పురుషు లిరువురు మైథునము చేసినపుడు దోషములు లేని శుక్రము నిర్దోషమగు ఆర్తవముతో కలిసి శుద్ధమగు యోని యున్నప్పుడు పరిశుద్ధమగు గర్భాశయము నందు గర్భమును తప్పక కలిగించును. ఎట్లనగా—శుభ్రమైన రంగు నిర్మలమైనట్టియు, బాగుగా కల్పింపబడినట్టియు వస్త్రమునందు పడిన వెంటనే రంగును కల్గించునట్లుగను, మరియు పెరుగుతో కలిసిన పాలు తమ స్వభావమును వదలి పెరుగుగ మారునట్లును శుక్రము కూడ అట్లేయగును.

**ఆయుర్వేదదీపిక :** "యథోక్తేన" అను మొదలగువాని ద్వారా ప్రస్తుతము గర్భోత్పత్తి క్రమమును చెప్పుచున్నాడు. "యథోక్తేన విధినా" అనగా పంచ కర్మయందు చెప్పబడిన విధితో అని అర్థము. "రఞ్జనం" అనగా రంగు వేయుటకు కావలసిన ద్రవ్యము. "దధ్యభిషుతమ్" అనగా కొంచెము ప్రమాణములోనున్న పెరుగుతో కలిపిన. "ఆపద్యతే దధిభావమ్" అనగా పెరుగుగానగును అని అర్థము. "తద్వత్" అనగా పాలు ఎట్లు పెరుగుగా మారునో లేక రంగుద్రవ్యమెట్లు రంగుగా మారునో అట్లే శుక్రము గర్భమును కలిగించును. యథోక్తమగు శోణిత యుక్తమగు శుక్రమని అర్థము.

18. ఏవమభినిర్వర్తమానస్య గర్భస్య స్త్రీపురుషత్వే హేతుః
పూర్వముక్తః యథా హి బీజమనుపతప్తముప్తం స్వాం స్వాం
ప్రకృతిమనువిధీయతే వ్రీహిర్వా వ్రీహిత్వం యవో వా యవత్వం
తథా స్త్రీపురుషావపి యథోక్తం హేతువిభాగమను విధీయేతే.

**తాత్పర్యము :** ఇట్లు కలిగిన గర్భము స్త్రీగా గానీ పురుషునిగా గానీ ఏర్పడుటకు హేతువు ఇదివరకు చెప్పబడినది. మంచి విత్తనము భూమియందు పాతి పెట్టినపుడు తన యొక్క ప్రకృతిని పొందు విధమున అనగా-వ్రీహిధాన్యము వలన వ్రీహులు, యవధాన్యము వలన యవలు పుట్టు విధమున పూర్వోక్త హేతు విభాగము ననుసరించి స్త్రీ పురుషులు జన్మింతురు.

**ఆయుర్వేదదీపిక :** "యథోక్తం హేతు విభాగమను విధీయతే" అనగా "రక్తేనకన్యామధికేన పుత్రం శుక్రేణ" (శారీర స్థానము 2వ అధ్యాయము) అను మొదలగు గ్రంథోక్త విభాగమును స్త్రీ పురుష జనకమగు హేతువు ననుసరించి యుండును.

## పుంసవన విధి

19. తయోఃకర్మణా వేదోక్తేన వివర్తనముపదిశ్యతే ప్రాగ్వ్యక్తీభావాత్ ప్రయుక్తేన సమ్యక్.కర్మణాం హి దేశకాల సంపదుపేతానాం నియత-మిష్టఫలత్వం, తథేతరేషామితరత్వం. తస్మాదాపన్నగర్భాం స్త్రియమభి-సమీక్ష్య ప్రాగ్వ్యక్తీభావాద్గర్భస్య పుంసవనమస్యై దద్యాత్. గోష్ఠే జాతస్య స్యగ్రోధస్య ప్రాగుత్తరాభ్యాం శాఖాభ్యాం శృఙ్గే అనుపహతే ఆదాయ ద్వాభ్యాం ధాన్యమాషాభ్యాం సంపదుపేతాభ్యాం గౌరసర్షపాభ్యాం వా సహ దధ్ని ప్రక్షిప్య పుష్యేణ పిబేత్, తథైవాపరాజ్జీవకర్షభకాపామార్గసహచర-కల్కాంశ్చ యుగపదేకైకశో యఘేష్టం వాఽప్యుపసంస్కృత్య పయసా, కుడ్యకీటకం మత్స్యకం వోదకాఞ్జలౌ ప్రక్షిప్య పుష్యేణ పిబేత్, తథా కనకమయాన్ రాజతానాయసాంశ్చ పురుషకానగ్నివర్ణానణుప్రమాణాన్ దధ్నః పయసోఽఞ్జలౌ వా ప్రక్షిప్య పిబేదనవశేషతః పుష్యేణ,

పుష్యేణైవ చ శాలిపిష్టస్య పచ్యమానస్యోష్మాణముపాఘ్రాయ తస్యైవ చ పిష్టస్యోదకసంసృష్టస్య రసం దేహల్యాముపనిధాయ దక్షిణే నాసాపుటే స్వయమాసించేత్ పిచునా. యచ్చాన్యదపి బ్రాహ్మణా బ్రూయురాప్తా వా స్త్రియః పుంసవనమిష్టం తచ్చానుష్ఠేయమ్.ఇతి పుంసవనాని.

**తాత్పర్యము :** గర్భమునందు లింగము ఏర్పడక ముందు బాగుగ ప్రయోగింపదగినట్టియు ఆయుర్వేదమునందు చెప్పబడినట్టియు కర్మచే గర్భమును స్త్రీగా గాని, పురుషుడుగా గాని మార్పు చెందించు విధానము చెప్పబడుచున్నది. దేశమునకును, కాలమునకును అనుకూలమైన కర్మలను చేసినచో ఇష్ట ఫలము తప్పక కలుగును. వ్యతిరేకమైన కర్మలను చేసినచో ఇష్ట ఫలము కలుగదు. అందువలన, స్త్రీని గర్భవతియైన దానినిగ తెలిసికొని గర్భము వ్యక్తమగుటకు పూర్వమునందే ఆమెకు పుంసవనమును చేయింపవలెను. ఎటులనగా గోవులు విశ్రాంతి తీసుకొను స్థలమునందున్నట్టి మఱ్ఱి చెట్టుయొక్క తూర్పు కొమ్మనగానీ, ఉత్తరపు కొమ్మనగానీ ఉన్న చిగుళ్ళను మంచి వాటిని రెండింటిని గ్రహించి వాటిని రెండు మంచి మినప గింజలతో గానీ, రెండు తెల్ల ఆవగింజలతోగానీ కలిపి పెరుగునందుంచి పుష్య నక్షత్రముతో కూడిన దినమునందు గర్భిణీ స్త్రీ పానము చేయవలెను. ఇట్లే ఇతరములగు జీవకము, ఋషభకము, ఉత్తరేణి, ములుగోరింట - వీటి అన్నింటియొక్క గానీ ఒక్కొక్కదాని యొక్కగానీ, ఇష్టానుసారముగా కొన్నింటియొక్కగానీ కల్కమును గ్రహించి పాలతో కలిపి పానము చేయవలెను. గోదయందుండు కీటకము, చిన్నచేప వీటిని ఒచే దోసిలి ప్రమాణము నీటిలో కలిపి పుష్యమి నక్షత్రమందు త్రాగవలెను. ఈ విధముగనే బంగారముతో గాని, వెండితో గాని, ఇనుముతో గాని చిన్నవిగను, అగ్ని వర్ణము కలవిగను నుండు పురుష విగ్రహములను చేయించి పెరుగునందు లేక ఒక దోసిలి ప్రమాణము గల ఉదకమునందు వేసి ఆ పెరుగును లేక ఉదకమును పుష్యమి నక్షత్రమునందు నిశ్శేషముగా పానము చేయవలెను. మొదట చెప్పిన ఔషధములను పుష్యమి నక్షత్రమునందు ముద్దగా నూరి దానిని ఉడకబెట్టుచు అపుడు వచ్చు ఆవిరిని పీల్చవలయును. ఆ ముద్దను నీటితో చేర్చి రసమును తీయవలెను. గర్భిణీ స్త్రీ తనయొక్క శిరస్సును ఇంటి గడపమీద ఉండునట్లు వెల్లకిల పరుండి పై చెప్పిన రసమును వత్తి సహాయమున తన కుడిముక్కుయందు వేసికొనవలెను. ఇట్లు పుంసవన విధులు చెప్పబడినవి. ఇవియేగాక బ్రాహ్మణులు, ఆప్తులగు స్త్రీలు చెప్పినట్టియు అనుకూలములైనట్టియు పుంసవన విధులను ఆచరింపవచ్చును.

ఆయుర్వేదదీపిక : స్త్రీత్వమునకు పురుషత్వమునకును పూర్వము చెప్ప బడిన ఆర్తవాధిక్యత, శుక్రాధిక్యతలను కారణములను తక్కువచేసి (వాటికంటె ఎక్కువ) వేదోక్తములైన ఇతర పుత్రజనక విధానములను "తయోః" అను మొద లగువానిద్వారా చెప్పుచున్నాడు. "వేదోక్తేన" అనగా ఆయుర్వేదమునందు చెప్ప బడిన వానివలన అని అర్థము. "ప్రాగ్వ్యక్తీభావాత్" అనగా స్త్రీత్వముగానీ పురుష త్వము గానీ గర్భమునకు ఎప్పటివరకు ఏర్పడదో అప్పటివరకే చెప్పబోవు కర్మ లింగ మార్పిడిని కలుగజేయునదిగా ఉండును. లింగ వ్యక్తీభావము రెండవనెల యందు జరుగును. ఈ విషయము శారీరస్థానమున ''ద్వితీయే మాసే ఘనః సంప-ద్యతే'' అను మొదలగువానిద్వారా చెప్పబడినది. లేదా మూడవ సమాసమునందు అంగప్రత్యంగముల వ్యక్తీకరణమునందు వ్యక్తీభావము జరుగునని తెలియవలెను. రెండవ మాసమునందు మాత్రము గ్రంథి మొదలగు రూపముగనుండు గర్భము నందు ప్రత్యంగముల వ్యక్తీభావము స్పష్టముగా నుండదు. అందువలన చెప్పబోవు కర్మ రెండు మాసములవరకును చేయవలయును. ప్రయుక్తేన అని మొదటిదానితో అన్వయించియుండును. ''నియతం'' అనగా నిశ్చయము అని అర్థము. ''పుంస-వనం'' అనగా పురుషుని కలుగజేయు కర్మ. ''గోష్ఠః'' అనగా గోవులు విశ్రాంతి తీసుకొను స్థలము. ఇచటయును పై వచనము వలన చెప్పిన స్థానాదులను గ్రహిం చుట వలననే ఫలితము కలుగునని ఊహింపవలయును కాని అటువంటి పోలికలున్న వాటిని గ్రహించుటవలన ఫలితముండదు. ధాన్యమాష శబ్దమువలన వ్రీహిమాష మును గ్రహింతురు: సువర్ణమాషమును గ్రహింపరు. గౌరసర్షపమనగా తెల్ల ఆవ గింజ. ''పుష్యేణ'' అనగా పుష్యనక్షత్రముతో, ''యథేష్టమ్'' అనుటవలన రెండు మార్లుగానీ మూడుమార్లు గానీ త్రాగవలెనని చూపుచున్నాడు. ''కుడ్యకీటః'' అనగా ''కవాడిగణా'' అని ప్రసిద్ధకీటము: లేదా, జ్యేష్ఠియని పిలువబడు కుడ్యకీటము. జతూకర్ణసంహితయందును ఇచటి ప్రయోగమునందు ''భిత్తిమత్స్యః'' అని పఠించ బడును. భిత్తిమత్స్యశబ్దము వలననూ పాశ్చాత్యులు జ్యేష్ఠి అని చెప్పుదురు. ''మత్స్యక'' అనగా చిన్న చేప. ''దేహలీ'' యనగా గృహద్వారము యొక్క అధో భాగమునసున్న చెక్క (గడప లేదా మండిగము అని తెలుగున ప్రసిద్ధము). ''తత్రోపనిధాయ'' అనుదానికి ''శిరః'' అని చేర్చుకొనవలెను.

## గర్భస్థాపన ఔషధ - ఆహార - విహారములు

20. అత ఊర్ధ్వం గర్భస్థాపనాని వ్యాఖ్యాస్యామః —
ఐన్ద్రీ బ్రాహ్మీ శతవీర్యా సహస్రవీర్యాఽమోఘాఽవ్యథా శివాఽరిష్టా వాట్యపుష్పీ విష్వక్సేనకాన్తా చేత్యాసామోషధీనాం శిరసా దక్షిణేన వా పాణినా ధారణం,ఏతాభిశ్చైవ సిద్ధస్య పయసః సర్పిషో వా పానమ్, ఏతాభిశ్చైవ పుష్యే పుష్యే స్నానం,సదా చ తాః సమాలభేత. తథా సర్వాసాం జీవనీయోక్తానామోషధీనాం సహోపయోగస్తైస్తైరుప— యోగవిధిభిః.ఇతి గర్భస్థాపనాని వ్యాఖ్యాతాని భవన్తి.

**తాత్పర్యము :** ఇకపై గర్భస్థాపనములను చెప్పుచున్నాము. చేదుపుచ్చ, సరస్వతి ఆకు, గరిక, గరికభేదము, కలిగొట్టు, తిప్పతీగె, కరక్కాయ, ముత్తవ పులగము, కటుక రోహిణి, పచ్చముత్తవ పులగము, ప్రేంఖణము ఈ ఔషధులను శిరస్సునందును కుడిచేతియందును ధరించుట, వీటితోనే తయారుకాబడిన పాలను గాని నేయినిగాని పానము చేయుట, వీటితోనే కాచబడిన నీటితో ప్రతి పుష్యనక్షత్రము నందును స్నానము చేయుట, ఈ ఔషధుల నెప్పుడునూ వద్ద నుంచుకొనుట, జీవ నీయగణమునందు చెప్పబడిన సమస్త ద్రవ్యములను ఆ యా ప్రయోగ విధులననుస రించి బాగుగా ఉపయోగించుట అనునవి గర్భస్థాపనములుగ నుండును.

ఆయుర్వేదదీపిక : ప్రస్తుతము ఏర్పడియున్న గర్భమునకు గర్భోప ఘాతకములగు భావములను ఖండించుటవలన ఏది తిరిగి గర్భమును నిలబెట్టుటకు కారణమగునో, ఆది గర్భస్థాపన మనబడును. ఈ విషయమును "అతః ఊర్ధ్వమ్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "ఐంద్రీ" అనగా గోరక్ష కర్కటీ (చేదుపుచ్చ) శతవీర్యా సహస్రవీర్యా అనునవి రెండు రకములైన గరికలు. "అమోఘా" అనగా కలిగొట్టు; "అవ్యథా" అనగా గుడూచి, "అరిష్టా" అనగా 'కటుకరోహిణి' "వాట్య పుష్పీ" అనగా పీతబల (పచ్చముత్తవ పులగము). "విష్వక్సేనకాన్తా" అనగా ప్రేంఖణము.

## గర్భమునకు విఘాతమును కలిగించు భావములు

21. గర్భోపఘాత కరాస్త్విమే భావా భవన్తి: తద్యథా — ఉత్కటవిషమ - కఠినాసనసేవిన్యా వాతమూత్రపురీషవేగానుపరున్ధత్యా దారుణానుచిత

వ్యాయామసేవిన్యా స్తీక్ష్ణోష్ణాతిమాత్రసేవిన్యాః ప్రమితాశన సేవిన్యా గర్భో
మ్రియతేఽన్తః కుక్షేః, అకాలే వా స్రంసతే, శోషీ వా భవతి; తథాఽభిఘాత
ప్రపీడనైః శ్వభ్రకూప ప్రపాతదేశావలోకనైర్వాఽభీక్ష్ణం మాతుః ప్రపతత్య
కాలే గర్భః, తథాఽతిమాత్ర సంక్షోభిర్యానై ర్యానేన, అప్రియాతిమాత్రశ్రవ
ణై ర్వా. ప్రతతోత్తాన శాయిన్యాః పునర్గర్భస్య నాభ్యాశ్రయా నాడీ కణ్ఠమను
వేష్టయతి, వివృతశాయినీ, నక్తంచారిణీ చోన్మత్తం జనయతి, అపస్మారిణం
పునః కలికలహశీలా, వ్యవాయశీలా దుర్వపుషమహ్రీకం స్త్రైణం వా, శోక
నిత్యా భీతమపచిత మల్పాయుషం వా, అభిధ్యాత్రీ పరోపతాపిన మీర్ష్యుం
స్త్రైణం వా; స్తేనా త్వాయాసబహులమతి ద్రోహిణమకర్మశీలం వా, అమర్షిణీ
చణ్డ మౌపధిక మసూయకం వా, స్వప్న నిత్యా తన్ద్రాలు మబుధమల్పాగ్నిం
వా, మద్యనిత్యా పిపాసాలుమల్ప స్మృతి మనవస్థిత చిత్తం వా, గోధా
మాంసప్రాయా శార్కరిణమశ్మరిణం శనైర్మేహిణం వా, వరాహమాంస
ప్రాయా రక్తాక్షం క్రథనమతిపరుషరోమాణం వా, మత్స్యమాంసనిత్యా
చిరనిమేషం స్తబ్ధాక్షం వా, మధురనిత్యా ప్రమేహిణం మూకమతి స్థూలం
వా, అమ్ల నిత్యా రక్తపిత్తినం త్వగక్షిరోగిణం వా, లవణనిత్యా శీఘ్రవలీ
పలితం ఖాలిత్యరోగిణం వా, కటుక నిత్యా దుర్బలమల్పశుక్రమనపత్యం
వా, తిక్తనిత్యా శోషిణమబల మనుపచితం వా, కషాయ నిత్యా శ్యావమానా
హినముదావర్తినం వా, యద్యచ్చ యస్య యస్య వ్యాధేర్నిదానముక్తం తత్త
దాసేవమానా న్తర్వత్నీ తన్నిమిత్త వికార బహులమపత్యం జనయతి. పితృ
జాస్తు శుక్రదోషా మాతృజై రపచారైర్వ్యాఖ్యాతాః. ఇతి గర్భోపఘాతకరా
భావా భవన్త్యుక్తాః. తస్మాదహితానాహారవిహారాన్ ప్రజాసంపదమిచ్ఛన్తీ
స్త్రీ విశేషేణ వర్జయేత్. సాధ్వాచారా చాత్మానముపచరేద్ధితాభ్యామాహార
విహారాభ్యామితి.

**తాత్పర్యము :** ఈ భావములు గర్భమునకు ఉపఘాతకరములుగా
నుండును. అవి ఏవనగా – పృష్ఠభాగమానునట్లు, హెచ్చు తగ్గులుగ నున్నట్టి ప్రదే
శము నందును, కఠినప్రదేశములందును కూర్చుండునట్టియు, వాత-మూత్ర-పురీష
వేగముల నడ్డగించునట్టియు, దారుణమును అనుచితమునూ నైన వ్యాయామము నాచ
రించునట్టియు, తీక్ష్ణ ఉష్ణ గుణములు కల పదార్థముల నధికముగా సేవించునట్టియు,
అత్యల్పముగా భుజించునట్టియు స్త్రీ యొక్క గర్భము కుక్షియందు మరణమునొందును

లేదా, అకాలమున ప్రసవించును, లేక కృశించును. దెబ్బ తగులుట వత్తిడి కలుగుట వలన అకాలమునందు గర్భపాతము కలుగును. సొరంగములను, బావులను, ఎత్తైన ప్రదేశములను అధికముగా చూచుటవలననూ గర్భపాతము కలుగును. మిక్కిలి క్షోభను కలిగించు వాహనములపై ప్రయాణించుటచేత, అప్రియములగు విషయములను మాటిమాటికిని వినుటచేతనూ, గర్భపాతము కల్గును. ఎత్తైన పడకలపై పరుండు దానికిని ఆమె గర్భమునందలి నాభినాడి గర్భస్థ శిశుపునకు కంఠమున చుట్టివేయును. ఆచ్ఛాదనలేని ప్రదేశములందు శయనించునదీ రాత్రులందు సంచరించునది యగుస్త్రీ ఉన్మత్తుడగువానిని ప్రసవించును. తరచు వాక్కలహము, శరీర కలహములను చేసినచో అపస్మారము కలవానిని కనును. అధిక మైథునము నాచరించినచో దుష్ట స్వభావము గలవానినిగాని, సిగ్గులేనివానినిగానీ, స్త్రీ వశుడగువానినిగానీ, ప్రసవించును. ఎల్లప్పుడు దుఃఖించుచున్నచో భయస్వభావము కలవానినిగానీ, కృశించినవానినిగాని, అల్పాయుపు కలవానినిగాని కనును. ద్రోహచింతన కలిగియున్నది పరులకు బాధ కలిగించువానినిగాని, అసూయ గలవానిని గాని, స్త్రీలకు వశమగువానినిగాని కనును. చోరస్వభావము కలదైనచో అధికమైన ఆయాసము కలవానినిగాని, ద్రోహస్వభావము కలవానినిగాని, పనులనుచేయక మందముగా నుండువానినిగాని కనును. క్రోధము కలదైనచో కోపముగలవానిని గాని, మోసగించు వానినిగాని, అసూయగలవానిని గాని కనును. అధికనిద్ర గలదైనచో నిద్రాస్వభావము కలవానినిగాని, మూర్ఖునిగాని, అగ్నిమాంద్యము కలవానినిగాని కనును. మద్యపానమును ఎక్కువగ చేయునదైనచో దప్పిక గలవానినిగాని, అల్పమైన జ్ఞాపకశక్తి గలవానిని గాని, స్థిమితములేని మనస్సు గలవానినిగాని కనును. గోధామాంసము (ఉడుము మాంసము) ను ఎక్కువగా తినునది శర్కరా మేహము గలవానిని గానీ, అశ్మరీ వ్యాధి కలవానినిగాని, శనైర్మేహము కలవానినిగాని కనును. ఎల్లప్పుడు పందిమాంసమును భుజించు స్త్రీ ఎర్రని నేత్రములు కలవానినిగాని, జంతువులను నరుకు వృత్తి చేపట్టువానినిగాని (మిక్కిలి ఆయాసపడువానినిగాని) మిక్కిలి పరుషములగు రోమములు కలవానినిగాని కనును. చేపలను ఎక్కువగా తినుచుండుటచేత ఎక్కువ కాలమునకు ఒకసారి కన్నులు మూయువానివిగాని, ఎల్లప్పుడు తెరచియుంచిన కన్నులుగలవానిని గాని కనుము. ఎక్కువ మధురరసమును సేవించు స్త్రీ ప్రమేహము గలవానినిగాని మూగవానినిగాని మిక్కిలి స్థూలకాయము గలవానినిగాని కనును. అమ్లరసము సేవించు స్త్రీ రక్తపిత్తము కలవానినిగాని, చర్మరోగములు గలవానినిగాని, నేత్రవ్యాధులు గలవానినిగాని ప్రసవించును. లవణరసము నధికముగా సేవించు స్త్రీ శరీరము త్వరగా ముడుతలు

పడువానినిగాని, త్వరగా నెరయు వెంట్రుకలు గలవానినిగాని, బట్టతల గలవానిని గాని కనును. కటురసము నెల్లప్పుడు సేవించు స్త్రీ దుర్బలుడగువానినిగాని, స్వల్ప శుక్రము గలవానినిగాని, వంధ్యుని గాని కనును. తిక్త రసమును సేవించునదైనచో క్షయరోగము గలవానినిగానీ, బలములేనివానినిగానీ, కృశించినవానినిగానీ కనును. కషాయరసమును సేవించు స్త్రీ శ్యావవర్ణము కలవానినిగాని, ఆనాహము కలవానిని గాని, ఉదావర్తము కలవానినిగాని కనును. ఆ యా వ్యాధులకు నిదానములుగ చెప్ప బడినవానిని సేవించు స్త్రీ ఆ యా వ్యాధులు అధికముగ కలవానిని కనును. ఈ అప చారములచే గర్భమునకు తల్లివలన విఘాతము కలుగు విధముననే ఈ అపచార ములు చేయు తండ్రియొక్క శుక్ర దోషమువలనకూడ గర్భమునకు విఘాతము కల్గును. ఈ విధముగా గర్భమునకు విఘాతమును కలిగించు భావములు చెప్ప బడినవి.

అందుచేత శ్రేష్ఠమైన సంతానమును కోరు స్త్రీ అహితములైన ఆహార విహా రములను తప్పక విసర్జింపవలయును. యోగ్యములైన ఆచారములు కలదై హిత కరములైన ఆహార విహారములనే తన్నుతాను ఉపచరించుకొనవలెను.

ఆయుర్వేదదీపిక : అప్పుడే పుట్టిన శిశువునకు గూడ గర్భమని వ్యవహ రించుట గలదు. అందువలన కుక్షికి బయటగూడ మరణించుట జరుగుచున్నందు వలన "అంతఃకుక్షేః" అని విశేషణము వచ్చినది. "ప్రతతోత్తానశాయినీ" అనగా ఎత్తైన పడకలమీద పరుండునది. "వివృతే" అనగా ఆవరణ లేనట్టి ప్రదేశమునందు పరుండునది "వివృతశాయినీ" అనబడును. వివృతశాయిని మరియు నక్తచారిణి (రాత్రులందు సంచరించునది) యును యగు స్త్రీ రాక్షసులు మొదలగు భూతములచే ఆవహింపబడదగినదగును. అటుపైన భూతములచే నావరింపబడిన గర్భము ఉన్మత్త మగుననుట యుక్తమే. "కలిః" అనగా నోటిమాటలతో పోట్లాడునది "కలహః" అనగా శారీరిక యుద్ధమును చేయునది. "స్త్రైణమ్" అనగా స్త్రీలకు వశమగువానిని "క్రథనమ్" అనగా అకస్మాత్తుగా ఉచ్ఛ్వాసావరోధము కలుగుట అట్టి లక్షణము కల వాడు కూడ క్రథనుడని చెప్పబడును.

మధురమనుటచే నిచట గర్భిణికి చెప్పబడిన క్షీరమును వదలి మిగిలిన మధుర పదార్థములను సేవించునది అని తెలిసికొనవలెను.

అభిధ్యాత్రీ అనగా మనస్సునందు పరులకు ద్రోహము చేయు గుణము కలదీ. "బౌపాధికం" అనగా గుప్త వేషమున తిరుగువాడు అని అర్థము.

క్షీరమునకు మాత్రము గ్రహింపవలెనని చెప్పబడియుండుటచే ప్రాశస్త్యము గలదు. ఆచట ఆరు రసములకును అధిక సేవనము వలన కలుగు దోషమును పేర్కొని మరల మద్యము మొదలగువానిని అధికముగ సేవించుట వలన వేరుగా దోషమేది చెప్పబడినదో అది ద్రవ్య ప్రభావమునకు గల దోష విశేషమును పేర్కొను టకు అని తెలియవలెను. యేవస్తు సేవన వలన ఏ వికారములు కలుగునో ఇచట గర్భమునకు నిదాన రూపములుగా చెప్పబడి అట్టివియే యగు వికారములను కల్గిం చును. ఉదాహరణకు- నిద్రను అధికముగా సేవించుట వలన తంద్ర ఎక్కువగా కలవాడు, మధురము నెక్కువగా సేవించుట వలన ప్రమేహము కలవాడు, అమ్ల రసము వలన రక్తపిత్తము గలవాడు ఈ మొదలగునవి. గర్భమునకు హేతు సదృశ ములు కాని వికారములేవి కలుగునో- గోధా మాంసము వలన శర్కరా మేహము, అశ్మరి కలుగుట ఈ మొదలగువానివలె- అది ద్రవ్య ప్రభావము వలననే జరుగు చున్నది. గర్భ గ్రహణమునకు ముందుగనే స్త్రీ చేత అపథ్య సేవనము జరిగి ఆర్తవ దుష్టిద్వారా గర్భము నందు వికారము కలిగింపబడుచున్ననూ, అటులనే ఇచటనే "పితృజాస్తు" అను మొదలగు గ్రంథము ద్వారా చెప్పినట్లు అపథ్య సేవనము చేసిన పురుషునికి దుష్టి చెందిన శుక్రము ద్వారా గర్భమునందు వికారము కలుగుచున్ననూ, గర్భమును గ్రహించిన స్త్రీచే చేయబడిన అపథ్య సేవనము వ్యవధాన మెక్కువ లేనందున వెంటనే రోగమును కలిగించునదగుటంజేసి "తత్తదా సేవమానా న్తర్వత్నీ" అని చెప్పబడినది. అనగా ఆ యా భావములను సేవించుచున్న గర్భిణీ స్త్రీ (కి ఇట్టి సంతానము కలుగును) అని అర్థము. "మాతృజైరపచారైర్వ్యాఖ్యాతా" అనగా ఏ విధముగా తల్లియొక్క అపచారములకు అనురూపమగు గర్భ వ్యాధులు కలుగునో, అట్లే తండ్రి వలనకూడ మైథునమునకు ముందు అపచారముచే కలిగిన శుక్రదృష్టి ద్వారా తదనురూపమైన వ్యాధులను కలుగునని అర్థము. "స్త్రీ విశేషేణ" అనుట చేత పురుషుడును వర్జింపవలెను అని చూపుచున్నాడు. "సాధ్వాచారా" అనగా మంగళ కరమగు ఆచారములు చేయుచున్నట్టి స్త్రీ అని అర్థము.

## గర్భిణీస్త్రీకి కలుగు సామాన్య వ్యాధులకును గర్భ సంబంధమగు ఉపద్రవము లేర్పడినపుడునూ చేయవలసిన విధులు

22. వ్యాధీంశ్చాస్యా మృదుమధురశిశిరసుఖసుకుమారప్రాయైరౌషధాహారో-
పచారైరుపచరేత్, న చాస్యా వమనవిరేచనశిరోవిరేచనాని ప్రయోజయేత్,

న ర క్తమవసేచయేత్, సర్వకాలం చ నాస్థాపనమనువాసనం వా కుర్యాదన్యత్రాత్యయకాద్వ్యాధేః. అష్టమం మాసముపాదాయ వమనాదిసాధ్యేషు పునర్వికారేష్వాత్యయికేషు మృదుభిర్వమనాదిభిస్తదర్థ-కారిభిర్వోపచారః స్యాత్. పూర్ణమివ తైలపాత్రమసంక్షోభయతాఽన్త-ర్వత్నీ భవత్యుపచర్యా.

23. సా చేదపచారాద్ ద్వయోస్త్రిషు వా మాసేషు పుష్పం పశ్యేన్నాస్యా గర్భః స్థాస్యతీతి విద్యాత్:అజాతసారో హి తస్మిన్ కాలే భవతి గర్భః.

24. సా చేచ్చతుష్ప్రభృతీనాం మాసేషు క్రోధశోకాసూయేర్ష్యాభయత్రాసవ్యవాయ-వ్యాయామసంక్షోభసంధారణవిషమాశనశయనస్థానక్షుత్పిపాసాఽతియోగాత్ కదాహారాద్వా పుష్పం పశ్యేత్,తస్యా గర్భస్థాపనవిధిముపదేక్ష్యామః.పుష్ప-దర్శనాదేవైనాం బ్రూయాత్-శయనం తావన్మృదుసుఖశిశిరాస్తరణసంస్తీర్ణ-మీషదవనతశిరస్కం ప్రతిపద్యస్వేతి.తతో యష్టీమధుకసర్పిర్భ్యాం పరమ-శిశిరవారిణి సంస్థితాభ్యాం పిచుమాప్లావ్యోపస్థసమీపే స్థాపయేత్తస్యాః,తథా శతధౌతసహస్రధౌతాభ్యాం సర్పిర్భ్యామధోనాభేః సర్వతః ప్రదిహ్యాత్,-సర్వతశ్చ గవ్యేన చైనాం పయసా సుశీతేన మధుకామ్బునా వా న్యగ్రోధాది-కషాయేణ వా పరిషేచయేదధోనాభేః,ఉదకం వా సుశీతమవగాహయేత్,-క్షీరిణాంకషాయద్రుమాణాం చ స్వరసపరిపీతాని చేలాని గ్రాహయేత్,న్యగ్రో-ధాదిశుఙ్గాసిద్ధయోర్వా క్షీరసర్పిషోః పిచుం గ్రాహయేత్,అతశ్చైవాక్షమాత్రం ప్రాశయేత్,ప్రాశయేద్వా కేవలం క్షీరసర్పిః,పద్మోత్పలకుముదకిఞ్జల్కాం-శ్చాస్యై సమధుశర్కరాన్ లేహార్థం దద్యాత్,శృఙ్గాటకపుష్కరబీజకశేరుకాన్ భక్షణార్థం,గన్ధప్రియఙ్గ్వసితోత్పలశాలూకోదుమ్బరశలాటున్యగ్రోధశుఙ్గాని వా పాయయేదజాక్షీరేణ పయసా,పయసా చైనాం బలాతిబలాశాలిషష్టికేక్షుమూల-కాకోలీశృతేన సమధుశర్కరం రక్తశాలీనామోదనం మృదుసురభిశీతలం భోజయేత్,లావకపిఞ్జలకురఙ్గశమ్బరశశహరిణైణకాలపుచ్ఛకరసేన వా ఘృత-సుసంస్కృతేన సుఖశిశిరోపవాతదేశస్థాం భోజయేత్,క్రోధశోకాయాసవ్య-వాయవ్యాయామేభ్యశ్చాభిరక్షేత్,సౌమ్యాభిశ్చైనాంకథాభిర్మనోనుకూలాభిరు-పాసీత:తథాఽస్యా గర్భస్తిష్ఠతి.

**తాత్పర్యము :** గర్భిణీస్త్రీ యొక్క వ్యాధులను సౌమ్య-శీత-మధుర-సుఖకర-సుకుమారములగు ఔషధాహార విహారములచే చికిత్సింపవలయును. ఆమెకు

వమన-విరేచన-నస్య-రక్తమోక్షణములను చేయింపరాదు. అత్యవసర పరిస్థితియందు తప్ప మిగిలిన సమయములందు ఆస్థాపనానువాసన వస్తులను ఇవ్వరాదు. ఎనిమిదవ మాసము మొదలుకొని వమనము మొదలగు వానిచేతనే సాధింపదగిన వ్యాధులు కలిగిన యెడల మృదు ద్రవ్యములతో వమనమిచ్చుటచేగాని అట్టి ఫలితములనిచ్చు ఇతర మృదుకర్మలచేగాని చికిత్సింపవలెను. తైలముతో నిండిన పాత్రను భద్రముగా తొణకనీయక యుంచినట్లు గర్భిణీస్త్రీకి క్షోభను కలిగింపని క్రియలచే ఉపచరింపవలెను.

గర్భిణీస్త్రీకి రెండవ లేక మూడవ మాసమునందు అపచారము వలన ఆర్తవము స్రవించిన యెడల ఆ గర్భము నిలువదని తెలిసికొనవలెను. ఈ మాసములందు గర్భములు సారము (బలము) లేనివిగానుండును.

గర్భిణీస్త్రీకి నాలుగవ మాసము మొదలు కోపము, శోకము, అసూయ, ఈర్ష్య, భయము, ఉద్వేగము, మైథునము, వ్యాయామము, సంక్షోభము, వేగధారణము, విషమాహారసేవనము, విషమశయనము, విషమస్థానము (విషమముగా నిల్చొనుట), అతి ఆకలి, అతి దప్పిక, దుష్టమైన ఆహార సేవనముల వలన రజోదర్శనమైనచో, ఆమెకు గర్భస్థాపన విధులను చెప్పుచున్నాము- రజస్సు కనపడగనే ఆమెను మెత్తగ సుఖకరముగ చల్లగనుండు వస్త్రాదులచే పరుపబడినదిగనునున్న శయ్యయందు శిరస్సు పల్లముగ నుండునట్లు పరుండమని చెప్పవలెను. పిమ్మట అతి మధురముతో కూడిన ఘృతమును మిక్కిలి చల్లగనున్న నీటియందుంచి ఒక వర్తికి పట్టించి ఆ వర్తిని గర్భిణియొక్క ఉపస్థపైన ఉంచవలెను. అట్లే శతధౌత సహస్రధౌత ఘృతములతో నాభికి క్రింది భాగమంతయును పూయవలెను. ఆవుపాలతోగాని యష్టిమధుకమును చేర్చిన చల్లని నీటితోగానీ న్యగ్రోధాది కషాయముతోగాని నాభి యొక్క క్రింది భాగమును తడుపవలెను. లేక చల్లనినీటితో అవగాహనము చేయించవలెను (చల్లనినీటిలో యోని భాగమువరకు మునుగునట్లు కూర్చుండబెట్ట వలెను). క్షీరి వృక్షముల యొక్క, కషాయ రసముగల వృక్షములయొక్కయు స్వరసములందు తడుపబడిన వస్త్రములను యోనిపై నుంచవలెను. న్యగ్రోధాదిగణ ద్రవ్యములతో తయారుచేయబడిన పాలయందుగానీ ఘృతమునందుగానీ తడుపబడిన వర్తిని యోనియందు పిచుధారణ చేయించవలెను. ఇట్టిపాలను లేక ఘృతమును ఒక అక్ష ప్రమాణము త్రాగింపవలెను. లేక కేవలము ఘృతమును త్రాగించవలెను. తామర-నల్లకలువ-తెల్లకలువ వీనియొక్క కేసరములను తేనె పంచదారలతో కలిపి నాకించవలెను. పరికగడ్డ, మెట్టతామర దుంపలు, నమ్మదుంపలు వీనిని తినిపించవలయును.

గంధక చోరములు ప్రేంఖణము, నల్లకలువ దుంప, లేత మేడికాయలు, మర్రిచిగుళ్ళు వీనిని మేకపాలతో కలిపి త్రాగించవలెను. రక్తశాలికి సంబంధించినట్టియు, తేనె, నెయ్యిలతో కూడినట్టియు మృదువుగను సుగంధయుక్తముగను చల్లగనున్నట్టియు అన్నమును బల అతిబల వేళ్ళు వరివేళ్ళు చెరకువేళ్ళు కాకోలిలతో కాచబడిన పాలతో భుజింపచేయవలెను. లావకపిట్ట కపింజలపక్షి లేడి ఎర్రని జింక కుందేలు ఇఱ్ఱి నల్ల ఇఱ్ఱి కాలపుచ్ఛముల యొక్క మాంసరసమును నెయ్యి ఉదరములతో సంస్కరించి, దీనిని సుఖముగను చల్లనిగాలి వీచునదిగను నుండు ప్రదేశమున గర్భిణిని కూర్చుండ బెట్టి ఆమెతో భుజింపజేయవలెను. కోపము, దుఃఖము, ఆయాసము, మైథునము, వ్యాయామములను విడిపింపవలెను. సౌమ్యములైనట్టియు మనస్సున కనుకూలము లైనట్టియు కథలను చెప్పవలెను. ఇట్లు చేసినచో ఆ స్త్రీకి గర్భము నిలుచును.

ఆయుర్వేదదీపిక : "మృదుభిర్వమనాదిభిః" అనగా మృదుద్రవ్యములతో చేయబడిన అల్పమాత్రలో ప్రయోగింపబడిన వమనాదులచేత అని అర్థము. "తదర్థ కారిభిర్వా" అనగా ఉదాహరణము - వమనార్థికారియగు నిష్ఠీవనము, విరేచనార్థ కారిణియగు ఫలవర్తి ప్రయోగము ఈ మొదలగు ఉపచారములచే చేయవలెను. "సంధారణమ్" అనగా వేగములను ధరించుట. కదాహారః అనగా చెడిన ఆహారము. శిశిరమ్ అనగా శీతమైనట్టి అని అర్థము. యష్టిమధుకముతో తయారైన ఘృతము యష్టీమధుక సర్పి యనబడును. "చేలాని గ్రాహయేత్" అనుచోట "యోనిం" అని శేషము (అందువలన చేలాని గ్రాహయేద్ యోనిం" అని అర్థము వచ్చును). "అతి శైత్యైవ" అనగా న్యగ్రోధాది శృంగములచేత లేదా "క్షీరసర్పిషః" అను పాఠము నందు క్షీరమునుండి వచ్చిన ఘృతము క్షీరసర్పియనబడును.

25. యస్యాః పునరామాన్వయాత్ పుష్పదర్శనం స్యాత్,ప్రాయ స్తస్యా స్తద్గర్భో-పఘాతకరం భవతి,విరుద్ధోపక్రమత్వా త్తయోః.

## ఉపవిష్టకోదర-నాగోదర లక్షణములు

26. యస్యాః పునరుష్ణతీక్ష్ణోపయోగాద్గర్భిణ్యా మహతి సంజాతసారే గర్భే పుష్ప-దర్శనం స్యాదన్యో వా యోనిస్రావ స్తస్యా గర్భో వృద్ధిం న ప్రాప్నోతి నిఃసృతత్వాత్;స కాలమవతిష్ఠతేऽతిమాత్రం,తముపవిష్టకమిత్యాచక్షతే కేచిత్. ఉపవాసకర్మపరాయాః పునః కదాహారాయాః స్నేహద్వేషిణ్యా వాతప్రకోప-

ణోక్తాన్యాసేవమానాయా గర్భో వృద్ధిం న ప్రాప్నోతి పరిశుష్కత్వాత్;స చాపి కాలమవతిష్ఠతేఽతిమాత్రమ్,అస్పన్దనశ్చ భవతి,తం తు నాగోదరమిత్యాచక్షతే.

**తాత్పర్యము :** గర్భిణీ స్త్రీకి ఆమ సంబంధముచేత రజోదర్శనమైన యెడల గర్భస్రావమును, ఆమమును పరస్పర విరుద్ధ చికిత్సలు గలవగుటచేత అట్టి రజోదర్శనము గర్భమునకు విఘాతమును కలిగించునదగును.

గర్భము గొప్పదిగను దృఢముగను ఉన్ననూ ఆ స్త్రీ తీక్ష్ణ గుణము ఉష్ణ వీర్యము కల పదార్థములను సేవించుటవలన రజోదర్శనముగానీ, ఇతర విధమైన స్రావము కలిగినచో అట్టి స్త్రీయొక్క గర్భము స్రావము కలదగుటవలన వృద్ధి నొందనేరదు. అట్టి గర్భము గర్భాశయము నందు చాలకాలమువరకు ఉండును. దీనిని కొందరు "ఉపవిష్టకోదరము" అని అందురు. ఉపవాసవ్రత కర్మలనాచరించు నట్టి గర్భిణీస్త్రీ దుష్టమైన ఆహారమును భుజించుచున్నపుడు, స్నేహ పదార్థములను తినకున్ననూ, వాతప్రకోపమును కలిగించునవిగ చెప్పబడినట్టి వానిని సేవించు చున్ననూ ఆమె గర్భము క్షీణించుట వలన వృద్ధి నొందనేరదు. అట్టి గర్భము కూడ గర్భాశయమునందు చాలకాలము నిలువయుండును. మరియు అది అధికముగ కదలు చుండును. దీనిని నాగోదరమని చెప్పెదరు.

**ఆయుర్వేదదీపిక :** "ఆమాన్వయాత్" అనగా ఆమమును కల్గించు కారణములతో కూడియుండుటచేత అని అర్థము. "విరుద్ధోపక్రమత్వాత్" అనగా గర్భ స్రావమునందు స్తంభన క్రియను చేయవలెను. అదియును శీత మృదు మధుర గుణములతో కూడియుండును. ఈ గుణములు ఆమమును కలిగించుటవలన ఆమ రోగమునకు విరుద్ధములు. ఇట్లు ఈ రెండింటికి చికిత్స విరుద్ధములుగా నుండును. "అన్యో వా" అనగా ఆర్తవలక్షణములకు విరుద్ధమైనట్టి (ఇతర స్రావము) అని అర్థము. కేచిత్ (కొందరందురు) అని చెప్పబడినప్పటికీ వ్యతిరేకించకపోవుటవలన ఆచార్యుని మతము గూడ ఇదియే యని తెలియవలెను.

## ఉపవిష్టకోదర - నాగోదరములయొక్క చికిత్స

37. నార్యోస్తయోరుభయోరపి చికిత్సితవిశేషముపదేక్ష్యామః—
భౌతికజీవనీయబృంహణీయమధురవాతహరసిద్ధానాం సర్పిషాం

పయసామామగర్భాణాం చోపయోగో గర్భవృద్ధికరః,తథా సంక్షోభన-
మేత్తైరేవ సిద్ధైశ్చ ఘృతాదిభిః సుఖితాయాః,అభీక్ష్ణం
యానవాహనాపమార్జనావజృమ్భణైరుపపాదనమితి.

## గర్భము కదలకుండునపుడు చేయవలసిన చికిత్స

28. యస్యాః పునర్గర్భః ప్రసుప్తో న స్పన్దతే తాం శ్యేనమత్స్యగవయ-
శిఖితామ్రచూడతిత్తిరీణామన్యతమస్య సర్పిష్మతా రసేనమాషయూషేణ
వా ప్రభూతసర్పిషా మూలకయూషేణ వా రక్తశాలీనామోదనం మృదు-
మధురశీతలం భోజయేత్. తైలాభ్యఙ్గేన చాస్యా
అభీక్ష్ణముదరవస్తివంక్షణోరుకటీపార్శ్వపృష్ఠప్రదేశానీషదుష్ణేనోపచరేత్.

## గర్భిణికి కలుగు ఉదావర్తమునకు చేయవలసిన చికిత్స

29. యస్యాః పునరుదావర్తవిబన్ధః స్యాదష్టమే మాసే న చానువాసన-
సాధ్యం మన్యేత తతస్తస్యాస్తద్వికారప్రశమనముపకల్పయేన్నిరూహమ్.
ఉదావర్తో హ్యుపేక్షితః సహసా సగర్భాం గర్భిణీం గర్భమథవాఽతి-
పాతయేత్.తత్ర వీరణశాలిషష్టికకుశకాశేక్షువాలికావేతసపరివ్యాధమూలానాం
భూతీకానన్తాకాశ్మర్యపరూషకమధుకమృద్వీకానాం చ పయసాఽర్ధోదకేనోద్గ-
మయ్య రసం ప్రియాలవిభీతకమజ్జతిలకల్కసంప్రయుక్తమీషల్లవణ-
మనత్యుష్ణం చ నిరూహం దద్యాత్.వ్యపగతవిబన్ధాం చైనాం
సుఖసలిలపరిషిక్తాఙ్గీం స్థైర్యకరమవిదాహినమాహారం భుక్తవతీం సాయం
మధురకసిద్ధేన తైలేనానువాసయేత్. న్యుబ్జాం త్వేనామాస్థాపనానువాసనా-
భ్యాముపచరేత్.

**తాత్పర్యము :** ఉపవిష్టక - నాగోదరములు కలిగిన స్త్రీ లిరువిరకునూ
చేయవలసిన చికిత్సా విశేషములను చెప్పుచున్నాము - వీరికి పిశాచాది భూతములను
నశింపజేయునట్టియు జీవనీయ గణమునందు చెప్పబడినట్టియు, బృంహణకరములై
నట్టియు మధురగణమునందు చెప్పబడినట్టియు వాతహరద్రవ్యములతో తయారు
కాబడిన ఘృతములను ఇవ్వవలెను. నాగోదరమునందు యోని వ్యాపత్తునందు చెప్ప
బడిన పాలను, ఆమగర్భములను (గ్రుడ్లను), గర్భమునకు వృద్ధిని కలిగించు

ద్రవ్యములను ఉపయోగింపవలెను. మరియు ఈ ద్రవ్యములతో తయారు చేయ బడిన ఘృతము మొదలగువానితో భోజనమును ఆకలిగ నున్నపుడు ఇవ్వవలెను. యానములందు, వాహనములందు ప్రయాణము చేయుట, స్నానము చేయుట అవ లింపుట ఈ పనులను ఎక్కువగా చేయించవలెను.

ఏ స్త్రీయొక్క గర్భము అణగియుండి కదలకయుండునో అట్టి స్త్రీకి-డేగ, చేపలు గవయమను మృగము, తిత్తిరిపక్షి, కోడి, నెమలి వీనిలోనేదోయొక మాంస రసమును నేతితో సంస్కరించి దానిని, మినపకట్టుతోగాని, అధికమగు నేతితో కూడిన ముల్లంగి కట్టుతోగాని, రక్తశాలి సంబంధమైనట్టియు మృదుమధుర శీతగుణ ములతో కూడియున్నట్టి అన్నమును భుజింపజేయవలెను. ఇట్టి స్త్రీయొక్క ఉద రము, గజ్జలు, తొడలు, కటిప్రదేశము, పార్శ్వములు, పృష్ఠప్రదేశము వీనియందు కొంచెము ఉష్ణముగ నున్న తైలమును అధికముగ పూయవలెను.

గర్భిణీ స్త్రీకి ఎనిమిదవ మాసమునందు ఉదావర్తమువలన విబంధము కలిగి అనువాసనవస్తిని చేయుటకు వీలులేనిచో ఆ బాధ ఉపశమించుటకై నిరూహవస్తిని చేయింపవలెను. ఉదావర్తమును చికిత్సింపక ఉపేక్షించినచో అది గర్భిణి గర్భము రెండింటినిగానీ కేవలము గర్భమునుగానీ నశింపజేయును. అట్టి ఉదావర్తమునందు అపురుగడ్డి, వరి, షష్టికధాన్యము, దర్భ, రెల్లు, ఇక్షువాలిక యనెడి చెరకు ప్రబ్బలి నీటిపేము వీనియొక్క వేళ్ళను, కామంచి, సుగంధిపాల, పెగ్గుమ్ముడు, చిట్టీత, అతి మధురము, ద్రాక్ష అనువానిని కలిపి సగము నీళ్ళు కలిపిన పాలతో కషాయమును కాచి ఆ కాషాయమునందు సారపప్పు, తానికాయ పప్పు, నువ్వులు వీని కల్కమును కొద్ది సైంధవ లవణమును కలిపి ఆ ద్రవము కొంచెము ఉష్ణముగా నున్నపుడు (సుఖోష్ణముగా నున్నపుడు) దానితో నిరూహవస్తిని చేయించవలెను. విబంధము పోయిన తరువాత సుఖోష్ణమగు ఉదకముతో స్నానమును చేయించి పిమ్మట స్థైర్య మును కలిగించునట్టియు, విదాహమును కలిగింపనట్టియు ఆహారమును భుజింపజేసి అతిమధురముతో తయారుచేయబడిన తైలముచే సాయంకాలమునందు అనువాసన వస్తిని చేయింపవలెను. ఇట్టి స్త్రీకి ఆ స్థాపనవస్తినిగాని అనువాసనవస్తినిగాని అధో ముఖము కలదిగ నున్నపుడు చేయింపవలెను.

ఆయుర్వేదదీపిక : "చికిత్సిత విశేషమ్" అనుచోట విశేష శబ్దము వలన గర్భమునకు కలుగు ఇతర వ్యాధులకంటు విశేష చికిత్సయని తెలియవలెను.

ఉపవిష్టకనాగోదరములకు విశిష్టమైన చికిత్సనే చెప్పవలయును: లేదా "యస్యాః పునర్గర్భః ప్రసుప్తో న స్పన్దతే" అను మొదలగువానివలన ఏ అవస్థయందు విశేష చికిత్స చెప్పబడవలయునో దానిని అపేక్షించి "చికిత్సిత విశేషమ్" అని చెప్పబడినది. భౌతికమనగా భూతములను నశింపజేయు వస గుగ్గులు మొదలగునవి; లేదా, చెప్పబోవుచున్న మహా పైశాచిక ఘృతమును చూడవలెను. "సుభిక్షయా" బాగుగా ఆకలిగొనియున్న దానికి "న చానువాసనసాధ్యం మన్యేత" అనగా ఉదావర్తమునకు ఆమము కలిసియుండుటవలన అది అనువాసవస్తి సాధ్యము కాదని తెలియవలెను. "తద్వికార ప్రశమనమ్" అనగా ఉదావర్త ప్రశమనము అని అర్థము. అట్టి ఉదావర్త ప్రశమనమగు నిరూహమును "తత్ర" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "పరివ్యధః" అనగా ప్రబ్బలి యొక్క భేదము. "ఉద్గమయ్య రసమ్" అనగా క్వాథమును పిండి గ్రహించి. క్వాథాది పరిమాణమును నిరూహ పరిమాణమువలెనే తీసికొనవలెను. న్యుబ్జామ్ అనగా అధోముఖముగనున్న స్త్రీకి అని అర్థము.

## గర్భము మృతి నొందినపుడు కలుగు లక్షణములు

30. యస్యాః పునరతిమాత్రదోషోపచయాద్వా తీక్ష్ణోష్ణాతిమాత్రసేవనాద్వా వాతమూత్రపురీషవేగవిధారణైర్వా విషమా(స)శనశయనస్థానసంపీడనాభిఘాతైర్వా క్రోధశోకేర్ష్యాభయత్రాసాదిభిర్వా సాహసైర్వాఽపరైః కర్మభిరన్తఃకుక్షేర్గర్భో మ్రియతే,తస్యాః స్తిమితం స్తబ్ధముదరమాతతం శీతమశ్మాన్తర్గతమివ భవత్యస్పన్దనో గర్భః, శూలమధికముపజాయతే, న చావ్యః ప్రాదుర్భవన్తి, యోనిర్నప్రస్రవతి,అక్షిణీ చాస్యాః స్రస్తే భవతః, తామ్యతి,వ్యథతే, భ్రమతే, శ్వసితి,అరతిబహులా చ భవతి,న చాస్యా వేగప్రాదుర్భావో యథావదుపలభ్యతే;ఇత్యేవం లక్షణాం స్త్రియం మృతగర్భేయమితి విద్యాత్.

**తాత్పర్యము :** ఏ స్త్రీకి దోషములధికముగ వృద్ధి చెందుట వలనగాని, తీక్ష్ణగుణ ఉష్ణవీర్యము గల పదార్థముల నధికముగ సేవించుటవలనగాని వాత మూత్ర పురీష వేగములనడ్డగించుట వలనగాని విషమములైన ఆహార (ఆసన) శయన స్థానములవలనగాని, కోప శోక ఈర్ష్య అసూయ భయ ఉద్వేగము వలన గాని ఇతరములైన సాహసకృత్యముల వలనగాని కుక్షి లోపల గర్భము మృతి నొందునో, అట్టి స్త్రీ యొక్క ఉదరము స్తిమితముగను, స్తబ్ధముగను, విస్తరింపబడి

నదిగను, చల్లగను, లోపల రాయిని ఉంచినట్లుగను ఉండును. గర్భము కదలదు. అధికమగు శూల కలుగును. ప్రసవ వేదనలు కలుగవు. యోనియందు స్రావము కలుగదు. నేత్రములు జారినట్లుండును. మరియు నామె మోహము నొందును. బాధ నొందును. భ్రమ కలుగును, ఉచ్ఛ్వాసనిశ్వాసములు అధికముగ నుండును. నిలకడ లేకయుండును. ఆమెకు వేగములు యథావిధిగ వెడలవు. ఇటువంటి లక్షణములుగల స్త్రీని మృతగర్భము కలదానినిగ తెలిసికొనవలెను.

**ఆయుర్వేదదీపిక :** "అశ్మాన్తర్గతమివ" అనగా లోపలరాయి ఉన్నదాని వలె అని అర్థము. "ఆవీ" అనగా ప్రసవవేదన.

## గర్భము మృతి నొందినపుడు చేయవలసిన చికిత్స

31. తస్య గర్భశల్యస్య జరాయుప్రపాతనం కర్మ సంశమనమిత్యాహురేకే, మన్త్రాదికమథర్వవేదవిహితమిత్యేకే, పరిదృష్టకర్మణాశల్యహర్త్రా హరణమిత్యేకే. వ్యపగతగర్భశల్యాం తు స్త్రియమామగర్భాం సురాసీధ్వరిష్టమధుమదిరాసవానామన్యతమమగ్రే సామర్థ్యతః పాయయేద్గర్భ-కోష్ఠశుద్ధ్యర్థమార్తివిస్మరణార్థం ప్రహర్షణార్థం చ, అతః పరం సంప్రీణ-నైర్బలానురక్షిభిరస్నేహసంప్రయుక్తైర్యవాగ్వాదిభిర్వా తత్కాలయోగిభిరా-హారైరుపచరేద్దోషధాతుక్లేదవిశోషణమాత్రం కాలమ్. అతః పరం స్నేహపానైర్బస్తిభిరాహారవిధిభిశ్చ దీపనీయజీవనీయబృంహణీయమధుర-వాతహరసమాఖ్యాతైరుపచరేత్. పరిపక్వగర్భశల్యాయాః పునర్విముక్తగర్భ-శల్యాయాస్తదహరేవ స్నేహోపచారః స్యాత్.

**తాత్పర్యము :** శల్య రూపముగనున్న మృత గర్భమునందు జరాయువు బయల్పడునట్లు చేయుట అనుకూలముగా నుండునని కొందరు చెప్పుదురు. అథర్వణ వేదమునందు చెప్పబడిన మంత్రాది కర్మల నాచరించవలెనని కొందరి యభి ప్రాయము. అనుభవముగల శల్య చికిత్సకునిచే మృత గర్భమును తీయించవలెనని కొందరు చెప్పుదురు. శల్యభూతమైన మృత గర్భమును తీసివేసిన పిదప పచ్చిగ నున్న గర్భాశయము గల ఆ స్త్రీకి గర్భకోష్ఠము శుద్ధి నొందుటకు, బాధ మరచుటకు, ఉత్సాహము కలుగుటకును సుర-శీధువు-అరిష్టము-మధువు-మదిర ఆసవానిలో దేని నైననూ సామర్థ్యమునననుసరించి ముందుగా నీయవలెను. అటుపిమ్మట బృంహణము

లైనట్టియు, బలమును కలిగించునట్టియు, స్నేహము కలుపనట్టియు యవాగువు మొదలైనవానినిగాని అట్టి కాలమునందుపయోగించు ఆహారముగాని దోషముల యందలి ధాతువుల యందలియు క్లేదము ఆరిపోవు వరకు ఈయవలెను. దీపనములు జీవనీయములును బృంహణములును, మధురములును వాతహరములునునగు ద్రవ్య ములతో తయారుచేయబడిన స్నేహపానము వస్తి అనువానిచే ఉపచరింపవలెను. మృతగర్భము తీసివేయబడి గర్భాశయము ఆరిన పిదప వెంటనే స్నేహ ద్రవ్యము లతో ఉపచారములను చేయవలెను.

ఆయుర్వేదదీపిక : "పిత్తే" అను వచనము వలన జరాయుపాతనాది మూడు కర్మలను వ్యతిరేకింపకపోవుటవలననూ మృతగర్భాపహరణము పట్ల సరి యగు చికిత్స లేదని చూపుచున్నాడు. "దోషధాతు విశేషణమాత్రం కాలమ్" అనుట వలన దోషధాతు క్లేద విశేషణము జరుగు వరకు యథోక్త క్రమమును చేయవలె నని చూపుచున్నాడు.

## మాసక్రమమునననుసరించి గర్భిణికి చేయవలసిన విధానము

32. పరమతో నిర్వికారమాప్యాయ్యమానస్య గర్భస్య మాసే మాసే కర్మోపదే- క్ష్యామః.ప్రథమే మాసే శఙ్కితాచేద్గర్భమాపన్నా క్షీరమనుపస్కృతం మాత్రావచ్ఛీతం కాలే కాలే పిబేత్, సాత్మ్యమేవ చ భోజనం సాయం ప్రాతశ్చ భుఞ్జీత:ద్వితీయే మాసే క్షీరమేవ చ మధురౌషధసిద్ధం:తృతీయే మాసే క్షీరం మధుసర్పిర్భ్యాముపసంసృజ్య:చతుర్థే మాసేక్షీరనవనీతమక్ష- మాత్రమశ్నీయాత్: పఞ్చమే మాసే క్షీరసర్పిః:షష్ఠే మాసే క్షీరసర్పిర్మధు- రౌషధసిద్ధం; తదేవ సప్తమే మాసే.తత్ర గర్భస్య కేశా జాయమానా మాతు- ర్విదాహం జనయన్తీతి స్త్రియో భాషన్తే,తన్నేతి భగవానాత్రేయః,కిన్తు గర్భో- త్పీడనాద్వాతపిత్తశ్లేష్మాణ ఉరః ప్రాప్య విదాహం జనయన్తి,తతః కణ్డూరు- పజాయతే,కణ్డూమూలా చ కిక్కిసావాప్తిర్భవతి.తత్ర కోలోదకేన నవనీతస్య మధురౌషధసిద్ధస్య పాణితలమాత్రం కాలే కాలేఽస్యై పానార్థం దద్యాత్, చన్దనమృణాలకల్కైశ్చాస్యాః స్తనోదరం విమృద్నీయాత్,శిరీషధాతకీసర్షప- మధుక చూర్ణైర్వా, కుటజార్జకబీజముస్తాతకల్కైర్వా,నిమ్బకోలసురసమఞ్జిష్ఠా- కల్కైర్వా,పృషతహరిణశశరుధిరయుతయా త్రిఫలయా వా:కరవీరపత్రసిద్ధేన

తైలేనాభ్యఙ్గః పరిషేకః పునర్మాలతీమధుకసిద్ధేనామ్బునా:జాతకణ్డూశ్చ కణ్డూయనం వర్జయేత్త్వగ్భేదవైరూప్యపరిహారార్థమ్,అసహ్యాయాం తు కణ్డ్వాము-న్మర్దనోద్ఘర్షణాభ్యాం పరిహారః స్యాత్:మధురమాహారజాతం వాతహర-మల్పమస్నేహలవణమల్పోదకానుపానం చ భుఞ్జీత. అష్టమే తు మాసే క్షీర-యవాగూం సర్పిష్మతీం కాలే కాలే పిబేత్;తన్నేతి భద్రకాప్యః. పైఙ్గల్యాబాధో హ్యస్యా గర్భమాగచ్ఛేదితి;అస్త్వత్ర పైఙ్గల్యాబాధ ఇత్యాహ భగవాన్ పునర్వసురాత్రేయః,నత్వేవైతన్న కార్యమ్: ఏవం కుర్వతీ హ్యరోగాఽఽరోగ్య బలవర్ణ సంహనననంపదుపేతం జ్ఞాతీనామపి శ్రేష్ఠమపత్యం జన-యతి.నవమే తు ఖల్వేనాం మాసే మధురౌషధసిద్ధేన తైలేనానువాసయేత్.-అతశ్చైవాస్యాస్తైలాత్ పిచుం యోనౌ ప్రణయేద్గర్భస్థానమార్గస్నేహనార్థమ్. యదిదం కర్మ ప్రథమం మాసం సముపాదాయోపదిష్టమానవమాన్మాసాత్తేన గర్భిణ్యా గర్భసమయే గర్భధారిణీకుక్షికటీపార్శ్వపృష్ఠం మృదూ భవతి,-వాతశ్చానులోమః సంపద్యతే,మూత్రపురీషే చ ప్రకృతిభూతే సుఖేన మార్గ-మనుపద్యేతే,చర్మనఖాని చ మార్దవముపయాన్తి,బలవర్ణౌ చోపచీయేతే; పుత్రం చేష్టం సంపదుపేతం సుఖినం సుఖేనైషా కాలే ప్రజాయత ఇతి.

**తాత్పర్యము :** వికారములు లేకుండగ వృద్ధి పొందుచున్న గర్భమునకు ప్రతి మాసమునందును చేయదగిన విధానమును చెప్పబోవుచున్నాము. గర్భము పొందినట్లు అనుమానించిన స్త్రీకి ప్రథమ మాసమునందు సంస్కారము చేయనట్టి శీతముగా నున్నట్టి పాలను ఇవ్వవలెను. సాత్మ్యములగు ఆహార పదార్థములను ప్రాతఃకాలము నందును సాయంకాలమునందును ఇవ్వవలెను. ద్వితీయ మాసము నందు మధురౌషధములతో కాచబడిన పాలనే ఇవ్వవలెను. తృతీయ మాసమునందు తేనె నెయ్యి కలిపిన పాలు. చతుర్థ మాసమునందు ఒక అక్ష ప్రమాణము పాలనుండి (పెరుగునుండి?) తీసిన వెన్నను, పంచమ మాసమునందు పాలనుండి తీసిన నెయ్యిని (వెన్నను కాచగా వచ్చిన నెయ్యిని), షష్ఠమాసమునందు మధుర ద్రవ్యములతో కాచబడిన నెయ్యిని సప్తమ మాసమునందు కూడా మధుర ద్రవ్యములతో కాచబడిన నెయ్యిని ఇవ్వవలెను. ఈ ఏడవ మాసమునందు గర్భమునకు కేశములు జనించుట వలన తల్లికి విదాహము కలుగునని స్త్రీలు చెప్పుదురు కాని అట్లు కాదని అత్రేయ భగవానుడు చెప్పెను. గర్భముచే పీడింపబడుట వలన వాతపిత్త శ్లేష్మములు తల్లి యొక్క వక్ష స్థలమును పొంది తల్లికి విదాహమును కలిగించును. అందువలన దురద

కలుగును. దురద కారణముగా కిక్కిసమనెడి వ్యాధి కలుగును. అపుడు మధుర ద్రవ్యములతో తయారు కాబడిన వెన్నను రేగుపండ్ల రసముతో కర్ష ప్రమాణమున ఆయా కాలములందు ఈయవలెను. చందనము తామరతూండ్లు వీని యొక్క కల్కముతోగాని: దిరిసిన పువ్వు, ఆవెపువ్వు, అవాలు, యష్టిమధుకము వీని యొక్క చూర్ణముతో గాని: కొడిశపాల, ధాతులసిగింజలు, తుంగగడ్డలు, పసుపు వీనియొక్క కల్కముతోగాని: వేప, రేగు, తులసి, మంజిష్ఠ వీనియొక్క కల్కముతోగాని: జింక లేడి, కుందేలు వీని రక్తముతో కూడిన త్రిఫలా కల్కముతోగాని ఈ స్త్రీ యొక్క స్తనములందు, ఉదరమునందును లేపనము చేయవలెను. లేక గన్నేరు ఆకులతో కాచిన తైలమును పూయవలెను. మాలతి-అతిమధురములతో కాచిన జలముచే తడుపవలెను. దురద కలిగినను చర్మము చిట్లిపోకుండుటకు, వికృతి కలుగకుండుటకును గోకుటను మానవలెను. దురదను సహింపలేకున్నపుడు ఆ ప్రదేశమునందు నెమ్మదిగా వత్తుట, రాయుటలను చేయవలెను మధుర రసప్రధానమైనట్టియు, వాతహరమైనట్టియు, స్నేహ లవణములు కొంచెముగా కలసియున్నట్టియు ఆహారమును భుజింపవలయును. అట్లు భుజించునపుడు ఉదకమును స్వల్పముగ త్రాగవలెను. ఎనిమిదవ మాసమునందు-పాలతో తయారు చేయబడిన యవాగుపునందు నేతిని కలిపి ఆయా కాలములయందు త్రాగవలెను (ఉదయము-సాయంత్రములయందు త్రాగవలెను). గర్భమునకు పింగళ వర్ణముగల కన్నులు వచ్చునుగాన అట్లు చేయరాదని భద్రకాప్యుడు అనెను. పింగళ వర్ణము గల నేత్రములు జనించినను త్రాగవచ్చునని ఆత్రేయ పునర్వసు భగవానుడు చెప్పెను. అట్లు త్రాగినచో రోగములులేని మంచి ఆరోగ్యము, బలము, వర్ణము, స్వరము, దేహ నిర్మాణములు కలిగియున్నట్టి వంశమంతటికీ శ్రేష్ఠమైన సంతానము కలుగును. తొమ్మిదవ మాసమునందు మధుర ద్రవ్యములతో తయారుకాబడిన తైలముచే అనువాసన వస్తిని చేయించవలెను. గర్భాశయమునకును గర్భాశయ మార్గమునకును స్నిగ్ధత్వము కలుగు నిమిత్తము ఈ తైలమునందు వత్తిని ముంచి పిచును యోనియందు ఉంచవలెను. మొదటి మాసము మొదలుకొని తొమ్మిదవ మాసము వరకు చెప్పబడిన ఈ కర్మను ఆచరించినచో గర్భిణీస్త్రీకి గర్భధారణ సమయమునందు కుక్షి-కటి-పార్శ్వములు-పృష్ఠ భాగము ఇవి మృదువుగ నుండును. వాతము అనులోమనముగ నుండును. మూత్ర పురీషములు ఉండవలసిన స్థితిలో నుండి వాని మార్గముల నుండి సుఖముగ బయ

టకు వెడలను. చర్మము, నఖములు మృదువుగ నుండును. బలము వర్ణములు వృద్ధి పొందును. ఆ స్త్రీ సంపత్తితో కూడినట్టియు, సుఖవంతుడైనట్టియు, ఇష్టుడైనట్టియు పుత్రుని సకాలమునందు సుఖముగ ప్రసవించును.

**ఆయుర్వేదదీపిక :** "పరమతః" అను మొదలగువానిద్వారా గర్భమునకు ప్రతియొక్క మాసమున చేయవలసిన కర్మను చెప్పుచున్నాడు- "తన్నేతి భగవానాత్రేయః" అనగా ఒకేమారుగా మూడవ మాసమునందు అంగ ప్రత్యంగములు కలుగుటతో కేశములు కూడ అపుడే పుట్టును. అవి క్రమముగా వృద్ధి పొందునుగాని ఏడవ మాసమునందు కేశములు పుట్టవు అని భావము. ఇక ఏడవ మాసమునందు కండు (దురద) ఎట్లుకలుగునో ఆ విషయమును "గర్భోత్పీడనాత్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "కిక్కిసః" అనగా చర్మము పగిలిపోవుట. స్తనములు మరియు ఉదరము స్తనోదరమని చెప్పబడును. "కోలం" అనగా రేగు. "పరిహారః" అనుదానికి "కండ్వా" అని శేషము. "పైఙ్గల్యమ్" అనగా కన్నులు పింగళములుగా నుండుట (తేనె కన్నులు లేక పిల్లి కన్నులు) శాలాక్యమునందు "పిత్తేఒత్యర్థప్రదుష్టే తు నేత్రయోః పిఙ్గలాక్షితా" అని చెప్పబడినట్లు అది పిత్తము వలన కలిగిననూ ఇచట అష్టమమాసీయ గర్భమునందు క్షీరయవాగు మొదలగు ఆహార సంబంధము యొక్క ప్రభావము చేతనే పింగళాక్షిత్వము ఏర్పడునని తెలిసికొనవలెను. "సత్వే పైతన్న కార్యమ్" అనగా పైంగల్యము అల్పదోషమగుట చేత, తరువాతి కాలమునందు చికిత్స సులభముగా నుండుటచేత, క్షీరయవాగూ మొదలగునవి సేవించుటయందు ఎక్కువరెట్లు లాభముండుట చేతనూ క్షీరయవాగు సేవనము తప్పక చేయవలెనని భావము "అతశ్చైవ" అనగా మధురౌషధ సిద్ధమగు తైలముచేత. గర్భధారిణీ అనగా మావి. ఇచట "పుత్రమ్" అని ప్రశస్తమగుట వలన చెప్పబడినది, అందు వలన "కన్యయును" అని తెలిసికొనవలెను. ఇందువలన ప్రతియొక్క మాసమునకు చేయవలసిన కర్మ వలన తప్పక పుత్రజన్మయే కలుగదని వివరింపబడినది.

## సూతికాగార నిర్మాణ విధి

33. ప్రాక్ చైవాస్యా నవమాన్మాసాత్ సూతికాగారం కారయేదపహృత్యాస్థి శర్కరాకపాలే దేశే ప్రశస్తరూపరసగన్ధాయాం భూమౌ ప్రాగ్ద్వారముదగ్ద్వారం వా బైల్వానాం కాష్ఠానాం తైన్దుకైఙ్గుదకానాం భల్లాతకానాం వార(రు)ణానాం ఖాదిరాణాం వా; యాని చాన్యాన్యపి బ్రాహ్మణాః శంసేయు-

రథర్వవేదవిదస్తేషాం: వసనాలేపనాచ్ఛాదనాపిధానసంపదుపేతం వాస్తువిద్యాహృదయయోగ్నిసలిలోదూఖలవర్చఃస్థానస్నానభూమిమహానస— సమృతుసుఖం చ.

**తాత్పర్యము :** గర్భిణికి తొమ్మిదవ మాసము నిండకముందే సూతికాగారమును- ఎముకలు, రాళ్ళు, పెంకులును తీసివేయబడిన ప్రదేశమునందు ప్రశస్తములగు రూప రసగంధములు గల భూమియందు- మారేడు, లొద్దుగ, గార, నల్లజీడి, ఇరుగుడు, (పున్నాగ ?), చంద్ర వీనిలో నేదో యొకదాని కర్రలతోగాని అథర్వ వేదము తెలిసిన బ్రాహ్మణులచే ప్రశస్తము లైనవిగా చెప్పబడిన కర్రలతో తూర్పు, ముఖముగా గాని, ఉత్తర ముఖముగా గాని నిర్మింపవలయును. ఆ గృహము వస్త్రములు, పూతలు, తలుపులు (మూతలు) మొదలగునవి సరిగానుండి వాస్తు విద్యను తెలిసినవారు చెప్పిన విధముగ అగ్నిస్థానము, ఉదక స్థానము, రోలు, మల విసర్జన ప్రదేశము, స్నానప్రదేశము, వంటశాలను ఏర్పరచవలెను. ఆ గృహము ఆ యా ఋతువులకు అనుకూలమైనదిగ నుండవలెను.

**ఆయుర్వేదదీపిక :** గర్భిణి ఎచ్చట ప్రసవించునో ప్రసవించిన తరువాత ఎచటయుండునో అది సూతికాగార మనబడును. బిల్వాది కాష్ఠముల యొక్క- ఇంటిని (అగారమును) నిర్మింపవలెనని అన్వయించుకొనవలెను. వారణః అనగా పున్నాగచెట్టు లేక వరుణ (ఉలిమిడి) చెట్టు "వసనమ్" అనగా వస్త్రము ఆచ్ఛాదన మనగా ఆస్తరణము. "అపిధానం" అనగా తలుపు. "వాస్తు విద్యా హృదయం" అనగా వాస్తు విద్యాతత్త్వము, అది కలిగియుండుటచేత గృహమునందు అగ్న్యాదుల స్థానము ఎచట నుండవలెనో అది అక్కడనే యుంచవలెను. వాస్తువిదుల మతము ననుసరించి అగ్నిస్థానము మొదలగువానిని విభజించి గృహమును నిర్మింపవలెనని అర్థము. "ఋతుసుఖమ్" అనగా అప్పటికి ఉన్న ఋతువు ననుసరించి సుఖముగా నుండునట్లు (నిర్మింపవలెను) అని అర్థము.

## సూతికాగారము నందుండవలసిన వస్తు సామగ్రి

34. తత్రసర్పిస్తైలమధుసైన్ధవసౌవర్చలకాలవిడ్లవణవిడఙ్గకుష్ఠకిలిమనాగరపిప్పలీ- పిప్పలీమూలహస్తిపిప్పలీమణ్డూకపర్ణ్యేలాలాఙ్గలీవచాచవ్యచిత్రకచిరబిల్వా- హిఙ్గుసర్షపలశునకతకకణకణికానీపాతసీబల్వజభూర్జకులత్థమైరేయసురాసవాః సన్నిహితాః స్యుః తథాఽశ్మానౌ ద్వౌద్వే కు(చ)ణ్డముసలే,ద్వేఉదూఖలే,-

ఖరవృషభశ్చ,ద్వౌ చ తీక్ష్ణౌ సూచీపిప్పలకౌ సౌవర్ణరాజతే,శస్త్రాణి చ తీక్ష్ణాయసాని,ద్వౌ చ బిల్వమయౌ పర్యఙ్కౌ,తైన్దుకైఙ్గుదాని చ కాష్ఠాన్యగ్నిసన్ధుక్షణాని,స్త్రియశ్చ బహ్వ్యో బహుశః ప్రజాతాః సౌహార్దయుక్తాః సతతమనురక్తాః ప్రదక్షిణాచారాః ప్రతిపత్తికుశలాః ప్రకృతివత్సలాస్త్యక్తవిషాదాః క్లేశసహిన్యోఽభిమతాః,బ్రాహ్మణాశ్చాథర్వవేదవిదః;యచ్చాన్యదపి తత్ర సమర్థం మన్యేత,యచ్చాన్యచ్చ బ్రాహ్మణా బ్రూయుః స్త్రియశ్చ వృద్ధాస్తత్ కార్యమ్.

**తాత్పర్యము :** అసూతికా గృహమునందు ఈ క్రింది ద్రవ్యములను, వస్తువులను ఉంచవలెను— ఘృతము; తైలము, తేనె, సైంధవ లవణము, సౌవర్చ లవణము, కాలలవణము, వాయువిడంగములు, చెంగల్వకోష్ఠు, దేవదారు, శొంఠి పిప్పళ్ళు. మోడి, గజపిప్పళ్ళు, మండూకపర్ణి, ఏలకులు, బొ త్తిదుంప, వస, చిత్ర మూలము, చవ్యము, నెమలడుగుచెట్టు, ఇంగువ, ఆవాలు, వెల్లుల్లి, చిల్లగింజ, జీల కర్ర, గోధుమరవ్వ (కణికా, నిష్యపురవ్వ) కడిమిచెట్టు, అవిశె, బల్వజమనెడిగడ్డి, భూర్జపత్రము, ఉలవలు, మైరేయమనెడి మద్యము, ఆసవములు వీనిని సిద్ధముగ నుంచవలెను. ఇంకను రెండురాళ్ళు, రెండు బరువైన రోకళ్ళు, రెండురోళ్ళు ఒక ఆబోతు, బంగారముతో చేయబడినది వెండితో చేయబడినదియగు తీక్ష్ణముగు రెండు సూదులు, తీక్ష్ణ లోహముతో చేయబడిన శస్త్రములు, మారేడుకర్రతో చేయబడిన రెండు మంచములు, అగ్నిని ప్రజ్వలింపజేయుటకు తుమికి, గార వీని సంబంధమగు కట్టెలు వీనిని ఉంచవలెను. మరియు ఎక్కువ సంతానమును కనినట్టియు, మంచి మనస్సుతో నున్నట్టియు, అనురాగము కలిగినట్టియు, శ్రేష్ఠమైన ఆచారములు కలిగి నట్టియు, ప్రతిపత్తియందు నేర్పరులైనట్టియు, ప్రేమగల ప్రకృతికలిగినట్టియు, విచా రములేనట్టియు, కష్టములను సహించునట్టియు అనేకమంది స్త్రీలు ఉండవలెను. అవ సరములైన ఇతర వస్తుసామగ్రిని కూడ యుంచవలయును. మరియు బ్రాహ్మణులును, వృద్ధస్త్రీలును చెప్పునట్టి పనులను చేయవలెను. (వారు ఇంకేపైన వస్తువులను గాని ద్రవ్యములనుగాని తెచ్చియుంచమని ఆజ్ఞాపించినచో, ఆయా సంభారములను తెచ్చి యుంచుకొనవలెను.)

**ఆయుర్వేదదీపిక :** ఇచట గృహమునందు ఉంచవలసిన నెయ్యి తైలము మొదలగు వానికి ఉపయోగము చెప్పవలసియే యున్నది. ఎక్కువగా నున్నందున వేనికి చెప్పబడలేదో వాని ఉపయోగమును ఊహించి తెలిసికొనవలెను.

"కిలిమం" అనగా దేవదారు "కణః" అనగా కుండికయని ప్రసిద్ధమైన ద్రవ్యము. "కణికా" అనగా కుణ్డకము కంటె స్థూలములైన తండులపు ముక్కలు (బియ్యపు రవ్వ-నూక). బియ్యము దేనితో దంచబడునో అది ముసలకము. "కుణ్డముసలే" అనగా పొట్టి ముసలకములు రెండు అని అర్థము లేదా "చండముసలే" అను పాఠమును అంగీకరించినచో అపుడు పెద్ద పెద్ద రోకళ్ళు రెండు అని అర్థము. ముసలములను తీసికొనుట నిషిద్ధమైనప్పటికినీ తరువాతి సమయమునందు ద్వారమున ముసలముసుంచుట చెప్పవలసి యున్నదగుటచే ముసలములను తీసికొనుట సరిగనే యున్నది. సూచ్యాకార శస్త్రములు రెండు సూచీ పిప్పలకము లనబడును. లేదా సూది ఎక్కడ ఉంచబడునో ఆ పాత్ర సూచీ పిప్పలకమనబడును. పర్యంకమనగా మంచము "సమర్థం మన్యేత" అనగా ఉపయుక్తమని అనుకొనినచో అని అర్థము.

## గర్భిణిని సూతికాగారమునందు ప్రవేశింపజేయువిధి

35. తతః ప్రవృత్తే నవమే మాసే పుణ్యేఽహని ప్రశస్త నక్షత్రయోగముపగతే ప్రశస్తే భగవతి శశిని కళ్యాణే కళ్యాణే చ కరణే మైత్రే ముహూర్తే శాన్తిం హుత్వా గోబ్రాహ్మణమగ్నిముదకం చాదౌ ప్రవేశ్య గోభ్యస్తృణోదకం మధులాజాంశ్చ ప్రదాయ బ్రాహ్మణేభ్యోఽక్షతాన్ సుమనసో నాన్దీముఖాని చ ఫలానీష్టాని దత్త్వోదకపూర్వమాసనస్థేభ్యోభివాద్య పునరాచమ్య స్వస్తి వాచ-యేత్.తతః పుణ్యాహశబ్దేన గోబ్రాహ్మణం సమనువర్తమానా ప్రదక్షిణం ప్రవిశేత్ సూతికాగారమ్. తత్రస్థా చ ప్రసవకాలం ప్రతీక్షేత.

**తాత్పర్యము :** గర్భిణికి తొమ్మిదవ మాసము నడుచుచున్నపుడు శుభ దినమునందు ప్రశస్తమైన చంద్రుడు కలిగినట్టియు శుభములగు కరణములు కలిగినట్టియు దినమునందు మిత్రదేవతాకమైన ముహూర్తమున శాంతి హోమమును చేసి గోవులను, బ్రాహ్మణులను, అగ్నిని, ఉదకపాత్రను ముందుగ ప్రవేశపెట్టి గోవులకు గడ్డి ఉదకము తేనిపేలాలను తినిపించి బ్రాహ్మణులకు అక్షతలను, పుష్పములను, నాందీముఖమునకు ఉపయోగించు ఫలములను ఇచ్చి ఆసనములయందు కూర్చుండ బెట్టి నీటితో కాళ్ళుకడిగి నమస్కరించి తిరిగి ఆచమనము చేసి ఆశీర్వచనములను పొందవలెను. పిమ్మట మంగళవాద్యములతో గోవులను బ్రాహ్మణులను ప్రదక్షిణ పూర్వకముగ అనుసరించుచు సూతికాగృహమును ప్రవేశింపవలెను. అట్లు ప్రవేశించి యున్న గర్భిణి ప్రసవకాలము కొరకు నిరీక్షించుచుండవలెను.

ఆయుర్వేదదీపిక : "శాన్తిం కృత్వా" అనగా శాంతి హోమమును చేసి "నాన్దీముఖాని చ ఫలాని" అనగా నాందీముఖ శ్రాద్ధము కొరకు హితములగు ఫలములు, లేదా "నాన్దీ" అనగా మురజము (మృదంగము) దాని ఎముఖము వంటి ఆకారము గల ఫలములు నాందీముఖఫలములు: ఖర్జూరము మొదలగునవి. ప్రదక్షిణము ఏ విధముగా జరుగునో ఆ విధముగా గోవులను బ్రాహ్మణులను అనుసరించుచున్నదై అని అర్థము.

## ఆసన్న ప్రసవ లక్షణములు

36. తస్యాస్తు ఖల్విమాని లిఙ్గాని ప్రజననకాలమభితో భవన్తి: తద్యథా-క్లమో గాత్రాణాం,గ్లానిరాననస్య అక్ష్ణోః శైథిల్యం,విముక్తబన్ధనత్వమివ వక్షసః, కుక్షేరవస్రంసనమ్,అధోగురుత్వం,వంక్షణబస్తికటీకుక్షిపార్శ్వపృష్ఠనిస్తోదః, యోనేః ప్రస్రవణమ్, అనన్నాభిలాషశ్చేతి;తతోఽనన్తరమావీనాం ప్రాదుర్భావః,ప్రసేకశ్చ గర్భోదకస్య.

## ప్రసవ వేదనలు కలిగినపుడు చేయవలసిన విధి

37. ఆవీప్రాదుర్భావే తు భూమౌ శయనం విదధ్యాన్మృద్వాస్తరణోపపన్నమే. తదధ్యాసీత సా.తాం తతః సమన్తతః పరివార్య యథోక్తగుణాః స్త్రియః పర్యుపాసీరన్నాశ్వాసయన్త్యో వాగ్భిర్గ్రాహిణీయాభిః, సాన్త్వనీయాభిశ్చ.

## ప్రసవ వేదనలు కలిగియు ప్రసవించినపుడు చేయవలసిన విధి

38. సా చేదావీభిః సంక్లిశ్యమానా న ప్రజాయేతాథైనాం బ్రూయాత్-ఉత్తిష్ఠ, ముసలమన్యతరం గృహ్ణీష్వ, అనేనైతదులూఖలం ధాన్యపూర్ణం ముహుర్ముహురభిజహి ముహుర్ముహురవజృమ్భస్వ చఙ్క్రమస్వ చాన్తరాన్తరేతి; ఏవముపదిశన్త్యేకే.తన్నేత్యాహ భగవానాత్రేయః. దారుణవ్యాయామవర్జనం హి గర్భిణ్యాః సతతముపదిశ్యతే, విశేషతశ్చ ప్రజననకాలే ప్రచలితసర్వధాతుదోషాయాః సుకుమార్యా నార్యా ముసలవ్యాయామసమీరితో వాయురన్తరం లబ్ధ్వా ప్రాణాన్ హింస్యాత్,దుష్ప్రతీకారతమా హి తస్మిన్ కాలే విశేషేణ భవతి గర్భిణీ;తస్మాన్ముసలగ్రహణం పరిహార్యమృషయో మన్యన్తే, జృమ్భణం చఙ్క్రమణం చ పునరనుష్ఠేయమితి.అథాస్యై దద్యాత్

కుష్ఠైలా లాఙ్గలికీవచా చిక్రితచిరబిల్వచవ్యచూర్ణముపఘ్రాతుం, సా తన్ము-హుర్ముహురుపజిఘ్రేత్, తథా భూర్జపత్రధూమం శింశపాసారధూమం వా. తస్యాశ్చాన్తరాన్తరా కటీపార్శ్వపృష్ఠసక్థిదేశానీశదుష్ణేన తైలేనాభ్యజ్యా-నుసుఖమవమృద్నీయాత్.అనేన కర్మణా గర్భోఽవాక్ ప్రతిపద్యతే.

## గర్భము ప్రసవాభిముఖమైనపుడు చేయవలసిన విధి

39. స యదా జానీయాద్విముచ్య హృదయముదరమస్యాస్త్వావిశతి, బస్తిశిరోఽవ-గృహ్ణాతి,త్వరయన్త్యేనామావ్యః, పరివర్తతేఽధో గర్భ ఇతి; అస్యామవ-స్థాయాం పర్యఙ్కమేనామారోప్య ప్రవాహయితుముపక్రమేత.కర్ణే చాస్యా మన్త్రమిమమనుకూలా స్త్రీ జపేత్—

## సుఖప్రసవమునకు గర్భిణికి చేయదగిన మంత్రోపదేశము

"క్షితిర్జలం వియత్తేజో వాయుర్విష్ణుః ప్రజాపతిః,
స గర్భాం త్వాం సదా పాన్తు వైశల్యం చ దిశన్తు తే.
ప్రసూష్వ త్వమవిక్లిష్టమవిక్లిష్టా శుభాననే,
కార్తికేయద్యుతిం పుత్రం కార్తికేయాభిరక్షితమ్". ఇతి.

## ప్రసవ సమయమున గర్భిణికి చేయవలసిన హితోపదేశములు

40. తాశ్చైనాం యథోక్తగుణాః స్త్రియోఽనుశిష్యుః—అనాగతావీర్మా ప్రవాహిష్ఠాః; యా హ్యనాగతావీః ప్రవాహతే వ్యర్థమేవాస్యాస్తత్ కర్మ భవతి, ప్రజా చాస్యా వికృతా వికృతిమాపన్నా చ,శ్వాసకాసశోషప్లీహప్రసక్తా వా భవతి. యథా హి క్షవథూద్గారవాతమూత్రపురీషవేగాన్ ప్రయతమానోఽప్యప్రాప్త-కాలాన్న లభతే కృచ్ఛ్రేణ వాఽప్యవాప్నోతి, తథాఽనాగతకాలం గర్భ-మపి ప్రవాహమాణా; యథా చైషామేవ క్షవథ్వాదీనాం సన్ధారణముపఘాతా-యోపపద్యతే తథా ప్రాప్తకాలస్య గర్భస్యాప్రవాహణమితి.సా యథా-నిర్దేశం కురుష్వేతి వక్తవ్యం స్యాత్. తథా చ కుర్వతీ శనైః పూర్వం-ప్రవహేత,తతోఽనన్తరం బలవత్తరమ్. తస్యాం చ ప్రవాహమాణాయాం స్త్రియః శబ్దం కుర్యుః— "ప్రజాతా ప్రజాతా ధన్యం ధన్యం పుత్రమ్. ఇతి. తథాఽస్యా హర్షేణాప్యాయన్తే ప్రాణాః.

**తాత్పర్యము :** గర్భిణీ స్త్రీకి ప్రసవకాలము సమీపించినపుడు ఈ లక్షణము లుండును. అవి ఏవనగా — శరీరము బడలిక నొందుట, ముఖము వాడినట్లుండుట, నేత్రములు జారినట్లుండుట, చన్నులు పట్టు విడిపోయినట్లుండుట, కుక్షి ప్రదేశము జారుట, గజ్జలు, వస్తి ప్రదేశము, కటి ప్రదేశము కుక్షి పార్శ్వములు, నడుము వీనియందు పొడిచినట్లు బాధకలుగుట, యోనియందు స్రావము కలుగుట, ఆహారమునందు ఇష్టము లేకపోవుట అను లక్షణములు కలుగును. అటు పిమ్మట ప్రసవ వేదనలు ప్రారంభమగుటయు, గర్భోదకము (ఉమ్మ నీరు) స్రవించటయునూ జరుగును.

ప్రసవ వేదనలు ప్రారంభింపగనే మృదువైన బట్టను పరచిన నేలపై పరుండ జేయవలెను. ఇంతకుముందు చెప్పబడిన గుణములు కల స్త్రీలు ఆమె చుట్టును ఉండి ఆమెకు అనుకూలమైనట్టి ఓదార్చునట్టి వాక్యములను చెప్పి ఓదార్చవలెను.

ప్రసవ వేదనలచే బాధపడుచు ప్రసవింపకున్న స్త్రీతో - "లెమ్ము, రోకలిని తీసికొని ధాన్యముతో నిండియున్న రోటిలో వేసి దంపుము, ఎక్కువగా ఆవలింపుము, ఆటునిటు తిరుగుము" అని చెప్పవలెనని కొందరందురు. అట్లు చేయరాదని ఆత్రేయ భగవానుడనెను. గర్భిణీస్త్రీ దారుణమైన వ్యాయామము నెప్పుడును వర్జింపవలెనని చెప్పబడినది. ప్రసవకాలమునందు విశేషించి చలించుచున్న సమస్త ధాతువులును దోషములును కలిగినట్టియు సుకుమారముగ నుండునట్టియు గర్భిణీస్త్రీ రోకలిచే పరిశ్రమ చేసినచో వాతము ప్రకోపించి అవకాశమును పొందినదై ప్రాణములను హింసించును. అందువలన రోకలిచే పరిశ్రమ చేయకూడదని ఋషులు చెప్పుదురు. ఆవలింతలను, ఆటునిటు తిరుగుటను మాత్రము చేయవచ్చును. ఈ స్త్రీకి చెంగల్వకోష్టు, ఏలకులు, పొత్తిదుంప, వస, చిత్రమూలము, నెమలడుగు చెట్టు, చవ్యము వీనియొక్క చూర్ణమును ఆఘ్రాణించు నిమిత్తము ఈయవలెను. అట్లు ఆమె ఎక్కువ మారులు ఆఘ్రాణింపవలెను. మరియు భూర్జపత్ర ధూమమునుగాని, ఇరుగుడు చెక్క ధూమమునుగాని ఆఘ్రాణింపవలెను. ఈ స్త్రీ యొక్క కటి ప్రదేశము, పార్శ్వములు, నడుము, తొడలు వీనిని కొద్దిగ వెచ్చగనున్న తైలముతో అప్పుడప్పుడు పూసి సుఖముగ నుండునట్లు పిసుకవలెను. ఇట్లు చేసినచో గర్భము ముందునకు (క్రిందకు) వచ్చును. ఈ స్త్రీకి గర్భము హృదయమును విడచి ఉదరము వద్దకు వచ్చి వస్తి శిరస్సు వద్దకు వచ్చినపుడు ప్రసవ వేదనలు అధికమగును. అపుడు గర్భము క్రిందకు తిరిగినట్లు తలచి గర్భిణిని శయ్యపై పరుండజేసి ప్రవా

హణము చేయమని చెప్పవలెను (గట్టిగా ముక్కమని చెప్పవలెను). మరియు ఈమె చెవియందు ఒక అనుకూలమైన స్త్రీచే-

"క్షితిర్జలం వియ త్తేజో వాయుర్విష్ణుః ప్రజాపతిః,
సగర్భాం త్వం సదా పాన్తు,వై శాల్యం చ దిశన్తు తే.
ప్రసూష్వ త్వమవిక్లిష్టమవిక్లిష్టా శుభాననే,
కా ర్తికేయద్యుతిం పుత్రం కా ర్తికేయాభి రక్షితమ్".

అను మంత్రమును పఠింపజేయవలెను అచటనున్న స్త్రీలు గర్భిణితో నిట్లన వలెను — "ప్రసవ వేదనలు లేనపుడు ముక్కకుము. అట్లు చేసిన యెడల ప్రయోజన ముండదు. అపుడు శిశువు జనించినను వికృతినొంది శ్వాసకాస శోష ప్లీహ వ్యాధి వీనితో కూడుకొనియుండును తుమ్ము త్రేనుపు అపానవాతము మూత్రము పురీషము అనునవి రాకుండగ ప్రయత్నించినను అవి రాకపోగా కష్టము కలుగునట్లే అకాలము నందు ముక్కినచో గర్భము బయటకు వెడలదు, లేదా కష్టముతో వెడలును. తుమ్ములు మొదలగువానిని నిరోధించినపుడు విఘాతము కలిగినట్లే సకాలమునందు ముక్కకపోయిన యెడల విఘాతము కలుగును. అందువలన మేము చెప్పినట్లు చేయుము". గర్భిణీ స్త్రీ కూడ మొదట మెల్లగ ముక్కుచు తరువాత గట్టిగా ముక్క వలయును. అపుడచ్చటనున్న స్త్రీలు "ధన్యురాలగు పుత్రుని కనుచున్నది" అని గట్టిగా అనవలయును. అట్లు చేయుట వలన ప్రసవించుచున్న స్త్రీకి మిక్కిలి సంతోషము కలుగును. (ఆమె ప్రాణములకు సంతోషము కలుగును.)

**ఆయుర్వేదదీపిక :** ఉపదేశింపవలసిన విషయమును పేర్కొనునట్టి వాక్కు గ్రహింపదగినదిగా నుండును. "అవజృమ్భస్వ" అనగా అవయవములను ప్రసరింపజేయుము (ఒడలు విరుచుకొనుము) అని అర్థము. "అన్తరం లబ్ధ్వా" అనగా కారణమును పొంది అని అర్థము.

## ప్రసవానంతరము చేయవలసిన కర్మ

41. యదా చ ప్రజాతా స్యాత్తదైవైనామవేక్షేత-కాచిదస్యా అపరా ప్రపన్నా న వేతి.తస్యాశ్చేదపరా న ప్రపన్నా స్యాదథైనామన్యతమా స్త్రీ దక్షిణేన పాణినా నాభేరుపరిష్టాద్బలవన్నిపీడ్య సవ్యేన పాణినా పృష్ఠత ఉపసంగృహ్య తాం సునిర్ధూతం నిర్ధునుయాత్.అథాస్యాః పార్ష్ణ్యా శ్రోణీమాకోటయేత్. అస్యాః స్ఫిచావుపసంగృహ్య సుపీడితం పీడయేత్. అథాస్యా బాలవేణ్యా

కణ్ఠతాలు పరిమృ శేత్.భూర్జపత్రకాచమణిసర్పనిర్మోకై శ్చాస్యా యోనిం ధూపయేత్.కుష్ఠతాలీసకల్కం బల్వజయూషే మైరేయసురామణ్డే తీక్ష్ణే కౌలత్థే వా యూషే మణ్డూకపర్ణిపిప్పలీసంపాకే వా సంప్లావ్య పాయ-యేదేనామ్.తథా సూక్ష్మైలాకిలిమకుష్ఠనాగరవిడఙ్గపిప్పలీకాలాగురుచవ్య-చిత్రకోపకుఞ్చికాకల్కం ఖరవృషభస్య వా జీవతో దక్షిణం కర్ణముత్కృత్య దృషది జర్జరీకృత్య బల్వజక్వాథాదీనామాప్లావనానామన్యతమే ప్రక్షిప్యాప్లావ్య ముహూర్తస్థితముద్ధృత్య తదాప్లావనం పాయయేదేనామ్.శతపుష్పాకుష్ఠ-మదనహిఙ్గుసిద్ధస్య చైనాం తైలస్య పిచుం గ్రాహయేత్. అతశ్చైవానువాస-యేత్. ఏతైరేవ చాప్లావనైః ఫలజీమూతకేక్ష్వాకుధామార్గవకుటజకృతవేధన-హస్తిపిప్పల్యుపహితైరాస్థాపయేత్. తదాస్థాపనమస్యాః సహ వాతమూత్ర-పురీషైర్నిర్హరత్యపరామాసక్తాం వాయోరేవాప్రతిలోమగత్వాత్. అపరాం హి వాతమూత్రపురీషాణ్యన్యాని చాన్తర్బహిర్మార్గాణి సజ్జన్తి.

**తాత్పర్యము :** ప్రసవమైన పిదప మావి బయటకు వెడలినదీ లేనిదీ చూడవలెను. బయల్వెడలని యెడల అచ్చట నున్నవారిలో ఒక స్త్రీ తన కుడిచేతితో ఈమె యొక్క నాభికి పైభాగమున గట్టిగ నొక్కి, ఎడమ చేతితో నడుమును పట్టుకొని బాగుగ పిసుకవలెను. కాళ్ళయొక్క మడమలతో శ్రోణి ప్రదేశమును పీడింపవలెను. పిరుదులను పట్టుకొని బాగుగా పిసుకవలెను. జడ వెంట్రుకలతో ఈమె యొక్క కంఠ ప్రదేశమును, తాలు ప్రదేశమును తుడువవలెను. భూర్జపత్రము, కాచమణి, పాము కుబుసము వీనితో యోనికి ధూపము వేయవలెను. చెంగల్వకోష్టు తాలీస పత్రాలయొక్క కల్కమును బల్వజగడ్డి యొక్క కషాయమునగానీ, మైరేయమను సురామండమునందుగానీ, ఉలవల కషాయమునందుగానీ, మండూకపర్ణి పిప్పళ్ళు వీని కషాయమునందుగానీ కలిపి త్రాగింపవలెను. లేక, సన్న ఏలకులు-దేవదారు-చెంగల్వకోష్టు-శొంఠి, వాయు విడంగములు-కృష్ణాగరు-చవ్యము-పిప్పళ్ళు-చిత్రమూలము-జీలకర్ర వీనియొక్క కల్కమును గానీ జీవించియున్న ఆబోతు యొక్క కుడి చెవిని కోసి రాతియందు మెత్తగ నూరి దానినిగాని, పై చెప్పబడిన బల్వజగడ్డి కషాయము మొదలగువానిలో దేనియందైనను కలిపి కొంచెమునేపైన తరువాత తీసి ఆ కషాయమును త్రాగించవలెను. సదాప, చెంగల్వకోష్టు, మంగకాయ, ఇంగువ వీనితో తయారుచేయబడిన తైలమునందు తడుపబడిన పిచును యోనియందుంచవలెను. ఈ తైలము తోడనే అనువాసన వస్తిని చేయింప

వలెను. పైన చెప్పబడిన బల్వజమనెడి గడ్డి కషాయము మొదలగువానిలో దేని యందైననూ మంగళాయ, దావరడంగి, చేదుసొర, పెద్ద చేదుబీర, కొడిసెపాల విత్తులు, చిన్న చేదు బీర, గజపిప్పళ్ళు-వీనిని కలిపి ఆస్థాపనవస్తిని చేయించవలెను. ఈ ఆస్థాపనస్తి వాతమునకు అనులోమ గతిని కల్గించి అంటిపెట్టుకొనియున్న మావిని వాతమూత్రపురీషములతో కూడ బయటకు వెడలించును. బహిర్గమన స్వభావమును కలిగి అంటిపెట్టుకొనియున్న ఇతరములను కూడ బయటకు వెడలించును.

ఆయుర్వేదదీపిక : "సునిర్ఘాతమను"నది క్రియా విశేషణము "ఆకోటయేత్" అనగా మర్దించవలెను అని అర్థము. చిన్నదిగా చేసిన జడ బాలవేణియన బడును. బల్వజయూషః అనగా బల్వజక్వాథము. "మణ్డూక పిప్పలీ" అనగా మండూకపర్ణి. లేదా "మండూకా" అనగా మండూకపర్ణి. పిప్పలీ అనగా పిప్పళ్ళు. ఆ రెండింటియొక్క సంపాకమనగా క్వాథము అని అర్థము. "తథా" అనుటవలన బల్వజ క్వాథము మొదలైనవానియందు సూక్ష్మఏలా మొదలగువానిని చేర్చి పానము చేయవలెనని చెప్పబడుచున్నది. ఖరవృషభమనగా ఆబోతు. (చణ్డబలీమర్దః) "ఏతైరేవ" అనగా బల్వజ యూషాదులతోడ అని అర్థము. "అన్తర్బహిర్మార్గాణి సజ్జన్తి" అనగా లోపలి ప్రదేశమున అంటిపెట్టుకొనియున్న బహిర్గమన శీలము కల పురీషాదులు అని అర్థము.

## జనించిన శిశువునకు వెంటనే చేయవలసిన కృత్యములు

42. తస్యాస్తు ఖల్వపరాయాః ప్రపతనార్థే కర్మణి క్రియమాణే జాతమాత్రస్యైవ కుమారస్య కార్యాణ్యేతాని కర్మాణి భవన్తి: తద్యథా— అశ్మనోః సంఘట్టనం కర్ణయోర్మూలే, శీతోదకేనోష్ణోదకేన వా ముఖపరిషేకః,తథా సక్లేశవిహతాన్ ప్రాణాన్ పునర్లభేత. కృష్ణకపాలికాశూర్పేణ చైనమభినిష్పుణీయుర్యద్యచేష్టః స్యాద్ యావత్ ప్రాణానాం ప్రత్యాగమనమ్ (తత్తత్ సర్వమేవ కార్యమ్). తతః ప్రత్యాగతప్రాణం ప్రకృతిభూతమభిసమీక్ష్య స్నానోదకగ్రహణాభ్యాముపపాదయేత్.

43. అథాస్య తాల్వోష్ఠకణ్ఠజిహ్వాప్రమార్జనమారభేతాఙ్గుల్యా సుపరిలిఖితనఖయా సుప్రక్షాలితోపధానకార్పాసపిచుమత్యా. ప్రథమం ప్రమార్జితాస్యస్య చాస్య శిరస్తాలు కార్పాసపిచునా స్నేహగర్భేణ ప్రతిసంఛాదయేత్. తతోఽస్యానన్తరం సైన్ధవోపహితేన సర్పిషా కార్యం ప్రచ్ఛర్దనమ్.

**తాత్పర్యము :** ప్రసవించిన స్త్రీకి మావి పడుటకు చేయవలసిన విధానమును చేయుచున్ననూ శిశువునకు జనించిన వెంటనే చేయవలసిన విధానములను చెప్పుచున్నాము— శిశువుయొక్క చెవులవద్ద రెండు రాళ్ళతో ధ్వనిని చేయవలెను. చల్లని నీటితోగాని వేడినీటితోగాని ముఖముపై చల్లవలెను. అట్లు చేసినచో క్లేశముచే బడలిన ప్రాణములకు తిరిగి ఆప్యాయనము కలుగును. జనించిన శిశువు చేష్టలుడిగి యున్నచో నల్లని బద్దలచే అల్లబడిన చేటచే చేష్టలు కలుగువరకు విసరవలెను. చేష్టను పొంది సమస్థితికి వచ్చిన పిదప స్నానము, నీటితో మలమార్గమును శుభ్రపరచుటలను చేయవలెను.

తరువాత గోళ్ళను తీసివేసిన వేలికి తడిపిన దూదిని చుట్టి ఆ వేలితో శిశువు యొక్క తాలు ప్రదేశమును, పెదవులను, కంఠమును నాలుకను తుడవవలెను. ఆ తరువాత చమురునందు తడుపబడిన దూదిని శిరస్సునందు తాలుప్రదేశమునందును ఉంచవలెను. ఆపైన సైంధవ లవణముతో కూడిన నేతితో వాంతిని చేయింపవలెను.

**ఆయుర్వేదదీపిక :** "శీతోదకేనోష్ణోదకేన వా" అనునది ఋతుభేదము వలన వికల్పమని తెలియవలెను— గ్రీష్మకాలమునందు శీతోదకము వలన, శీత కాలమునందు ఉష్ణోదకముతోడనూ అని అర్థము. "క్లేశవిహతాన్" అనగా యోని యంత్రపీడనము మొదలగు బాధలచే పీడింపబడినట్టి అని అర్థము. నల్ల వెదురు, ఈషిక, నలముంజ, వెదురు మొదలగువానితో చేయబడిన చేట కృష్ణకపాలికా శూర్పమనబడును. దానితో— "నిష్పుణీయుః"— విసరవలెను అని అర్థము. ఇక ఎంతకాలమువరకు అట్లు విసరవలెనో— "యావత్ ప్రాణానాం ప్రత్యాగమనమ్" అని (ప్రాణములు తిరిగి వచ్చునంతవరకు- అని) చెప్పుచున్నాడు ఉదకగ్రహణము మలమార్గముయొక్క శుద్ధికొరకు. ఉపధానమనగా ఆవరణము: అది ఇచట దూది వత్తితోనున్న అంగులితోనే (తీయవలెను).

## నాభినాళమును ఛేదించు పద్ధతి.

44. తతః కల్పనం నాడ్యాః. అత స్తస్యాః కల్పనవిధి ముపదేక్ష్యామః— నాభిబన్ధనాత్ ప్రభృత్యష్టాఙ్గులమభిజ్ఞానం కృత్వా ఛేదనావకాశస్య ద్వయోర న్తరయోః శనైర్గృహీత్వా తీక్ష్ణేన రౌక్మరాజతాయసానాం ఛేదనానామన్యతమేనార్ధధారేణ ఛేదయేత్. తామగ్రేసూత్రేణోపనిబధ్య

కణ్ఠేఽస్య శిథిలమవసృజేత్. తస్యచేన్నాభిః పచ్యేత,తాం లోధ్రమధుక-
ప్రియఙ్గుసురదారుహరిద్రాకల్కసిద్ధేన తైలేనాభ్యజ్యాత్, ఏషామేవ
తైలౌషధానాం చూర్ణేనావచూర్ణయేత్. ఇతి నాడీకల్పనవిధిరుక్తః
సమ్యక్.

**తాత్పర్యము :** ఇక శిశువు యొక్క నాభి నాడీ ఛేదన విధిని చెప్పు చున్నాము. బొడ్డుదగ్గర నుండి ఎనిమిది అంగుళములుగ కొలిచి గుర్తునుంచి ఛేదింప దగిన ఆ ప్రదేశమునకు అటునిటు పట్టుకొని పదునైనట్టి బంగారపు, వెండి లేదా ఇనుప చాకుతో కోయవలెను. నాడియొక్క చివరిభాగమునందు దారమునుకట్టి దారపు రెండవచివరను శిశువు యొక్క కంఠమునకు వదులుగా చుట్టవలెను. నాభియందు పుండు ఏర్పడినచో లొద్దుగ, అతిమధురము, ప్రేంఖణము, దేవదారు, పసుపు వీని యొక్క కల్కముతో తయారుచేయబడిన తైలమును పూయవలయును. మరియు ఈ ద్రవ్యముల యొక్క చూర్ణమును చల్లవలయును. ఇట్లు నాభి నాడీ ఛేదనవిధి సరిగా చెప్పబడినది.

**ఆయుర్వేదదీపిక :** "అష్టాంగులమభిజ్ఞానం కృత్వా" అనగా ఎనిమిదవ అంగుళమునందు చిహ్నమును చేసి. అర్ధధారయనగా తిర్యగ్ధార యనెడి శస్త్ర విశేషము. "తామ్" అనగా ఛేదించిన తరువాత మిగిలిన ఎనిమిది అంగుళముల నాడిని. "కణ్ఠేఽవసృజేత్" అనగా నాడి చివర కట్టిన దారమును శిశువుయొక్క కంఠము నందు కట్టవలెను.

## నాభినాడిని సరిగ ఛేదించకపోవుట వలన కలుగు దోషములు-చికిత్స

45. అసమ్యక్కల్పనే హి నాడ్యా ఆయామవ్యాయామోత్తుణ్డితా- పిణ్డలికా - వినామికా - విజృమ్భికాబాధేభ్యోభయమ్. తత్రావిదాహిభిర్వాతపిత్త-ప్రశమనైరభ్యఙ్గోత్సాదనపరిషేకైః సర్పిర్భిశ్చోపక్రమేత గురులాఘవమభి-సమీక్ష్య.

**తాత్పర్యము :** నాభినాడిని సరిగ ఛేదింపని యెడల నాభి పొడుగుగ నుండుట, విస్తరించుట, మండలములతో కూడుకొనియుండుట, మధ్యన పల్లముగ నుండుట, తరచు ఉబ్బుచుండుట అను వికృతములు కలుగును. అట్లు కలిగినయెడల

దోషములయొక్క గురులాఘవములను తెలిసికొని తాపమును కలిగింపనట్టియు, వాత పిత్తములను శమింపజేయునట్టియు అభ్యంగములు, నలుగు పెట్టుట, స్నానములు-వీనిచేతను, ఘృతములచేతను చికిత్సింపవలయును.

**ఆయుర్వేదదీపిక :** నాడిని విధిప్రకారము కాకుండక ఛేదించుటయందు దోషమును "అసమ్యక్" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "ఆయామః" అనగా పొడవు. "వ్యాయామః" అనగా వెడల్పు. వానివలన పొంగినది ఆయామ వ్యాయామోత్తుండితమనబడును - పొడవుగను లావుగను ఉండునని అర్థము. "పిణ్డలికా" అనగా ముడులతో కూడిన. "వినామికా" అనగా చివరల ఎత్తుగా నున్నట్టి మధ్యన పల్లముగా నున్నట్టియు అని అర్థము. "ఏజృమ్భికా" అనగా మాటిమాటికి పెరుగునది. "గురులాఘవమభిసమీక్ష్య" అనగా నాడి పుండగుటకు కారణమగు పిత్తమునందు మరియు వాతమునందునూ ఆయామాది నాలుగు వికార ములను కల్గించువానిలో ఏ దోషము ఎక్కువగా నుండునో దానిని వెంటనే చికిత్సింపవలెను అని అర్థము.

## జాతకర్మ విధానము

46. అతోఽనన్తరం జాతకర్మ కుమారస్య కార్యమ్. తద్యథా— మధుసర్పిషీ మన్త్రోపమన్త్రితే యథామ్నాయం ప్రథమం ప్రాశితుం దద్యాత్.
స్తనమతో ఊర్ధ్వమేతేనైవ విధినా దక్షిణం పాతుం పురస్తాత్ ప్రయచ్ఛేత్
అథాతః శీర్షతః స్థాపయేదుదకుమ్భం మన్త్రోపమన్త్రితమ్.

**తాత్పర్యము :** తరువాత శిశువునకు జాతకర్మను చేయించవలెను. అది యెట్లనగా- విధిప్రకారముగ మంత్రములచే మంత్రింపబడిన తేనె, నెయ్యిలను శిశు వుచే తొలుత నాకింపవలెను. అపైన మంత్రములచే మంత్రింపబడిన దక్షిణ స్తన మును ముందుగా పానము చేయించవలెను. తరువాత మంత్రింపబడిన జలకుంభ మును శిరస్సువద్దనుంచవలెను.

**ఆయుర్వేదదీపిక :** పుట్టిన వెంటనే చేయవలసిన వేదోక్తమగు కర్మ జాతకర్మ యనబడును. "యథామ్నాయం" అనగా ఆగమము ప్రకారము మంత్రము లచే ఉపమంత్రించినదానిని అని అర్థము. "ఏతేనైవ విధినా" అనగా స్తనమును కూడ అభిమంత్రించినదానినే త్రాగింపవలయునని అర్థము.

## రక్షావిధి

47. అథాస్య రక్షాం విదధ్యాత్—ఆదానీఖదిరకర్కన్ధుపీలుపరుషకశాఖాభిరస్యా గృహం సమన్తతః పరివారయేత్. సర్వతశ్చ సూతికాగారస్య సర్షపాతసీ-తణ్డులకణకణికాః ప్రకిరేయుః. తథా తణ్డులబలిహోమః సతతముభయకాలం క్రియేతానామకర్మణః. ద్వారే చ ముసలం దేహలీమనుతిరశ్చీనం న్యసేత్. వచాకుష్ఠక్షౌమకహిఙ్గుసర్షపాతసీలశునకణకణికానాం రక్షోఘ్నసమాఖ్యాతానాం చౌషధీనాం పోట్టలికాంబద్ధ్వా సూతికాగారస్యోత్తరదేహల్యామవసృజేత్, తథా సూతికాయాః కణ్ఠే సపుత్రాయాః, స్థాల్యుదకకుమ్భపర్యఙ్కేష్వపి, తథైవ చ ద్వయోర్ద్వారపక్షయోః. కణకకణ్టకేన్ధనవానగ్నిస్తిన్దుకకాష్ఠేన్ధనశ్చాగ్నిః సూతికాగారస్యాభ్యన్తరతో నిత్యం స్యాత్. స్త్రియశ్చైనాం యథోక్తగుణాః సుహృదశ్చానుశ్చానుజాగృయుర్దశాహం ద్వాదశాహం వా. అనుపరతప్రదాన మఙ్గలాశీఃస్తుతిగీతవాదిత్రమన్నపానవిశదమనురక్తప్రహృష్టజనసంపూర్ణం చ తద్వేశ్మ కార్యమ్. బ్రాహ్మణశ్చాథర్వవేదవిత్ సతతముభయకాలం శాన్తిం జుహుయాత్ స్వస్త్యయనార్థం కుమారస్య తథా సూతికాయాః. ఇత్యేతద్రక్షా-విధానముక్తమ్.

**తాత్పర్యము :** ఇక రక్షావిధిని చేయవలెను—శిశువు ఉన్న గృహము చుట్టును బీర, చండ్ర, రేగు, కొండగోగు, చిట్టీత వీనియొక్క కొమ్మలనుంచవలెను. సూతికాగృహమంతటను ఆవాలు అవిసెగింజలు, బియ్యపు నూక, గోధుమ నూక వీనిని చల్లవలెను. నామకరణము చేయు వరకు ఉదయం, సాయంత్రము తండుల బలిహోమమును చేయించవలెను. ద్వారమునందు గడప ప్రక్కనే రోకలిని అడ్డముగా ఉంచవలయును. వస, చెంగల్వకోష్టు, కచోరము, ఇంగువ, ఆవాలు, అవిసెగింజలు, వెల్లుల్లి, బియ్యపు నూక, గోధుమ నూక-వీనిని మరియు రక్షోఘ్నములగునట్టి ఇతర ఔషధులను మూటకట్టి సూతికాగృహముయొక్క ద్వారమునకు పై భాగమునందున్న కమ్మెకు వ్రేలాడగట్టవలెను. మరియు సూతికా స్త్రీ యొక్కయు, శిశువుయొక్కయు కంఠమునందు, భోజన పాత్రలు, ఉదక పాత్రలు, మంచములు వీనియందును కట్ట వలెను. అటులనే ద్వారమున కిరుపైపులను కట్టవలెను. నంది వృక్షము, చింత, తిందుక-వీనితో సూతికాగారమునందు ఎల్లప్పుడును అగ్నిని చేసియుంచవలెను. పూర్వమందు చెప్పబడిన గుణములు కలిగినట్టియు, స్నేహితురాండ్రైనట్టియు స్త్రీలు

ఈ సూతికాస్త్రీని పది లేక పన్నెండు దినముల వరకు జాగరూకత పరచుచు కాపాడు చుండవలెను. ఎడతెగక ఆ గృహము దానములు, మంగళాశీస్సులు, స్తోత్రములు గీత ములు వాద్యములు అన్నపానములు జరుగుచుండి అనురాగము హర్షముతో కూడిన జనులతో నిండియుండవలెను. శిశువునకు, సూతికాస్త్రీకిని మంచి జరుగుట కొరకు అథర్వ వేద విదులగు బ్రాహ్మణులు శాంతి హోమమును ప్రతిరోజు రెండువేళల యందు చేయుచుండవలెను. ఇట్లు ఈ రక్షా విధానము చెప్పబడినది.

**ఆయుర్వేదదీపిక :** "ఆదాసి" అనగా దీరలో ఒక రకము తణ్డుల బలిహోమము ఎంత కాలము వరకు చేయబడవలెనో "ఆనామకర్మణ" అని చెప్పు చున్నాడు— పదిరోజుల వరకు అని అర్థము. పదవరోజున నామకర్మ జరుగగలదు. జతూకర్ణ సంహిత యందును "తణ్డుల బలిహోమో ద్వికాలమాదశాహమ్" అని చెప్పబడినది. "రక్షోఘ్నసమాఖ్యాతానామ్" అనుట వలన గుగ్గులు మొదలగువానిని గ్రహించుచున్నాడు. "ఉత్తర దేహల్యాం" అనగా ద్వారమునకు పైన; ఇతరులు మాత్రము ద్వారమునకు అడుగుననున్న కర్రను "దేహలీ" (గడప) అని పిలుతురు.

## సూతికా స్త్రీకి చేయవలసిన ఉపచారములు

48. సూతికాం తు ఖలు బుభుక్షితాం విదిత్వా స్నేహం పాయయేత పరమయా శక్త్యా సర్పిస్తైలం వసాం మజ్జానం వా సాత్మ్యభావమభిసమీక్ష్య పిప్పలీ పిప్పలీమూల చవ్య చిత్రకశృఙ్గవేరచూర్ణ సహితమ్. స్నేహం పీతవత్యాశ్చ సర్పిస్తైలాభ్యామభ్యజ్య, వేష్టయేదుదరం మహతా వాససా; తథా తస్యా న వాయురుదరే వికృతి ముత్పాదయనవకాశత్వాత్. జీర్ణేతు స్నేహే పిప్ప ల్యాదిభిరేవ సిద్ధాం యవాగూం సుస్నిగ్ధాం ద్రవాం మాత్రశః పాయయేత్. ఉభయతః కాలం చోష్ణోదకేన చ పరిషేచయేత్ ప్రాక్ స్నేహయవాగూపానా భ్యామ్. ఏవం పఞ్చరాత్రం సప్తరాత్రం వాఽనుపాల్య క్రమేణాప్యాయయేత్ స్వస్థవృత్తమేతావత్ సూతికాయాః.

**తాత్పర్యము :** సూతికా స్త్రీ ఆకలిగొనియున్నదని తెలిసికొని ఆమెకు సాత్మ్యమగుదానిని తెలిసికొని ఘృతతైల మజ్జావసలయందును దేనినైననూ పిప్పళ్ళు, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి-ల చూర్ణముతో కలిపి త్రాగించవలెను. అట్లు స్నేహపానము చేసిన తరువాత ఆమెకు ఘృతతైలములతో అభ్యంగనము చేయించి శుభ్రమైన పెద్ద వస్త్రముతో ఆమెయొక్క ఉదరము చుట్టును చుట్టవలెను.

అట్లు చేయుటవలన అవకాశము లేకపోవుటచే వాయువు ఉదరమునందు వికృతిని కలిగింపనేరదు. మొదట త్రాగిన స్నేహము జీర్ణమైన తరువాత పిప్పలీ మొదలగు వానితోడనే తయారైన యవాగును కొంచెము స్నేహముతో కలిపి తగు మాత్రలో ద్రవాంశమును మాత్రము త్రాగించవలెను. స్నేహపానము యవాగు పానములకు ముందుగా రెండు కాలములందును శరీరమును ఉష్ణోదకముతో కడుగవలెను. ఇట్లు ఐదు దినములుగాని ఏడు దినములుగాని చేసి పిమ్మట క్రమముగా బలమును కలిగించ వలెను. ఇదంతయును సూతికకు చేయవలసిన స్వస్థవృత్తము.

**ఆయుర్వేదదీపిక :** కుమారునికి చేయవలసిన జాతకర్మను పేర్కొని, సూతికా స్త్రీకి చేయవలసిన విధిని "సూతికాం తు" అను మొదలగువానిద్వారా చెప్పుచున్నాడు. "బుభుక్షితమ్" అనుటవలన ఏ సమయమున ఆకలి గొనియుండునో ఆ సమయమున స్నేహపానము చేయవలెను. "పరమయా శక్త్యా" అనగా ఉత్తమ శక్తి కలిగియున్నది స్నేహమును త్రాగవలెను. ఎంత స్నేహము వరకు త్రాగిన బల విరోధము కాదో అంతవరకు స్నేహమును త్రాగవలెను అని తెలిసికొనవలెను. "సాత్మ్యీభావ మభిసమీక్ష్య" అనగా నెయ్యి మొదలగువానిలో నేది యామెకు సాత్మ్యమో దానినే త్రాగింపవలెను అని అర్థము. "అచ్ఛేన" అనగా నిర్మలమైన దానితో అని అర్థము. "ఉభయతః కాలమ్" అను పదము "ఉష్ణోదకేన పరిషేచ యేత్" అనుదానికి అన్వయింపవలెను. అదియే కాలద్వయము "ప్రాక్" అను మొద లగువాని ద్వారా చెప్పుచున్నాడు. పూర్వాహ్ణమునందు స్నేహపాన సమయమున మరియు స్నేహము జీర్ణమైన పిదప యవాగును ఇచ్చుటకు ముందు పరిషేచనము చేయవలెనని అర్థము. ఈ వ్యవహారము ఎక్కువ కఫము ఉండుటవలన అనూప దేశమునందు లేదనియు ఇది జాంగలదేశ వ్యవహారమనియు తెలియవలెను.

### సూతికా స్త్రీకి కల్గు వ్యాధులకు చేయవలసిన విధి

49. తస్యాస్తు ఖలు యో వ్యాధిరుత్పద్యతే స కృచ్ఛ్రసాధ్యో భవత్యసాధ్యో వా, గర్భవృద్ధిక్షపిత శిథిల సర్వధాతుత్వాత్, ప్రవాహణ వేదనాక్లేదనరక్త నిఃస్రుతి విశేష శూన్యశరీరత్వాచ్చ; తస్మాత్తాం యథోక్తేన విధినోపచరేత్; భౌతికజీవనీయ బృంహణీయ మధుర వాతహర సిద్ధైరభ్యఙ్గోత్సాదన పరిషే కావగాహనాన్నపాన విధిభిర్విశేషతశ్చోపచరేత్, విశేషతో హి శూన్యశరీరాః స్త్రియః ప్రజాతా భవన్తి.

**తాత్పర్యము :** సూతికాస్త్రీయొక్క సమస్త ధాతువులు గర్భవృద్ధి వలన క్షీణించి శిథిలమై యుండుటవలన; ముక్కుట - ప్రసవ వేదనలు పడుట - క్లేదము రక్తములు స్రావమగుట వీనివలన శూన్యముగనున్న శరీరము కలదిగ నుండును. అందుచేత ఆమెకు కలుగువ్యాధి కష్టసాధ్యముగను అసాధ్యముగాగానీ ఉండును. అందువలన ఆమెకు పూర్వము చెప్పిన విధానములచే ఉపచరింపవలెను. వారికి భూతహరములు జీవనీయ బృంహణీయములు మధురములు వాతహరములు అయిన ద్రవ్యములతో తయారైన అభ్యంగములు ఉద్వర్తనము స్నానములు అవగాహ స్నానములు అన్నపానములు - వీనిచే ఉపచరింపవలెను.

**ఆయుర్వేదదీపిక :** సూతికాస్త్రీకి మిథ్యోపచారము వలన కలుగు వ్యాధి ఏ విధముగా కష్టసాధ్యముగా గానీ అసాధ్యముగాగానీ అగునో చూపుచు యథోక్త క్రమముయొక్క అవధానము వలన చేయవలసినదానిని చూపుటకు "తస్యాస్తు" అను మొదలగునవి చెప్పుచున్నాడు. గర్భవృద్ధివలన గర్భముయొక్క ధాతువులను పోషించుట వలన క్షీణింపబడినది శిథిలీకృతమైనది యగు స్త్రీ అట్లు పిలువబడును. గర్భము బయటకు వెడలుట ఈమె శరీరము శూన్యమగుటకు కారణము. మరియు ప్రవాహణాదులను విశేషముగా హేతువులు అని "ప్రవాహణ" అను మొదలగు వానిద్వారా చెప్పుచున్నాడు. "యథోక్తేన" అనగా స్నేహపానము మొదలైనవాని వలన. ఇందువలన యథోక్తముగా చేయుటయే దుశ్చికిత్స్యమగు సూతికావ్యాధియొక్క నిదానపర్జనరూపమగు ఉత్తమ భేషజము అని చూపుచున్నాడు. ఉత్పన్నమైన వ్యాధి యందు చెప్పబడిన ఔషధము సాధారణముగా సిద్ధింపకుండుటంచేసి ఇచట ఔషధము చెప్పబడలేదు. భౌతికమనగా భూతహరము అని అర్థము.

### నామకరణ విధి

50. దశమే త్వహని సపుత్రా స్త్రీ సర్వగన్ధైరౌషధైర్గౌరసర్షపలోధ్రైశ్చ స్నాతా లఘ్వహతశుచివస్త్రం పరిధాయ పవిత్రేష్టలఘువిచిత్రభూషణవతీ చ సంస్పృశ్య మఙ్గలాన్యుచితామర్చయిత్వా చ దేవతాం శిఖినః శుక్లవాససోఽవ్యఙ్గాశ్చ బ్రాహ్మణాన్ స్వస్తి వాచయిత్వా కుమారమహతానాం చ వాససాం సంచయే ప్రాక్శిరసముదక్శిరసం వా సంవేశ్య దేవతాపూర్వం ద్విజాతిభ్యః ప్రణమతీత్యుక్త్వా కుమారస్య పితా ద్వే నామనీ కారయేన్నాక్షత్రికం

నామాభిప్రాయకం చ. తత్రాభిప్రాయికం ఘోషవదాద్యన్తస్థాన్తమూష్మాన్తం వాఽవృద్ధం త్రిపురుషానూకమనవప్రతిష్ఠితం, నాక్షత్రికం తు నక్షత్రదేవతా-సమానాఖ్యం ద్వ్యక్షరం చతురక్షరం వా.

**తాత్పర్యము :** పదవ రోజున పుత్రునితో గూడియున్న సూతికాస్త్రీ సమస్త గంధ ద్రవ్యములతోడను తెల్ల ఆవాలుతోడ్దుగ వీనితో సంస్కరింపబడిన నీటితో స్నానము చేసి తేలికగను క్రొత్తదిగను శుచియైనదియును అగు వస్త్రమును గట్టుకొని పవిత్రమైన ఇష్టమైన తేలికగానుండు విచిత్రములగు ఆభరణములను ధరించి శుభప్రదములైనవానిని స్పృశించి అనుకూలమైన దేవతను పూజించి శిఖ కలిగినట్టియు, తెల్లని వస్త్రములను ధరించినట్టియు, అంగవైకల్యము లేనట్టియు బ్రాహ్మణులచే ఆశీర్వచనములు నొందవలయును. మరియు శిశువు యొక్క శిరస్సు తూర్పువైపునకుగాని ఉత్తరపువైపునకుగానీ ఉండునట్లు పరుండబెట్టి క్రొత్తది పరిశుభ్రమైనదియూనైన వస్త్రముతో కప్పవలెను. శిశువు యొక్క తండ్రి దేవతలకును బ్రాహ్మణులకును నమస్కరించి శిశువునకు నక్షత్ర సంబంధమైన పేరును, ఇష్టమైన పేరును రెండింటినీ పెట్టవలెను. ఇష్టమైన పేరునకు ఘ-ఝ-ఢ-ధ-భలలో ఏదైననూ ఆదియందునూ, య-ర-ల-వ-శ-ష-స-హలలో నేదైన అంతమునందునూ ఉండవలయును. మరియు ముగ్గురు వృద్ధ పురుషులలో ఎవరి పేరునైననూ అనుసరించి, క్రొత్తది కానిదిగ యుండవలయును. నక్షత్ర సంబంధమైన పేరు నక్షత్ర దేవత యొక్క పేరుతో సమానమైనదిగను, రెండుగాని, నాలుగుగాని అక్షరములు కలదిగను నుండవలెను.

**ఆయుర్వేదదీపిక :** "ఉచితామ్" అనగా ఎవరికి ఏ దేవత ఎల్లప్పుడు పూజనీయమగుటచే ఉచితమో (తగినదిగా నుండునో) దానిని అర్చించి అని అర్థము. "శిఖినః" అనగా అగ్నులు: లేదా, శిఖా అనగా జుట్టు: అది కలిగియున్నట్టి-ముండనము చేయించుకొననట్టి బ్రాహ్మణులు. "నక్షత్రదేవతా సంయుక్తమ్" అనగా ఏ నక్షత్రమునందు కుమారుడు జన్మించియున్నాడో ఆ నక్షత్రమునకు జ్యోతిశ్శాస్త్రమునందు ఏ దేవుడు చెప్పబడినాడో ఆ పేరును పెట్టవలెనని అర్థము లేదా, నాక్షత్రికము అభిప్రాయికము (వ్యావహారికము) అగు రెండు పేర్లను పెట్టవలెనని పాఠము. అచటను నాక్షత్రికము వివరింపబడియేయున్నది. అభిప్రాయనామములందు ఘోషవత్ అను మొదలగునవి విశేషణము. ఘోషములనగా వర్గములందలి నాల్గవ అక్షరములు ఘ, ఝ,ఢ,ధ,భలు. అన్తస్థములు-య,ర,ల,వలు, ఊష్మములు-శ,ష,స,హలు.

## ఆయుష్మంతుడైన శిశువు యొక్కల క్షణములు

51. వృత్తే చ నామకర్మణి కుమారం పరీక్షితుముపక్రమేతాయుషః ప్రమాణ-
జ్ఞానహేతోః.తత్రేమాన్యాయుష్మతాం కుమారాణాం లక్షణాని భవన్తి తద్యథా-
ఏకైకజా మృదవోఽల్పాః స్నిగ్ధాః సుబద్ధమూలాః కృష్ణాః కేశాః ప్రశస్యన్తే,
స్థిరా బహలా త్వక్,ప్రకృత్యాఽతిసంపన్నమీషత్ప్రమాణాతివృత్తమనురూప-
మాతపత్రోపమం శిరః,వ్యూఢం దృఢం సమం శ్లిష్టశఙ్ఖసన్ధ్యూర్ధ్వవ్యఞ్జన
సంపన్నముపచితం వలిభమర్ధచన్ద్రాకృతి లలాటం,బహలౌ విపులసమపీఠౌ సమే
నీచైర్వృద్ధౌ పృష్ఠతోఽవనతౌ సుశ్లిష్టకర్ణపుత్రకౌ మహాచ్ఛిద్రౌ కర్ణౌ, ఈష-
త్ప్రలమ్బిన్యావసంగతే సమే సంహతే మహత్యౌ భ్రువౌ,సమే సమాహితదర్శనే
వ్యక్తభాగవిభాగే బలవతీ తేజసోపపన్నే స్వఙ్గాపాఙ్గే చక్షుషీ,ఋజ్వీ మహో-
చ్ఛ్వాసా వంశసంపన్నేషదవనతాగ్రా నాసికా,మహదృజ్వనువిష్టదన్తమాస్యమ్,
ఆయామవిస్తారోపపన్నా శ్లక్ష్ణా తన్వీ ప్రకృతివర్ణయుక్తా జిహ్వా,శ్లక్ష్ణం
యుక్తోపచయమూష్మోపపన్నం రక్తం తాలు,మహానదీనః స్నిగ్ధోఽనునాదీ
గమ్భీరసముత్థో ధీరః స్వరః,నాతిస్థూలౌ నాతికృశౌ విస్తారోపపన్నావాస్య-
ప్రచ్ఛాదనౌ రక్తావోష్ఠౌ,మహత్యౌ హనూ,వృత్తా నాతిమహతీ గ్రీవా,
వ్యూఢముపచితమురః,గూఢం జత్రు పృష్ఠవంశశ్చ,విప్రకృష్టాన్తరౌ స్తనౌ,
అసంపాతినీ స్థిరే పార్శ్వే,వృత్తపరిపూర్ణాయతౌ బాహూ సక్థినీ అఙ్గులయశ్చ,
మహదుపచితం పాణిపాదం,స్థిరా వృత్తాః స్నిగ్ధాస్తామ్రాస్తుఙ్గాః కూర్మాకారాః
కరజాః,ప్రదక్షిణావర్తా సోత్సఙ్గా చ నాభిః,ఉరస్త్రిభాగహీనా సమా సముప-
చితమాంసా కటీ,వృత్తౌ స్థిరోపచితమాంసౌ నాత్యున్నతౌ నాత్యవనతౌ స్ఫిచౌ,
అనుపూర్వం వృత్తావుపచయయుక్తావూరూ,నాత్యుపచితే నాత్యపచితే ఏణీపదే
ప్రగూఢసిరాస్థిసన్ధీ జఙ్ఘే,నాత్యుపచితౌ నాత్యపచితౌ గుల్ఫౌ,పూర్వోపదిష్టగుణౌ
పాదౌ కూర్మాకారౌ,ప్రకృతియుక్తాని వాతమూత్రపురీషగుహ్యాని తథా
స్వప్నజాగరణాయాసస్మితరుదితస్తనగ్రహణాని, యచ్చకిఞ్చిదన్యదప్యనుక్త-
మస్తి తదపి సర్వం ప్రకృతిసుపన్నమిష్టం, విపరీతం పునరనిష్టం. ఇతి
దీర్ఘాయుర్లక్షణాని.

**తాత్పర్యము :** నామకరణమును చేసిన పిదప ఆయుష్ప్రమాణమును
తెలిసికొనుటకు శిశువును పరీక్షింపవలెను. ఈ క్రింద చెప్పబడునవి ఆయుష్మంతులైన
శిశువులయొక్క లక్షణములుగ నుండును. అవి యేవనగా-వెంట్రుకలు విడివిడిగా

నుండి మృదువుగను, సన్నముగను నున్నగను దృఢమైన మొదళ్ళు కలవిగను నల్లవిగను నుండును. చర్మము సహజముగనే స్థైర్యము కలదిగను, పుష్టిగను ఉండును. శిరస్సు ప్రకృతి సంపత్తుతోకూడి కొంచెమధికముగను శరీరమునకు తగినదిగను గొడుగుతో సమానమైనదిగను ఉండును. నుదురు విశాలముగను దృఢముగను సమానముగను బాగుగా కలసిన కణతల సంధులు కలదిగను ఊర్ధ్వ రేఖలు మొదలగువానితో కూడినదిగను పుష్టిగను, బలము కలదిగను అర్థ చంద్రాకారము కలదిగను నుండును. చెవులు పుష్టిగను విశాలముగను సమానముగనున్న పీఠభాగము కలవిగను క్రింది భాగమున వృద్ధికలవిగను వెనుకకు వంగినవిగను బాగుగ కలిపిన కర్ణపుటములు కలవిగను విశాలమైన రంధ్రములు కలవిగను నుండును. కనుబొమ్మలు కొంచెము జారినవిగను కలియనివిగను సమానముగను దట్టముగను పెద్దవిగను నుండును. నేత్రములు సమానముగను సమమైన చూపుగలవిగను వ్యక్తముగానున్న వర్ణ విభాగము కలవిగను బలిష్టమైనవిగను తేజస్సుతో కూడినవిగను ప్రశస్తమైన కొలకులు కుదురులు గలవిగను నుండును. ముక్కు వంకరలేనిదిగను గొప్ప ఉచ్ఛ్వాసములు గలదిగను సరియైన ముక్కుదూలము (వంశము) గలదిగను చివరన కొంచెము వంగియు ఉండును. నోరు పెద్దదిగను వంకరలేనిదిగను బాగుగ కూర్చబడిన దంతములు కలదిగను నుండును. నాలుక పొడవుగను వెడల్పుగను నునుపుగను పలుచగను ఉండవలసిన వర్ణము కలదిగను ఉండును. తాలుప్రదేశము నునుపుగను పుష్టిగను ఊష్మము కలదిగను ఎర్రగను ఉండును. స్వరము గొప్పదిగను దైన్యము లేనిదిగను స్నిగ్ధముగను ప్రతిధ్వని కలదిగను గంభీరముగ వెడలునదిగను ధీరత్వము కలదిగను ఉండును. పెదవులు ఎక్కువ లావు ఎక్కువ సన్నముకాక నోరును సరిగా కప్పునవిగను ఎర్రగను నుండును. అంకిళ్ళు పెద్దవిగనుండును. మెడ గుండ్రముగను మిక్కిలి పెద్దది కానిదిగను నుండును. వక్షఃస్థలము విశాలముగను పుష్టిగను ఉండును. జత్రుప్రదేశమును పృష్ఠవంశమును నిగూఢములుగా నుండును. స్తనములమధ్య ప్రదేశమెక్కువగా యుండును. పార్శ్వములు అంస ఫలకముల వరకు వ్యాపించినవిగను దృఢముగను ఉండును. బాహువులు తొడలును వ్రేళ్ళను గుండ్రములైనవిగనుండి పుష్టికలవిగను పొడవుగను ఉండును. చేతులును, కాళ్ళను గొప్పవిగ పుష్టికలవిగ నుండును. గోళ్ళు దృఢముగ గుండ్రముగ నునుపుగను తామ్రవర్ణమును కలిగియు ఎత్తుగ తాబేలు యొక్క ఆకారము కలవిగను ఉండును. నాభి గుండ్రమైన ఆవర్తనము కలదిగ

మధ్యన లోతుగను చుట్టూ ఎత్తుగను ఉండును. కటి ప్రదేశము వక్షఃస్థలము యొక్క పరిమాణములో నాలుగవవంతు ప్రమాణము కలదిగను సమముగను అధికముగ వృద్ధినొందియున్న మాంసము కలదిగను ఉండును. పిరుదులు గుండ్రముగను బలిష్ట మైనట్టియు వృద్ధిపొందినట్టి మాంసము కలవియు మిక్కిలి ఎత్తు మిక్కిలి సన్నము కాకయు యుండును. తొడలు క్రమముగ గుండ్రమైనవియు పుష్టికలవిగను ఉండును. పిక్కలు ఎక్కువలావు సన్నములు కాక లేడిపిక్కలవలె నుండును; దీనియందు సిరలు ఎముకలు బయటపడక నిగూఢములై యుండును. గుల్ఫ ప్రదేశములు ఎక్కువ లావు సన్నములులేక యుండును. పాదములు ఇంతకుముందు చెప్పబడిన లక్షణములు కలవియై తాబేలు ఆకారములో నుండును. అపానవాయువు మూత్రము పురీషములు ప్రకృతి గుణములతో కలిగియుండును. మరియు నిద్రించుట-మేల్కొంచుట-శ్వాస-నవ్వు-ఏడుపు- స్తన్యపానము ఇవి ప్రకృతియుక్తములుగ నుండును. ఈ లక్షణములు దీర్ఘాయుష్మంతులకు ఉండును. వీనికి వ్యతిరేక లక్షణములు అనిష్టములుగ నుండును.

ఆయుర్వేదదీపిక : "నామకర్మణి" అనగా నామకరణ సమయమునందు చేయబడుచున్న హోమాది కర్మలయందు పేరును పెట్టుటయే చేయుటవలన గానీ అది నామకర్మ యనబడును. "ఈ షత్ప్రమాణాతివృత్తంశిరః" అనునది ఉత్సర్గాప వర్గ న్యాయము వలన తెలియవలెను. అందువలన మొదటచెప్పిన "షడఙ్గులోత్సేధం ద్వాత్రింశదఙ్గుల పరిణాహం శిరః" అనుప్రమాణము "తత్రాయుర్బలం" అనగా అది ఆయుష్షు, బలములను పెంచుననుట మరియు "ప్రమాణవతి శరీరే: విపర్యయస్తు హీనేఽధికే వా." (విమానస్థానము ఎనిమిదవ అధ్యాయము) అనియు చెప్పబడినది. ఇచట శిరస్సునందు కొంచెము ప్రమాణాధిక్యము అనువచనముచేత అపవాదముగా నున్నప్పటికీ ఎక్కువ ప్రశస్తమగునని తెలియవలెను. ఇటులనే "మహదుపచితం పాణిపాదము" అనుచోటకూడ వ్యాఖ్యానించుకొనవలెను. 'అనురూపమ్' అనుటవలన శిరస్సు శరీరమునకు తగినట్లు ఉండుటను చూపుచు చెప్పబడిన లక్షణము కంటె శిరస్సు ఎక్కువగా నుండనిదని చెప్పుచున్నాడు. అతివృద్ధి చెందియున్న శిరస్సు శరీరమునకు తగినట్లుండదు అది ప్రశస్తమేకాదు. "ఊర్ధ్వవ్యఞ్జనమ్" అనగా ఊర్ధ్వ రేఖాత్రయ రూప లక్షణముతో కూడియున్నట్టిది అని అర్థము. జతూకర్ణ సంహిత యందును లలాటము మూడురేఖలతో కూడియున్నదని (మంచిదని) చెప్పబడినది. "నీచైర్వృద్ధౌ" అనగా లేచియున్నవి కాకుండగ క్రమముగా పెరిగియున్నవి అని అర్థము. "అసఙ్గతే" అనగా మధ్యభాగము దూరముగానున్నవి. అందమైన కనురెప్పలు,

కొలకులు, చివరలు కలిగియున్నవి "స్వంగ్గాపాఙ్గే" అనబడును. ఇచట అంగశబ్దమును గ్రహించుటచేత అపాంగ అర్థము వచ్చునప్పటికీ తిరిగి అపాంగమని చెప్పుట విశేషముగా అపాంగముల శోభను చూపుటకు అని తెలిసికొనవలెను. "ఆస్యప్రచ్ఛాదనౌ" అనగా నోటిని కప్పియుంచగలిగినట్టివి నోటిని మూయునట్టివి. "పృష్ఠవంశశ్చ" అనుదానికి "గూఢః" అని అన్వయించుకొనవలెను. అంసపాతినీ అనగా బాగుగా బయటకు వచ్చియున్న లేదా అలక్ష్యముగానున్న అర్థము. "ప్రకృతియుక్తా" అనగా దేహమునకు అనురూపముగనున్నవి అని అర్థము. "ఏణీపదే" అనగా లేడి తొడలవలెనున్నవి అని అర్థము. "ప్రకృతి యుక్తాని" అనగా ఎక్కువ తక్కువ కానివి అని అర్థము.

## ధాత్రీ పరీక్ష

52. అతో ధాత్రీపరీక్షామువదేక్ష్యామః. అథ బ్రూయాత్ధాత్రీమానయ సమానవర్ణాం యౌవనస్థాం నిభృతమనాతురామవ్యఙ్గామవ్యసనామవిరూపామజుగుప్సితాం దేశజాతీయామక్షుద్రకర్మణీం కులే జాతాం వత్సలామరోగాం జీవద్వత్సాం పుంవత్సాం దోగ్ధ్రీమప్రమత్తామనుచ్చారశాయినీమనన్త్యావసాయినీం కుశలోపచారాం శుచిమశుచిద్వేషిణీం స్తనస్తన్యసంపదుపేతామితి.

**తాత్పర్యము :** ఇపుడు దాదియొక్క లక్షణములను (ధాత్రి పరీక్షను) చెప్పనున్నాము- సమానమైన జాతికలదీ, యవ్వనమునందున్నదీ, నమ్రతకలదీ, వ్యాధులులేనట్టిదీ, సమస్తమైన అవయవముతో కూడినట్టిదీ, వ్యసనములు లేనిదీ, అవయవ వికృతిలేనట్టిది (జుగుప్స కలిగింపని రూపముకలదీ) అదేదేశమునందు జనించినదీ (శిశువు జన్మించిన దేశమందు జన్మించినదీ) నీచురాలుకానట్టిదీ, నీచకృత్యములు చేయనట్టిదీ, మంచి కులమునందు జనించినదీ, ప్రేమకలిగినట్టిదీ, జీవించియున్న శిశువుకలిగి యున్నదీ, మగశిశువును కలిగియున్నదీ, పాలిచ్చుచున్నట్టిదీ, అప్రమత్తురాలు, నిద్రించు స్వభావము లేనట్టిదీ, నిద్రయందు గురకపెట్టనిదీ, జాతిభ్రష్టురాలు కానట్టిదీ, ఉపచారములందు నేర్పరియైనదీ, శుచిమంతురాలు, అశుచిని ద్వేషించునదీ, స్తనములు స్తన్యము బాగుగానున్నట్టిదీ యగు దాదిని తీసికొని రమ్మనవలెను.

**ఆయుర్వేదదీపిక :** "సమానవర్ణామ్" అనగా సమానమైన జాతికి సంబంధించినదానిని అని అర్థము. "యౌవనస్థామ్" అనుటవలన బాలాస్త్రీకి, వృద్ధస్త్రీకిని క్షీరము అసంపూర్ణముగా నుండుటవలన ఆ ఇద్దరిని నిరసించుచున్నాడు. "నిభృ

తామ్" అనగా వినమ్రురాలైనదానిని. "అవిరూపామ్" అనగా వికృతముగాలేని అవయవములు కలదానిని అని అర్థము. "అవ్యఙ్గామ్" అనగా అంగవైకల్యము లేని దానిని. "దేశజాతీయామ్" అనగా అదే దేశమునందు పుట్టినదానిని. "అనన్త్యావసాయినీమ్" అనునది శూద్రులకు చెప్పుచున్నాడు. శూద్రులకునూ చండాలాది స్త్రీ సవర్ణమువలన సంబంధింపబడును. అట్టి చండాలస్త్రీయునూ నిషిద్ధము. బ్రాహ్మణాదులకు సవర్ణత్వము గాకుండుటవలన చండాలస్త్రీ వర్జనీయురాలు. లేదా పతితురాలైన బ్రాహ్మణ స్త్రీ మొదలైనవారు "అనన్త్యావసాయినీమ్" అను పదమునందు చేర్చబడుదురు.

## స్తనములుండవలసిన తీరు

53. తత్రేయం స్తనసంపత్—నాత్యూర్ధ్వౌ నాతిలమ్బావనతికృశావనతిపీనౌ యుక్తపిప్పలకౌ సుఖప్రపానౌ చేతి (స్తనసంపత్).

**తాత్పర్యము :** అతిగా ఊర్ధ్వముఖములు (పొట్టిగా) నుండనివి, ఎక్కువ వ్రేలాడుచుండనివి, ఎక్కువ కృశింపనివి, ఎక్కువ లావుగా నుండనివి, సరియగు పిప్పలకము (చనుమొన)తో కూడియున్నవి, సుఖముగ పానము చేయతగినవి — ఈ లక్షణములతో కూడియున్నవి మంచి స్తనములనబడును.

**ఆయుర్వేదదీపిక :** "యుక్త పిప్పలకౌ" అనగా స్తనము యొక్క తొడిమ (మొన లేక చూచుకము) ఎత్తుగా నున్నవి.

## స్తన్యముండవలసిన తీరు

54. స్తన్యసంపత్తు ప్రకృతివర్ణగన్ధరసస్పర్శమ్, ఉదపాత్రే చ దహ్యామానముదకం వ్యేతి ప్రకృతిభూతత్వాత్;తత్ పుష్టికర మారోగ్యకరం చేతి.

55. అతోఽన్యథా వ్యాపన్నం జ్ఞేయం.తస్య విశేషాః - శ్యావారుణవర్ణం కషాయానురసం విశదమనాలక్ష్యగన్ధం రూక్షం ద్రవం ఫేనిలం లఘ్వతృప్తికరం కర్శనం వాతవికారాణాం కర్తృ వాతోపసృష్టం క్షీరమభిజ్ఞేయం: కృష్ణనీలపీతతామ్రావభాసం తిక్తామ్లకటుకానురసం కుణపరుధిరగన్ధి భృశోష్ణం పిత్తవికారాణాం కర్తృ చ పిత్తోపసృష్టం క్షీరమభిజ్ఞేయం, అత్యర్థశుక్లమతి మాధుర్యోపపన్నం లవణానురసం ఘృతతైలవసామజ్జాగన్ధి పిచ్ఛిలం-తన్తుమదుదకపాత్రేఽవసీదచ్ఛ్లేష్మవికారాణాం కర్తృ శ్లేష్మోపసృష్టం క్షీరమభిజ్ఞేయం.

**తాత్పర్యము :** పై చెప్పిన శుద్ధ స్తన్య లక్షణములకు వ్యతిరేకముగా నుండుట వ్యాపత్తు అని తెలియవలెను. అట్లు విపత్తును పొందిన స్తన్యము యొక్క విశేషములు ఏవనగా - శ్యావ అరుణ వర్ణములు కలిగియున్నది, కషాయ రసము అను రసముగా గలది, విశదముగానున్నది సరిగాలేని వాసన కలిగినది, రూక్షముగను మిక్కిలి పలుచగను మరుగుకలదిగను, తేలికగను ఉండి తృప్తిని కలిగించనిది కృశత్వమును కలుగజేయునది వాత వికారములను కలుగజేయునదియు నగు స్తన్యము వాతముచే దూషింపబడినదని తెలిసికొనవలెను. నలుపు, నీలము, పసుపు, త్రామ వర్ణములను కలిగి చేదు పులుపు కారములు అనురసములుగనున్నట్టియు, శవ గంధము లోహిత గంధము వచ్చుచున్నట్టి, మిక్కిలి వేడిగా నున్నట్టియు పిత్త వ్యాధులను కలిగించునట్టియు స్తన్యము పిత్తముచే దూషింపబడినదని తెలిసికొనవలెను. మిక్కిలి తెల్లగ నున్నట్టియు, మిక్కిలి తీయగా నున్నట్టియు లవణరసము అనురసముగా కలిగియున్నట్టియు, నెయ్యి-నూనె-వస-మజ్జ వీని వాసనలను కలిగినట్టియు, జిగురుగ తీగలు సాగుచున్నట్టియు ఉదకపాత్రలో వేసినపుడు మునుగుచున్నట్టియు శ్లేష్మవ్యాధులు కలిగించునట్టియు స్తన్యము శ్లేష్మము వలన దూషింపబడినదని తెలిసికొనవలెను.

**ఆయుర్వేదదీపిక :** "ఉదకం వ్యేతి" అనగా ఉదకమును విశేషముగా ఏతి—వ్యాపించును అని అర్థము. జతూకర్ణ సంహితయందునూ "ఉదకే విసర్పత్ క్షీరం ప్రశస్తమ్" అని చెప్పబడియున్నది. "శ్యావ" అను మొదలగువానిద్వారా వాతాదులచే దూషింపబడిన క్షీరము యొక్క లక్షణములను చెప్పుచున్నాడు. "లవణానురసమ్" అనునది శ్లేష్మదూషితమైన క్షీరమునందు దోషదూష్య సమ్మూర్ఛన ప్రభావమున అని తెలియవలెను. ఎందువలననగా శ్లేష్మము దూషించినపుడు అందు లవణ రసముండును. ఇట్లు వేర్వేరుగా దోషదూషిత స్తన్య లక్షణములను చెప్పుట వలన ద్వంద్వ - సన్నిపాత క్షీదూషిత స్తన్య లక్షణములనూ ఊహించి తెలిసికొనవలెను.

## స్తన్యదోష చికిత్స

56. తేషాం తు త్రయాణామపి క్షీరదోషాణాం ప్రతివిశేషమభిసమీక్ష్య యథాస్వం యథాదోషం చ వమనవిరేచనాస్థాపనానువాసనాని విభజ్య కృతాని ప్రశమనాని భవన్తి. పానాశనవిధిస్తు దుష్టక్షీరాయా యవగోధూమశాలిషష్టికముద్గహరేణుకకులత్థసురాసౌవీరకమైరేయ-మేదకలశునకరఞ్జప్రాయః స్యాత్. క్షీరదోషవిశేషాంశ్చావేక్ష్యావేక్ష్య తత్తద్విధానం కార్యం స్యాత్.పాఠామహౌ-

షధసురదారుము స్తమూర్వాగుడూచీవత్సకఫలకిరాతతి క్తకటుకరోహిణీసారివా-
కషాయాణాం చ పానం ప్రశస్యతే,తథాఽన్యేషాం తి క్తకషాయకటుకమధు-
రాణాం ద్రవ్యాణాం ప్రయోగః క్షీరవికారవిశేషానభిసమీక్ష్య మాత్రం కాలం
చ. ఇతి క్షీరవిశోధనాని.

**తాత్పర్యము :** ఆ మూడింటి యొక్క క్షీరదోషముల యొక్క ప్రతి విశేషమును బాగుగా తెలిసికొని తగు విధమున దోషముననుసరించి వమనము, విరేచనము, ఆస్థాపనము, అనువాసనము వీనిని చేయింపవలెను. దుష్టమైన స్తన్యము గల స్త్రీకి అన్నపానముల నిమి త్తము యవలు, గోధుమలు, శాలిధాన్యము, షష్టిక ధాన్యము, పెసలు, పెద్ద శనగలు, ఉలవలు, సురామద్యము, సౌవీరకము, తుషోదకము, మైరేయము, మేదకము, వెల్లుల్లి, క్రానుగ వీనిని అధికముగా ఉపయోగింపవలెను. క్షీర దోషముల యొక్క విశేషములను బాగుగా తెలిసికొని ఆ యా విధానములను ఆచరింపవలెను. చిరుబొద్ది, శొంఠి, దేవదారు, తుంగము స్తలు, చాగ, తిప్పతీగె, కొడిశపాలవిత్తులు, నేలవేము, కటుక రోహిణి, సుగంధిపాల వీనియొక్క కషాయములను పానము చేయవలెను. మరియు క్షీర దోష విశేషములననుసరించి తి క్తరసము కషాయరసము కటురసము మధురరసము ఇవి కలిగిన ద్రవ్యములను కాలమున కనుగుణముగను, తగు పరిమితిగను ఉపయోగింపవలెను. ఈ పద్ధతులు స్తన్యమును శుద్ధిపరచునదగును.

**ఆయుర్వేదదీపిక :** "తేషామ్" అను మొదలగువానిద్వారా చికిత్సను చెప్పుచున్నాడు. "ప్రతి విశేషమభిసమీక్ష్య" అనగా వాతాదులకు ఒక్కొక్కదానికి ప్రత్యేకమగు కోష్ఠా శ్రయత్వము ఉదీర్ణ త్వము మొదలగు శోధనానుగుణమగు విశేషమును బాగుగా సమీక్షించి అని అర్థము. "యథాస్వం" అనుట వలన శ్లేష్మము నందు వమనము పి త్తమునందు విరేచనము వాయువునందు ఆస్థాపనానువాసనములు రెండును అను దేనికి తగిన దానిని దానికి సంశోధన విధిని చూపుచున్నాడు. "యథా దోషం" అనుట వలన బాగుగా వృద్ధి చెందియున్న దోషమునందు ఎక్కువ సంశోధనమును అల్పముగానున్న దోషమునందు తక్కువ సంశోధనమును చేయవలెనని చూపుచున్నాడు. "విభజ్య" అనుదానిని "యథాస్వం" అనుదానికి అన్వయించుకొనవలెను. "ప్రకృతి విశేషమ్" అని పాఠమున్నచో అపుడు ధాత్రియొక్క ప్రకృతి విశేషమును కూడ పరిశీలించి ఎక్కువగాగాని తక్కువగాగాని వమనాదులను చేయవలెనని అర్థము. "త త్తద్విధానం కార్యం స్యాత్" అనగా ఆ యా వృద్ధ

దోషమునకు ప్రతికూలమగు ఆహార విధానమును (అమలు) చేయవలెనని అర్థము. "కషాయాణాం" అని బహు వచనమును ప్రయోగించుటచేత చెప్పబడిన పాఠాది సమస్త ద్రవ్యముల యొక్క కషాయములు గ్రహింపబడుచున్నవి.

## క్షీరజనక ద్రవ్యములు

57. క్షీరజననాని తు మద్యాని సీధువర్జ్యాని,గ్రామ్యానూపౌదకానిచ శాకధాన్య-మాంసాని,ద్రవమధురామ్లలవణభూయిష్ఠాశ్చాహారాః,క్షీరిణ్యశ్చౌషధయః,-క్షీరపానమనాయాసశ్చ,వీరణషష్టికశాలీక్షువాలికాదర్భకుశకాశగున్ద్రేత్కటమూలకషాయాణాం చ పానమితి (క్షీరజననాని).

**తాత్పర్యము** : సీధువు తప్ప మిగిలిన మద్యములు, గ్రామ్య-అనూప-ఉదక సంభవములగు శాకములు - ధాన్యములు మరియు మాంసములు, ద్రవ-మధుర-అమ్ల-లవణము లెక్కువగా నుండు ఆహారములు, క్షీరిణీ ఔషధములు, క్షీర పానము, శ్రమపడకుండుట, మరియు అవురుగడ్డి-షష్టిక ధాన్యము-ఇక్షువాలిక-దర్భ-రెల్లు-కుశ-పెద్దరెల్లు గుంద్రమనెడు రెల్లు-ఇత్కటమనెడు రెల్లు గడ్డి అనువాని వేళ్ళ యొక్క కషాయము ఇవియన్నియు క్షీరమును వృద్ధిపరచును.

**ఆయుర్వేదదీపిక** : "క్షీరిణ్యశ్చ" అనగా దుగ్ధికా (రెడ్డివారినానుబాల? మనుబాల ?) కలమ్బికా మొదలగు పాలు కనుపించు ద్రవ్యములు.

## స్తన్యమును త్రాగించునపుడు చేయవలసిన విధి

58. ధాత్రీ తు యదా స్వాదుబహులశుద్ధదుగ్ధా స్యాత్తదా
స్నాతానులిప్తా శుక్లవస్త్రం పరిధాయైన్ద్రీం బ్రాహ్మీం శతవీర్యాం
సహస్రవీర్యామమోఘామవ్యథాం శివామరిష్టాం వాట్యపుష్పీం
విష్వక్సేనకాన్తాం వా బిభ్రతోష్యధిం కుమారం ప్రాఙ్ముఖం
ప్రథమం దక్షిణ స్తనం పాయయేత్.ఇతిధాత్రీకర్మ.

**తాత్పర్యము** : మధురముగను అధికముగను శుద్ధముగను నున్న స్తన్యమును కలిగియున్నపుడు ధాత్రి స్నానము చేసి శరీరమునకు మైపూతలు పూసుకొని తెల్లని వస్త్రమును కట్టుకొని చేదుపుచ్చ, సరస్వతియాకు, గరిక, కలిగొట్టు, తిప్పతీగె, కరక్కాయ, కటుక — రోహిణీ, ముత్తవపులగము, ప్రేంఖణము వీనిలో దేనినైనూ కట్టుకొని శిశువునకు ముఖము తూర్పువైపున నుండునట్లుంచి మొదట కుడిచన్నను పానము చేయించవలెను. ఇట్లు దాదీ చేయవలసిన కర్మ చెప్పబడినది.

**ఆయుర్వేదదీపిక :** "అమోఘా" మొదలగునవి మొదట వివరించబడినవి. "అవ్యథా" అనగా తిప్పతీగె.

## కుమారాగారమును నిర్మించు విధానము

59. అతోఽనన్తరం కుమారాగారవిధిమనువ్యాఖ్యాస్యామః వాస్తువిద్యాకుశలః
ప్రశస్తం రమ్యమతమస్కం నివాతం ప్రవాతైకదేశం
దృఢమపగతశ్వాపదపశుదంష్ట్రిమూషికపతఙ్గం సువిభక్తసలిలోలూఖల-
మూత్రవర్చఃస్థానస్నానభూమిమహానసమృతుసుఖం యథర్తుశయనాస్తరణ-
సంపన్నం కుర్యాత్: తథా సువిహితరక్షావిధానబలిమఙ్గలహోమప్రాయశ్చిత్తం
శుచివృద్ధవైద్యానురక్తజనసంపూర్ణం. ఇతి కుమారాగారవిధిః.

## కుమారునికి చేయవలసిన సామాన్య విధులు.

60 శయనాసనాస్తరణప్రావరణాని కుమారస్య మృదులఘుశుచిసుగన్ధీని స్యుః:
స్వేదమలజన్తుమన్తి మూత్రపురీషోపసృష్టాని చ వర్జ్యానిస్యుః:అసతి
సంభవేఽన్యేషాం తాన్యేవ చ సుప్రక్షాలితోపధానాని సుధూపితాని శుద్ధ-
శుష్కాణ్యుపయోగం గచ్ఛేయుః.

**తాత్పర్యము :** ఇకపై కుమారాగార విధిని చెప్పుకొందుము. వాస్తువిద్య యందు నేర్పరి యైనవాడు — ప్రశస్తమైనట్టియు, మనోహరమైనట్టియు, చీకటి లేనట్టియు, ఎక్కువ గాలి లేనట్టియు, అనుకూలమైన గాలి వచ్చునట్టియు, దృఢముగ నుండునట్టియు, కుక్కలు - పశువులు - పందులు - ఎలుకలు - మిడతలు ఇవి ప్రవేశించుటకు వీలులేనట్టియు, ఉదకము-రోలు - మలమూత్ర విసర్జనము - స్నానము — వంట వీనికి ప్రత్యేకముగా నేర్పరచి యున్నట్టియు ఆ యా ఋతువులకు అనుకూలముగ నుండునట్టియు ఆ యా ఋతువులకు తగిన శయన ఆసన ఆస్తరణములను కలిగినట్టియు — గృహమును నిర్మింపవలెను. ఈ గృహము రక్షావిధి, బలికర్మ, శుభములు, హోమములు, ప్రాయశ్చిత్తములు వీనితో కూడినదిగను, పవిత్రమైనవారు, వృద్ధులు, వైద్యులు, ప్రేమ కలవారు వీరితో నిండినదిగను ఉండవలెను.

శిశువునకు శయనము ఆసనము ప్రక్కలు కప్పుగుడ్డలు ఇవి మెత్తగను తేలికగను పరిశుభ్రముగను, పరిమళయుక్తముగను నుండవలెను. చెమట, మాలిన్యము, క్రిములు, మూత్రము, పురీషములతో కూడిన వానిని తీసివేయవలెను. వేరుగా గుడ్డలు లేనప్పుడు వీటినే బాగుగా ఉతికి ధూపము వేసి శుద్ధి నొందించి ఎండించి ఉపయోగించవలెను.

**ఆయుర్వేదదీపిక :** "సుప్రక్షాళితోపధానాని" అనగా బాగుగా కడిగిన తరువాత పిండినవి అని అర్థము. "శుద్ధశుష్కాణి" అనగా కడిగినదైననూ మలములు అంటుకొని యున్నపుడు ఎండించినచో మలములు పోవును. అపుడే వానిని ఉపయోగింపవలెను. బాగుగా కడిగినది తడిగానూ ఉండవచ్చును అట్లే గాఢముగా అంటుకొని యున్న మలాదులు కలది కడిగిననూ అశుద్ధముగా నుండవచ్చును. అందుచేతనే "శుద్ధశుష్కమ్" అని చెప్పబడినది.

## ధూపములు

61. ధూపనాని పునర్వాససాం శయనాస్తరణప్రావరణానాం చ
యవసర్షపాతసీహిఙ్గుగుగ్గులువచాచోరకవయఃస్థాగోలోమీజటిలా
పలఙ్కషాశోకరోహిణీసర్పనిర్మోకాని ఘృతయుక్తాని స్యుః.

**తాత్పర్యము :** వస్త్రములకు ధూపము వేయుటకు యవలు, ఆవాలు, అవిసె విత్తులు, ఇంగువ, గుగ్గులు, వస, కచ్చూరములు, సరస్వతి ఆకు, తెల్లగరిక; జటామాంసి, గుగ్గిలము, కటుక రోహిణి, పాము కుబుసములను నేతితో కలిపి వేయవలెను.

**ఆయుర్వేదదీపిక :** వయఃస్థా - బ్రాహ్మి; గోలోమీ - తెల్లగరిక; జటిలా - జటామాంసి.

## ధారణయోగ్యములగు మణులు మొదలగునవి.

62. మణయశ్చ ధారణీయాః కుమారస్య ఖడ్గరురుగవయవృషభాణాం
జీవతామేవ దక్షిణేభ్యో విషాణేభ్యోఽగ్రాణి గృహీతాని స్యుః;
ఐన్ద్ర్యాద్యాశ్చౌషధయో జీవకర్షభకౌ చ,యాని చాన్యాన్యపి బ్రాహ్మణాః
ప్రశంసేయురథర్వవేదవిదః.

**తాత్పర్యము :** కుమారునకు మణులను ధరింపజేయవలయును. జీవించి యున్న ఖడ్గమృగము, గవయము, నల్లచారల దుప్పి, ఎద్దు - వీనియొక్క కుడి కొమ్ముయొక్క అగ్రభాగమును కత్తిరించి ధరింపజేయవలెను. ఐంద్రీ మొదలగు ఔషధులను, జీవక ఋషభకములను ఇంకను అథర్వవేదవిదులగు బ్రాహ్మణులు చెప్పిన ఇతర వస్తువులను ధరింపజేయవలెను.

**ఆయుర్వేదదీపిక :** "మణయః" అనగా అథర్వ వేదమునందు చెప్పబడినవి మరియు ముత్యము మొదలగు మణులు ఖడ్గమృగము మొదలగు వాని

శృంగాగ్రములు ధరింపవలసినవి అని అన్వయించుకొనవలెను. జతూకర్ణ సంహిత యందు— "రురుఖడ్గాదీనాం జీవతాం దక్షిణశృఙ్గాగ్రాణి నికృత్తాని ధారయేత్." అని చెప్పబడియే యున్నది. జీవక ఋషభకములు రెండును ప్రజాస్థాపనములుగా చెప్పబడినవి. ఐంద్రీ మొదలగు పది ఔషధములు కూడ అచటనే చెప్పబడినవి

## కుమారున కివ్వవలసిన ఆటవస్తువులు, అతనికి అనారోగ్యము కలిగినపుడు చేయవలసిన విధులు.

63. క్రీడనకాని ఖలు కుమారస్య విచిత్రాణి ఘోషవన్త్యభిరామాణి చాగురూణి చాతీక్ష్ణాగ్రాణి చానాస్యప్రవేశీని చాప్రాణహరాణి చావిత్రాసనానిస్యుః.

64. న హ్యస్య విత్రాసనం సాధు. తస్మాత్తస్మిన్ రుదత్యభుఞ్జానే వాఽన్యత్ర విధేయతామాగచ్ఛతి రాక్షసపిశాచపూతనాద్యానాం నామాన్యాహ్వయతా కుమారస్య విత్రాసనార్థం నామగ్రహణం న కార్యం స్యాత్.

65. యది త్వాతుర్యం కిఞ్చిత్ కుమారమాగచ్ఛేత్ తత్ ప్రకృతినిమిత్త-పూర్వరూపలిఙ్గోపశయవిశేషైస్తత్త్వతోఽనుబుధ్య సర్వవిశేషానాతురౌషధ-దేశకాలాశ్రయాన వేక్షమాణశ్చికిత్సితుమారభేతైనం మధురమృదులఘు-సురభిశీతశఙ్కరం కర్మ ప్రవర్తయన్. ఏవంసాత్మ్యా హి కుమారా భవన్తి. తథా తే శర్మ లభన్తే చిరాయ. అరోగే త్వరోగవృత్తి-మాతిష్ఠేద్దేశకాలాత్మగుణవిపర్యయేణ వర్తమానః, క్రమేణాసాత్మ్యాని పరివర్జ్యోపయుఞ్జానః సర్వాణ్యహితాని వర్జయేత్.తథా బలవర్ణశరీరాయుషాం సంపదమవాప్నోతీతి.

66. ఏవమేనం కుమారమాయౌవనప్రాప్తేర్ధర్మార్థకౌశలాగమనాచ్చానుపాలయేత్

**తాత్పర్యము** : కుమారునకు విచిత్రములు, ధ్వనిని కలిగించునవి సుందరమైనవి, బరువులేనివి, పదునైన అంచులు లేనివి, నోటిలో పెట్టుకొనుటకు వీలు కానివి, ప్రాణములను తీయనివి, భయమును కలిగించనివి అగు ఆట వస్తువులను ఇవ్వవలయును.

అతనిని భయపెట్టుట మంచిదికాదు. అందువలన అతడు ఏడ్చుచున్నపుడు అన్నము తిననపుడు, చెప్పినమాట విననపుడును రాక్షసపిశాచ పూతనాది పేర్లను పిలుచుచూ కుమారుని భయపెట్టుటకు ఆ పేర్లను వాడుట చేయరాదు.

కుమారునకు కొంచెము అస్వస్థత వచ్చినచో ఆ రోగముయొక్క ప్రకృతి - హేతు - పూర్వరూప - లక్షణ - ఉపశయములను పూర్తిగ తెలిసికొని, రోగి-

ఔషధము - దేశము - కాలము దీని సంబంధమైన సమస్త విశేషములను వివరముగా గ్రహించి మధుర - మృదు - లఘువులగు నట్టియు, తగిన మోతాదులో నున్నట్టియు, శీతలములు సుఖకరములు అగునట్టి చికిత్సలనే చేయవలెను. కుమారులకు ఇవియే సాత్మ్యములుగా నుండును. మరియు వెంటనే సుఖమును పొందుదురు. వ్యాధులు లేనపుడు దేశము - కాలము - శరీరము వీనియొక్క గుణములకు వ్యతిరేకములగు గుణములు గల ఉపచారములచే ఉపచరించుచు ఆరోగ్యమును కాపాడవలెను. అభ్యాసము లేని పదార్థములను మార్పు చేసి క్రమముగ నుపయోగించుచు అహితములైన వాని కొన్నింటిని విడచిపెట్టవలెను. ఇట్లు చేసినచో కుమారుడు బలము, వర్ణము, శరీర నిర్మాణము, ఆయువు - వీనియొక్క సంపత్తును పొందును.

ఈ విధముగా ఇతనికి యౌవనము వచ్చువరకును, ధర్మార్థముల విషయమై నేర్పు కలుగు వరకును ఉపచారములను చేయవలెను.

**ఆయుర్వేదదీపిక :** "ప్రకృతి" అను మొదలగువానియందు ప్రకృతి యనగా వాతాదులు; "నిమిత్తం" అనగా వాతాదులకు బాహ్య కారణములగు రూక్షాదులు. "సర్వవిశేషాన్" అను మొదలగువానియందు ఆతురశబ్దము వలన ఆతుర్య హేతువువగు వ్యాధి గ్రహింపబడును. ఆశ్రయ శబ్దము వలన మాత్రము శరీరము గ్రహింపబడును. "శం" అనగా మంచిని "కరోతి" చేయునది- "శంకరమ్" అనబడును. "దేశకాల" అను మొదలగువానియందు "ఆత్మ" శబ్దము వలన శరీరము గ్రహింపబడును. అందువలన దేశము మరియు కాలము మరియు శరీరములకు శీతాది గుణము లేవి కలవో వానికి వ్యతిరేకములగు గుణములుగల ఆహార ఆహారాదులను సేవించుట ద్వారా స్వస్థవృత్తమును పాటించవలెను. ఇతరత్ర స్వస్థవృత్తము నందు కూడ "దేశకాలాదిగుణ విపరీతానామాహారవిహారాణాం క్రియోపయోగః "సమ్యక్" (శారీర స్థానము 6వ అధ్యాయము) అని చెప్పబడినది. "క్రమేణ" అను మొదలగు వాని ద్వారా ఇంకొక విధమగు స్వస్థవృత్తమును చెప్పుచున్నాడు. క్షీరము నుండి క్షీరాన్నమును అచటనుండి అన్నమును ఇవ్వవలెను. అచటయును అన్నమునందు బాలురకు సాత్మ్యమగు మధురాదులనుండి నవేగాన్ధారణీయాధ్యాయము నందు చెప్పబడిన క్రమమును "ఉచితావహితాద్ధీమాన్ క్రమశో విరమేన్నరః" (సూత్రస్థానము 7వ అధ్యాయము) ఈ విధముగా ఉపయోగించి అహితములైన దానినుండి మరల్చవలెనని అర్థము. బాలునకు ఇతర సాత్మ్యవస్తువుల సేవనయందును ఇటులనే తెలిసికొనవలెను. "తథా" అను మొదలగు వాని ద్వారా స్వస్థవృత్తాచరణము వలన కలుగు ఫలమును చెప్పుచున్నాడు.

## అధ్యాయ సంగ్రహము

67. ఇతి పుత్రాశిషాం సమృద్ధికరం కర్మ వ్యాఖ్యాతమ్. తథాచరన్
యథోక్తైర్విధిభిః పూజాం యథేష్టం లభతేఽనసూయక ఇతి.

తత్ర శ్లోకౌ —

68. పుత్రాశిషాం కర్మ సమృద్ధికారకం యదుక్తమేతన్మహదర్థసంహితమ్,
తథాచరన్ జ్ఞో విధిభిర్యథాతథం పూజాం యథేష్టం లభతేఽనసూయకః.

69. శరీరం చిన్త్యతే సర్వం దైవమానుషసంపదా
సర్వభావైర్యత స్తస్మాచ్ఛారీరం స్థానముచ్యతే.

ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే శారీరస్థానే జాతిసూత్రీయం శారీరం నామాష్టమోఽధ్యాయః.

**తాత్పర్యము :** పుత్రుని కోరువారలకు అనుకూలమైన కర్మ ఈ విధముగ చెప్పబడినది. అసూయలేనివాడై దీనిని విధి ప్రకారముగ అచరించినవాడు పరిపూర్ణమైన గౌరవమును పొందును.

అరువది ఎనిమిదవది క్రిందటి అరువదిఏడవ సూత్రమునకు శ్లోకరూపమేగాన పై అర్థమునే అన్వయించుకొనవలెను.

దైవ సంపత్తుచేతను మానుషసంపత్తుచేతను సమస్త భావముల చేతను శరీరమును గురించి ఈ స్థానమున వివరింపబడినది గావున ఇది శారీరస్థానమని చెప్పబడును.

ఇది అగ్నివేశునిచే రచింపబడి చరకునిచే ప్రతిసంస్కరింపబడిన తంత్రమునందలి శారీర స్థానమున జాతిసూత్రీయ శరీరమను ఎనిమిదవ అధ్యాయము.

**ఆయుర్వేదదీపిక :** "పుత్రాశిషాం సమృద్ధికరమ్" అనగా పుత్రుని కోరుటకు అనురూపమగు ఫలమును నిచ్చునది అని అర్థము. "పుత్రాశిషాం" అనునది అధ్యాయ సంగ్రహ శ్లోకము. "జ్ఞః" అని పురుష విశేషణము ప్రాధాన్యముచేత చెప్పబడినది. అందువలన పురుష పుత్రుడు కలుగుటవలన స్త్రీలు కూడ పుత్రలాభ మనెడి అర్థముచేతనే పొందబడుచున్నది. అనురూపపుత్రుని పొందినపుడు నాకెట్లు పుత్రుడు కలుగునసెడి అసూయను పొందనివాడు అనసూయకుడు అగును. కొందరు ఈ శారీర స్థానశబ్దవ్యుత్పత్తిని చూపు శ్లోకమును "శరీరమ్" అని మొదలైనదానిని పఠింతురు. ఆ శ్లోకము యొక్క అర్థము తేటతెల్లముగనే యున్నది.

ఇది శ్రీ చక్రపాణి దత్తునిచే రచింపబడిన ఆయుర్వేదదీపిక యనెడి చరక తాత్పర్యటీక యందలి శారీరస్థానమున జాతిసూత్రీయ శారీరమను పేరుగల ఎనిమిదవ అధ్యాయము.

— —